# శ్రీ రామాయణ నిధి

## (యుద్ధకాండ)




లలిత కవికోకిల, కవి రత్న
విద్వాన్ తలమర్ల కళానిధి

# శ్రీ రామాయణ నిధి
# (యుద్ధకాండ)



లలిత కవికోకిల, కవిరత్న
విద్వాన్ తలమర్ల కళానిధి

ప్రతులు 1000

సంవత్సరము 2002



మూల్యము : నూరు రూపాయలు

ప్రతులు దొరుకు చోటు

తలమర్ల కళానిధి
D/o దామోదరం సరస్వతి
డో నెం 11/308 లక్ష్మి కళా సౌధము
అరవిందనగరు అనంతపురం

ముద్రణ
భద్రావతి ప్రింటర్స్
కమలానగర్ అనంతపురం
ఫోన్ 35160



తిరుమల తిరుపతి దేవస్థానముల వారి రచయితలకు ఆర్థిక సహాయము అను పథకము ద్వారా ఈ రామాయణ నిధి యుద్ధకాండ గ్రంథ ముద్రణమునకు తిరుమల తిరుపతి దేవస్థానములవారు రు 20 000 లు (ఇరువై వేల రూపాయలు) ఆర్థిక సహాయ మందించి నా సాహిత్య సేవకు చేయూత నొసంగియున్నారు జీవితాంతము వరకు దేవస్థానముల వారికి కృతజ్ఞడను

'నిధి'



## టి. ఓబన్న

మూడేడులైనను నిండకపూర్వమే మా తల్లి ఓబాంబ నన్ను
విడనాడి స్వర్గసీమల విహరింపబోయినప్పటి నుండియు
పెంచి పెద్దజేసి విద్యాబుద్ధులు గరపిన మదీయ జనకుడు

'నిది'



మా అక్క

ఓబాంబ



మా అత్త

నరసమ్మ

# కృతజ్ఞతాంజలి

ఆదికవి వాల్మీకి మహర్షిచే రచింపబడిన శ్రీ రామాయణ కావ్యమును జదువుచుండగా అమ్మహాకావ్యమును ఆంధ్రభాష లోనికనువదించి వచన రచన గావించి జన్మ పావనము గావించు కోరాదా! యని నాయాత్మారాముడు ప్రబోధించినాడు ఆత్మ దేవుని యాదేశానుసారము 1953 సం॥లో శ్రీరామనవమినాడు ప్రారంభించి 1956 సం॥ జులై 3వ తేదీ నాటికి ఆరు కాండలను ముగించితిని

శ్రీ రామాయణ కావ్య రచనకు బూనుకొన్నదాదిగా అనారోగ్యపు కోరలలో నలిగి జవ సత్వములుడిగి నైరాశ్యజలధి నీదుచుండగా మా సహధర్మచారిణి మరికొందరు మిత్రులు ఇంతపెద్ద కావ్యమును రచించుచున్నారే! ఇది ముద్రణకు నోచుకొనుట కష్టము కాదా! అదియునుగాక! మీ యారోగ్యము సన్నగిల్లుచున్నది కాన కావ్యరచనను మానుకొని ఆరోగ్యమును కాపాడుకోమని హితముపదేశింపుచు బ్రతిమలాడిరి ఆ రామచంద్రుడే ముద్రించుకోగలడులెమ్మని వారి మాటలు పెడచెవిని బెట్టి నా దీక్షను కొనసాగించుచునేయుంటిని రానురాను శరీరము శల్యావశిష్టము కాగా నిరుత్సాహా మినుమడింపసాగెను రామా! ఇక నా చేత గాదని రామాయణ రచన నిలిపివేయ సంకల్పించితిని ఆనాటి రాత్రి శ్రీమాన్ వప్పారి రామాచార్యులవారు స్వప్న వీధుల్లో గోచరించి ' ఏమప్పా" ! రామాయణ రచన మానుకోదలంచితివేలా? నిరుత్సాహము జెందవలదు కావ్యరచన సాగించి ధన్యుడవుకమ్ము! లెమ్ము! లెమ్మని మృదు మధుర వాక్యములతో వాత్సాల్యమేపారహిత బోధ గావించుచుండగా మెలకువ వచ్చినది ఏమిటి స్వప్నమని కనులు దెరచి చూడగా ఎవరులేరు మరల కనులు మూసికొంటిని ఏమాశ్చర్యమోకాని వాల్మీకి మహర్షి భూర్జువా పత్రముపై రామకథను రచించుచున్న దృశ్యము నయన పర్వముగా గోచరించినది 'శ్రీరామాయణను" అను వర్ణములు రజిత

కాంతులనీనుచు కనులకు మిరుమిట్లు గొల్పినవి శ్రీ రామాచార్యుల రూపేణా శ్రీరామచంద్ర భగవానుడే స్వప్న వీధుల్లో సాక్షాత్కరించి జవసత్వము లొసంగి కార్యోన్ముఖుని గావించినాడను గాఢ విశ్వాసముతో రచన కుపక్రమించి ఆరుకాండల రచన ముగించి కృత కృత్యుడనైతిని

ఆ యుద్ధంధమును అచ్చొత్తించుకొనుటకు ఆర్థిక స్థోమత లేనందున 1961సం॥లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారిని గ్రాంటు కొనమర్థించితిని కాని ఫలితము శూన్యమైనందున గ్రంధమట్లులే మూలబెట్టియుంటిని 1963 సం॥ ఎద్దీరష్ట దంపతుల చలువ వలన బాలకాండ వెలుగులోనికి వచ్చినది 1983 సం॥లో ఇరువది సంవత్సరముల తరువాత తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సహాయముతో 'అయోధ్య కాండ" ముద్రింపబడినది 1985 సం॥లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము సాంస్కృతిక వ్యవహారాలశాఖవారి ఆర్థిక సహాయముతో అరణ్య - కిష్కింధకాండలు ముద్రింపబడినవి

2000 సం॥లో కరుణాలవాలుడు భగవానుడు నాకే ఆర్థిక సహాయువెుసంగి, సుందరకాండను వెలుగు దారులలో విహరింపజేసినాడు ఆయన లీలలు వెలకట్టరానివి కదా !

2002 సం॥లో తిరుమల తిరుపతి దేవస్థానములవారి రూపేణా శ్రీరామచంద్రుడే రూ 20,000-00 ఇరవైవేల రూపాయలు ఆర్థిక సహాయమందించుటచేత 'శ్రీరామాయణనిధి" యుద్ధకాండ వెలుగులోనికి వచ్చి విరాజిల్లుచున్నది శ్రీరామపట్టాభిషేకముతో శుభాంతముగా కావ్యము ముగియుచున్నందుకు నేనెంతయో ధన్యుడను

ఇక మిగిలియున్న 'సప్తమకాండ' మొకటే! శ్రీరామచంద్ర భగవానుడే "శ్రీరామాయణనిధి" సప్తమకాండను గూడ ముద్రించుకోగలడని గాఢవిశ్వాసముతో నిరీక్షించుచున్నాను మా భార్యా, మిత్రులు కొందరు మీ ఆరోగ్యము సన్నగిల్లుపోవుచున్నది

ఈ యుద్ధగ్రంథము ముద్రణకెట్లు నోచుకోగలదు అని వారించినపుడు శ్రీరామచంద్రుడే ముద్రించుకోగలడు లెమ్మనిన నా మాటలు నేడు అక్షరాలా నిజమై విలసిల్లుచు నా విశ్వాసమును వమ్ముచేయకుండ భగవానుడు రక్షించినా డనుటలో అతిశయోక్తిలేదు

శ్రీ చి॥ కె సంజయ ప్రభాకర్ యంయన్‌సి (బిసి వెల్‌ఫేర్ ఆఫీసర్) గారు తమ తండ్రి కీ॥శే॥ కొప్పుల సుబ్బన్న (అడిషినల్ పోలీస్ సూపరెంటెన్‌డెంటు) గారి స్మృత్యర్థము శ్రీరామాయణనిధి" యుద్ధకాండ కావ్యశరీరముతో శాశ్వతముగా సాహిత్య ప్రపంచములో తన తండ్రి వెలుగొందునట్లు చేయుమని నన్నుకోరిన శ్రీ సంజయ ప్రభారక్ గారికి భగవానుడాయురైశ్వర్యము లొసంగుగాక! శ్రీ కైపా నాగరాజు గారు అప్లికేషన్ ఫారాలు తెచ్చి ఇచ్చి తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి 'శ్రీరామాయణనిధి' యుద్ధకాండను ఆర్థిక సహాయార్థము పంపుమని ఒత్తిడి గావించి ప్రోత్సాహ మొసంగి నాకెంతో సహాకారమింపొంద గావించినందుకెంతయొ కృతజ్ఞుడను శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ కన్నడ ప్రొఫెసర్ శ్రీ శేషశాస్త్రిగారు శ్రీరామాయణనిధి యుద్ధకాండ గ్రంథమును తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి ఆర్థిక సహాయార్థము పంపుమని సలహానిచ్చి నన్నుఎంతగానో ప్రోత్సహించినందులకు వారికి సదా కృతజ్ఞుడను

శ్రీ చీమల చంద్రప్ప సబ్‌రిజిష్ట్రార్ (పామిడి) గారు 87వ సంవత్సరముల వయోభారముతోనున్న నాకెంతగానో తోడ్పడి 30 రూ॥ల బాండు పత్రమును టైపు చేయించి ఇచ్చి సహకరించినందులకు చాలా కృతజ్ఞుడను ఇతనికి దేవుడు ఆయురారోగ్యభాగ్యము లొసంగుగాక ।

శ్రీమతి చి॥ దామోదరం సరస్వతి - శ్రీ చి॥ తలమర్ల సుధీర్ (యంబిబియన్) శ్రీ చి॥ దామోదరం నళినీధర్ బిటెక్ వీరు ముగ్గురు గ్రంథ ముద్రణ విషయములో సహకరించి అండగా నిలిచినందుకు భగవానుడు వీరికి ఆయురైశ్వర్యము లొసంగి రక్షించుగాక । తల్లిని పోగొట్టుకున్న నన్ను మా నాన్నగారు రాత్రి తనప్రక్కలో

వరుండబెట్టుకొనుచు రామా! అని మూడుసార్లు చెప్పకొని నిద్రపోవుచుండెను కాని అప్పటికయ్యేది నాకర్థమయ్యేది కాదు ఒక్కనాటిరాత్రి తన ప్రక్కలో పండుకొనియున్న నన్ను చూచి మా తండ్రి రామా! అని మూడుసార్లు చెప్పకొని నిద్రపోరా అన్నారు ఆనాటి నుండియు రామనామమును జపించుకొనుచునే యున్నాను ఆ తారకమంత్ర ప్రభావమే శ్రీరామాయణ రచనకు దోహదము చేకూర్చినదని నా విశ్వాసము

లక్ష్మీ కళాసౌధము
అరవిందనగరు
అనంతపురం
తేది 15-6-2002

ఇట్లు
బుధజన విధేయుడు
**తలమర్ల కళానిధి**



# అభిప్రాయములు

మిత్రులు   కళానిధి  గారికి-నమస్సులు

జగత్ప్రసిద్ధమైన రామాయణకథ మీ సరళసుందర గద్యశైలి నన్నాకర్షించినది కన్నుల తడితో తలపాలముదాకనేక పథమున నన్నీడ్చుకొని పోయినది మీ కృతివరంపరలో శ్రీరామాయణనిధి మకుటాయమానముగానున్నది

హృద్యత-మీ గద్య కవిత సాధించిన ప్రధాన గుణము ! మీ రచన సారస్వతేయుల హృదయములను నాచికొనగలదు మిగిలిన కాండములు అచిరకాలమున వెలుగుచూచునట్లు భగవానుడు ఆశీర్వదించు గాక!

మీ

**బెక్లూరి శ్రీనివాసమూర్తి**

---

**బహుగ్రంథకర్త తలమర్ల కళానిధి గారికి నమస్కారములు**

మీ రామాయణనిధి సుందరకాండ గ్రంథము అందింది సంతోషం భారత భాగవత రామాయణ కావ్యాలు వచములోకంటే పద్య రూపంలోనే ఎక్కువగా వెలుబడ్డాయి ప్రస్తుతం మీరు వ్రాసిన శ్రీరామాయణనిధి గ్రంధాలు ఆ లోటును తీర్చగలవనుకుంటున్నాను భారతీయ కుటుంబ వ్యవస్థను జీవన విధానాన్ని తెలియజేసి, సమాజాన్ని ఒక దిక్సూచిగా నిలిచింది రామాయణ గ్రంధం పరమ పవిత్రమై ఆదర్శ పురుషుడుగా నిలిచిన శ్రీరామ కృపతో శ్రీరామాయణనిధిగా ఏడు కాండలను రచించిన మీకు సకల శుభాలు కలగాలని ఆకాంక్షిస్తున్నాను శ్రీరాముని కృపతో యుద్ధకాండ, ఉత్తరకాండలు ముద్రణకు నోచుకొని మీ అభిష్టం నేరవేరాలని కోరుతున్నాను

**వృషనామ సం॥ర ఉగాది శుభాకాంక్షలతో**

మీ

**గోపి** యం.ఎ పి హెచ్.డి (ప్రొఫెసర్)

వైస్ ఛాన్సలర్

శ్రీ పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం, హైదరాబాద్

# సన్మానములు

5-9-1999తేదీ నాడు ఉపాధ్యాయ దినోత్సవ సందర్భమున లయన్సు క్లబ్‌వారు " లలితకళా పరిషత్" భవనములో కవి సన్మానము చేసినారు

24-2-2001 తేది నాడు హిందూపురము స్వర్ణ భారతివారు కీ॥శే॥ కల్లూరు అహోబలరావుగారి కవిత్వ వేదిక పురస్కారముతో సత్కరించి 1116/- రూ॥ మొమెంటు, శాలువను సమర్పించినారు

14-7-2001 తేదినాడు ఆచార్య శలాక రఘునాథ శర్మగారు తన షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున (శంకర మఠంలో) రజిత పాత్రతోను-పంచె శాలువలతోను ఆదరాభిమానములతో కవి సన్మానము చేసినారు

10-2-2001 తేదినాడు "తెలుగు పండుగ' సందర్భమున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నారు కవి సన్మానముగావించి 500-00 రూ॥లు శాలువను మొమెంటును సమర్పించినారు



**18-4-1993** తేదినాడు అనంతపురంలో డా॥ బి ఆర్ అంబేద్కర్ జయంతి వేడుకల సందర్భమున కార్యదర్శి, కమిటీ మెంబర్లు కవి సన్మానము గావించుచున్న దృశ్యము



అడిషినల్ పోలీస్ సూపరింటెండెంట్

**కీ॥శే॥ కొప్పల సుబ్బన్న** బి.ఏ

జననము **1-8-1936** మరణము **16-4-1998**

కీ॥శే॥ కొప్పుల సుబ్బన్నగారి సంగ్రహ జీవితము

# పరమ హంస

అరుణాచలమనుచు స్మరియించువారల

అహం నిర్మూలింపు మరుణాచలా!

1 తల్లి సుగుణ సంపన్నురాలు గంగమ్మ
తండ్రి సహజ నిర్వికల్ప సమాధి నిష్ఠుడు పెంచలయ్య
ప్రథమ పుత్రరత్నము కొప్పుల సుబ్బన్న నామధేయము
కడప జిల్లా రాజంపేట మండలం
బాలబ్రహ్మ బ్రహ్మస్థలంబు బ్రాహ్మణపల్లె

(అందానుగా జననము 1 8-1936)

2 బాలభానుడుగా భాసించుచు
అమ్మఒడిలో కమ్మని సుధలు గైకొన్న బాలుడు
తేనెలొలుకు మాటలతో ఆటపాటలతో
బుడి బుడి నడకల నవ్వడితో
బడిలో చేరెను బాలుడు

3 బాల ప్రాయమున తండ్రి కాలగర్భమున కలిసిపోయే
కరువు కాటకాలతో కఠినుల నడుమ
బ్రతుకు తెరువు భారమయ్యే
విద్య నేర్చుటకు విత్తము దూరమయ్యే
చమటోడ్చి ధనమార్జించి విద్యలన్నియు
నార్జించే సుబ్బన్న అవనిపైన

4 బ్రహ్మ నిష్ఠాగరిష్టుడు కోటపాటి వెంకటయ్య
సుగుణ సాత్వికశక్తి సంపన్నురాలు సుబ్బమ్మ
ద్వితీయ పుత్రికారత్న సౌశీల్య సౌభ్రాతృత్వ ఆత్మమణి నాగలక్ష్మికి
జనని జనయిత్రులుగ వెలసిరి రాజంపేట మండలం
బ్రాహ్మణపల్లెయందు

5 నాగలక్ష్మీ సుబ్బన్న
వధూవరుల జన్మస్థలమునందు
అల్లంత దూరాన ఆలయమున
సురులు సుధలు గురిపించగ
వేదమంత్రములు మిన్నులంటగ
నిరాడంబరముగా వివాహము జరిగిపోయె

6 నీటి మీద బోటులాగ
సరస్సులోని కమలంలాగ
సతీపతిగ సంసారమున
ఏకైక పుత్రిక
ముప్పురు పుత్రరత్నములకు
తల్లితండ్రులైరి యుల్లముల్బొంగ

7 దుష్టశిక్షణ శిష్టరక్షణ కొరకు
పోలీసుశాఖలో యస్ ఐ గా చేరి
పదోన్నతులు ఎన్నెన్నో పొంది
దిగువ ఉద్యోగులకు రారాజుగాను
పై అధికారులకు ధీరుడుగాను
దుష్టులకు కాలయముడుగాను
సాధు జనులకు సర్వేశ్వరుడుగాను
బంధుమిత్రులకు ఆపద్బాంధవుడుగాను
కర్షక సోదరులకు కనక వర్షముగాను
అవనిపై అవతరించిన సుబ్బన్న అవతారపురుషుడు

8 ఢిల్లీ దర్బారు నగరములో
కేంద్ర నేరపరిశోధనా శాఖలో డియస్‌పి గాను
అవినీతి నిరోధక శాఖ హైదరాబాద్‌లో డైరెక్టరుగాను
ఆంధ్రావనిలో అనంతపూరు జిల్లా అదనపు యస్‌పి గాను
నీతినిరోధక నరులకు ఛండశాసనుడుగాను
ధరణిపై దర్శనమిచ్చిన కొప్పల సుబ్బన్న ధన్యజీవి
(పదవి విరమణ 31 8-1994)

9 భక్తి జ్ఞాన వైరాగ్యములు వీరి సహజ సంపదలు
నిగర్వి నిత్య నిర్మలానందము వీరి హృదయము
త్యాగనిరతి సత్యసంధత నిష్కామ కర్మ వీరి విధ్యుక్త ధర్మము
కలియుగ కలిమిలేములకు కలత చెందని కరుణామయుడు

10 రాగద్వేష రహిత రాజయోగి
జీవకారుణ్య నిష్కామ కర్మయోగి
సకలవేద శాస్త్ర ధర్మాచరణ జ్ఞానయోగి
తన్ను తాను తెలుసుకున్న బ్రహ్మ (జ్ఞాని) యోగి

11 సప్తస్వరాల సమ్మేళన స్వరముతో
గంధర్వుల గానకోకిల గళముతో
మృదుమధుర మిత వేదామృత భాషణములతో
సకల జీవులను రజింపజేసిన సుబ్బన్న
ప్రేమానంద స్వరూపుడు పుడమిపైన

12 ఎవ్వరిని నొప్పించక తానొవ్వక
చట్టాన్ని చక్కగా అమలుజేసిన నైపుణ్య చరితుడు
మానవత్వముతో సామరస్యముగా
అధికార విధులను ఘనముగా
నిర్వహించిన సుబ్బన్న వినయ సంపన్నుడు

13 నిస్వార్థ సేవయే సహజ ధర్మమని
అహంకారమును హరించి
హరిని హృదయమున నిల్పి
త్రిగుణాతీత శక్తితో అధికార విధులపై స్వారిజేసి
ఐ పి యం అవార్డు గ్రహీతగా
సాటిలేని మేటి రారాజు కీ॥శే॥ యన్ టి రామారావుచేత
పోలీసు శాఖలో పరమహంసగా కీర్తింపబడిన
కొప్పల సుబ్బన్న అమర వినుల సుచరితుడు అవనిపైన
14 సువిశాలమైన సుబ్బన్న నిష్కామ కర్మయోగమును
క్రమము దప్పక ఆచరించిన
హతమగును హీనగుణము
హితములో హరి ఇచ్చును హరివాసము
(మరణము16 4-1998)
15 జననము మరణము తథ్యమని
సుఖదు ఖాలకు అది నిలయమని
కర్మము ధర్మము సహజమని
చిరస్మరణీయ శృతి స్మృతులను మిగిల్చి
దు ఖసాగరమున ప్రాణ కోటిని ద్రోసివేసి
పరమ రహస్యముగా ప్రాణము వీడిపోయె
అకటా! కాలచక్రముతో కాయము వదలిపోయె
కాదనక ప్రాణమేనులను నిల్పగల శక్తులెవరు? ఇచ్చట!
జీర్ణ శరీరమును వదులుట ఆత్మకు పరిపాటియే గదా!
16 బ్రతికినంతకాలము బ్రహ్మనిష్ఠ వదలక యుండుటే భక్తి ముక్తి

ఇట్లు
కృతజ్ఞతాభినంద ధన్యవాదములతో
తేది 25-02-2002
కోటపాటి సుబ్బరామయ్య

# పారాయణ శ్రవణ ఫలము

శ్లో॥ య కర్ణా ఞ్జలి సమ్పుటై రహరహస్సమ్యక్పిబత్యాద రా
ద్వాల్మీకే ర్వదనారవిన్దగాళితం రామాయణాఖ్యం మధు
జన్మ వ్యాధి జరావిపత్తి మరణైరత్యన్త సోపద్రవం
సంసారం సవిహాయ గచ్ఛతి పుమాన్విష్ణో పదం శాశ్వతం

తా॥ వాల్మీకి మహర్షి వదనార విందమును శ్రీమద్రామాయణమనెడి మధువు జాలు వారినది సంతృప్తి మెరయ ఆదరముతో ఎవ్వడు గ్రోలునో (భక్తిమెరయునాలకించునో) వాడు వ్యాధి జరావిపత్తి మరణాదులనెడి ఉపద్రవకరమగు ఈ సంసారమును వదలి శాశ్వతానందమొనగూర్చి విష్ణులోకమును బడయుచున్నాడు





# శ్రీ రామాయణ నిధి

(యుద్ధకాండ)

# శ్రీ రామాయణ నిధి - యుద్ధకాండ

## రాముడు హనుమంతుని శ్లాఘించుట

వినయమే భూషణము గాగల వాయునందనుడు విన్నవించిన వృత్తాంత మాద్యంతము నాలకించి శ్రీరాముడు సంతృష్టుడై యిట్లనియె పవనాత్మజా! అన్యులకలవిగాని గొప్ప కార్యమొనరించి ధన్యుడవైతివి వైనతేయుడు వాయుదేవుడు నీవుగాక సముద్రమును దాటువారిని మరెవ్వరిని నేజూడ లేదు దేవదానవయక్ష గంధర్వోరగ రాక్షసులకును దేరిచూడరాని రావణ రక్షితంబగు లంకాపురంబు జొచ్చి బలశ్రీని చేపట్టి మగుడి రాగలధీరుడెవ్వరు? హనుమంతా! నీవే సమర్థుడవు వానరాధీశురాజ్ఞాపించిన మహాకార్యము సాధించి అంతటితో దనివిజెందక అశోక వనంభంగాది కార్యము లొనరించి సద్యశోనిలయుడవైతివి

ఏభృత్యుడును ఇంతటి కార్యమాచరించి యెరుంగడు స్వామి తన కాజ్ఞాపించిన దుష్కర కార్యమును జేసి యాకార్యమునకు ననుగుణముగా ఇతర కార్యములను కౌశలముతోనొనరించు వాడే యుత్తమ భృత్యుడు తన యేలిక యాజ్ఞమేరకు నుత్సాహముతో కార్యమొనరించి మనకేలనని యెడువాడు మధ్యమ భృత్యుడు

ప్రభుభక్తి గలిగి సమర్థుడై యుండియు తనకాజ్ఞాపించిన కర్తవ్యము నైనను నెరవేర్పజాలని వాడధమ భృత్యుడనబడును

పవనాత్మజా! అశోక వనభంగము - అక్షాది సంహారము - లంకా దహనము మొదలు గాగల కార్యము లాచరించి సుగ్రీవునకును నాకును మితిలేని యానందమొనగూర్చితివి సీతను జూచివచ్చి మా రఘువంశమును, మమ్ములను ఆత్మహత్యాదోషమునుండి మరలించి పుణ్యము గట్టుకొంటివి ఇట్టి మహోపకార మొనరించిన మారుతీ! నీకేమి యుడుగరలిత్తును అదియే నాకు దు ఖమును జేకూర్చుచున్నది వీరాధివీరా! నీకేమి పారితోషిక ఇచ్చినను నాయాత్మకు సంతృప్తి జేకూర గలదు?

నా సర్వస్వము నీకే యొసంగినను తనివిజెందకున్నాడనుగదా! సమీర నందనా! సద్గుణనిలయా! ఇదిగో! నాగాఢాలింగనమే సర్వస్వప్రదానంబగు గాక! యని శ్లాఘించుచు పులకాంకితుడై హనుమంతుని గాఢోప గూహనలో నుంచుకొనెను

కొంత తడవాలోచించి రాముడు సుగ్రీవుని జూచి యిట్లనియె సుగ్రీవా! మనమిక సీతనన్వేషించు మార్గమేది? నీరాకరంబును దలంచినన్ నాకేలకో భయమగుచున్నది వనచరులందరు నొక్కపెట్టున జలరాసిని దాటి దక్షిణతీరము జేరుటెట్లు? సముద్రమును దాటుటకేమియుపాయమున్నది? వివరింపుమని దుఃఖితుడై యున్న రాముని జూచి సుగ్రీవుడిట్లనియె

## సుగ్రీవుడు శ్రీరాముని యోదార్చుట

రామా! ప్రకృతుని చందంబునబరితపించుట నీకుదగునా? కృతఘ్నుడు సౌహార్దమును వదలు విధంబున శోకమును విడనాడుము శత్రువు యునికియు సీతాదేవి వృత్తాంతమును దెలిసిన పిమ్మట దుఃఖించెదవేల? నీవు భవిష్యత్సమాచారమెరింగిన నీతికోవిదుడవు ఊహాతీతుండవు సర్వసమర్థుడవు పండితోత్తముడవు ఉత్సాహమును గోలుపోవలదు మేము మహానక్రసమాకులమైన మహాంబుధిని దాటి లంకాపురంబు జొచ్చి నీ శత్రువైన రావణాసురుని రూపుమాపెదము సదా దుఃఖాబ్ధి నీదెడువానికదైన్యము చేకూరి నిరుత్సాహమ్మును నిరాశయునావరించి సమస్త కార్యములకు హాని గలుగజేయును గొప్ప యాపద గూడ సంభవించును మన వానరులు మహాశూరులు, ఉపాయమెరింగినవారు పండితోత్తములు నిన్నానందాబ్ధి నీదజేయుటకై అగ్నిహోత్రమునైనను గొని తెచ్చుటకు సంసిద్ధులై యున్నారు మహోత్సాహముతో మన యాజ్ఞ కొరకు వేచియున్నారు

రామచంద్రా! సముద్రమునకు సేతువును నిర్మించి, రావణ రక్షితలంకాపురంబు జొచ్చునట్లాజ్ఞాపించుడు త్రికూట పర్వతముపై ప్రతిష్ఠితంబైన యాలంకా పట్టణంబు నొక్క మారుజూచినంజాలును రావణుడు రణమందాక్షణమే గూలినట్లుగ నిశ్చయింపుము భయంకరమైన పయోరాసికి సేతువు నిర్మింపనిదే దేవేంద్రుకు దేవాసురులకును దేరి చూడనలవిగాదు మనము సేతువు గట్టిన క్షణంబుననే వానర సైన్యమంతయు సముద్రము నవలీలగా దాటిపోగలదు కామరూపులును యుద్ధకౌశలము గలవారునునగు

మనవానరులు లంకపట్టణమును రాక్షసులతో గూడ బెల్లగించి తీసికొని రాగలరు మనకు జయంబు జేకూరినట్లుగ దలంపుము ధైర్యంబును ఇక్క బట్టుము నీవుకేముషీధురంధరుడవు మహా పండితుడవు సర్వశాస్త్రార్థ కోవిదుడవు మరియు నన్ను బోలిన మిత్రుని గూడి శత్రువును సంహరింపుము రామా! రణరంగమందు నీవు ధనుర్ధారివై నిలువంబడినచో ముజ్జగంబుల యందును నీ మ్రోల నిలువంజాలిన మొనగాడెవ్వడున్నాడు? అనంతంబగు సముద్రమును దాటి త్వరలో సీతా సాధ్విని దర్శింపగలవు ఇంక దు ఖంబు మానుము క్రోధంబున వలంబింపుము భయంకరాకారునకందరును భయపడుట లోక సహజమేగదా! ఘోర పారావారంబును దాటెడు కర్తవ్యమెద్దియో సూక్ష్మబుద్ధి వగు నీవు మాతోనేకేభవించి యాలోచింపుము కామ రూపులగు వానరులు రాళ్ళచేతను వృక్షములచేతను రక్కసులందఱిని గీటడగింతురు ఇంకెన్నియో శుభనిమిత్తంబులు గోచరించు చున్నవి నిన్ను జయలక్ష్మి తప్పక వరించును నా హృదయమానందసరసిలో దేలియాడుచున్నది రావణాసురుడు హతుడయ్యె ననియే దలంచెదను రామా! సంకోచింపవలదని సుగ్రీవుడు రామునితో జెప్పెను

## లంకాపట్టణ రహస్యమును హనుమంతుడు శ్రీరామునితో జెప్పుట

పరమార్థవేత్తయగు రాముడు వనచర వల్లభుని వాక్యములాలకించి హనుమంతుని జూచి యిట్లనియె మారుతాత్మజా! సేతు బంధనముగావించియో సముద్రమునింకింపజేసియో మరేవిధము చేతనైనను సముద్రమును దాట సమర్థుడనై యున్నాను ఆ లంకా పట్టణమునకెన్ని దుర్గములున్నవి? రావణుని సైన్య పరిమాణమెంత యున్నది ద్వారరక్షణంబును - ప్రాకారాట్టాలకాది సన్నివేశంబును, రాక్షసుల సదనంబులను జక్కగా దెలిసికొనుగోరుచున్నాను నీవు ప్రత్యక్షముగా జూచి వచ్చిన లంకా వృత్తాంత మాద్యంతము నాకెఱిగింపుము సర్వవిధముల నీవు సమర్థుడవని రాముడు హనుమంతుని ప్రశ్నించెను వాయుసుతుండమితానంద పరవశుండై యథార్థముగ లంకా సన్నివేశక్రమంబంతయు జెప్పుటకుపక్రమించెను

రామచంద్రా! లంకాపురంబున నివసించెడు ప్రజలందఱమితానందసాగరంబున నోలలాడుచున్నారు ఆపట్టణ రాజము మిగుల విశాలమైనది రథ గజతురంగములచే నిండియున్నది రాక్షసమూకలు లెక్కకు మిక్కుటముగ నున్నవి లంకా పట్టణము శత్రువులకభేద్యమైయున్నది బలిష్ఠములైన నాలుగు

ద్వారంబులుగలవు ఆ ద్వారంబులయందు బాణమోచక యంత్రంబులును, శిలామోచక యంత్రంబులును గలవు శత్రు సైన్యములా ద్వారంబులను సమీపించిన తోడనే ఆ యంత్రంబులు శరవర్షంబును, శిలావర్షంబును గురిపించి ధ్వంసము జేయును ఒక్కమాఱు ప్రయోగించిన నూర్గురు చూర్ణమై పోయెడు నినుపగుదియలను రాక్షసులు దాల్చి ద్వారములయందు నిల్చియున్నారు ఆ లంకా పట్టణము చుట్టును సువర్ణమయమైన ప్రాకారమందందున లంకార్థమై పద్మరాగ ప్రవాళ వైడూర్యముక్తా ఫలములచే నిర్మింపబడి దాటనలవిగాకున్నది ప్రాకారము చుట్టును మహాభయంబును బుట్టించుచున గాధములై స్పృశింపనలవిగాని యగడ్తలు శీతలోదకము చేతను, మొసళ్ల చేతను, మహామీనంబులచేతను, మనోహరమ్మైయొప్పారుచున్నవి ఆ యగడ్తలకు నలుదిశలయందును నాలుగు దారునిర్మితములైన సంచారమార్గములున్నవి ఆ మార్గములను యిష్టానుసారముపయోగించెడు యంత్రములున్నవి సుభటులచటనే కావలి గాయుచుందురు ఆదారునిర్మితములైన సంచార మార్గములు శత్రుసేనలు వచ్చినప్పుడు లంకా పట్టణమును రక్షించుచున్నవి ఆ మార్గములభేద్యములైనవి ఒక మార్గము మిక్కిలి బలిష్టమై బంగారు స్తంభములతో ప్రకాశించుచున్నది రావణుడు నిశ్చలమానసుండై యేమఱకనుత్సాహము గలవాడై సేనాసముదాయములను జక్కగా బరిశీలించు చుండును లంకాపురంబు త్రికూట పర్వతంబుపై నుండుటచే బైకి పోవుటకే యాధారములేదు చూపరులకు భయంబును గలిగించుచు దేవతలకైనను బ్రవేశింపనలవిగాకున్నది జలదుర్గంబును, పర్వతదుర్గంబును, వనదుర్గంబును ప్రాకారపరిఖావృతంబగు కృత్రిమ దుర్గంబును ననియెడు నాలుగు దుర్గంబులచే లంకాపురంబు నొప్పారుచు సముద్రతీరమందు సొరుజిలుకుచుండును సముద్రమును దాటుటకు నోడమార్గము లేదు వార్తలను దెలిసికొనియెడు నుపాయము గానరాదు లంకాపట్టణమునకు జలదుర్గమున్నది అమరలోకమును బోలిన యాపట్టణ రాజము పర్వతాగ్రంబుపై రథగజతురంగములచే నలరారుచున్నది అగాధమైన యగడ్తల చేతను, శతఘ్నుల చేతను బాణశిలా మోచకాది నానావిధములైన యంత్రముల చేతను, లంకాపురంబు దురాత్ముండగు రావణునిచే రక్షింపబడుచున్నది పూర్వద్వారమందు పదివేల రాక్షసులును, దక్షిణ ద్వారమందు చతురంగబల సమేతులైన లక్షమంది రాక్షసులును పశ్చిమ ద్వారంబున బది లక్షల రక్కసులును, ఉత్తర ద్వారమందు నూఱుకోట్ల రాక్షసులును, బాహుబలాఢ్యులై రావణునిచే గౌరవింపబడుచుందురు వారందఱు రాక్షసేశ్వరునకత్యంత విశ్వాసనీయులు మఱియు దురాధర్షులగు రాక్షసులు నూర్లకొలదిగను, వేనవేలుగను కోట్లకొలదిగను, పట్టణమధ్యభాగమందున్నారు

నేనాయగడ్తెల మీదనున్న సంచారమార్గములన్నింటిని బ్రద్దలుజేసి బూడ్చితిని ప్రాకారములన్నిటిని బగులగొట్టి లంకాపురంబును దహించి వైచితిని ఇప్పుడంతకష్టములేదు రావణుని సైన్యములో మహాబలపరాక్రమ సంపన్నులగు వారిని గొందఱిని బిలుకు మార్చితిని జలరాశిని దాటుటకు మనకంత కష్టముండదు మన వానరులు లంకాపురంబు జొచ్చి ధ్వంసము గావించిరనియే నిశ్చయింపుడు అంగదుడును, ద్వివిదుడును, మైందుడును, జాంబవంతుడును, బనసుడును, నళుడును నీలుడును వీరలే చాలును మనకు మిగతా సేనలతో బనియేలేదు వీరందఱు వియత్తలంబున బయనించి పర్వతముల తోడను, వనంబుల తోడను, బహిర్ద్వారములతోడను ప్రాకారములతోడను, గృహంబులతోడను లంకాపురంబును బెళ్ళగించి యిచ్చటికి దేగలరు అంగదాదుల కనుమతి నొసంగుము సంసిద్ధుడవుగమ్మని పవనాత్మజుడు దశరథాత్మజునితో జెప్పెను

## నేడే వానరసేనలతో ప్రయాణము గమ్మని రాముడు సుగ్రీవునితో జెప్పట

శ్రీరాముడు సమీరకుమారుడు జెప్పిన దంతయునాలకించి సుగ్రీవుని జూచి యిట్లు బలికెను సుగ్రీవా! సూర్యభగవానుడిపుడు దివామధ్యమునొంది యున్నాడు ఈ యభిజిన్ముహూర్తమే ప్రయాణమునకెంతయు యుక్తమై యున్నది ఈ ముహూర్తమాత్రమున బయలుదేరినచో జయలక్ష్మిమనలను వరించును రావణుడెందుబోయినను విడువక వధించెదను విషంబును గోలి జీవితాశలు వదలి యున్నవాని కమృత స్పర్శంబునొంది కొలదిగ జీవితాశలు చిగురించు చందంబున వైదేహి నా ప్రయాణంబునాలకించి జీవితాశను బొందగలదు నేడుత్తర పల్గుణీ నక్షత్రము, చాల శుభదినము పునర్వసు నక్షత్రమందు బుట్టిన వారికిది సాధనతార యగుచున్నది రేపు హస్త నక్షత్రము అది నాకునైధన తారయగును కావున సమస్త సైన్య సమేతముగా నేడే పయనంబయ్యెదము శుభ నిమిత్తములెన్నియో ప్రాదుర్భవించుచున్నవి రావణాసురుని దునుమాడి సీతను దెచ్చెదను

నీలుడు, గజుడు, గవయుడు, గవాక్షుడు, ఋషభుడు, దుర్ధర్షుడు, గంధమాదనుడు మొదలగువారందఱిని నలుదిశల నుండి సేనలతో బయలుదేరునట్లాజ్ఞాపింపుము పల్లపు భూములందును, జలదుర్గస్థానమ్ము లందును, కాననము లందును, మనలనెదుర్కొనుటకై శత్రుసైన్యంబులుంచి

యుందురు వానరులాకాశంబున కెగిరి శత్రుసైన్యములున్నవో! లేవో! పరిశీలించు నట్లాజ్ఞ నొసంగుము అగ్రసేనలను ముందు నడిపింపుము నేను సురేంద్రు డైరావతమునారోహించి వచ్చినట్లుగ వాయుసుతునిపై నెక్కి సేనలకమితోల్లాస ముదయింప జేయుచు మధ్యభాగమందు వచ్చెదను కుబేరుడు సార్వభౌమంబను నుతమ గజంబునెక్కి వచ్చినట్లుగ లక్ష్మణుడును అంగదునారోహించి వచ్చును మహాబలుండగు జాంబవంతుడును, సుషేణుడును, వేగదర్శియు వీరు మువ్వురును, సేనా పశ్చాద్భాగమును రక్షించెదరని ధర్మాత్ముడగు రాముడుజెప్పగా కీశాధిపుండగు సుగ్రీవుడాలకించి ముదమొంది ప్రయాణమునకు సంసిద్ధులు గావలయునని కపులకాజ్ఞాపించెను

## వానరులందరు యుద్ధోత్సాహులై బయలుదేరుట

వానరాధీశుని యాజ్ఞను శిరంబునందాల్చి వానరసముదాయంబులు యుద్ధోత్సాహమినుమడింప గుహలనుండియు పర్వతములనుండియు మహీరుహంబులనుండియు నెగిరి గంతులు వేయదొడంగెను శ్రీరామచంద్రుడు లక్ష్మణ సుగ్రీవులతో బూజలందుకొని వానరసైన్య సమేతుడై దక్షిణ దిశకు బయలుదేరెను సుగ్రీవ పాలితులై వానరులు గర్వించి యెగిరి గంతులిడుచు, సింహనాదంబులు గావించుచు బరుగులిడుచు సుగంధి ఫలంబులను భక్షించుచు, మధువులను గ్రోలుచు విలాసార్థమై మంజరీ సుశోభితంబులగు గొప్ప భూరుహములను బట్టుకొనుచు దక్షిణదిశకేగిరి మనము రావణాసురుని రాక్షసులను మట్టుబెట్టవలయునని గర్జించుచు నొకరికొకరు బడద్రోసి కొనుచు బైకెత్తుచు దన్మయులైనడువందొడంగిరి

మహాపరాక్రమశాలురగు ఋషభుడును, నీలుడును, కుముదుడును, సేనలకు ముందునడచుచు మార్గమును బరిశోధింపుచుండిరి సుగ్రీవుడును, రామలక్ష్మణులును, బలవంతులగు పెక్కు వానరులచేత బరివేష్టింపబడి సేనామధ్యంబున నడచుచుండిరి వీరాధివీరుడగు శతబలి పదికోట్ల వానరసేనలతో బరివేష్టింపబడి సేనలను రక్షించుచుండెను కేసరి బనసుడు, గజుడును నర్కుడు నూరుకోట్ల వానర వీరులను రక్షించు చుండిరి సుషేణుడు జాంబవంతుడు లక్ష సైన్యముచే బరివేష్టింపబడి సుగ్రీవుని ముందుంచుకొని వానరసేన పశ్చిమ భాగమును రక్షించు చుండిరి వానరోత్తముండగు నీలుడు నలుదిశలయందును సంచరింపుచు వానరసేనను రక్షించుచుండెను బాహు విక్రమ సంపన్నులగు దరీముఖుడును, ప్రజంఘుడును రంభుడును, రభసుండును నలువైపుల

సంచరింపుచు సేనలను బ్రోత్సాహపఱచుచు బోయిరి ఇవ్విధంబున వనచరులు బోవుచు మార్గమునుండియే ద్రుమలతాయుతంబగు సహ్యపర్వతంబును ఫుల్ల పద్మకల్హారంబులగు సరోవరంబులను, తటాకములను వనంబులను దిలకించిరి అనంతమై సముద్రమును బోలియున్న సేనాసముదయమంతయు శ్రీరామునాజ్ఞకు వెఱచి నగరంబులపైగాని, జనపదంబులపైగాని పడకుండ మహాధ్వను లొనరించుచు సముద్రంబుకరణి సాగిపోయినది శ్రీరామున కమితోత్సాహంబును గలిగించుటకై బాటలగు వానరోత్తములు జవనాశ్వంబులకైవడి పరుగులిడిరి పురుషోత్తములగు రఘునందనులు హనుమదంగదులపై చంద్రసూర్యుల వోలె బ్రకాశించిరి

జ్ఞాననిలయుడగు లక్ష్మణుడు పరిపూర్ణమనోరథుడై రాముని జూచి మంగళకరంబైన మాటలతో నిట్లనియె, అన్నా! త్వరలో రావణుని బరిమార్చి సీతాదేవిని గైకొని సమృద్ధమనోరథుడవై యయోధ్యానగరంబును జేరగలవు భూమ్యాకాశంబులయందు గొప్ప శుభనిమిత్తంబు లెన్నియో గోచరించుచు నీకార్య సిద్ధిని సూచించుచున్నవి పవనుడు సుఖకరంబుగ భావిశుభములను సూచించుచు మెలమెల్లన సేనవెంట వీచుచున్నాడు మృగపక్షులు మధుర స్వనంబులొనరించుచున్నవి దిక్కులన్నియు బ్రసన్నములై యొప్పారుచున్నవి భాస్కరుడు విమలుడై వెలుగొందుచున్నాడు పరిశుద్ధుడగు శుక్రుడు ప్రసన్న తేజోనిలయుడై నీవెనుక భాగమందు బ్రకాశించుచున్నాడు సప్తర్షులు ధ్రువునకు బ్రదక్షిణముగ దిరుగుచు దేదీప్యమానులై విలసిల్లుచున్నారు ఇక్ష్వాకు వంశోద్భవుండగు త్రిశంకు మహారాజు నిర్మలుడై వెలుగొందుచున్నాడు మన యిక్ష్వాకు వంశ్యులకు ముఖ్యమైన విశాఖ నక్షత్రము దుష్ట గ్రహములకు దూరముగ నిర్మలమైన కాంతిపుంజములను వెదజల్లుచున్నది రాక్షసుల నక్షత్రమైన మూలా నక్షత్రము చేరువలోనున్న ధూమకేతువుచే స్పృశింపబడి తపింపబడుచు మిక్కిలి పీడింపబడుచున్నది అందువలన రాక్షసులకు వినాశంబు తప్పదు జలంబు స్వచ్ఛమై యున్నది వనంబులు ఫలపూర్ణములై యున్నవి భూరుహంబులు ఋతుమర్యాద నతిక్రమింపక పుష్ప సుగంధములను గుబాళించుచున్నవి వ్యూహములుగా నేర్పరుపబడియున్న వానరసేనల సురసైన్యనికరంబువోలె బ్రకాశించుచున్నవి ఈశుభనిమిత్తములను గాంచి సంతోషాబ్ధినీదు చుండుమని శ్రీరామునితో సుమిత్రాసుతుండు జెప్పెను

నఖదంతాయుధులగు ఋక్షవానరుల మహాసేనాసముదయంబులు భూవలయమునంతటిని వ్యాపించి పోవుచుండెను వనచరుల హస్తముల చేతను, పాదములచేతను, చెలరేగిన దుమ్ము సూర్య ప్రకాశమునావరించి లోకమును

తల్లడింప జేయుచుండెను రామకార్యధురంధరులై బలగర్వితులగు వనచరులు సంతుష్టాంత కరణులై కిలకిలయని యఱచుచు వాలములను నేలకు గొట్టుచు తరుశాఖలను విఱుచుచు బర్వతములను బ్రద్దలు గొట్టుచు సింహనాదంబులు గావించిరి కొందఱు యూరువేగంబున లతా వితానములను మర్దించుచు వృక్షములను రాళ్లను దీసికొని యాటలాడిరి సుగ్రీవ పాలితమై యున్న వానరసేన రామకార్యమందు మగ్నమై రాత్రింబవళ్ళు పయనము సాగించుచు సమరోత్సాహ మినుమడింప తరులతాదుల తోడను, మృగసమూహముల తోడను, నిండి నిబిడీకృతమై సహ్యమలయ పర్వతములను సమీపించెను

## రామసుగ్రీవులు వానరులతో సహ్యా - మలయ పర్వతములను జూచుచు బోవుట

శ్రీరాముడు సహ్యా, మలయపర్వతంబులందలి నానావిధములైన వనములను సెలయేఱులను దిలకించుచు సుగ్రీవాదులతోగూడి పోయెను వానరులు మార్గమధ్యమందు చంపక వృక్షములను మామిడి యశోకవృక్షములను, తెల్లవావిలి కరవీర పొదరిండ్లను జూచుచు బోయిరి ఆ వనచరుల త్రొక్కుడుల చేత ధాతువులందుబుట్టిన పరాగమును సమీరుడు వెదజల్లగా సైన్యమునంతయు గప్పివైచినది

సహ్యాపర్వతమందలి శీతలోదకములచే జెలువారుచు వికసించిన కమలములు, తెల్లకలువలు, నల్లకలువలు గల జలాశయంబులును చక్రవాక కారండవాది పక్షులును, వరాహాది జలగోచర మృగసంసేవితంబులగు నడబావులును, ఋక్షంబులును సివంగులును, సింహసశార్దూలంబులును, దుష్టగజంబులును మొదలుగాగల క్రూరమృగంబులచే నిండిన వనంబులన్నియు వనచరులచే జెఱుపబడెను పర్వత సానువులందు వివిధ పక్షి జాలంబులు మధురముగా గూయుచుండెను సరోవరములందు వానరులు స్నానమాడుచు జలంబుల నొకరిపై నొకరు జల్లుకొనుచు గ్రీడ సల్పిరి మధుర ఫలములను, మూలములను, కుసుమములను భుజించిరి, అచ్చటచ్చట వ్రేలాడుచున్న తూమెడు తేనియగల తేనెపట్టులను స్వేచ్ఛగా గ్రోలుచు పరమామోదమొందుచు వానరులు నడచుచుండిరి కొందఱు వృక్షములనారోహించుచు నేలకు దుముకుచు బోయిరి ఇవ్విధంబున రాజీవలోచనుండగు రాముడు సుగ్రీవాదులందఱితో బయలుదేరిపోయి మహేంద్ర పర్వత శిఖరంబునారోహించి

కూర్మ, మీన, సమాకీర్ణమైన సలిలాకరంబును దిలకించెను వానరసేనలు సహ్యామలయ పర్వతంబులను దాటి భీమనిస్వనంబులీనెడు సముద్రమును సమీపించినవి పురుషోత్తముడగు రాముడు సుగ్రీవలక్ష్మణులంగూడి పర్వతంబు డిగ్గి జలరాశిని జూచు కుతూహలంబుతో సముద్రతీర వనమునకు బోయి సుగ్రీవుని జూచి యిట్లనియె

## వానరసేనల సముద్ర తీరమును జేరి యుద్యుక్తమొందుట

సుగ్రీవా! మనము సముద్ర తీరమును జేరితిమి ఉపాయమెఱుంగక సముద్రమును దాటనలవిగాదు ఇప్పుడిచటనే విడియుదము జలరాశినిదాటు కర్తవ్యమెద్దియో దీర్ఘముగా నాలోచించెదము సేనాధిపతులు వారి వారి సైన్యములను వదలియెచ్చటికిని బోరాదు వానర ప్రముఖులందరు నేమఱక దిరుగుచుండవలయును ఛిద్రంబన్వేషించి మనలను బ్రహరించుటకై శత్రువులెచ్చోటనైనను దాగి యుందురేమో! జాగ్రత్తగా మెలగునట్లాజ్ఞాపింపుమని రాముడు సుగ్రీవునితో జెప్పెను సుగ్రీవుడు రాముని యానతిని శిరంబునందాల్చి సముద్ర తీరమందు సేనలను విడియ నియమించెను ఆసేన రెండవ సముద్రంబు కరణి బ్రకాశించుచుండెను వానరులొనరించు ధ్వనులు సముద్రధ్వని నణచివేయుచుండెను రామకార్యంబు నెరవేర్చనుద్యుక్తయై వానరవాహిని పరమోత్సాహముతో మహార్ణవమందు చెలరేగుచున్నతరంగములను గాంచి యాశ్చర్యమొంది సంతోషసాగరమున దేలుచుండెను రాక్షస గణంబుచే సేవింపబడునదియును వరుణునకునికి పట్టైయొప్పునదియును, భయంకరమకరంబుల కాల వాలమైనదియును, సంధ్యాసమయంబున భయంకరమై గోచరించునదియును, ధవళఫేనంబులచే నవ్వునట్లు దోచునదియును, తరంగ జాలంబుచే నర్తనంబుగావించు కరణింగను పట్టునదియును, చంద్రోదయసమయంబున సముద్ధూతమై ప్రతి చంద్రబింబితంబులగు చంద్రబింబములచే సొరు జిలుకునదియును, తిమింగలాది భుజంగములచే నిండినదియును, శింశుమారాది మహాజంతువుల చేతను, మునిగియున్న నానావిధ పర్వతంబులచేత నొప్పారునదియును, దొరనశక్యమైన మార్గరహితంబై మిక్కిలి యగాధముగలదియునునగు నా యనంత పారావారంబును వనచరులు దిలకించి దీని నెబ్బంగి దాటగలమని శోకంబు నొందిరి

మకరంబుల తోడను సర్పముల తోడను వాయువేగ వలితంబులై గొప్పతరంగములు యెగిరి పడుచు నాకాశ సముద్రంబులు రెండును మిళితమై భేదంబుగానబడకుండెను రణరంగమునందు భయంకరమైన భేరీధ్వనులవోలె తరంగ రావములు వినబడుచుండెను జలజంతు గణసంకులంబై వాయువేగంబుచేత బైకి లేచెడు తరంగముల ధ్వనులు మాటలాడునట్లున్న సముద్రమును మహోత్సాహభరితులై వానరులు జూచి యాశ్చర్యమొందిరి

## రాముడు సీతావియోగమును భరింపజాలక దుఃఖించుట

సేనాధిపతియగు నీలుడు నీతిశాస్త్రోక్త ప్రకారంబున సముద్రోత్తర తీరంబునందు రక్షకుల నేర్పరచి నిర్భయంబుగా సేనానివేశనంబుగావించెను మైందుడు ద్వివిదుడను వానరోత్తములు సేనాసముదయంబులను రకించుచు నలుదిశలయందును సంచరించు చుండిరి

ఆ విధంబున సైన్యమంతయు విడిసినంతనే రాముడు తన పార్శ్వ భాగమందు సేవించుచున్న లక్ష్మణుని జూచియిట్లనియె సోదరా! కాలవశమున దుఃఖము నశించును గాని నాకు ప్రియావియోగము వలన జెందిన దుఃఖము నానాటికి వృద్ధిబొందుచున్నది ప్రియురాలు దూరదేశమందున్నదనియు రాక్షసుడు గొనిపోయెననియు నాకు దుఃఖములేదు రాక్షసులను గుత్తనియలుగా దునుమాడి ధర్మపత్నిని బడయవచ్చును ఇప్పుడాసుకుమారి నిండుజవ్వనము వ్యర్థమగుచున్నందుల కెంతయో విషాదము గలుగుచున్నది వాయుదేవుడా! నీవు బోయి నా ప్రియురాలును స్పృశించి వచ్చి నన్ను స్పృశించి సంతోషింపుదిని నీదజేసి నాదేహ తాపమును బోగొట్టుము నా జీవితేశ్వరి వదనారవిందమును బోలిన చంద్రబింబమును జూచి ప్రియురాలి పూర్ణేందు బింబమును దిలకించినట్లు మోదార్ణవమున దేలవలసియున్నది నాయర్ధాంగి దేహస్పర్శ నాకు లభించెడు భాగ్యము నీ యధీనములో నున్నది సీతాదేవి ముఖమును జూచెడు భాగ్యము చంద్రుని యధీనములోనున్నది

సమస్త భోగభాగ్యములన్నిటిని తృణప్రాయముగా విడనాడి నావెంట మోరారణ్యమునకు వచ్చిన ప్రాణసఖిని నేనెట్లు మఱవగలను దుష్టరక్కసుడు గొని పోవునపుడు తన పాతివ్రత్యాగ్నిచే వానిని భస్మము చేయునంతటి సమర్థురాలైనను పతిభక్తి పరాయణురాలై నన్నే ధ్యానించుచు అయ్యో! నాథా! యనుమాటతో విషంబుకైవడి నాదేహమంతయు దహింపబడుచున్నది

ప్రియావియోగమే ఇంధనముగను చింతయే జ్వాలలుగను జేసి మన్మధుడనియెడు హుతాశనుడు రాత్రింబవళ్లు నన్ను దహించుచున్నాడు సోదరా! యీ సుమశరుని తాపంబున కోర్వంజాలను నిన్ను విడిచి సముద్రమందు బరుండెదను అప్పుడీ పుష్పబాణుడు నన్ను దహింపజాలడు సీత జీవించియున్నది అందులకే నేనుగూడ జీవించియున్నాను అరివర్గమును హతమార్చి సుశ్రోణియు శతపత్రేక్షణయునగు లక్ష్మిని బోలిన సీతను నేనెన్నడు జూడగలను? చారుబింబోష్ఠములు గలదియు, పద్మముఖియునగు నా ప్రియురాలు ముఖమును గొంచెము పైకెత్తి రోగింసాయనంబును గ్రోలుచందంబున నదరామృతము నెప్పుడు తనివి దీర గ్రోలుదునో గదా! ఆబిడ మైముఱచి నన్ను గాఢోపగూహనలో నదిమి పట్టినపుడు తాళపలంబులనుబోలిన [illegible] [illegible]ములు నాదేహంబునకెప్పుడు సోక గలవు? నేను జీవించి యుండి[illegible] ప[illegible]యుగు నా ధర్మపత్ని దిక్కులేని దానివోలె రాక్షసులనడుమ బరితపించుచున్నది గదా! జనకాత్మజయై దశరథ మహారాజునకు కోడలై నాకు ప్రియురాలై, రాక్షసుల నడుమ జిక్కియున్నదే! ఔరా! యేమికాలమహిమ? శారద నీరదములనడుమ నుండి బయల్వెడలు చంద్రరేఖవోలె సీతాదేవి రాక్షసుల వారినుండి విడువడి నా మ్రోలనెన్నడు నిలువగలదు? రావణాసురుని నాబాణాగ్నిచే నెన్నడు దగ్ధముచేయగలను? సురసులోపమానయైన సీతాదేవి పరమామోదమొందుచు నన్ను బిగికౌగిట జేర్చి యానంద బాష్పము[illegible] నెపుడువిడువ[illegible]లదు? సీతాదేవి విరహ దుఃఖాగ్ని నుండి దరిజేరుటెన్నడని [illegible] యిడు విలపించెను శ్రీరాముడట్లు దుఃఖించుచుండగానే సూర్యుడస్తమింప దొడంగెను సంధ్యాకాల మాసన్నమయ్యెను ప్రియా వియోగాబ్ధినీదుచు శ్రీరాముడు సంధ్యావందనము గావించెను

## రావణుడు లంకలో తన మంత్రులను గూడి యాలోచించుట

రావణాసురుడు హనుమంతుడు గావించి పోయిన [illegible]యం[illegible]కర కార్యంబును జూచి సిగ్గుజెంది రాకసులందఱిని కలయంజూచి నిండోలగంబున నిట్లుజెప్పను రాక్షసులారా! శత్రువులకు దుష్ప్రవేశంబగు లంకాపట్టణములో హనుమంతుడను వాడు నిర్లక్ష్యముగా ప్రవేశించెను ఆ కోతి సీతను [illegible], చైత్యప్రాసాదంబును భగ్నము జేసి రాక్షస శ్రేష్ఠులను బెక్కండ్రను బిలుకుమార్చి పట్టణ రాజంబును దహించి నా మనంబునకు దీని వ్యాకులంబును జేకూర్చెను మనమిపుడు జేయువలసిన కర్తవ్య మెద్ది? కార్యసిద్ధి గలిగించెడు మార్గమేది?

ఇందులకు దగిన యుపాయమెఱిగింపుడు మంత్రముచేతనే జయలక్ష్మిని బొందవచ్చునని ధీశాలురగు పెద్దలు నుడువుదురు రాముని జయించు నిమిత్తమై మంత్రము సేయగోరుచున్నాను లోకంబున నుత్తమ మధ్య మాధములని మూడు విధములగు పురుషులు గలరు వారి గుణదోషము లెఱింగించెద నాలకింపుడు

ఎల్లప్పుడు తన హితమపేక్షించుచుండెడు మంత్రులతో గాని, సుఖ దు ఖములను సమముగా బంచుకొనియెడు మిత్రరత్నములతో గాని, తన మేలుగోరెడు బంధుజనంబులతో గాని చక్కగానాలోచించి శక్తి వంచన లేక కార్యంబుల నారంభించుచు భగవంతుని యందే భారము వేసి యుండునో యాతడుత్తమపురుషుడనంబరగును తానొక్కడే యాలోచించి యేకాంతముగ దైవమునాశ్రయించి కార్యములొనరించు నాతడు మధ్యమపురుషుడనబడును గుణదోషాదులను నిశ్చయింపక భగవంతుని సరకు గొనక కార్యారంభము నకుపక్రమించి తుదముట్టగావింపనేరని వాడధమ పురుషుడనబడును ఈ మూడు విధములగు పురుషులవోలెనుత్త మాధమ మధ్యములని మూడు విధములగు మంత్రములు గలవు

సచివులందఱు నైకమత్యము నొంది శాస్త్ర జ్ఞాన సంపన్నులై పరస్పరాసక్తులై చేయుమంత్రముత్తమంబని పెద్దలందరు కార్యనిర్ణయ విషయమై మంత్రులకు బరస్పర మతభేదంబులు గలిగియెట్టకేలకు నైకమత్యమొనగూడునో యది మధ్యమమంత్రమని మతిమంతులందురు మంత్రులు భిన్నాభిప్రాయంబులను బొంది తమతమ యభిమతంబులను వీడక వాదోపవాదములుగావించుచు నైకమత్యమును గోల్పోయి చేసెడు మంత్రమధమ మంత్రమని చెప్ప బడుచున్నది కాన ధీశాలురగు మీరు శాస్త్రోక్తముగా జేయదగిన కార్యమును జక్కగా నాలోచించి నిర్ణయింపుడు రాముడు బాహుబలాఢ్యులగు వేలకొలది వానరులంగూడి లంకా పట్టణమునకు వచ్చుచున్నాడు సుగ్రీవాది వానరోత్తములను గూడి శక్తి సంపన్నుడై సముద్రమును యింకించిగాని సేతుబంధాదులుగావించి గాని సుఖంబున దాటి రాగలడు నాలంకా పట్టణమునకును, సైన్యమునకును శ్రేయంబొనగూర్చెడు నుపాయము నాలోచింపుడని రావణుడు మంత్రులతో జెప్పెను

## రాక్షసులు రావణాసురుని శ్లాఘించుట

రావణుని పలుకు లాలకించిన బాహుబలాఢ్యులైన నీతి బాహ్యులును, బుద్ధిహీనులునగు రాక్షసులందఱు శత్రుబలంబును దెలియంజాలక జేమోడ్పు

గిలించి రాక్షసేంద్రుని జూచి యిట్లు బలికిరి రాక్షసాధీశ్వరా! అనంతమైన సైన్యము నీచెంతనుండగా దు ఖించెదవేల? మన సేనాసముదయంబు నెదిరింప గల శూరుడెవ్వడు, ముజ్జగంబుల యందును నిన్ను జయించువారున్నారా? పాతాళంబునకేగి పన్నగులను, ఈశ్వరునికి మిత్రుడును, కైలాసవాసియును యక్షులకు ప్రభుండునునగు కుబేరుని జయించి పుష్పక విమానమును గైకొంటివి రాక్షసేంద్రా! దానవనాథుండగుమయుడు నీకు వెఱచి నీతో మైత్రి నాపాదించి తనయనుంగుకుమార్తెయగు మండోదరిని నీకొసంగి వివాహము గావించెను నీభగినికుంభీనసికత్యంత ప్రియుండగును, బలదర్పితుండనునగు మధువును యుద్ధంబున జయించి వశీకరించుకొంటివి పాతాళలోకంబునకేగి వాసుకిని తక్షకుని, శంఖుని, జటిని మొదలగు నాగేంద్రులను జయించి నీ వశంబు గావించుకొంటివి

మూర్ఛము గావించినను మరల సజీవులగు నాశరహితులును సత్త్వ సంపన్నులును, శూరులును ఘోరతపంబు గావించి బ్రహ్మచేత వరంబులు వడసిన వారునునగు కాలకేయులనియెడు దానవులు స్వబలమునంతయు వినియోగించి సంవత్సర కాలంబు యుద్ధంబు గావించి కడపటికి నీకు వశ్యులైరి ఆ కాలకేయుల మైత్రిని సంపాదించుకొని వివిధములగు మాయలెన్నింటినో నేర్చి యున్నావు వీరాధి వీరులగు వరుణపుత్రులను చతురంగ సైన్య సమేతముగా జయించినావు సంగ్రామ మొనరించి కాలుని యవలీలగా బారదోలి విజయలక్ష్మిని జేపట్టితివి నీపేరు విన్నచో లోకంబులన్నియు జలించిపోవును సురనాథున కీడు వచ్చెడు క్షత్రియుల నెందఱినో జయించితివి రాముడు వారలకు సాటివచ్చునా? రాముడేడ? నీవేడ? ఆ మానవాధముడు నీయెదుట నిలువగలడా? రాజా! నీవు శ్రమజెందనేల? ఊరకుండుము నీ యనుంగు సుతుండగు ఇంద్రజిత్తు యొక్కడే వనచరులనందఱిని రూపు మాపగలడు ఉత్తమాధ్వరము గావించి పరమేశ్వరునిచే బరమ దుర్లభంబగు వరంబు వడసెను పరమేశుని వరప్రసాదంబుచే శక్తితో మరాద్యాయుధంబులే మత్స్యంబులుగను, ప్రేవులే శైవలంబుగను, గజములే కచ్ఛపంబులుగను, తురగంబులే మండూకములుగను, రుద్రాదిత్యులే మకరంబులుగను, వసువాయువులే మహోరగంబులుగను, రథాశ్వ గజంబులే జలసమూహముగను, పదాతి సైన్యమే పులినతిన్నెలుగను

మహానీరాకరంబు కరణిభయంకరమై గ్రాలెడు సురసైన్యనికరంబు జొచ్చి సురేంద్రుని బట్టి బంధించి లంకాపురంబునకు గొనితెచ్చెను గదా! అట్లు గొనితేబడిన దేవేంద్రుని బ్రహ్మానానతింజేసి విడిచి పుచ్చితివి అట్టి నీవు క్షుద్రుడగు హనుమంతుని దలంచి దిగులొందుట మిమ్ము బోలినధీర హృదయులకిది జెల్లునా? నీవు దప్పక రాముని దునుమాడగలవు ఇంద్రజిత్తను బంపుము వానరవాహినులను వధించి రాగలడని రాక్షసులు రావణునితో జెప్పిరి

## ప్రహస్తాది రాక్షసులు రావణునితో తమ తమ పరాక్రమమును వెల్లడించుకొనుట

వీరోత్తముడును రాక్షస సేనాధిపతియును నీలాంబుదమునుబోలిన దేహంబుగల వాడునగు ప్రహస్తుడు రావణునకు నమస్కరించి యిట్లనియె, రావణ రాజా! దేవదానవగంధర్వ పిశాచపతంగోరగంబులెదురొడ్డి నిల్చినను యుద్ధమందు నిన్ను జయింపజాలరు వనచరాధములనగానెంత? మనల నెదిరించువారెవ్వరు? మనమాదమఱచి యున్నపుడు హనుమంతుడు తటాలున వచ్చి యింత పనిజేసిపోవుట కవకాశముగలిగెను ఇప్పుడేమి మునిగి పోయినది నేను జీవించి యున్నంతదనుక నా వానరాధముడెట్లు ప్రాణంబులు దక్కించు కోగలడు? నా కనుజ్ఞనొసంగుము భూమండలమంతయు గాలించి వానర పురుగులు లేకుండునట్లు రూపుమాపి వచ్చెదను నాచే రక్షింపబడుచున్న ఈ లంకలోనికెవ్వడు రాగలడు? వానరులెంత? వారిబలమెంత? నిన్నేమియు జేయంజాలరు నిశ్చింతగా నుండుమని ప్రహస్తుడు రావణునకు జెప్పెను

దుర్ముఖుండను రాక్షస వీరుడు క్రోధ తామ్రాక్షుడై ముందునకు వచ్చి యిట్లనియె, రాక్షసేశ్వరా! హనుమంతుడు మన కొనరించిన పరాభవంబు భరింపరానిది క్షమించుటకు వీలుగానిది వనచరాధముండొకడరుగుదెంచి మన లంకాపట్టణంబును అంత పురంబును పరాభవాగ్నిలో బడద్రోయుటను జూడ శ్రీమంతుడగు రావణ రాజేంద్రునే పరాభవించినట్లున్నది ఇది సహింపరాని విషయము నేనిదే పోయివచ్చెద సెలవొసంగుము నేనొక్కడనే బోయి వానరులందఱు సముద్రమున దాగినను గగన వీధినుద్గమించినను, పాతాళంబున కేగి

రాజా! ఎంతొక హితంబు నీకెఱుంగదెల్పెద నాలకింపువము ఏమఱకేయుపాయంబు చేతనైనను శత్రువులనుజయింపవలెను కామరూపధరులును, శూరులునగు రాక్షసులు భయంకర రూపములను మానివేనవేలుగా మనుష్య రూపములను దాల్చి రాముని చెంతకేగి రామా! నీ సోదరుండగు భరతుడు బంపగా వచ్చినాము భరతుడు సేనా సమేతుడై వచ్చుచున్నాడని చెప్పవలెను అంతలోనే మేమందఱు ధనుర్బాణ ఖడ్గశూలశక్తి గదాధరులమై పోయి వానరసేనాసముదయంబును యమసదనంబునకు బంపెదము రామలక్ష్మణులు సేయునది లేక ప్రాణంబులు వదలుదురు మీరేమియు చింతింపవలదని వజ్రదంష్ట్రుడు రావణునితో జెప్పెను

మహాసత్త్వ సంపన్నుడగు కుంభకర్ణుని కుమారుడు నికుంభుడను వాడమితకుపితమానసుండై లోకంబుల నేడ్పించెడు రావణునితో నిట్లులనియె రాక్షసాధీశ్వరా! మీరందఱు నిచటనే నిశ్చింతగా నుండుడు నేనొంటరిగా బోయి రామలక్ష్మణులను, సుగ్రీవాది వానరులందఱిని వధించి వచ్చెదననెను

పర్వతాకారుండగు వజ్రహనుడను రాక్షసుడమిత కోపోద్రేకుడై భక్షణ స్మరణంబున నోరూర నాలుకను జాచి చప్పరించుచు రావణునితో నిట్లు జెప్పెను రాజా! మీరందఱు నిర్భయముగా మీ మీకార్యంబులను జేసికొను చుండుడు నేనిదేబోయి వానరలందఱిని భక్షించెదను మీరు నిశ్చింత తోమధ్యమును గ్రోలుచు స్వస్థచిత్తులై క్రీడింపు చుండుడు నేనొక్కడనే బోయి రణకుంజరుండగు రాముని, లక్ష్మణ సుగ్రీవులను, హనుమంతుని, అంగదుని హతమార్చి వచ్చెదనని వజ్రహనుడు వాక్రుచ్చెను

## శ్రీరామునకు సీత నొసంగుమని విభీషణుడు రావణునకుజెప్పుట

నికుంభుడు రభసుండు, సూర్యశత్రుడు, సుప్తఘ్నుడు, యజ్ఞహుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, దుర్ధర్షుడు అగ్నికేతుడు రశ్మికేతుడు మహాతేజుడు ఇంద్రజిత్తు, ప్రహస్తుడు విరూపాక్షుడు, వజ్రదంష్ట్రుడు, ధూమ్రాక్షుడు, అతికాయుడు, దుర్ముఖుడు మొదలుగా

గల వారందఱు పరిఘంబులను బట్టిసంబులను, ప్రాసంబులను, శక్తులనుశూలంబులను పరశువులను ధనుర్బాణంబులను, నిశితంబులగు మహాఖడ్గములను ధరించి పరమకుపిత మానసులై తేజోవంతులై రావణుని జూచి యిట్లు నుడివిరి

రాక్షసేంద్రా! మేమిప్పుడే బోయి రామలక్ష్మణులను, సుగ్రీవాది వనచరాధముల‌ను లంకాపురంబును భస్మంబు గావించిన నీచాధముండగు హనుమంతుని వధించి వచ్చెదము సెలవొసంగుమనిరి ఆయుధములను ధరించి ప్రయాణ సన్నద్ధులైయున్న నికుంభాది రాక్షసులను వారించి కూర్చుండని యోగించి విభీషణుడు రావణునకు జేమోడ్పు గేలించి హితముపదేశింప దొడంగెను

అన్నా! సామదాన భేదంబులనియెడు మూడుపాయంబులచేత సాధ్యము గానిదెయ్యదియో దానికొఱకు దండోపాయంబు బ్రయోగింపవలయునని బుధవర్యులు జెప్పుదురు కాన మనమిపుడు సామదాన భేదోపాయంబులను బ్రయోగింప వలయునే గాని దండోపాయంబును బ్రయోగించుటకిది తరుణంబుగాదు విషయలోలురై ప్రమత్తులగు వారలయందును శత్రువులచే నాక్రాంతులై దైవంబు ప్రతికూలంబుగాగల వారలయందును, నీతి శాస్త్రోక్త ప్రకారంబుగ బరీక్షించి ప్రయోగింపబడునేనని దండోపాయంబు సఫలంబగును మఱొందుచోట బ్రయోగించినచో యెంతమాత్రము సిద్ధింపనేరదు

రాక్షసవీరులారా! రాముడెంత మాత్రమునేమఱుపాటు లేనివాడు విజిగీషుడు, బాహుబలాఢ్యుడు అకాలంబున కోపంబునొందువాడుగాడు అతనినెదిరించుటకెవరి తరము? అట్టి భ్రాంతి మీకేల? హనుమంతుడొక్కడే మహాసముద్రమును దాటి వచ్చి యెంత పనిజేసినాడో మీకందఱికి దెలియును గదా! రామునకు దైవబలమున్నది శత్రువుల బలపరాక్రమంబులు గొలత లేనివి మీరింత సులభముగా శత్రుబలంబులను గూర్చి మాట్లాడుట తగదు రాముడు ఖరదూషణాదులను జంపి రాక్షసేశ్వరుండగు రావణాసురనకపకారము గావించినాడు అందువలన రాముని భార్యను రావణుడు జనస్థానమునుండి గొని తెచ్చెనందురేమో! ఖరుడే ముందుగా రాముని జంపబోయునాడు గదా! తనశక్తి కొలది ప్రాణంబులను దక్కించుకొనుటకాతడు ఖరుని జంపుటలో దోషమేమున్నది? పరదారగమనమపఖ్యాతిని ఆయుక్షయంబును, అర్థక్షయంబును

మహాపాపంబును గలిగించును సీతాదేవి వలన మనకు ఘోర విపద్దశ సంభవింపక మానదు ఆబిడను రామచంద్రున కీయవలసినదే! కలహంబునకు దారిదీయున దెంతమంచిదైనను ప్రయోజనమేమున్నది మహాపరాక్రమశాలియు, ధర్మనిరతుండునగు దశరథరామునితో నిష్ప్రయోజనమైన వైరమును బెంపొందించుకొనుట మనకు దగదు సైన్యసమేతముగా వచ్చి బహురత్న సమాకీర్ణంబునగు లంకాపురంబును రాముడు బాణజాలంబుచే విదారించుటకు మున్నే సీత నొసంగుట శ్రేయోదాయకము అన్నా! నా హిత వచనంబులాలకింపుము కోపంబు సుఖంబును, ధర్మంబును నశింపజేయును కాన కోపమును విడిచి శాంతచిత్తుడవుగమ్ము శరత్సూర్య మరీచికలను బోలిన తీక్షణమగు బాణంబులచే రఘుకుల తిలకుడు నిన్ను వధింపగలడు సీత నొసంగి సత్కీర్తి నార్జించుకొనుము సంతోషమును సద్యశంబును వృద్ధి బొందించెడు ధర్మమార్గమందు సంచరింపుము నన్ననుగ్రహించి నాహితవచనంబులాలకించి రామచంద్రునకు సీతనొసంగుము బంధుమిత్రాదులతోడను, పుత్రపౌత్రుల తోడను, సహధర్మచారిణుల తోడను మనము సౌఖ్యంబుధినోలలాడెడు మార్గము నరయుడనియెడు విభీషణుని వాక్యములను రావణుండాలకించి మాఱుమాటాడక తన స్వగృహంబునకు బోయెను

## విభీషణుడు రావణునకు హితముపదేశించుట

పర్వత శిఖరంబువోలె నత్యున్నతంబైనదియును బుధవర్యులు, ధీశాలురు, స్వామి భక్తి పరాయణులునగు ప్రధానులచే రక్షింపబడుచున్నది యును ప్రాత కాలశంఖమృదంగాది వాద్యధ్వనుల చేతనిబిడంబై యున్నదియును, వనితామణుల ఒయ్యారములచేత వన్నెలొలుకు నదియును, దేవనగరంబు పగిది సర్వైశ్వర్య సంపన్నమైదివ్యప్రభలతో దేజరిల్లెడు రావణుని రాజ గృహంబును మహా పరాక్రమశాలియు తేజో నిలయుండునగు విభీషణుడు సూర్యభగవానుడాకసంబు బ్రవేశించునట్లు బ్రవేశించెను

రాక్షసరాజునకు విజయంబు జేకూరుటకై వేదవేత్తలగు రాక్షసులు పఠించెడు పుణ్యాహమంత్రంబుల ధ్వనిని విభీషణు డాలకించుచు మంత్ర బ్రాహ్మణవేత్తలగు బ్రాహ్మణులను గూడ జూచుచు లోనికింబోయి సింహాసనాసీనుడై కుబేరానుజుండగు రాక్షసేంద్రునకు నమస్కరించెను రావణుడు కనుసైగచే హేమభూషితమగు నాసనంబు జూపెను సోదరుని యనుమతిపై విభీషణుడాసనాసీనుడయ్యెను

తదనంతరము దేశకాలపాత్రంబులనెఱింగిన వాడును మహాయింగిత జ్ఞానియునగు విభీషణుడు స్తోత్రాదులచే గ్రమము దప్పక సాంత్వన ప్రసన్నుని గావించుకొని మెల్లగా నిట్లు హితంబు పదేశింపమొదలిడెను అగ్రజా! మనపట్టణమునకు సీతను గొనిలెచ్చిన దాదిగా మనకెన్నియో అశుభసూచకంబులు గోచరించుచున్నవి సమంత్రకంబుగా వ్రేల్వబడినయగ్ని హోత్రవేలకో చక్కగా బ్రజ్వరిల్లక ధూమముచే గప్పబడియున్నది పొయ్యిలందును అగ్నిహోత్ర గృహంబులందును వేదాధ్యయన స్థలంబులందును, సరీసృపములగుపడుచున్నవి హోమంబు కొఱకు దాచియున్న హవిస్సులకు పిపీలకము లెక్కుచున్నవి గోవులు పాలిచ్చుట మానుకొన్నవి మదగజంబులు మదహీనములై గనుపట్టుచున్నవి అశ్వంబులు దీనముగా నఱచుచు ఆహారమును విసర్జించి యున్నవి రాక్షస రాజా! ఖరోష్ట్రములను - కంచరగాడిదెలను, రోమంబులు వీడ కన్నీరు గార్చుచు రోదన మొనరించు చున్నవి నానావిధములైన చికిత్సలు గావించినను చక్కబడకున్నవి క్రూరంబులగు కాకులు విమాన శిఖరములందును మఱెచ్చట జూచినను తండోపతండములుగ నఱచుచు గానబడుచున్నవి గృధ్రములు గుంపులు గుంపులుగవచ్చి ప్రతిగృహంబుపైనను నిల్చుచున్నవి జంబుకంబులు సంధ్యాకాలంబుల రెండింటియందును పట్టణ సమీపంబునకు వచ్చి యమంగళముగ నఱచు చున్నవి శునకాది క్రూరమృగంబులు పురద్వారములందు గుమిగూడి పిడుగుమ్రోతకెనయగు ధ్వనితోనఱచు చున్నవి దానికి దగిన రీతిగా లంకాదహనాదులు సంభవించియేయున్నవి గదా! సీతను రామున కొసంగుట శ్రేయస్సుగానున్నది మహారాజా! నీ యనుంగు సోదరుడనగుకతంబున

నీకీ హితంబు గఱపితిని దీనిని దోషంబుగా దలపోయవలదు ఈ దుశ్చకునాది దోషంబులు సమస్త రాక్షసలోకంబునకును అంత పుర స్త్రీలకును, విదితమే గదా! మంత్రులందఱు నీకు వెఱచి దాక్షిణ్యమునకై నీకీ సంగతిని దెలుపరు మనమేకోదరులము నేను నీకు దమ్ముడనగుటచే యథార్థముగా జెప్పుచున్నాను నీవు న్యాయ సమ్మతముగా నాలోచించి నిశ్చయించుకొను మనియెడు భూతభవిష్య ద్వర్తమాన కాలములందును, మేలొనగూర్చెడు విభీషణుని హితవచనంబులను రావణుండాలకించి మహా కోపంబునొంది తన దీక్షను విడనాడ కిట్లు బదులు పలికెను విభీషణా! నన్నేల బెదరించెదవు, నాకెవ్వనివలననూ భయంబిసుమంతయులేదు నాచే జిక్కిన సీతను రాముడు మరలబొందుట కల్ల దేవేంద్రాదులతో గూడివచ్చినను రాముడు రణరంగమందు నన్నెదిరించి నిలువంజాలడు నీవు పోయిరమ్మని రావణుడు విభీషణునకనుమతి నొసంగెను

## రావణుడు మంత్రులతోను మిత్రులతోను ఆలోచించుట

విభీషణుని హితోపదేశముతో ప్రహస్తాదులేకీభవించుటంజూచి రావణుడు మిగుల లోలోన గృశించి మంత్రులతోను, మిత్రవర్యులతోను ఆలోచింప దలంచి రథంబునకు బ్రదక్షిణముగావించి యారూఢుడై సభకు బయలుదేరెను రావణుని పార్శ్వభాగములను రాక్షసులు బరివేష్టించి నానాయుద్ధ పాణులై నడచిరి అతిరథులగు రాక్షసులు కొందఱు రథంబులను మదగజములను అశ్వములను అధిరోహించి గదలను పరిఘంబులను, శూలాదులను దాల్చి రాక్షసేంద్రుని వెంట బోయిరి రావణుడు సభకు బోయిన తోడనే వేలాది వాద్యధ్వనులు మిన్నుముట్టెను రాక్షసులందఱును నిలువంబడి రాజేంద్రునకు నమస్కరించిరి జయజయనినాదముల చేతను, ఆశీర్వచనంబులచేతను శ్లాఘింపబడుచు శుభకరమై సుందరమైలికెడు సభకు రాక్షసేంద్రుడరగుదెంచి వైడూర్యమణులచే బొదిగింపబడిన సింహాసనముపై నాసీనుడయ్యెను రావణాసురుని యాజ్ఞమేరకు రాక్షసులందఱు తండోపతండములుగా వచ్చి వారి వారి యోగ్యతకు దగిన రీతిగా గూర్చుండిరి

పండితోత్తములును, సర్వజ్ఞులును, గుణకోవిదులగు మంత్రి సత్తములును క్రమంబు దప్పక గూర్చుండిరి మహాయశోనిలయుడగు విభీషణుడు సుందరంబగురథంబునారోహించి సహోదరుండగు రావణుని సభకరుగుదెంచి పాద సరోజములపై వ్రాలి నమస్కరించెను శుకుడును, ప్రహస్తుడును గూడ నమస్కరించిరి రావణుడాముువ్వురకును వారివారి యోగ్యతకు దగిన రీతిగా నాసనంబుల నొసంగెను రాక్షసులు దాల్చియున్న కుసుమదామములచేతను, సుగంధ ద్రవ్యములచేతను, సభలో పరిమళము గుబాళించుచుండెను సభ్యులెల్లరు నిశబ్దముగా నుండిరి అసత్యవాదులెవ్వరును లేకుండిరి ధీరహృదయులగు రాక్షసుల నడుమ రావణుడు వసువులనడుమనున్న సురేంద్రుని మాడ్కి ప్రకాశించుచు సేనాధ్యక్షుడగు ప్రహస్తునిదిలకించి సేనాధిపతీ ! సమస్తాయుధ విద్యల నెఱింగిన యోధులకు పట్టణంబును జాగరూకులై రక్షించునట్లాజ్ఞాపింపు మనిన ప్రహస్తుడిట్లనియె రావణ రాజా! సైన్యములను లోపలను, వెలుపలను జాగ్రత్తగా కావలియుంచి యున్నాను నీ కర్తవ్యమెద్దియో నిశ్చయింపుడనియెడు సేనా నాయకుని వాక్యము లాలకించి రావణుడు తన మిత్రులతో నిట్లనియె

ధర్మార్థ కామంబులలో సంకటమొనగూడినపుడు ప్రియా ప్రియంబులను, సుఖదు ఖములను లాభనష్టములను హితాహితంబులను దెలిసికొనుటకు మీరందఱు సమర్థులు సర్వవిధంబులను జక్కగా నాలోచించి దృఢనిశ్చయముతో నారంభించిన కర్తవ్యమెద్దియైనను నాకు సఫలంబగును అమరేంద్రుడు, సూర్యచంద్ర గహంబులతోను, నక్షత్రమండలముతోడను, దేవగణంబులతోడను గూడి జయలక్ష్మిని చేపట్టు చందంబున మీయందఱితోనేకీభవించి జయలక్ష్మి కౌగిళ్లలో నోలలాడెదను ఈ విషయము మీకెల్లరికిని తెల్లంబుగావించియున్నాను కుంభకర్ణుడు నిద్రాపరవశుండై యున్నందున నాతనికెఱిగింపజాలనైతిని అతడిపుడాఱు మాసంబులు నిదురించి మేల్కొన్నాడు సభకుగూడ చనుదెంచినాడు రాముని ప్రియురాలగు సీతను దండకారణ్యమునుండి గొని తెచ్చియున్నాను ఆ మందగామిని యగు జనకాత్మజను నేనెంత ప్రార్థించినను నాపై వలపు గొనకున్నది ముజ్జగంబులయందును సీతను

బోలిన సుందరీమణి మరొక్కతె లేదు ఔరా! ఆ సన్నని నడుము ఆ తతని తంబములు, ఆ శారదేందుబింబమును బోలిన ముఖారవిందము, ఆ చారులోచనములు, ఆ బంగారు ప్రతిమవంటిమేను సాటిలేని సౌందర్యరాశియో యనంబరగుచు మయనిర్మితంబగు మాయపగిది నబ్బుర మొందజేయుచున్నది అమె యెఱ్ఱని మృదుపదంబులను, నఖంబులను జూడచూడ నాకు విరిశరుని వేడిమి యెక్కుడగుచున్నది మన్మథుడూరక నన్నుగలంచుచున్నాడు ఆ సీతాదేవి తన ప్రాణేశుని బడయుకాంక్షతో గాబోలు! నన్నొక సంవత్సరముగడువడుగు కొన్నది ఆ సుందరాంగి పలుకులకు నేనంగీకరించితిని మార్గాయాసంబు చేతనలసియున్న గుఱ్ఱంబు మాఱ్కి నేను మన్మదుని బారికిజిక్కి యలసట జెందియున్నాను

అక్షోభ్యంబును, తిమింగలాది మహాసత్త్వ సమాకీర్ణమైన మహా సాగరంబును రామలక్ష్మణులు వానరులతోనెట్లు దాటి రాగలరు? ఒకవేళ సముద్రమును దాటి రాగలరనియే తలంతుము ఒక్క వనచరాధముడు వచ్చి మనలనెదుర్కొని యుద్ధముచేసి రాక్షసులను జంపి పోయెనే! కార్యగతులనారయుట మిగులదుస్తరము కావున మీమీ బుద్ధికి దోచిన చందంబున దెలియంబలుకుడు మీ సహాయంబు నూతగాజేకొనియే దేవాసుర యుద్ధమందు విజయలక్ష్మిని వరించితిని, ఆ మాన వాధముడేమి జేయగలడు ? చక్కగా నాలోచింపుడు సీతాదేవి యునికి నెఱింగి సుగ్రీవాది వానరమూకలతో రామలక్ష్మణులు సముద్రోత్తరతీరంబు జేరియున్నారు రాముని ధర్మపత్ని నొసంగకయే దశరథ సుతులను రూపుమాపుటెట్లు? మీరెల్లరు చక్కగా నాలోచించి నిశ్చయింపుడు తగిన యుపాయము నెఱిగింపుడు సముద్రమును దాటి వచ్చుటకీ ప్రపంచమందెవ్వండును సమర్థుడుగాడు నిశ్చయముగా జయలక్ష్మి నన్నే వరింపగలదు అని మన్మథావిష్టుడగు రావణుడు జెప్పిన మాటలను కుంభకర్ణుడాలకించి మహాకోపోద్రిక్తుడై యిట్లు చెప్పదొడంగెను

## శత్రువులను జంపివచ్చెదనని కుంభకర్ణుడు రావణునకు జెప్పుట

అన్నా! నీయంతకు నీవే యాలోచించి రాముని ధర్మపత్ని నిచ్చటికి బలాత్కారముగా గొనిరాకమునుపే మాతో నాలోచించి యుందువేని నీమనస్సు నిశ్చయంబునొంది యుండెడిది ఇప్పుడాలోచించినచో లాభమేమున్నది గతజల సేతుబంధనమువంటిదే యగును ఎవ్వడైనను కార్యంబు నారంభించుటకు మున్నే న్యాయ సమ్మతముగా నాలోచించి ఆదుపరి రాజకార్యములారంభింపవలయును ప్రతికార్యము నందును నిశ్చిత బుద్ధిగల రాజేంద్రుడు నీవలె వెనుక బరి తాపంబునొందడు ఎంత మంచి పనియైనను ఉపాయముచే జేయని యెడల నిష్ఫలంబగుటయే గాక! నపాత్రులకు బెట్టిన యన్నంబు పగిది దోషంబును గలుగజేయును వెనుక ముందు లాలోచింపక కార్యములొనరించు వాడు మంచిచెడ్డ లెఱింగిన వాడు గాడు నీవు యుక్తాయుక్తంబు లెఱుంగక సీతాపహరణ కార్యంబు గావించితివి మాయెల్లరి భాగ్యవశంబుచేత రాముడింత దనుక నిన్ను జంపకున్నాడు రావణరాజా! చింతించిన లాభమేమి? ఇప్పుడు నీ కార్యమును సాధించి శత్రువులను జంపి వచ్చెదను నేనుగాక మఱొక్కడెవ్వడును నీకార్యంబు జేయంజాలడు ఇంద్రుడు, ఇనుడు, అగ్ని వాయువులైనను, కుబేరవరుణులైనను నాతో బోరంజాలరు నన్ను జూచి పారిపోయెదరు రాముడు నీపై బాణవర్షంబు గురియింపకమునుపే వాని రక్తము గ్రోలెదను ఊరడిల్లి స్వస్థ చిత్తుడవుగమ్ము రామలక్ష్మణులను జంపి వానరోత్తములందఱిని భక్షించెదను నీకు సుఖమును జేకూర్చెడు జయలక్ష్మిని నీస్వాధీనవముగావింతును మంచిమద్యంబును గ్రోలి యథేచ్ఛగా గ్రీడింపుము నేనిదే బోయి శత్రవులను దునుమాడివచ్చెదను సీతాదేవి శాశ్వతముగా నీయధీనములోనుండగలదు చింతింపవలదని కుంభకర్ణుడు రావణునితో జెప్పెను

## బలాత్కారంబున సీతను బట్టి క్రీడింపుమని మహాపార్శ్వుడు చెప్పుట

కుంభకర్ణుని వాక్యములాలకించి రావణాసురుడు కినుకను బూని యుండుటనెఱింగి మహాపార్శ్వుడు తమ రాజును ప్రసన్నుని జేయనుపాయం బాలోచించి నమస్కరించి యిట్లు జెప్పదొడంగెను రాక్షసేశ్వరా! మధువును గ్రోలు కాంక్షతో మృగవ్యాళసమాకులమైన వనంబున కేగి కష్టపరంపరల నెదుర్కొని కడపటికి మధువును సంపాదించి దానిం ద్రాగజాలనివాడు మూఢుడగును నీవు సీతాసమాగమంబు గోరి మిగుల శ్రమలకోర్చి యామెను గొనితెచ్చియు నూరకుండంజనదు నీవె జగదధీశుండవు పరమేశ్వరుండవు నిన్ను కాదను వాడెవ్వడు శత్రువుల శిరంబులను ఖండించి సీత సమ్మతింపకున్నను గుక్కుటంబు వగిది బలాత్కారంబున బట్టి పలుమాఱు గ్రీడించి సంతోషసాగరంబున దేలియాడుము నీకాంక్ష నీడేర్చుకొన్న పిమ్మట నీకేమి భయంబు సంభవించినను లక్ష్యము లేదు కుంభకర్ణుడును, బాహుబలాఢ్యుడునగు యింద్రజిత్తును మాతోగూడి వజ్రాయుధమును దాల్చి సురేంద్రుడే వచ్చినను జయింపగలరు సామదానభేదోపాయంబులను వీడి దండోపాయము చేతనే కార్యసిద్ధి నొందుము శస్త్రాస్త్రములచే శత్రువులను నీకు వశీకృతులంగావించెదను సందేహమును వీడుమని మహాపార్శ్వుడు రావణునితో జెప్పెను

## తన శాపవృత్తాంతమును మహాపార్శ్వునితో రావణుడు జెప్పుట

మహాపార్శ్వుండు జెప్పిన మాటలను రాక్షసేంద్రుడాలకించి మిగుల శ్లాఘించి యిట్లు జెప్పదొడంగెను మహాపార్శ్వుడా! నా యందొక్క రహస్యమున్నది నీకెఱిగించెద తెలిసికొని యుండుము బహుకాలము క్రిందట నేనొకప్పుడు భయపడుచు దాగి దాగి విరించి గృహంబునకు బోవుచుంటిని అప్పుడాకాశంబున నందచందములతో వెలుగొందు చున్న

పుంజికస్థలయను నప్సరసను గనుంగొని దాని సౌందర్యమునకబ్బుర మొంది మోహపరవశుండనై బలాత్కారంబున బట్టి వివస్త్రను గావించి భోగించితిని అప్పుడది వాడిన తామరతూడు వోలె దీన వదనయై సురజ్యేష్ఠుని సమీపించి యీవృత్తాంత మెఱిగించినది బ్రహ్మదేవుడదిక కోప పరవశుండై నన్ను జూచి రావణా! ఇది మొదలు నివిట్లు పరభామినులను బలాత్కారంబున బట్టి భోగించెదవేని నీశిరంబు నూఱు వ్రయ్యలై పగులంగలదు ఇందుల కావంతయు సందేహములేదు పొమ్మని శాపంబొసంగియున్నాడు అట్టి బయంకరమైన శాపంబునకు వెఱచియే సీతను బలాత్కారంబున బట్టి భోగింపజాలకున్నాను

పర్వత గుహయందు నిదురించుచున్న సింహమును నిద్రలేపు చందంబునను, నిద్రలోమునిగి యున్న మృత్యువును మేలుకొల్పు విధముగను ఊరకున్న నన్ను రాముడు పురికొల్పు చున్నాడు ఆతడేమియు దెలివి లేనివాడు నా బలపరాక్రములెఱుంగక నాపైకి వచ్చుచున్నాడు పన్నగంబులను బోలిన నా నిశితశరంబుల చవియెఱుంగడు గాబోలు! త్వరలోనే గజంబులపై గొఱివి కట్టెలు వేయునట్లు రామునిపై వజ్రంబులను బోలిన శరపరంపరలను బ్రయోగించెదను ప్రాత కాలంబునను దితుండగు దినకరుండు తారకామణుల కాంతులను హరించునట్లు వానరసైన్యమును ముక్కలుముక్కలుగా జక్కాడెదను సహస్రాక్షుడు గాని, వరుణుడు గాని యుద్ధమందు నాయెదుర నిలువనోపరు కుబేరుని జయించి లంకాదిపతినైతిని రాముడు మానవుడు, వాడెట్లు నన్ను జంపగలడని రావణుడు మహాపార్శ్వునితో జెప్పెను

## ఇంద్రజిత్తును - ప్రహస్తాదులను మందలించి విభీషణుడు రావణునకు హితంబు జెప్పుట

అప్పుడు విభీషణుడు రావణుని మాటలను కుంభకర్ణుని గర్జనలను ఆలకించి పరమార్థ సంయుతంబగు హితంబును జెప్ప దొడంగెను నిశాచరేంద్రా! వక్షస్థలమే పడగగను, చింతయే మహాగరళంబుగను,

మందస్మితమే కళకు గోలలుగను, దు ఖపరవశయై తలగడగానిడు కొన్న హస్తంబునందలి యైదు వ్రేళ్లనియెడు నైదు శిరంబులను గలిగియున్న సీతామహోహియనియెడు భుజంగంబునేల గోరితివి

అన్నా! పర్వతాకారంలైదంతవములును నఖంబులును, ఆయుధములుగా గల వనచరులు లంకాపట్టణమును బ్రవేశింపక మున్నే సీతాదేవిని రామచంద్రున కప్పగింపుము వజ్రతుల్యములును, వాయువేగంబునుగల శరంబులను రాముడు బ్రయోగించి రాక్షసోత్తముల శిరంబులను ద్రుంచుటకు మునుపే జానకీదేవిని రామున కిచ్చి వేయుము అశని పాతంబునకు సమానమైన రామబాణంబుల చవి ప్రహస్తుడింకను జూచి యుండలేదు అందులకే నితడిట్లాత్మస్తుతి గావించుకొనుచున్నాడు నీవు గాని నీ సుతుండింద్రజిత్తుగాని కుంభకర్ణుడుగాని, మహాపార్శ్వమహోదరులుగాని నికుంభుడు కుంభడుగాని, యతికాయుండుగాని మరెవ్వరును యుద్ధంబున రామునెదుట నిలువంజాలరు దిననాథుడుగాని అమరులుగాని, దేవేంద్రుడు గాని నిను రక్షింపజాలరు ఆకసంబునకేగినను, పాతాళంబునకు బారిపోయినను రాముని బాణాగ్ని జ్వాలలనుండి తప్పించుకొనజాలవు తప్పక నిన్ను జంపునని విభీషణుడు రావణునితో జెప్పెను

విభీషణుని వాక్యములాలకించి ప్రహస్తుడిట్లులనియె విభీషణా! యేమంటివి? మమ్ములను బెదరింపవలదు దేవదానవుల వలనగాని, మరెవ్వరి వలనను గాని మాకావంతయు భయంబు లేదు యక్ష గంధర్వమహోరగంబు లెదుర్కొని నిల్చినను సమరంబున మమ్ములను జయించువారు లేరు ఇంక రాచపిల్లకాయయగు రాముని వలన మాకేమి భయము? మనుష్యుడేడ ? రాక్షసాధీశుడేడ ? చక్కగానాలోచించుకొమని ప్రహస్తుడు విభీషణునితో నుడివెను

రాజహితమును గాంక్షించెడు విభీషణుడు తన సోదరునకు, గీడును జేకూర్చెడు ప్రహస్తుని పలుకులనాలకించి ధర్మార్థకామంబులను జక్కగా నాలోచించి యిట్లు జెప్పబూనెను ప్రహస్తుడా! నీవును, మహోదరుడును కుంభకర్ణుడును రావణుని హితంబు గోర్కైతిరి అధర్మ మార్గమున

జరించెడు వానికి స్వర్గగమనంబు సిద్ధింపనట్లు రాక్షసేంద్రుని కార్యసిద్ధి కష్టతగిలి జెఱచుచున్నారు తెప్పకొయ్యలేనివాడు మహార్ణవమును దాట జాలని భంగి నాకు గాని - నీకు గాని - రాక్షస సమూహమునకు గాని యిక్ష్వాకు వంశోద్భవుని వధింప చేతనగునా? తనను తనసారధిని తురంగములను రక్షించుకొనుచు బదునొకండువేలమంది విలుకాండ్రతో బోరు సలుపగల బాహుబలశాలియు, విరాధ, కబంధ వాలి మొదలుగాగల వీరశిఖామణులనెందఱినో వధించిన సమర్థుడగు దశరథరాముని మ్రోల సమరంబున నిలువగల వీరు లెవ్వరు? అమరులు అమ్మహాత్ముని జూచి మోహితులగుదురు మనమేడ? రాముడేడ? రాముని దురాసదంబులగు తీక్ష్ణ నారాశంబులు నీదేహంబును భేదించగలవు సుమా! అందులకే నీవిట్లు ఆత్మస్తుతి జేసికొనుచున్నావు రాక్షసేంద్రుడు గాని త్రిశీర్షుడు గాని కుంభకర్ణుడు గాని - నికుంభుడు గాని, ఇంద్రజిత్తుగాని, నీవు గాని దశరధసుతుని రణరంగమందు యెదురించి నిలువ గలరా? దేవాంతకుడుగాని, నరాంతకుడుగాని పెక్కండ్రు విలుకాండ్రతోనేక కాలంబున బోరంజాలిన యతికాయుడుగాని అకంపనుడుగాని రాముని యెదుటనిల్చి పోరు సలుపగలరా? ఈ రావణుడన్నను తీక్ష్ణస్వభావుడై యాలోచింపక కార్యములొనరించును వాక్పరుషము, దండ పారుష్యము - అర్థదూషణము పానము, స్త్రీ, వేట, జూదము అనుసప్తవ్యసనంబులకు లోనై యుక్తా యుక్తంబులెఱుంగక రాక్షసులకు నాశంబు గలిగించునట్టి కార్యంబున కొడంబడి యుండ మీరందఱు మిత్రులమని పేరుబెట్టుకొని శత్రువుల పగిదినతని యెదుట నిచ్చకములాడుచు కపటాత్ములై చరించు చున్నారు అనంతమైన దేహముగలదియు, సహస్ర శిరంబులు గలదియు, మహాభయంకరమైనది యనుగు రామవైరంబనియెడు ఘోరభుజంగంబు రావణుని జుట్టుకొని యున్నది స్నేహితులైన మీరందఱు ఘోర సర్పమును బారద్రోలి యితనిని విముక్తునిగా నొనరింపుడు

రాజేంద్రుడు దుర్మార్గమునచరించెనేని ప్రభువుచే సమస్త లాభములను బొంది పూర్ణకాములైన మిత్రులందఱొక్కటిగా జేరి భూతంబులచే నావిష్టుండగు పురుషునివోలె దలవెండ్రుకలను బట్టి

యొడ్బియైనను నిగ్రహించి సన్మార్గమున జరింప జేయవలయును మీకు సమస్త సుఖంబులను జేకూర్చునట్టి మీ రాక్షసాధీశుడు వినాశము నొందు చుండు దరిజేర్పకున్నారేల ? మంత్రి యగు వాడు శత్రుబలంబులను తన రాజ బలంబులను తెలిసికొని వృద్ధి క్షయంబులను గుర్తించి మేలుజేయవలయును లంకాపురంబునకును, రావణునకును, మీకందఱకును హితంబు గోరి చెప్పుచున్నాను చక్కగా నాలోచించి నా మతంబున కొడంబడుడు ఏమందురా? రామచంద్రునకు సీతాదేవి నొసంగుదము అందఱకును మేలుగలుగునని విభీషణుడు చెప్పెను

బృహస్పతిని బోలిన బుద్ధిశాలియగు విభీషణుని మాటలను విని ఇంద్రజిత్తుయిట్టులనియె చిన్నాయనా ! పులస్త్యవంశంబునంబుట్టి యింతభయంబుజెందుట నీకు జెల్లునా ? ఎంత నిష్ప్రయోజనముగా మాట్లాడితివి! మనవంశంబున జన్మింపనివాడు గూడ నిట్టి నీచవాక్యములాడడు గదా ! ఎంత బేలవైతివి ! ఎట్టిమాటలాడితివి ! మా పిన్న తండ్రియగు విభీషణుడొక్కడే బలంబును, ప్రభావంబును, ధైర్యసాహసములను గోల్పోయి పిఱికివాడై మావంశంబునందు జన్మించినందులకు మిగుల చింతిలుచున్నాను పిన్నతండ్రీ! రామలక్ష్మణులను మాలోనొక్క నీచరాక్షసుడు చంపగలడు నీవు పిఱికివాడవై మమ్ములనేల భయపెట్టెదవు త్రిలోకనాథుడగు దేవరాజును నేల బడద్రోసి యైరావతంబుదంతముల నూడబెఱికి దేవతలనందఱిని దద్దరిల్ల జేసి నలుదెసలకును బారదోలితిని సమస్త దేవతలకు గర్వభంగము గావించితిని, మనుజాధములగు రాచపిల్లకాయలను జయింప సమర్థుడనుగానా ? చిన్నాయనా! ఎంత మాటాడితివని యింద్రజిత్తు చెప్పగా విభీషణుడాలకించి పరమార్థయుక్తంబగు మాటలను జెప్ప దొడంగెను

నాయనా! నీవు పిన్నవాడవు మంత్రము సేయుటలో నీకు శక్తిచాలదు నీకింకను బుద్ధి పరిపక్వము గాలేదు అందువలన నిరర్థకమై వినాశము గలిగించెడు వాక్యములచేత బ్రేలుచున్నావు ఇంద్రజిత్తా! శ్రీరాముని వలన రావణునకు బుత్రమిత్ర కళాత్రాది సహితంబుగా వినాశంబు సంభవించుచుండట నాలకించియు నీ వజ్ఞాన తిమిరంబున విహారమును

సల్పుచు బుత్రరూపమునతోనున్న శత్రుండవై పితృవినాశంబున కొడిగట్టుకొంటివి కావున నీవు వధ్యుండవు దుర్బుద్ధివి నిన్నీయాలోచనతో సభకుగొని తెచ్చినవాడు గూడ వధ్యుడే నీవెంత యుమందమతివి గర్వాంధడవు శిక్షకర్షుడవు క్రూరస్వభావుడవు నీచబుద్ధిగలవాడవు ఆలోచించుట కర్షుడవుగాదు నీయజ్ఞానమే నిన్నింతకు గొని తెచ్చినది వ్యర్థముగ బ్రేలినచో లాభమేమి? బ్రహ్మదండమునకెనయైం యగ్నిజ్వాలలనుగ్రక్కుచు రామునిచె బ్రయోగింపబడియెడు బాణజాలంబునెవ్వడు దహింపగలడు అన్నా! రాక్షసేశ్వరా! ధనంబుల వరములను, నానావిద రత్నరాజములను, సీతను, రామునకు సమర్పించి మనమెల్లరము నిర్భయులమై సుఖజీవితంబును బుచ్చెదము నా హితవచనంబులాలకించి రాక్షస వంశమును గాపాడుమని విభీషణుడు రావణునితో జెప్పెను

## రావణుడు విభీషణుని పరుష వాక్యములచే దూషించుట

విభీషణుని హితవచనంబుల నాలకింపక రావణుడు మృత్యుప్రేరితుండై పరుష వాక్యంబులచే దూషింప మొదలిడెను విభీషణా! సాక్షచ్ఛత్రువుతోగాని కోపంబుచే నురుగులుగ్రక్కెడు ఘోరపన్నగంబుతో గాని స్నేహాము జేయవచ్చును కాని మిత్రుని రూపమును దాల్చియున్న శత్రుపక్షపాతితో సహవాసముసేయరాదు సర్వజనుల యందును జ్ఞాతుల స్వభావము నాకు బక్కగా దెలియును జ్ఞాతులు తమ జ్ఞాతి జనులకాపదలు ననుభవించినప్పుడు ఆనంద పరవశలగుచుందురు పండితోత్తముడగు వానిని గాని, ప్రదానుడగు వానినిగాని, ధార్మికుని గాని, శూరుని గాని జ్ఞాతులు పరాభవించి తిరస్కరింతురు కాన జ్ఞాతులను నమ్మరాదు ఒకరిపై నొకరు మైత్రీ భావముతో నున్నట్లభినయించుచు మనంబున నొకటి, బయట నొకటిగా మాట్లాడుచు సదాకీడునే దలంచుచు నాపత్సమయము లందు ద్రోహంబుజేయుట కొడంబడుదురు ఎప్పటికైనను దాయాదుల వలన దప్పక ముప్పుగలుగును అగ్ని వలన గాని, ఆయుధము వలన గాని, భయంబు జేకూరదు మన జాతి వారలే మనకు గీడు తలపోయుదురు

శత్రువులకు మర్మము లెఱిగించి యెంతపనియైనను జేయంగలరు అగ్ని భయముకంటే జ్ఞాతుల భయమే గొప్పది గోవుల యందు సంపదయున్నది బ్రాహ్మణోత్తముల యందు ఇంద్రియ నిగ్రహము గలదు స్త్రీల యందు చాపల్యమున్నది జ్ఞాతుల వలన భయంబు గలదు తమ్ముడా ! నీవు జ్ఞాతివి నేను పరమైశ్వర్యంబుతో దులతూగుచు లోక పూజితుండనై యుండుట నీకు సమ్మతముగాదు తామరాకులపై బడిన జలబిందువులైక్యముగాని యట్లు దుష్టుల తోడి మైత్రి గూడ నైక్యమైయుండదు దుష్ట సహవాసము తప్పక ముప్పుగలిగించును మధుకరము పుష్పముల లోని మధువును గ్రోలి యుపకారమును మఱచి వెడలిపోవు చందంబున నీవు నా వలన సర్వసుఖములను భవించుచుండియు నాకపకారమును దలపెట్టుచున్నావు దుష్ట సహవాసమెప్పటికిని నిష్ఫలమునే గలిగించును శారదనీరదములు గర్జించియు వర్షమును గురియని చందంబున దుర్మార్గులతోనెంత స్నేహముజేసినను ఫలితము శూన్యము విబీషణా నీవుతమ్ముడవని నిన్ను మన్నించితిని మఱొక్కడిట్టి పరుష వాక్యము లాడియున్నచో జీవించి యుండ నేరడు నీవు వంశంబును జెఱుప బుట్టిన వాడవు ఛీ ! పాపాత్మా ! నా యెదుట నిలువ వలదు పొమ్మావల నీమోము జూడనొల్లనని రావణుడు విబీషణుని పరుషోక్తులాడెను

న్యాయవాదియగు విభీషణుండు పరుషోక్తులచే, బరాభవమొంది గదను కరంబునందాల్చి నల్వురి రాక్షస ప్రముఖులతో నాకాశంబున కుద్గమించి రాక్షసేశ్వరుని జూచి-కుపితమా నసుండైయిట్లు జెప్పెను రావణా ! నీవు నాకు జ్యేష్ఠభ్రాతవు పితృతుల్యుడవు పూజనీయుడవు, ఐతే ధర్మ మార్గమును వీడి చరించుచున్నావు నేను నిర్దోషిని నాపైన సత్యదోషమ్మును మోపి పరుషోక్తులాడి పరాభవించితివి దీనిని మాత్రము నేను సహింపజాలను నీ సోదరుడనగు కతంబున నీ మేలుగోరి హితంబునుపదేశించితిని మృత్యు దేవత వశులైయున్న బుద్ధి హీనులకు హితంబు వీనులంజొరదు ఎల్లప్పుడు హిత వచనంబు లాడుచు మోద వార్థినీదజేసెడు వారలు దొఱకుట దుర్లభము అప్రియములగు వచనంబులు బలుకుచు బెడత్రోవల బట్టించువారు లభించుట సులభము మండుచున్న గృహంబు వోలె కాల పాశంబునకు

బద్ధుడవైయున్న నిన్ను జూచియూరకుండ నోపక నింతదూరము నీ మేలుగోరి చెప్పితిని రాముని బాణాగ్ని జ్వాలలచే నీవు దగ్ధమగుటను జూడజాలను ఎంతటి శూరులైనను, బలాఢ్యులైనను, అస్త్ర కోవిదులైనను, మృత్యు వాసన్నమై నప్పుడు ఇసుకచే నిర్మించిన సేతువు వోలె నిమిష కాలమందే మడిసిపోదురు అగ్రజుడవని నీహితమపేక్షించి యేదియో చెప్పితిని నా యందు దోషమున్నచో క్షమింప గోరుచున్నాను సర్వ విధముల నిన్ను నీవు రక్షించు కొనుము రాక్షసులను లంకా పట్టణమును గూడ సురక్షితముగా నుంచుకొనుము నన్ను నమ్మి నీవు కీడు నొందవలసిన పనిలేదు నేను బోయి వచ్చెదను, నేను బోయిన పిమ్మట సర్వ సుఖములనుభవింపుము నీకు శుభము చేకూరుగాక ! అన్నా ! నా హితవచనంబులు నీకు రుచింపవయ్యె ఇదే పోయి వచ్చెదనని విభీషణుడు ముహూర్త మాత్రంబున రామలక్ష్మణులున్న ప్రదేశమునకు వెడలి పోయెను

## విభీషణుని జూచి వానరులు శంకించుట

విభీషణుడు ప్రతిపక్షులను బరిత్యజించి మేరునగధీరుడై యగ్ని జ్వాలల నుండి వెలువడి శీతల సరోవరంబున బడుటకు వచ్చు చందంబున రత్న ఖచితములైన దివ్యాభరణములను ధరించి తేజో నిలయుడై గగన భాగంబున నిల్చి యిట్లు దలపోయ దొడంగెను అహా ! రామభక్తులగు వానరులనేమని కొనియాడగలను ఇమ్మహా భక్తా గ్రేసరులు నన్ను రామచంద్రుని సన్నిధికి బోనిత్తురో ! పోనివ్వరో ! గదా ! అమ్మహాత్ముని దర్శన భాగ్యమే నాకు లభింపకున్నచో నేనెట్లు జీవింతును? ఎందుబోదును ఎవ్వరాదరించి దరికి దీయుదురు ? నాగతి యేమగునోయను భయంబున గడ గడ వడంకుచు విద్యుల్లత వోలె వెలుగొందు చున్న విభీషణుని వనచరులందఱు తండోపతండములుగా వచ్చి చూచిరి అనల-శరభ-సంపాతి-ప్రఘనులనియెడు నలువుర రాక్షసులంగూడి త్వరితముగ నాకాశ మార్గంబున వచ్చుచున్న రావణుని తమ్ముని జూచి వానరేశ్వరుంధీశాలిగావున హనుమంతుడు మొదలుగా గల వానర ప్రముఖులను గాంచి యిట్లులనియె వానరోత్తములారా ! ఇతడెవ్వడైయుండును ? మన రహస్యములనెఱుంగుట

కిటు వచ్చుచున్నాడో, మనలను బ్రహరింపవచ్చుచున్నాడో ! నాకేమియు దోచకున్నది అదిగో ! చూడుడు సమస్తాయుధములను దరించి నల్వురు రాక్షసులంగూడి మనలను జంపుటకై వచ్చుచున్నాడు నిజము నిజమనియెడు సుగ్రీవుని వాక్యము లాలకించి వనచరోత్తము లందఱు మహీరుహంబులను, పర్వతంబులను బేకొని యిట్లు జెప్పిరి వానరేంద్రా ! మమ్మాజ్ఞాపింపుము ఈ దురాత్ములంగీటడగించి వచ్చెదము వీరలల్ప తేజస్కులు మా మ్రోలనిలువంగలరా ? యని వానరోత్తములు సుగ్రీవునితో జెప్పిరి

## విభీషణుడు వానరులతోదన వృత్తాంతము నెఱిగించుట

రామశరణాగతి నొందుటకై వచ్చి యాకసంబున నిల్చి యున్న మహా పండితోత్తముడగు విభీషణుడు వానరులు పరస్పరము మాటాడు కొనుట నాలకించి తన మనంబున నిట్లు దలపోసి కొనెను ఔరా ! యీ వానరులు నన్ను జంపుటకు యత్నించు చున్నారే ! ఈ బుద్ధి నా యందలి ద్వేషముచే గలిగినది గాదు వీరు రామభక్తులు అమ్మహాత్మునిపై గల భక్తి చేతనే నాయందు సంశయము గల వారలై యిట్టి కార్యమున కొడంబడుచున్నారు రాజేంద్రుడెంత దయార్ద్ర హృదయుడైనను అతని కంతరంగ భూతులగు పూరుషవరేణ్యుల ద్వారముననే శరణు బొందవలయును రామభక్తులగు వీరలంగీకారము లేనిదే రామాంగీకారము వలన నాకేమి ప్రయోజనమున్నది రామాంగీకారము కంటే రామ భక్తాంగీకారమే శ్రేయోదాయకము గదా ! ఏది యెటులున్నను యీ భక్తా గ్రేసరుల వలననే భక్తవత్సలుడగు రాముని దర్శించెదనని ధర్మసూక్ష్మాను సారంబున నిశ్చయించి రామునకును సుగ్రీవాది వానరులందఱకును దనయార్త స్వరంబు వినంబడునట్లు యివ్విధంబున జెప్ప దొడంగెను

వనచర వల్లభు లారా ! నేను శరణాగతుడను దురాచారుడగు రావణుని తమ్ముడను నాపేరు విభీషణుడు అన్యుడనుగాను నన్ను శత్రువుగా దలంపకుడు జటాయువును సంహరించి జనస్థానము నుండి జనకాత్మజను రావణుడపహరించి తెచ్చెను ఆబిడ దుఃఖపరవశురాలై యున్నది అట్టి

సాధ్వీమణిని నిర్బంధములోనుంచి రాక్షస స్త్రీలను కావలి యుంచి యున్నాడు శ్రీ రామచంద్రునకు జాలనపకారంబుగావించి యున్నాడు ఆక్రూరాత్ముని సంబంధముచే నాకు గూడ దోషంబు సంభవించి యున్నది సీతను రామున కొసంగుమని హిత వచనంబు లెన్నిటినో పెక్కుమార్లు బోధించితిని మూర్ఖుడౌషధమును స్వీకరింపని యట్లు రావణుడు నా హిత వచనంబులాలకింపడయ్యెను అదియునుంగాక నిండోలగంబున పరుషోక్తులాడి దూషించి దాసుని భంగి పరాభవించెను ఆ యవమానమును భరింపజాలక పరమ పురుషార్థంబగు రామాశ్రయమభిలషించి పుత్ర మిత్ర కళత్రాదులను గూడ బరిత్యజించి రాముని శరణు జొచ్చితిని రఘువంశంబున భక్తానుగ్రహార్థమై సర్వలోక శరణ్యుడై యవతరించి యున్న దశరథ సుతునకు విభీషణుడను నేను శరణాగతుండనై వచ్చి యున్నానని త్వరితముగ దెల్పుడనుచు సుగ్రీవాదులతో విన్నవించుకొనెను

## విభీషణుని నమ్మరాదని సుగ్రీవుడు రామునితో జెప్పుట

విభీషణుని మాటలు సుగ్రీవు డాలకించి యిట్లు దలపోసెను అయ్యో ! ఇప్పుడు జేయవలసిన కర్తవ్యమెద్ది ? రామచంద్రుడు శరణాగతవత్సలుడు గదా ! ఈ విభీషణుడు శరణాగతుడయ్యెనన్న మాట విన్నతోడనే తప్పక రక్షించును పరమార్థముగ నీతడు శరణాగతుడు కాడు ఈ దురాత్ముడేయపకారమును దలపెట్టి వచ్చినాడో ! ఏది యెటులున్నను ముందుగా విభీషణుని సంహరింపుమని రామునితో జెప్పవలయునని సుగ్రీవుడు విభీషణుని పరిశుద్ధాత్మను బరిశీలింపనేరక సంశయించి త్వరిత గతిని లక్ష్మణ సహితుడైయున్న రాముని జేరంజని యిట్లనియె

రామచంద్రా ! రావణుని తమ్ముడట అతని పేరు విభీషణుడట నల్వుర రాక్షసులతో నీ శరణు జొచ్చుటకై వచ్చినాడు నీకు మంగళమగు గాక ! ఆ రాక్షసుని నమ్మరాదు ఇతడు రావణుని తమ్ముడు రాక్షసులు కామరూపులు, కపటోపాయంబులను బన్నుటయందు పండితులు మహాశూరులు అదృశ్యులై వచ్చి ప్రహరించెదరు ఇతడు మనలను నమ్మించి

మిత్ర ద్రోహంబు గలిగించును ఇందుకు సందేహము లేదు మిత్ర సైన్యమును అరణ్య మందు నివసించెడు జనుల బలంబును, మూల బలంబును వేతనంబునుగైకొని జీవించెడు సైన్యమును బరిగ్రహింప వచ్చును కాని శత్రువు బలంబుల నెంతమాత్రము గ్రహింప జనదు ఈ విభీషణుడు నీ శత్రుపక్షము వాడు ఇతనిని నమ్ముటెట్లు ? రామా ! రావణాసురుండు బంపగా వచ్చిన చారుండని యెఱుంగుము కుటిలోపాయంబు బన్నుటకై వచ్చినాడు ఆలసింపక మంత్రులతోగూడ బరిమార్చుట మేలని నా యభిమతము రంధ్రంబునన్వేషించి పెక్కువాయసంబులనులూకము వధించినట్లు క్రూరాత్ముడగు రావణుని తమ్ముడు రహస్యముగా మన సైన్య మందు జొచ్చిచంపును ఈ కలుషాత్ముని నమ్మరాదని పండితోత్తముండగు వానరేంద్రుడు రామునితో జెప్పెను సుగ్రీవుని వాక్యములాలకించి హనుమదాది వానర ప్రముఖులను జూచి రాముడిట్లు చెప్పెను

## విభీషణుని గూర్చి మీమీ యభిప్రాయములను వెలిబుచ్చుడని రాముడు వానరులతో జెప్పుట

వానరోత్తములారా! సుగ్రీవుడు విభీషణుని గుఱించి యుక్తియుక్తముగా జెప్పినాడు అయ్యెది మీరందరాలకించితిరి ఒక మిత్రుడుపదేశించిన పిమ్మట మఱొక్క మిత్రుడుపదేశింపగూడదనియెడు నియమంబులేదు కార్యసంకటంబు జేకూరినప్పుడుధీశాలియును, సమర్థుడును, శ్రేయస్కార ముండునగు చెలికాడెవ్వడైనను ఉపదేశించుట యుక్తము కావున మీరందఱు మీకు దోచిన చందంబునెఱిగింపుడని రాముడు వనచరులతో జెప్పెను ఆ వానరులు రామహితంబు సేయంగోరి రామా! ముజ్జగంబుల యందును నీకు దెలియని మర్మమున్నదా! మాకందఱికిని గౌరవమును, సత్కీర్తిని సమకూర్చుటకివ్విధంబున బలుకుచున్నాడవు నీవు సత్యశీలుడవు, శూరుండవు, ధర్మనిరతుడవు, దృఢవిక్రముడవు, పరీక్షించిన కార్యమునకు గడంగువాడవు మఱపెఱుంగని మాన్యచరితుడవు మేలిమిత్రరత్నముడవు ధీశాలురును, సమర్థులునగు మంత్రివర్యులు క్రమముదప్పక యుక్తి యుక్తంబుగా వారి వారి యభిమతంబులనెఱిగించెదరు ఆలకింపుడని వనచరులు రామునితో జెప్పిరి

## అంగదాదులు విభీషణుని గురించి రామునితో జెప్పుట

అప్పుడు ధీమణియగు అంగదుడు విభీషణుని గూర్చి రామునితో నిట్లులనియె మహాత్మా! ఇతడు శత్రు సన్నిధినుండి వచ్చినాడు మనమెట్లు నమ్మదగును కుటిలాత్ములు తమ యభిప్రాయంబులను మఱుగు పఱచుకొని పైకి సజ్జనుల వోలె సంచరింపుచు కడపటికి చిద్రంబు దొఱకినప్పుడు ప్రహరింతురు అప్పుడు మనకు గొప్పముప్పు సంభవించును గుణదోషంబులను జక్కగా నరయువలయును సుగుణములుండెనేని యంగీకరించి స్వీకరింపవలయును దోషములుండెనేని వెంటనే విడువవలయును ఈ విభీషణుని జక్కగా బరిశీలించి సద్గుణములుండినచో చేరదీయుదము దోషములుండెనా వదలివేయుదము ఇదియే నాయభిమతమని వాలిసుతుండు రామునితో దెలియబలికెను

అటు పిమ్మట శరభుడు దీర్ఘముగా నాలొచించి దృఢచిత్తుడై యిట్లు చెప్పబూనెను రామా! ఆలసింపక సూక్ష్మ బుద్ధిగల గూఢాచారునొకని విభీషణుని సన్నిధికి బంపుము ఆ గూఢపురుషుని చేత మర్మములెఱింగి చక్కగా బరీక్షించి తదుపరి నీతిశాస్త్రోక్త ప్రకారంబున బరిగ్రహా పరిగ్రహంబులు గావింపవలయును ఇదియే నాయభి ప్రాయమని శరభుడు చెప్పెను

పండితోత్తముడగు జాంబవంతుడు శాస్త్రయుక్తంబుగా నాలోచించి నిర్మల వాక్యములతో నిట్లులనియె దశరథాత్మజా! రావణుడు నీయందు బద్ధవైరము గలవాడు గదా! అతని తమ్ముడేకారణముచేత నిచటికి వచ్చుచున్నాడో! మనకర్థముగాకున్నది ఎటు జూచినను యేలకోనతనిపై సందేహము బొడముచున్నదనెను న్యాయాన్యాయకోవిదుండును, వచన సంపన్నుడునునగు మైందుడు రాముని జూచి నరేంద్రా! గూఢపురుషు డొక్కడు బోయి మృదుమధురభాషణములచే రావణుని వృత్తాంతమేమని విభీషణుని ప్రశ్నించి యథార్థమును దెలసికోవలయును తదుపరి దుష్టాత్ముడో పరిశుద్ధుడో చక్కగా బరిశీలించి కర్తవ్యమాలోచింప వలయుననెను

# హనుమంతుడు విభీషణుని గుణగణములను రామునితో జెప్పుట

సమస్త శాస్త్రాభ్యాసజన్యసంస్కార సంపన్నుడును, మంత్రి వర్యుండునగు మారుతాత్మజుడు గంభీరమైన మృదుమధుర వచనములతో రాముని జూచి యిట్లులనియె రామా! నీకు దెలియనిదే మున్నది నీకంటే సమర్థుడెవ్వడు? బృహస్పతిని బోలిన బుద్ధిమంతుడవు, తర్క కౌశలంబున విజయశ్రీని జేకొనవలయు ననియెడు కాంక్షగాని, నేనాధిక్యము బొందవలయుననియెడు యభిప్రాయముగాని నాకులేదు నీయందు నాకు గల గౌరవముచే నాకు దోచిన దానిని యదార్థముగా జెప్పెద నాలకింపుము

మహాత్మా! గుణదోషంబులు చక్కగా నిర్ణయించి తదుపరి స్వీకారపరిత్యాగంబులు సేయవలయునని నీమంత్రులిపుడు నుడివిరిగదా! దానియందేలకో నాకు దోషంబుగను పట్టుచున్నది రాచకార్యము లందుప్రవేశపెట్టకున్నచో గుణదోషములు మనకెట్లు దెలియును గుణదోషంబులనెరుంగుకయే రాచకార్యములందు బ్రవేశపెట్టుటయు సరిగాదు ఒకవేళ ప్రవేశపెట్టినచో దుర్మార్గుడయ్యెనా సర్వము జెఱచును గుణదోషములను విచారించవలయుననెడు అంగదమతంబ న్యోన్యాశ్రయ దోషగ్రస్తమైయున్నది చారుని బంపి మర్మమెఱుంగ వలయుననెడు శరభుని మతంబు గూడమెచ్చదగినది కాదు దూరముగ నున్నవారల చెంతకు గూఢపురుషులను బంపి వారి హృదయ రహస్యము లెఱుంగవలయునేగాని దగ్గఱలో మనలనందఱిని జూచుచు మనకన్నుల కగుపడుచున్న విభీషణుని చెంతకు జారుని బంపుటెట్లు? అనుచిత దేశంబునను, అకాలంబునను, విభీషణుడిచటికి వచ్చినాడని జాంబవంతుడు చెప్పెను అతడు దేశకాలంబులెఱింగియే వచ్చినాడనుటకు సందేహమావంతయులేదు

అధముడగు రావణునకు నీ గుణగణంబులను బలపరాక్రమములను వర్ణించి చెప్పి సీతాదేవి నొసంగుమని విభీషణుడు హితంబు జెప్పియుండును ఆ దురాత్ముడాలకింపక బరాభవించి

యుండును ఆ యవమానమును భరింపజాలక నిన్ను శరణువేడుటకై రావణుని విడిచి వచ్చుటెంతయు సమంజసముగానున్నది దేశకాలంబులుగూడ యోగ్యములుగానే యున్నవి గూఢాచారునొక్కని బంపి రహస్యమునుదెలిసికొని రావలయునన్న మైందుని మాట గూడ సమంజసముగలేదు తటాలునబోయి మనమడిగినతోడనే యాతడేల సందేహింపకుండును? అట్లు సందేహమును గలిగించి యడుగుటచేతను సుఖాగతుండగు సన్మిత్రుడు గూడ దుష్టుడైతోచును ఒకవేళ మాటాడినను ఆతడు తన యభిప్రాయమును దాచుకొనియే మాట్లాడును గదా! ఎంతటి సమర్థునకైనను హృదయాభిప్రాయ మెఱుంగ నలవియగునా? ఈ విభీషణుని మాటలు విన్నచో యందులో దురాభిప్రాయమేమియు నాకుదోచలేదు ఆతని వదనారవిందమెంత ప్రసన్నముగానున్నదో బరిశీలింపుడు కలుషాత్ముడింత నిస్సందేహముగను, నిర్భయముగను రాజాలడు ఆతని పలుకులు నిర్దోషములైనవి నిర్భయముగా నున్న విభీషణుని యందు నాకిసుమంతయు సందేహములేదు ముఖవికారమెంత దాచినను దాగునా? హృదయగతంబగు భావంబును బలాత్కారంబున దాచినను దప్పక బయట బడగలదు కార్యవేత్తలలోనుత్తముడవగు నీకు దెలియని రహస్యమున్నదా! రావణుని వధించుటకు నీవు జేయు ప్రయత్నమును నాలకించి సోదరుని దురాచారములను గాంచి సహింపనేరక నిన్ను శరణువేడుటకై వచ్చినాడు మఱియు నీవు వాలిని వధించి సుగ్రీవునకు వానర రాజ్యమొసంగుటనాలకించి రాజ్యకాంక్షతో నిన్ను దరిజేరవచ్చినాడు నాశక్తికొలది నాకు దోచిన విధంబంతయు నెఱింగించితిని విభీషణుని పరిగ్రహించుటలో దోషమేమియు లేదని నాయభిమతము రామా! ఇంక మిగత కర్తవ్యము నీ యిచ్ఛానుసారము జేయవచ్చును నాదేమియు లేదని హనుమంతుడు రామునితో జెప్పెను

## విభీషణుని గురించి రాముడు తనయభిప్రాయ మెఱిగించుట

పవన తనయుని పలుకులనాలకించి శ్రీరాముడు తన యభిప్రాయంబు జెప్పనారంభించెను వానర ప్రముఖులారా! విభీషణుని గురించి నా యభిమతంబు నెఱిగించెదను నాశ్రేయస్సును గోరెడు మీరెల్లరు చక్కగా నాలకింపుడు అతడెంతకలుషాత్ముడైనను శరణు జొచ్చి యున్నాడు అట్టి శరణాగతుని నేనెట్లు విడువగలను శరణాగత రక్షణమే సత్పురుషుల ధర్మము ఆ ధర్మమును మించినది మఱొక్కటి లేదనియెడు శ్రీరాముని వాక్యములను సుగ్రీవుడాలకించి యిట్లు బదులు పలికెను రామా! నాకు నీ యందుగల యధిక పక్షపాతంబుచే నిట్లు బలుకుచున్నాను క్షమింపుడు ఈ రజనీచరుండు దుర్మార్గుడుగాని సన్మార్గుడుగాని, యితని పొందు మనకేల? ఈ మహావిపద్దశ యందు గూడ సోదరుని వీడి వచ్చినాడే! ఇంతకంటె కృతఘ్నుడు మఱొక్కడు గలడా? ఈ కలుషాత్ముడెవ్వరిని గాని విడువకుండును? ఇతనిని పరిగ్రహింపగూడదు భ్రాతృపరిత్యక్తుడైన వీనిని నమ్మరాదని సుగ్రీవుడు చెప్పెను

వానరేశ్వరుండగు సుగ్రీవుని వాక్యములాలకించి సత్యశీలుండగు రామచంద్రుడు లక్ష్మణునిపై జిఱునవ్వొల యంగటాక్షంబు బఱపి యిట్లు జెప్పబూనెను శాస్త్రాధ్యయనంబును, వృద్ధసేవయు, గావించిన వారలకుదక్క సుగ్రీవుడిపుడు జెప్పిన మాటంజెప్పనలవిగాదు ఈ విషయమునందు ప్రత్యక్షంబును, తాకికంబునగు నొక్క సూక్ష్మధర్మము సర్వ భూమీపతులకును గలిగియున్నది ఆ ధర్మసూక్ష్మంబిప్పుడు నాకు స్ఫురించుచున్నది వివరించెద నాలకింపుడు దాయాదులును, ఇరుగు పొరుగుననున్న రాజులును కష్టంబు సంభవించినప్పుడు సమయమెఱింగి ప్రహరింపజూతురు ఈ విభీషణుడు గూడ రావణునకు జ్ఞాతియే గదా! అందువలన కష్ట సమయంబెఱింగి జ్ఞాతిని పరిత్యజించి యిచ్చటికి వచ్చినాడు యోగ్యులగు రాజులు తమకత్యంతప్రియులగు జ్ఞాతులను గౌరవింతురేగాని మన పూర్వకముగా నమ్మరు పాపాత్ముడగు రావణుడు

జ్ఞాతినెట్లు నమ్మగలడు అగ్రజునిచే శంకింపబడిన వాడై విరోధమును బూని యితడిచ్చటికి వచ్చినాడు కాని వేఱుగాదు సుగ్రీవా! శత్రుబలంబు సంగ్రహించుకొను విషయమై నీ వెఱిగించిన దోషంబునే విశదీకరించెద నాలకింపుము

మనము రజనీచరులముగాము రాక్షస రాజ్యకాంక్ష మనకు లేదు మనపై నాతనికి ద్వేష్యము గలుగుట కవకాశములేదు మన సహాయమపేక్షించి రాజ్యమును బడయనున్నాడు మనలనాతడు విడువంజాలడు ఐతే రాక్షసుల కింతటి విమర్శనా జ్ఞానముండునా యని సందేహించెదవేమో! నిశాచరులలో గూడ కొందఱు నిర్మలాత్ములగు పండితులుందురు విభీషణుడాతెగకు జెందినవాడే! ఆ నిర్దోషిని పరిగ్రహింపవచ్చును ఇతని కంఠధ్వని నాలకించినచో భయపడియిచటకి వచ్చినట్లున్నది జ్ఞాతులెప్పటికిని పరస్పరమైత్రితోనుండరనుట సుప్రసిద్ధమే గదా! భయపడిమఱుగుజొచ్చిన వానిని రక్షించుటలో దోషమేమియులేదు వానరోత్తమా! తోబుట్టువులందఱు భరతునిబోలియుండరు తండ్రికి కుమారులందఱు నన్నుబోలియుండరు స్నేహితులందఱు నిన్నుబోలియుండజాలరు అందఱును మనలనుబోలిన ధార్మికులై యుందురని తలంపకు మనియెడు రామచంద్రుని మాటలు సుగ్రీవు డాలకించి నమస్కరించి మహాత్మా! యీ విభీషణుని రావణుడే రహస్యముగా బంపి యున్నాడని గ్రహింపుడు వీని వలన మనకు గీడు మూడగలదని నాకు దోచుచున్నది తక్షణమే యీ కుటిలాత్ముని బరిమార్చవలయును సెలవిమ్మనియెడు సుగ్రీవుని సుభాషితము లాలకించి మరల రాముడిట్లనియె

వానరేంద్రా! యీ విభీషణుడు దుష్టుడేయగు గాక! లేక సన్మార్గుడే యగుగాక! నన్నీతడేమి చేయగలడు? నాకు కీడు తలపెట్టునందువా? అది దుస్సాధ్యము లంకా పట్టణములోని రాక్షసులనే గాదు ఈ భూవలయంబున నివసించి యుండు పిశాచములను, దానవులను, యక్షులను, నా పెద్దవ్రేలి చివరచే నలిపి చంపెదను ఈ విభీషణుడెంత? నన్నేమి చేయగలడు?

## శరణాగతరక్షణమును గూర్చి రాముడు జెప్పుట

ఒక కపోతము తన భార్యనపహరించిన బోయవాడొకడు శరణు జొచ్చిన తోడనే వానిని పూజించి తనదేహమును దృణప్రాయముగా త్యజించి ఫలలంబొసంగి రక్షించిన విషయము మీకందఱకును దెలిసినదే గదా! ఇంక నాయట్టివాడు శరణు జొచ్చిన వానిని రక్షింపకెట్లుండును? మీరే యోచింపుడు కణ్వమహర్షి పుత్రుడు, కండుమహామునీంద్రుడు మున్ను పరమధర్మబోధకంబగు నొకగాథను జెప్పియున్నాడు అద్దానిని నీకెఱింగెద నాలకింపుము వానర రాజా! దీనవదనుడై కరంబులు మొగిడ్చుకొని శరణు వేడుచున్న శరణాగతుని వధించుటకెట్లు బుద్ధి బొడమగలదు? అయ్యో! ఇది యక్రౌర్యధర్మపరిపాలన మనబడదా! చంపదగినయట్టి శత్రువులలో నెవ్వడైనను శరణాగతుండయ్యేనేని పండితోత్తముడగు వాడు తన ప్రాణంబులొడ్డియైనను రక్షింపవలయును భయంబుచేతగాని, అజ్ఞానము చేతగాని కామంబుచేతగాని శరణాగతుని రక్షింపనివాడు పాపమునకు గురియై లోకాపవాదమునుం గూడ భరించుకొనును మఱియు సమస్త సంచితపుణ్యమును బోగొట్టుకొని నరకమున బడిపోవును అంతియేగాక బలంబు నశించిన వాడగునని కండు మహాముని చెప్పినట్లు తప్పక నేను జేసెదను దీనివలన సద్యశంబును స్వర్గప్రాప్తియు గలుగును

శరణాగతుడను, నీవాడను నన్నుదరిజేర్పుమని యొక్కమారు యాచించునేని యాతని కెవ్వరివలన నేమి భయంబులున్నను ఆ భయంబులన్నియు నేదీర్చెదను ఇదియే నా వ్రతము సుగ్రీవా! ఇతడు యథార్థముగా విభీషణుడో! లేక విభీషణుని వేషమును దాల్చి వచ్చిన శత్రుడగు రావణుడో! యని సంశయింపవలదు నాకు మఱాడవలదు ఇతనికి నేనభయమిచ్చితిని తక్షణమే తోడితెమ్ము పొమ్ము అనియెడు రాముని వాక్యములను సుగ్రీవుడాలకించి యంమ్మహాత్ముని శరణాగతవాత్సల్యమున కద్భుతమొంది యిట్లనియె

రామా! లోకనాథా! ధర్మజ్ఞుడా! నీ శరణాగత వాత్సల్యము నెంతనికొనియాడుదును సర్వలోక శరణ్యా! విభీషణుని వధించుటకు

నిర్ణయించుకొన్న నాకు మనస్సు మారినది. అతడు పరిశుద్ధుడని తెలిసికొంటిని ఇది యంతయు నీయనుగ్రహమే నీవును, హనుమంతుడును జెప్పిన యుక్తుల వలన విభీషణుని యాకారాదులను నిస్సందేహముగ బరీక్షించి తెలిసికొంటిని అమ్మహాపండితుడగు విభీషణుడు త్వరితముగ నిచ్చటికి వచ్చి మాలోనొకడై చెలికాడగును గాక! పోయివచ్చెదనని త్వరితముగ బోయి సుగ్రీవుడు విభీషణుని దోడితెచ్చిన వెంటనే వైనతేయునితో సురనాథుడు జేరునట్లు రామచంద్రుడు విభీషణునితో జేరెను

## విభీషణుడు రాముని రక్షణంబుగోరి పాదములపై బడుట

రాముడభయమొసంగిన తోడనే పండితోత్తముడగు విభీషణుడు తన నలువురి మంత్రులతో గూడ నేలకు డిగ్గి రామా! దశరథరామా! రక్షింపుము రక్షింపుమని దశరథసుతుని పాదంబులపై వ్రాలి యిట్లనియె దేవా! నేను రావణుని తమ్ముడను ఆ రాక్షసరాజు నన్ను బరాభవించెను సర్వభూతములను సమదృష్టితోనరయు రక్షకుడవని నిన్ను శరణు జొచ్చితిని లంకాపట్టణమును, పుత్రమిత్రకళాత్రాదులను, సర్వసంపదలను బరిత్యజించి నీ దరిజేరితిని నారాజ్యము నాజీవితము, నాసుఖంబులును నీ యధీనములు రామా! నాకింతకంటె వేఱొండేమియు లేదని విభీషణుడు పలికిన మధుర వాక్యములను రాముడాలకించి కరుణా రసార్ద్రంబగు కటాక్షంబునంజూచుచు విభీషణా! రాక్షసుల బలాబలంబులను విశదముగా నాకెఱిగింపుమనిన విభీషణుడు రావణుని బలంబునంతయు జెప్ప మొదలిడెను

రామచంద్రా! రావణుడు సురజ్యేష్ఠునివలన వరంబులు వడసి గంధర్వోరగ రాక్షసులకుగాని, సర్వభూతములకు గానియు వధ్యుడై యొప్పారుచున్నాడు దశగ్రీవునకు దమ్ముడను నాకు జ్యేష్ఠుండనగు కుంభకర్ణుడమిత తేజశ్శాలి భండనంబున దేవేంద్రునకు సాటి వచ్చు బలగర్వితుడు సేనాధిపతియగు ప్రహస్తుని గూర్చి పవన తనయుడు

మీకెఱిగించియే యుండును ఆతడు కైలాసవాసుండగు కుబేరుని సేనాధిపతియగు మాణిభద్రుని జయించి పేరెన్నిక గాంచిన బహువిక్రముండు రావణాసురుని సుతుండగు ఇంద్రజిత్తు గోధాంగుళీత్రాణంబులు ధరించి ధనువులను దాల్చినిల్చి యుద్ధమందు దృశ్యుడగుచుండును హోమంబొనరించి యగ్ని హోత్రునకు సంతృప్తి గావించి తత్ప్రభావంబున నదృశ్యుడై శత్రువులను దునుమాడును మహోదరుడును మహాపార్శ్వుండును అకంపనుడును, మొదలుగాగల రావణుని సేనాధ్యక్షులెందరోగలరు వారందఱు లోకపాలురకు సాటివత్తురు మాంసశోణితాహారులును కామ రూపులునగు ప్రధాన రాక్షసవీరులు లంకయందు బదివేల కోట్లున్నారు ఆ రక్కసుల బలంబును చేయూతగ జేకొనియే రావణుడు దిక్పాలురతోడను సమస్త దేవతలతోడను, సంగరంబుగావించి విజయలక్ష్మిని బడసెను సురనికరంబు పరాభవమునకు బాల్పడెనని విభీషణుడు రామునితో జెప్పెను దశరథసుతుండు విభీషణుని పలుకులాలకించి మనంబున కొంత తడవాలోచించి యిట్లనియె విభీషణా! నీవలన రావణుని శౌర్యకార్యంబులన్నియు గ్రహించితిని, ఇంక నా ప్రతిజ్ఞ వినుము

## రావణుని సంహరించి లంకాధిపత్య మొసంగెదనని రాముడు విభీషణునితో జెప్పుట

రావణాసురుని సమస్త బంధుమిత్రపుత్రాదులను ప్రహస్తాదులను బరిమార్చి నిన్ను లంకా రాజ్యాభిషిక్తుని గావించెదను ఇది ముమ్మాటికిని సత్యమని నమ్ముము ఆ రాక్షసాధముడు రసాతలంబునకేగినను పాతాళంబు జొచ్చినను, బ్రహ్మలోకంబునకు బరుగులిడినను నేనతని జీవంబులతో విడువను ఆ దురాత్ముని బరిమార్పనిదే నేనయోధ్యకేగనని నా మువ్వురి తమ్ములమీద శపథంబొనరించు చున్నాననిన తోడనే రావణుని తమ్ముడుప్పొంగి మైమఱచి సాష్టాంగనమస్కార మొనరించి యిట్లు విన్నవించెను రామా! నేను నాశక్తికొలది రాక్షసులను దునుమాడుట యందు నీకు జేదోడు వాదోడుగానుండెదను శత్రుసేనల యందు జొరబడి సమరంబు గావించెదనన్న విభీషణుని

శ్రీరాముడాలింగనము గావించుకొని పరమామోదమంది మిక్కిలి ప్రేమగల వాడై లక్ష్మణుని జూచి యిట్లులనియె

లక్ష్మణా! నేనెంతయు బ్రసన్నుడనైతిని నీ వీక్షణమందే సముద్రజలమును గొనితెచ్చి పండితోత్తముడగు విభీషణుని రాక్షస రాజుగా నభిషేకింపుమనెను రాముని యాజ్ఞను లక్ష్మణుడు శిరంబునందాల్చి వానరోత్తములనడుమ విభీషణుని రాక్షస రాజుగా నభిషేకించెను వానర యూథమంతయు పరమామోదమంది సింహ నాదంబులు జేయుచు మహాత్ముడగు రామచంద్రుని శ్లాఘించిరి

## హనుమంతుడును సుగ్రీవుడును సముద్రమును దాటువార్గమేదని ఏకాంతముగా విభీషణునితో నాలోచించుట

హనుమత్సుగ్రీవులు యేకాంతముగనున్న విభీషణుని సమీపించి యిట్లు ప్రశ్నించిరి విభీషణా! మనమందఱం వానరసేనా సముదయంబులతో గూడ నక్షోభ్యంబగు నీ పయోరాశినెట్లు దాటగలము ఆయుపాయంబెట్టిదో మాకేమియు దోచకున్నది నీవు నద్దానినెఱింగిపుమని కోరిరి ధర్మజ్ఞుడగు విభీషణుడు హనుమత్సుగ్రీవుల పలుకులాలకించి వారలతో నిట్లులనియె వానరోత్తములారా! మహాత్ముడగు రాముడు సాగరుని శరణు బొందవలయును ఈ సముద్రుడు రాముని కూటస్థుడైన సగరచక్రవర్తిచే వృద్ధిబొందినవాడు రామచంద్రుడు గూడ సగర వంశోద్భవుండగు కతంబున సముద్రుడు కృతజ్ఞుడై రామకార్యంబునకు దోడ్పడును మీరేమియు సందేహింపవలదని విభీషణుడు జెప్పెను సుగ్రీవుడు వెంటనే రామలక్ష్మణులను సమీపించి సముద్రోపాసనంబును గురించి చెప్పెను

పరమధార్మికుండగు రాముడు సముద్రోపాసనమునకు సమ్మతించి లక్ష్మణుని జూచి యిట్లనియె సోదరా! విభీషణుని యాలోచనమెంతయు మెచ్చదగి యున్నది నీవు సుగ్రీవునితో నాలోచించి మీ యిరువురి యభిప్రాయమేమో నిశ్చయించుకొని నాకెఱిగింపుడనిన

లక్ష్మణ సుగ్రీవులు చేతులు మొగిడ్చి వినయపూర్వకంబుగానిట్లు జెప్పిరి పురుషోత్తమా! మనకేయుపాయంబును దోచని సమయంబున కార్యసాధకంబగు తెఱంగునత్యంత సులభముగా విభీషణుడెఱిగించెను అట్టి ధీశాలి యాలోచన మాకెందుకు సమ్మతము గాకుండును? ఇమ్మహార్ణవంబునకు సేతువునిర్మింపనిదే సురేశ్వర సహితులగు సురాసురులకైనను లంకాపురంబు ప్రవేశింపనలవిగాదు పండితోత్తముడగు విభీషణుడు జెప్పిన యుపాయంబాచరింపుడు కాలమును వ్యర్థము సేయవలదు మనమెల్లరు త్వరలో లంకాపురంబు జేరునట్లు సముద్రుని బ్రార్థింపుడు ఇదియే కర్తవ్యమని సుగ్రీవ లక్ష్మణులెఱుగ దెల్పిరి వెంటనే శ్రీరాముడు సముద్రతీరంబున దర్భలను బఱచివేదియందగ్నిహోత్రుని మాడ్కి శయనించెను

## శార్దూలుడను రాక్షసుడు వానర సైన్యమునుజూచి వచ్చి రావణునితో జెప్పుట

సుగ్రీవ పాలితంబైన సముద్రపుటొడ్డున విడిసియున్న వానర సైన్యమును రావణుని చారుండగు శార్దూలుడను రాక్షసుడుగల యనవలోకించి వేగంబున లంకాపట్టణమునకేగి రావణునితో నిట్లులనియె రాక్షసేంద్రా! అప్రమేయంబగు వానర భల్లూక సైన్యము రెండవ మహార్ణవంబువోలె లంకాపురంబుపైకెత్తి వచ్చుచున్నది దశరథనందనులగు రామలక్ష్మణులిరువురును ఉత్తమాయుధములను దాల్చి సీతయున్న స్థలంబు జేరనుద్యుక్తులై యున్నారు వానరసేన యెటు బరికించినను దశయోజనముల భూమివఱకు నావరించియున్నది నేను సామాన్యముగా జూచి వచ్చితిని నీవతి త్వరితముగ దూతలనుబంపి చక్కగా గనుగొని రమ్మని యాజ్ఞనొసంగుము అలసింపవలదనియెడు శార్దూలుని వాక్యము లాలకించి కార్యవేత్తలలో శ్రేష్ఠుడగు శుకుడును రాక్షసుని జూచి రావణుడిట్లనియె

## శుకునితో సుగ్రీవునకు రావణుడు సందేశమంపుట

శుకుడా! నీవు బోయి వానరేంద్రుడగు సుగ్రీవుని జూచి నేజెప్పి పంపిన సందేశమును క్రమముగా ధీరచిత్తువై మృదుమధుర వచనంబులతో శ్రావ్యముగా నెఱిగింపుము కీశాధీశుండగు సుగ్రీవుడా! నీవు సత్కులసంజాతుడవు మాతో నిష్కారణవైరంబు బూనుట నీకు దగదు మహాసత్త్వసంపన్నుడవు అల్పబలుండగు రాముని పొందు నీకేల? అతని వలన నీకే కార్యమగును? బ్రహ్మపుత్రుండగు ఋక్ష రజుని పుత్రుడవు అందువలన నీవు నాకు బంధుడవైతివి ఇదియునుంగాక నీకిందురాబోయెడి లాభనష్టములేమియు లేవు నీ యగ్రజుండగు వాలి నాప్రాణమిత్రుడు నీవు వా తమ్ముడవు నాతో వైరంబు బూనుట నీకుదగదు సుగ్రీవా! నేను రాముని భార్యను గొని వచ్చితినందువేమో! వానరేశ్వరుండవగు నీకిందులో జోక్యమెందుకు నీకేమి సంబంధమున్నది? నీవు బుద్ధిమంతుడవు దీర్ఘముగా నాలోచించుకొనుము నిశ్చింతగా కిష్కింధకు మరలి పొమ్ము నీకీ గొడవతోబనిలేదు ఈ లంకాపట్టణంబు జొచ్చుటకు వానరులకలవి యగునా? దేవదానవులకే సాధ్యముగాదు మానవులు వనచరులు ప్రవేశించుట దుర్లభమని సుగ్రీవునితో నేను జెప్పినట్లుగా జెప్పుమని రావణుడు శుకునితో జెప్పెను

రాక్షసేశ్వరుని పలుకులాలకించి శుకుడు పక్షిరూపమును దాల్చి గగనవీధికెగిరి రామాదులున్న సముద్రోత్తర తీరంబున కేగి సుగ్రీవాదులున్నచోటెఱింగి యాకాశమునుండియే వానరేశ్వరుని జూచి రావణుడు జెప్పిన సంగతినంతయు బూసగ్రుచ్చిన చందంబున వాక్రుచ్చెను ఆకసంబున నిల్చి మాటాడుచున్న శుకుని మాటలను వానరులాలకించి వెంటనే యాకాశంబునకుద్గమించి బలాత్కారంబుగా నారక్కసు నొడిసిపట్టి నేలకుబడద్రోసి పీడింపసాగిరి శుకుండార్వజాలక రాముని బేర్కొని యిట్లు మొఱబెట్టుకొనెను రామా! ధార్మికులెవ్వరును దూతను బరిమార్చరు నన్నీ వనచరులు బట్టి చంపనుద్యుక్తులై యున్నారు నన్ను రక్షింపుము స్వామి మతంబునకు విరుద్ధముగా

సంచరించుదూతను వధింపవలయును నిర్దోషినగు నన్ను వధించినచో నీకేమి లాభమని శుకుడు రోదన పూర్వకముగా విన్నవించుకొనెను రాముడాతని మొఱాలకించి దయార్ద్రహృదయుడై శుకుని గొట్టుచున్న వనచరోత్తములంజూచి వీనిని వధింపవలదు ఇది నాయాజ్ఞయని నుడివెను వనచరులు రాముని వాక్యము లాలకించి రాక్షసుని విడిచి పెట్టిరి వెంటనే విఱిగిన ఱెక్కలతో శుకుండాకసంబుకెగిరి సుగ్రీవా! రావణునితో నేనేమి జెప్పవలయునో యెఱిగింపుమనిన సుగ్రీవుడిట్లనియె

## సుగ్రీవుడు శుకునితో రావణునకు సందేశమంపుట

రావణుని చారుడగు శుకుడా! నేను జెప్పినట్లుగా రావణునితో నిట్లులనుము నీవు నాకు మిత్రుడవు గావు కరుణింప దగినవాడవుగావు నీ వలననేయుపకారమునుబొందిన వాడనుగాను ప్రియతముడవుగావు నా ప్రాణమిత్రుడగు శ్రీరామునకు పరమశత్రుడవు వాలి నాకు శత్రువు నీ వాతని మిత్రుడవు కాన నీవు నాకు శత్రుడవు వాలియుంబోలె నీవు గూడ వధ్యుడవు నీ బంధుమిత్రాదులను పుత్రులనుజ్ఞాతులను బరిమార్చెదను త్వరితముగ వానరసేనతో లంకాపురంబు జొచ్చి భస్మము గావించెదను మూఢాత్మా! నీకు సురేంద్రాదులు తోడై వచ్చినను నీవంతర్ధానంబునొందినను, సూర్యద్వారంబు జొచ్చినను, పాతాళంబునకు బరిగెత్తినను రాముడు విడువక నిన్ను హతమార్చును ఆ దశరథసుతుని బారింబడిన నిన్ను ముజ్జగంబుల యందును రక్షించు వారలు లేరు జటాయువును వధించిన వీరుండనని నిన్ను నీవు బొగడు కొనుచున్నావు గాబోలును అతడు వృద్ధుడు అసమర్థుడు పాపమావృద్ధ గృధరాజును వధించుటలో నబ్బురమేమున్నది? రామలక్ష్మణులు లేని తరుణంబుజూచుకొని సీతను దొంగిలించితివి ఆ దశరథనందనుల యెదుట గొనితెచ్చియున్నచో నీభంగము బయట పడియుండెడిది సిగ్గులేక దొంగతనముగా రాముని భార్యను గొనిపోయితివి అమ్మహాత్ముని బలంబెఱుగవైతివి నీ ప్రాణంబులను రాముడు బలిగొనక మానడని సుగ్రీవుడు శుకునితో జెప్పి పంపెను

అంతలో వాలి సుతుండగు అంగదుడు సుగ్రీవుని జూచి యిట్లు చెప్పెను వానరేంద్రా! యీ శుకుండు రావణాసురుని చారుడే గాని దూతగాడు ఇతనిని లంకకు బోనీయరాదు పట్టి బంధింపుడనిన తోడనే వానరేంద్రుడు రాక్షసునిబట్టి తెండని వానరులకాజ్ఞ నొసంగెను వృక్షచరులు రాక్షసుని బట్టి బంధించి బాదింపసాగిరి శుకుండా వానరుల బాధకాగ జాలక రామా! వానరులు నానెఱకలను విఱిచి నాకన్నులను బెఱికి వేయుచున్నారు అనపరాధిని ఏ దోషమెఱుగను అన్యాయముగనే వధింపబడుదునేని నేజేసిన ఘోరపాపంబులన్నియు నిన్ను జేరును రక్షింపుమని మొఱబెట్టుట నాలకించి దూతను విడువుడని రాముడు వానరుల కాజ్ఞ నొసంగెను వృక్షచరులు శుకుని విడిచిపెట్టిరి

## దర్భశయనుడగు రాముడు సముద్రునిపై గినుక వహించుట

శత్రుసంహారకుండగు రాముడు సముద్ర తీరమందు సర్ప శరీరమును బోలిన తనమృదులంబగు బాహువులను తలగడగా నిడుకొని తూర్పు మొగముగా బరుండి సాగరునకు నమస్కరించెను ముక్తామయ భూషణములను ధరించి హంసతూలికాతల్పము నందు సీతాసాధ్వి శిరంబుచే నధిష్ఠితంబై ప్రకాశించుచు శత్రువులపై దీవ్ర నారాచంబులను బ్రయోగించెడు గొప్పయిను పగుదియను బోలిన దక్షిణ బాహువును దలగడగా నుంచుకొని నాకిక మరణమో! లేక సముద్ర తరణంబో! గలుగుగాక! యని దృఢ సంకల్పుడై మనోవాక్కాయకర్మంబులచే సముద్రమునకెదురుగా శయనించెను అట్లు నియమవ్రతుండై సముద్రుని ధ్యానించు చుండగా మూడురాత్రులు గడచినయొ మూఢాత్ముడగు సాగరుడు సాక్షాత్కరింపడయ్యెను

ఆ తరుణమందు రాముడమితకోపోద్రేకుడై లక్ష్మణుని దిలకించి యిట్లనియె లక్ష్మణా! యీ సముద్రుడింకను బ్రత్యక్షముగాకున్నాడు ఇతని గర్వమే యింతకుదెచ్చినది కోపమును వీడుట అపరాధములను సైచుట కుటిలతలేకుండుట, ప్రియవచనంబులాడుట సత్పురుషుల

సహజగుణములు ఈగుణములు నిర్గుణులకు నసామర్థ్యకృత్యంబులుగా దోచును నిర్దయుండై వివేచనంబును బోనాడి సర్వులను దండించెడు పురుషుని లోకమందు గౌరవించెదరు శమదమాది సద్గుణసంపన్నుడగు సత్పురుషుని గౌరవింపరు పరాక్రమవంతుడనియెడు కీర్తిని గాని సమరమందు విజయంబును గాని మంచితనముచే బొందనలవిగాదు తమ్ముడా! నాశర పరంపరలచే దుత్తనియులై మకరంబులు, మహా భుజంగములు, గజాకారమత్స్యంబులు సముద్రమంతటను దేలియాడునట్లు గావించెదను ఈ సముద్రుడు శోషిల్లుటను కన్నులారా జూడగలవు నేనెంతయో సహించితిని నేనోర్చియుండుట వలన సాగరుడు నన్నసమర్థునిగా భావించి యుపేక్షతో నున్నాడు ఈ దుష్టుడు సాహాయ్యంబెంత జేసినను నాకు సాక్షాత్కారింపడయ్యెను సోదరా! నాశరాసనంబును, దీక్షబాణంబుల నిటుదెమ్ము పయోరాశినంతయు శోషిల్లజేసి వానరులు కాలినడకలో లంకాపురంబునకు బోవునట్లొన రించెదను నేనిదే క్రుద్ధుడనైయక్షోభ్యంబగు సముద్రమును క్షుభితంబు గావించెదను తరంగ సంకులంబై చెలియలికట్ట నతిక్రమింపని మహార్ణవ మంతటిని త్వరితముగ నిర్మర్యాదంబుగా మహీమండల మంతయు బ్రవహింపజేసెదనని రాముడు ధనుర్బాణంబులు ధరించి మహోగ్రుడై కండ్లు గిఱగిఱంద్రిప్పుచు బ్రళయకాలానలంబుపగిది వెలుగొందు చుండెను

అట్లు కొంత తడవాగి దృఢముష్టింబట్టి రాముడు ధనువు సజ్యంబుగావించి లోకంబులు భయంబునొంది గడగడవడంకునట్లు నిశితశర పరంపరలంబ్రయోగించెను ఆ శరపరంపరల ధాటికాగజాలక మహార్ణవమంతయు మంటలెగయుచు గాంతివిహీనమై కలత జెందెను జంతుజాలంబులు సంక్షోభమొందుచు బైకిదేల విలవిల దన్నుకొనుచు దల్లడమందుచుండెను అతిభయంకరమైన శరసంధానము సేయుందొడగిన రాముని జూచి యింక నేనుపేక్షింపరాదు క్షణమూర కున్నచో లోకంబులన్నియు భస్మమై పోగలవని తలంచి లక్ష్మణుడు రాముని ధనువును బట్టుకొని అన్నా! వలదు, వలదు, ఇంక విరమింపుమని ప్రార్థించెను సముద్రుడింకను సాక్షాత్కరింపడయ్యె అప్పుడు రఘుకుల

తిలకుడు కోప పరవశుండై సాగరుని జూచి భయంకరముగ నిట్లు జెప్పెను సముద్రుడా! నీగతియేమౌనో చూడుము నిన్నీక్షణమందే పాతళముతో గూడ శోషిల్లజేసెదను నాబాణాగ్నిచే నీవు జలజంతువులు దగ్ధమై నీవున్న స్థలమంతయు నిసుకమయమగుగాక! వనచరులు కాలినడకతో నవలీలగా దాటిపోగలరు దానవుల సహవాసమున నీకీ దుర్బుద్ధియలవడినది ఇదే నా(త్రాణచుడుమని (బహ్మాస్త్రంబున భిమం(త్రించి వింటంగూర్చి యాకార్ణాంతము నాకర్షించెను

## ప్రకృతి తల్లడమందుట

అవ్విధంబున రాముడు దనువు నాకర్షింపగానే భూమ్యాకాశంబులు (బద్ధలైనట్లుండెను శైలంబులన్నియు భయంబున గడగడవడంకి పోయినవి లోకమంతయు తిమిరావృతమైనది కకుభంబులు కాంతి విహీనములైనవి సరోవరంబులును నిర్ఘరులును గలంగి పోయినవి సూర్యచంద్రులును, నక్షత్రములును భయకంపితమొంది వక్రంబుగా సంచరించినవి గాఢ తిమిరావృతంబై యుండుటంజేసి యాకసంబున సూర్యకిరణంబులు కొఱవులంబోలి కాంతిరహితములై గన్పట్టుచున్నవి అంతరిక్షము నుండి మహాధ్వనులుత్పన్నములగుట వలన పిడుగులు బడినవి చండమారుతంబులు భయంకరముగా వీచినవి వాయువేగంబున జలధరములు చదలనలముకొన్నవి మహామహీరుహంబులు విఱిగి నేల బడినవి పర్వత శిఖరంబులు ఖండములైనవి మహామేఘ సంగతంబుల వలన మహాధ్వనులు బయలుదేరి పిడుగులు బడినవి దృశ్యములగు మనుష్యాది భూతంబులు పిడుగు (మోతకు వెఱగంది గుండెలవియ నా(క్రోశించినవి అ దృశ్యంబులగు పిశాచాది భూతంబులును భయంకరధ్వనిని గావించినవి సర్వభూతములును భయవిహ్వలంబులై నేలబడినవి రామశరసంధానముచేత మహార్ణవంబుభూతంబులతోడను, మహాభుజంగములతోడను, దానవుల తోడను, గొప్పతరంగములతోడను, భయంకరమైన వేగంబుగలదియై చెలియలికట్టనతిక్రమించి యోజన దూరంబు వెనుకకు బోయెను అప్పుడు దశరథసుతుండు బాణప్రయోగంబుసేయుదయ్యెను

## రామునికి సముద్రుడు ప్రత్యక్షంబగుట

మేరుపర్వతము నుండి భాస్కరుడుదయించు చందంబున నదనదీపతి సాగరమధ్యంబునుండి యావిర్భవించెను వైడూర్య సంకాశుడును, రక్తమాల్యాంబరధరుండును పద్మపత్రంబులను బోలిన నేత్రములు గలవాడును, సర్వపుష్పములచే గూర్చిన దివ్యపుష్పమాలికను శిరంబున దాల్చిన వాడును, వివిధామూల్యరత్న ఖచితంబులగు బంగారు సొమ్ములచేత నలంకృతుండునగు సముద్రుడు మహాతరంగము లాకసమునంటుచుండ దీప్తముఖంబులగు పన్నగంబుల తోడ గూడ రామచంద్రుని జేరంజని చేమోడ్పుగేలించి బాణపాణియగు రామా! పంచభూతంబులు స్వస్వభావంబులను వదలునా! అగాధమై దాటనలవి గాకుండుట నాస్వభావము నాసహజ ధర్మమును నేనెట్లు గోల్పోదును? అగ్నికి చల్లదనము విరుద్ధమైనట్లు లోతు లేకుండుట నాకు ధర్మవిరుద్ధము గదా! రాజనందనా! కామము చేతగాని లోభము చేతగాని, భయముచేతగాని మకరంబులాదిగా గల జంతు సముదాయముచే నిండియున్న సలిలంబులను స్తంభింప జాలుటెట్లు? నా చేతనైన కార్యంబును శక్తివంచన లేకుండ జేసెదను మీ సైన్యము మహోదధిని దాటువఱకు గ్రాహాదిజలజంతువులు బాధింపకుండునట్లు గావించెదను సేతుబంధనము గావించుటకు వలయు సహాయంబు జేసెదను శాంతింపుమని సముద్రుడు రామునితో జెప్పెను

అప్పుడు రాముడు సాగరునిజూచి సముద్రుడా! అమోఘంబగు నీ బ్రహ్మాస్త్రమును శరాసనంబున సంధించినానే! దీని నెచ్చట విడుతును జెప్పుమనిన 'రామా! ఇచ్చట కనతి దూరంబున నుత్తర దిశయందు వినుతి కెక్కిన సుందరద్రుమకుల్యంబనునొక్క ప్రదేశమున్నది అచ్చట చోరులనేకులు నా జలంబును గ్రోలుచు, మహాదుశ్చేష్టలొనరించుచున్నారు ఆ పాపకర్ముల స్పర్శనమును సహింపజాలకున్నాను ఈ యమోఘ బాణంబును ఆ దుర్మార్గులపై బ్రయోగింపుమనిన తోడనే రాముడు తన బాణమును ద్రుమకుల్యముపై బ్రయోగించెను

ఆ బాణమును బ్రయోగించిన, స్థలమంతయు జలమెండిపోయి

మరుకాంతారమని ప్రసిద్ధి జెందినది బాణపాతంబునంజేసి మహీవలయుము మారుమ్రోగినది పాతాళమునుండి దివ్యజలంబుద్గ మించినది దానికి వ్రణకూపమని పేరు వచ్చినది ఆ జలంబత్యంత రుచ్యంబై సముద్ర సలిలంబువోలె నాశంబు నొందక ప్రసిద్ధి నొందియున్నది ద్రుమకుల్యమందు పాపాత్ములచే స్పృశింపబడుచున్న జలంబంతయు రాముని బాణప్రయోగంబుచే నశించిపోయినది జలంబంతయు ఇంకి పోవుటచేత నాప్రదేశము మరుకాంతారమని ముల్లోకముల యందును బేరువడసియున్నది దేవతుల్యుడగు రాముడు సముద్రకుక్షి ప్రదేశమునుండి పాపాత్ములను రూపుమాపి యీ కాంతారముబాల తృణాదులచే నభివృద్ధి జెందియు రోగమై ఫలమూల మధువులతో నలరారుచు క్షీరసమృద్ధమై సుగంధి మూలికలచే శోభనొలుకు చుండుగాక! యని మరుకాంతారమునకు వరంబొసంగెను

అవ్విధంబున ద్రుమకుల్యంబంతయు దగ్ధమైన పిమ్మట సమస్త శాస్త్రకోవిదుండగు రాముని జూచి సరిత్పతి యిట్లులనియె రామచంద్రా! విశ్వకర్మసుతుండగు నలుడు నీ చెంతనేయున్నాడు శిల్పవిద్యయందు తండ్రికి దీసిపోడు విశ్వకర్మ వలన వరంబునొందియున్నాడు ఇతడు మహోత్సాహుడు సముద్రమందు సేతువును నిర్మింపగల సమర్థుడు నలుడు నిర్మించెడు సేతువును మునుగకుండ నేను ధరించెదను ఈ నలుడే సేతువును నిర్మించుగాక! యనుచు నదీపతియంతర్హితుడయ్యెను

అప్పుడు వానరోత్తముడగు నలుడు లేచి రామా! సముద్రుడు యథార్థము జెప్పినాడు నా జనకుండొసంగిన సామర్థ్యంబుచేత విశాలంబగు సముద్రమందు సేతువు నిర్మించెదను లోకమందు కృతఘ్నుల విషయమై క్షమయు సామదానోపాయంబులును బనికిరావు ఈ సాగరుండు సగర చక్రవర్తిచే నభివృద్ధి నొందియు గృతజ్ఞతలేని వాడై రాముడు కినుక వహించిన పిమ్మట దండించునను భయముచేత సేతునిర్మాణమునకు స్థలం బొసంగియున్నాడు మందరపర్వతమందు నా జననికి విశ్వకర్మ వరంబొసంగియున్నాడు నేనాతని కౌసరపుత్రుడను శిల్పవిద్యలయందు విశ్వకర్మకు సమానుడను నన్ను నేను బొగడుకొనను సముద్రమందు సేతువును దప్పక నిర్మింపగలను వనచరులంచటునిప్పుడే సేతునిర్మాణ

సన్నాహంబు సేయుదురుగాక! యని నలుడు రామునితో నుడివెను

## వానరులు సేతు నిర్మాణమును గావించుట

రాముడు వెంటనే సేతునిర్మాణమును గావింపుడని వానరోత్తముల కాజ్ఞనొసంగెను రామునియోగంబున వనచరోత్తములు పరమోత్సాహులై లక్షలాదిగా గుమిగూడి కాననంబులకేగి నానావిధ వృక్షములను బెఱికి సముద్రమందు జేర్చుచు, మద్ది ఇనుమద్ది, ఏఱుమద్ది చంద్ర, వెదుళ్లు, కొండమల్లె, తాటి, బొట్టు గుదిమిశవృక్షంబులను బిల్వవృక్షంబులను, ఏడాకులయరటిచెట్లను, పుష్పములను దొడగిన కొండగోగుచెట్లను, చూతవృక్షములను అశోకవృక్షములను గొనితెచ్చి సముద్రమున బడవైచిరి మఱికొన్ని వృక్షములను సమూలముగను, విమూలముగను గొనితెచ్చి మహార్ణవంబును సమపూరముగావించిరి తాటి, దాడిమ, నారికేళ, తాంద్ర పొగడ, తుమ్మ, నింబ వృక్షములను గొనివచ్చి పయోరాశింబడద్రోసిరి మహాకాయులగు మర్కటులు మదగజంబులను బోలిన మహాశిలలను పర్వతంబులను బెఱికి యంత్రసహాయంబుచే గొనిపోయిరి పర్వతంబులు బడుటచే సముద్ర జలమంతయు ఆకసంబున కెగురుచుండెను కొందఱు వానరులు శతయోజనములు నిడుపుగల సూత్రంబును బట్టుకొని సరిజూచుచుండిరి మఱికొందఱు కొలత కొయ్యలను బట్టుకొని పరీక్షించుచుండిరి దశయోజనముల వెడల్పును, శతయోజనముల నిడుపును గల మహాసేతువును, వానరులను సహాయంబుగాగొని పరమానందముతో ప్రథమ దివసంబున పదునాల్గు యోజనముల దూరమును, రెండవ దినంబున నిరువది యోజముల దూరమును, మూడవ దినమందు ఇరువది యొక్క యోజనముల దూరమును, నాల్గవ దినంబున నిరువది రెండు యోజనముల దూరమును, ఐదవదినంబున సువేల పర్వతంబుదనుకనిరువది మూడు యోజనముల దూరమును, వానరోత్తముడగు నలుడు జలరాశి మధ్యమందు సేతుబంధన కార్యంబును సమాప్తము గావించెను

## వానరులు సముద్రమును దాటుట

మకరాలయంబగు నీరాకరంబునడుమ, నల నిర్మితంబగు సుందరంబైన సేతువును అమరులును, గంధర్వులును, సిద్ధులును, మహర్షులును మిగుల నాశ్చర్యముతో దిలకింపనచటికరుగుదెంచిరి దుస్సహంబైన సముద్ర సేతుబంధమును సర్వ భూతములు సందర్శించినవి వానరులు కోట్లకొలదిగ సముద్ర దక్షిణ తీరమును జేరిరి భద్రముగా నిర్మిపబడిన సేతువు దివ్యప్రభలను వెదజల్లుచుండెను విభీషణుడు తన సచివోత్తములను గూడి గదాపాణియై శత్రువులను సంహరించుటకై సముద్రతీరంబున వేచియుండెను

అప్పుడు సుగ్రీవుడు రాముని జూచి యిట్లనియె రామచంద్రా! నీవు పవనాత్మజునిపై నారోహింపుము లక్ష్మణుడంగదునిపై నారోహింపగలడు ఈ మకరముల కాలవాలమైన సముద్రముపై మీరు నడచివచ్చుట భావ్యముగాదు హనుమదంగదులు గగనమార్గంబున మిమ్ములను దీసికొనిపోయి దాటింపగలరనిన తోడనే వానరసేనలు సుగ్రీవుననుసరించి ముందు భాగంబున నడచెను కొందఱు మధ్యభాగమందు నడచిరి మఱికొందఱు పోవుట కవకాశము లభింపమిచే జలంబులంబడిలేచిరి మార్గమిరుకుగానున్నందున తీరంబుననే నిల్చి కొందఱు మఱికొంతసేపటికి బోయిరి గరుత్మంతునివోలె కొందఱు నాకాశగమనంబునంబోయిరి వానరసేన సముద్రమును దాటునపుడు భయంకరమైన ధ్వని వినబడెను వానరాధీశుండగు సుగ్రీవునితోగూడ నలనిర్మితంబగు సేతువు మీదుగా వానరసేన సముద్రమును దాటి ఫలమూలములచే గలకలలాడు సముద్ర దక్షిణతీరమును జేరినది దేవతలును, సిద్ధచారణులును, మహర్షులును రామకార్యంబున కద్భుతమొంది త్వరితముగ రాముని సమీపించి మంగళ జలంబులచేత నభిషేకమొనరించి శత్రువులను దునుమాడుము భూవలయంబును జక్కగా బాలింపుమని మంగళ వచనంబులచే బూజించిరి

## శుభాశుభ నిమిత్తంబులను గూర్చి రాముడు లక్ష్మణునితో జెప్పుట

శుభాశుభ నిమిత్తంబులను గాంచి రాముడు లక్ష్మణుని కౌగిలించుకొని మోదావార్ధినీదుచు నిట్లు జెప్పబూనెను తమ్ముడా! శీతలోదకములును, మధురఫలములును గల ప్రదేశమందు నివాసస్థాన మేర్పఱచుకొని సేనలను విభజించి గరుడవ్యూహంబుగా దీర్చి స్వస్థచిత్తులమై యుందము ఈ ఘోరసంగ్రామము వలన మహాపరాక్రమశాలురగు భల్లూకవానరులును, నిశాచరులును, లెక్కకు మిక్కుటముగా వధింపబడుదురని తోచుచున్నది పవనుడు భయంకరముగా వీచుచున్నాడు వసుధాతలంబంతయు వడంకుచున్నది పర్వత శిఖరంబులు గంపమొందుచున్నవి భూరుహంబులాకస్మికముగా విఱిగి నేలబడుచున్నవి జలధరములు క్రవ్యాద సంకాశములై పరుషంబులై భయంకరమైన ధ్వనులతో శోణితబిందు మిశ్రంబుగా వర్షించు చున్నవి సంధ్య రక్తచందనసంకాశమై పరమదారుణంబుగా నున్నది ఆదిత్యుడు జ్వాలించెడు నిప్పులను వర్షించుచున్నాడు మృగ పక్షులు సూర్యనకెదురుగా నిలువంబడి దీనముగా నఱచుచు మహాభయంబును సూచించుచున్నవి రేరాజు కాంతిహీనుడై సంతాపమును గలిగించుచున్నాడు నిర్మలంబగు సూర్యమండలము నడుమ నల్లనికళంకము గోచరించుచున్నది! నక్షత్రములు మలినమై కాంతిహీనములై భువనంబులకు బ్రళయము గలుగునట్లు సూచించుచున్నవి

వాయసంబులును, శ్యేనంబులును, గృధ్రములును మొదలగు బలముగల పక్షులన్నియు దుర్బల పక్షులచే నేలగూలుచున్నవి గోమాయువులు భయంకరములగు నమంగళధ్వనులను గావించు చున్నవి రణరంగమంతటను రక్తమాంసములచే నిండిపోగలదు మనమిక జాగుసేయంజనదు ఈ క్షణమందే ప్లవంగవాహినులను గూడి రావణుని లంకాపురంబునకు బోవుదమని రాముడు లక్ష్మణునితో జెప్పి యుద్ధప్రియుడై, ధనుర్ధరుడై లంకాభిముఖుడై వానరవాహినులకు ముందుగా నడచిపోయెను విభీషణ సుగ్రీవులును వానరోత్తము లందఱును శత్రువులను వధించుటకు నిశ్చిత హృదయులై

సింహనాదములొనరించుచు బయలుదేరిపోయిరి వానరుల యుద్ధోత్సాహమును రాముడు దిలకించి ఆనందతరంగడోల లందేలియాడెను

## సైన్యంబునంతయు వ్యూహముగా దీర్చుటకై రాముడు వానరులకాజ్ఞాపించుట

రామాధిష్ఠితంబైన వానరవీరసేన శరత్పూర్ణిమవోలె తళతళలాడు చుండెను వానరవాహినిచే బీడింపబడి వసుధాతలంబు గడగడ వడంకినది సేనానివేశంబైన పిమ్మట లంకలోనుండి వనచరులకు భేరీమృదంగ నినాదములును, సైనికుల యాక్రోశంబును వినబడినవి లంకయందలి ధ్వనులనాలకించి వానరశ్రేష్ఠులందఱు సంతుష్టులై ద్విగుణీకృతంబుగా సింహనాదములు గావించిరి మేఘనిర్ఘోషంబుల మాడ్కి వినబడుచున్న వానరవీరుల సింహనాదములను రాక్షసులు మదోన్మత్తులై యాలకించిరి నానావిధములగు ధ్వజపతాకలచే నొప్పారెడు లంకాపురంబును రాముడు దిలకించి సీతను దనమనంబునందలపోసి మృగశాబాక్షియగు నాప్రాణప్రియురాలు దుష్టగ్రహంబగునంగారకునిచే రోహిణియుంబోలె రాక్షసాధమునిచే నిరోధింపబడుచున్నదని నయనాశ్రువులనురాల్చి యుద్ధ యాత్రాసందర్భమున దుఃఖించుట తగదనివేడి నిట్టూర్పులను బుచ్చి లక్ష్మణునితో నిట్టులనియె సోదరా! త్రికూట పర్వతమునందు విశ్వకర్మ నిర్మితంబగు లంకాపట్టణమెంత రమ్యముగానున్నదో చూడుము ధవళజీమూతములతో గూడిన యాకసంబుపగిదిలంకాపురంబు పెక్కువిమానములచేతనావృతమై విరాజిల్లుచున్నది మధురగాన మొనరించెడు వివిధ విహంగములతోడను, ఫలపుష్పసంపూర్ణమగు సుందరోద్యానవనములతోడను ఫలరసాస్వాదనంబుచే మదించిన పతంగముల తోడను, మకరందమును గ్రోలి మత్తిల్లిన మధుపంబుల తోడను పల్లవంబులను భక్షించెడు పికకుమారికలతోడను, వనంబులెంత రమణీయముగా నున్నవో చూడుమని రాముడు లక్ష్మణునితో జెప్పి నీతిశాస్త్ర పద్ధతిపై సైన్యంబునంతయు వ్యూహముగా దీర్చుడని వనచరులకివ్విధంబున నాజ్ఞాపించెను

శత్రువులకు దుర్జయుడవగు అంగదా! నీవు నీలునితో గూడి సైన్యమును దీసికొని వానరసేన వక్షస్థలంబున జాగరూకుండవై మెలంగుచుండుము వానరోత్తముడగు ఋషభుడా! నీవు సేనాసముదయముతో గూడి వానరసేనకు దక్షిణ పార్శ్వంబున మెలకువతోగాచియుండుము మత్తగజేంద్రుని బోలిన గంధమాదనా! నీవు సేనాసమూహముతోగూడి వానరసేనా సవ్యపార్శ్వంబున జాగ్రత్తగా గాచియుండుము నేను లక్ష్మణసహితుండనై శిరస్సుననుండెదను జాంబవంతా! సుషేణా! వేగదర్శీ! మీరు మువ్వురును వానరసేనా కుక్షిస్థానమును రక్షింపుచుండుడు సుగ్రీవా! వరుణుడు పశ్చిమదిశను రక్షించునట్లు వానరసేనాపుచ్ఛభాగంబును భద్రముగా రక్షించుచుండ మనిన తోడనే రామాజ్ఞకమితానందమొందిన వానరులు పర్వత శిఖరంబుల చేతగాని, పిడికిళ్ల చేతగాని, లంకాపురంబు నెప్పుడు చూర్ణము గావింతుమో! యని మనంబుల నిశ్చయించుకొనిరి అప్పుడు రాముడు సుగ్రీవుని జూచి వానరరాజా! మన సైన్యంబునంతయు వ్యూహాకారమున దీర్చియుంచితిమి గదా! ఇంక నీ శుకుని విడిపింపుమనెను సుగ్రీవుడు రామచంద్రుని యాజ్ఞమేరకు రావణుని దూతయగు శుకుని విడిపించెను ఆ శుకుండు నిమిషమైనను నిలువనోపక రావణునొద్దకు బ్రతుకు జీవుడాయని పరుగిడిపోయెను

## శుకుడు తనకు గలిగిన పరాభవమును రావణునితో జెప్పుట

అప్పుడా రాక్షసాధీశుడు శుకుని జూచి చిఱునవ్వు నవ్వుచు శుకుడా! నీ నెఱకలు ఛేదింపబడినట్లున్నవే! చపలాత్ములగు వనచరులచేత బట్టువడలేదు గదా! నీవృత్తాంతమేమో యెఱిగింపుమనెను అప్పుడు శుకుడు భయంబుచే దొట్రుపడుచు రావణుని జూచి యిట్లు చెప్ప దొడంగెను రాక్షసేశ్వరా! నేను సముద్రోత్తర తీరంబునకేగి సుగ్రీవుని జూచి మృదుమధురవచనంబుల ననునయింపుచు నీవు జెప్పిన విషయమంతయు బూసగ్రుచ్చిన చందంబున నెఱిగించితిని అగచరులు నా వాక్యములాలకించి పరమ కుపితులై అకాశంబున కుద్గమించి నన్ను బట్టుకొని నేలబడద్రోసి ముష్టిఘాతంబులచే గడతేర్చుటకు సంసిద్ధులైరి

రావణరాజా! ఏమని చెప్పుకొందును అతిక్రూరులగు వానరులనడుమ నాదీనావస్థను గుర్తించు వారలే కఱవైరి దిక్కులేని వాడనై శిధిలమైన ఱెక్కలతో నీదరిజేరుకొంటిని

విరాధకబంధులను ఖరదూషణాదులను బరిమార్చిన బలశాలి యగు రాముడు, సుగ్రీవ సహితుడై లంకాద్వీపంబునకు వచ్చి ద్వారంబు జేరుకొన్నాడు పర్వతాకారులగు ఋక్షవానరసేనలు వేనవేలుగా మహీమండలమంతయు నావరించియున్నవి వానరులు లంకా ప్రాకారంబులపైకి రాకమునపే సీతను రామునకొసంగుము లేదా యుద్ధమునకు సంసిద్ధుడవుగమ్ము అలస్యము గూడదనియెడు శుకుని జూచి రావణుడిట్లనియె శుకుడా! దేవదానవ గంధర్వులెత్తివచ్చినను, సమస్తలోకములు భయపెట్టినను, సీతను రామునకొసంగను నేనొక్కడనే రాక్షస సేనాపరివృతుండనై యుదయించుచున్న భాస్కరుడు చంద్ర నక్షత్రాదుల కాంతిని బారదోలునట్లు రాముని వానరసేనలను రూపుమాపెదను నాబాహుబలంబును రాముడెఱుంగడు నా బాణంబుల చవిసెన్నడెఱుంగక నాపై యుద్ధము చేయగోరుచున్నాడు సహస్రాక్షుడు, వరుణుడు, యముడు, నాముందు నిల్చి సంగరమొనరింపజాలరు రాముడెంత? వానరులెంత? సమరమందు నా బాహుబలంబును రాముడెఱుంగకయే కయ్యంబునకు గాలు ద్రవ్వుచున్నాడు వాడు కాలుని మందిరంబునకేగగలడు నీవు దిగులొందవలదని శుకునితో రావణుడు జెప్పెను

## వానరుల సేనాపరిమాణమును రహస్యముగా దెలిసికొనిరమ్మని రావణుడు శుకసారణులతో జెప్పుట

దశరథసుతుండగు రాముడు వానరసేనాసమేతుడై సముద్రమును దాటివచ్చుట నాలకించి రావణుడు తన మంత్రులగు శుకసారణులతో నిట్టులనియె మంత్రులారా! ఇంతకుముందెప్పుడును కనివిని యెఱుంగని సేతువును నిర్మించి రాముడగచరసేనలతో గూడి సముద్రమును దాటి వచ్చినాడని వినుచున్నాను ఆ మనుజాధముడు

సేతువును నిర్మించినాడనుట నాకేలకో సందేహముగా నున్నది నేను నమ్మజాలకున్నాను ఆ వానరసైన్య పరిమాణమెఱుంగవలయునని నాకు కాంక్ష బొడముచున్నది మీరిరువురును బోయి రహస్యంబుగా వానరసేనాపరిమాణమును మంత్రులను సేతు నిర్మాణమును మొదలగు మర్మములను గనుంగొని రండని యాజ్ఞాపించెను

శుకసారణులు వానర రూపంబులను దాల్చి సేనయందు ప్రవేశించిరే గాని లెక్కపెట్టజాలరైరి మహా భయంకరమైన సేనాసముదయంబును గాంచి మహాద్భుతమొందుచు విహరించు చుండిరి ప్రచ్ఛన్నులై విహరించుచున్న శుకసారణులను విభీషణుడు కనుంగొని పట్టి రామునకప్పగించెను ఆ శుకసారణులిరువురు శోకించుచు ప్రాణంబులపై నాశవదలుకొనిచేమోడ్పు గీలించి రాముని జూచి యిట్లు మొరబెట్టుకొనిరి రామా! మేము రావణుని దూతలము ఆతనిని యోగంబున మీ సైన్యమునంతయు బరిశీలింపవచ్చితిమి ఇచ్చట విభీషణునిచే బట్టువడితిమి మా రహస్యము బయట బడినదనియెడు శుకసారణులను రాముడు జూచి దయార్ద్ర హృదయుడై మోముపై మందహాసము జిగిరింప నిట్లు నుడివెను శుకసారణులారా! మా సైన్యమునంతయు జక్కగా బరిశీలింపుడు రావణుని యాజ్ఞమేరకు సేననంతయుగలయ దిరిగి తదుపరి స్వేచ్ఛగా మీలంకకు మీరు బోవచ్చును మీరు చూడగోరినచో విభీషణుడే మీకు మాసైన్యము నంతయు జూపగలడు మీరిపుడు ప్రాణభీతి జెందనక్కరలేదు ఆయుధములేని వారలను, దూతలను జంపగూడదు గదా! మీరు నిరాయుధులు కావున వధ్యులు కారు విభీషణా! వీరు శత్రుపక్షము నుండి వచ్చిన వారలైనను బ్రతిమాలుకొనుచున్నారు ఈ రాక్షసులను విడిచిపెట్టుమని యాజ్ఞనొసంగి శుకసారణులతో నిట్లనియె

శుకసారణులారా! మీరు లంకాపురంబునకేగి రావణునిజూచి నేనిపుడు మీతో జెప్పి పంపెడు మాటలన్నిటిని క్రమముగా జెప్పుడు రావణా! నీవే భుజబలంబునవలంబించి నాధర్మపత్నియగు సీత నపహరించితివో! యాబలంబుచేతనే సైన్యసమేతుడవై బంధువులతోగూడ బవరంబుననిలువుము దురాత్మా! రేపు ప్రాత కాలమందు లంకా

ప్రాకారంబులను బహిర్ద్వారములను, రాక్షస సైన్యములను నాబాణాగ్నిచే భస్మంబుగావించెదను జాగ్రత్తగానుండుమని మీరాజునకు దెల్పుడనిన రాముని పలుకులు శుకసారణులాలకించి ధర్మవత్సలుడగు దశరథసుతుని జయశబ్దంబులంబొగడి, లంకాపట్టణంబునకేగి రాక్షసేశ్వరుని జూచి యిట్లు చెప్పిరి

రాక్షసేంద్రా! మేము నీ యాజ్ఞ మేరకు వానర రూపంబులను దాల్చి విహరించు చుండగా విభీషణుడు మమ్ములను గుర్తించి, పట్టుకొని రాముని సన్నిధికి గొనిపోయెను దయార్ద్ర హృదయుడును, ధర్మవత్సలుడునగు రాముడు మమ్ములను విడిచి పెట్టెను శ్రీమంతులగు రామలక్ష్మణులు, విభీషణుడు సుగ్రీవుడు లోకపాలురవోలె వెలుగొందుచున్నారు అస్త్ర కోవిదులగు యీ పురుష శ్రేష్ఠులు నలువురే లంకాపట్టణంబును ప్రాకారతోరణంబులతోగూడ బెళ్లగించుకొని పోగలరు రాముడొక్కడే యైనను లంకాపురంబునంతయు భస్మము చెయగలడని తోచుచున్నది దశరథసుతులతోడను, సుగ్రీవుని తోడను రక్షింపబడుచున్న వానరసేనను యెదిరింప దేవాసురలకైనను నలవిగాకున్నది దశయోజనంబుల వెడల్పును, శతయోజనముల నిడుపునుగలసేతువు నీరాకరంబు నడుమ నిర్మిపబడినది వానరసేన సముద్రమును దాటివచ్చినది ఆ సేనల కంతమేగానరాదు వానరవీర శిఖామణులందఱు సమరంబుసేయంగోరి పరమోత్సాహులైయున్నారు రాజా! వారలతో వైరమెందుకు? కోపంబును వీడి సీతను రామునకొసంగుమని శుకసారణులు రావణునితో జెప్పిరి

## వానరుల బలంబును గూర్చి సారణుడు రావణునితో జెప్పుట

జంకుగొంకులేక నిర్భయముగా నుడివిన శుకసారణుల వాక్యములాలకించి రావణుడు సారణుని జూచి యిట్లనియె సారణుడా! దేవదానవగంధర్వాదులెదురొడ్డి నిల్చినను నాయెదురనిలువంజాలరు సమస్త లోకంబులునన్ను భయపెట్టినను సీతను రామునకొసంగను నీవు శూరుండవయ్యును వానరులచే దెబ్బలు తిని భయకంపితుడవై సీతను

రామునకిమ్మని నుడువుచున్నావు నన్ను భండనంబున భంగపరచెడు పరాక్రమవంతుడెవ్వడు? నేనిదే వానరసైన్యంబును బరించెదనని మిక్కిలి యవౌన్నత్యము గల ప్రాసాదంబుపైకెక్కి భూభాగమునంతయు నావరించియున్న లెక్కకు మిక్కుటమగు వానర సైన్యమును గాంచి సారణునితో నిట్లనియె

ఈ వానర ప్రముఖులలో వీరాధి వీరులెవ్వరు? బాహుబలాఢ్యులెవ్వరు? అమితోత్సాహముతోననిమొనంనిలువగల ధైర్యశాలురెవ్వరు? ఈ వానరోత్తములందు సుగ్రీవుడెవ్వరి మాటలను వినును? వీరిలో నగ్రసేనా నాయకులెవ్వరు? యథార్థముగా నాకెఱింగిపుమనిన సారణుడిట్లు జెప్ప నారంభించెను రాక్షసేంద్రా! వానరేంద్రుడగు సుగ్రీవుని సేన యగ్ర భాగంబుననున్న వానర్తోముడే నీలుడు ఇతడే వానరసేనాధ్యక్షుడు ఈ వానరనాథుని సింహనాదమే లంకాపట్టణమును బ్రాకారతోరణంబులతో గూడ గడగడ లాడించుచున్నది కరంబులనుబైకెత్తి క్రోధాగ్నిని రగులింప జేయుచు విజృంభించి దశదిశలంబ్రతిధ్వనులు పిక్కటిల్లినట్లుగా వాంగూలమును నేలకుగొట్టువాడే వాలిసుతుండగు అంగదుడు అమ్మహావీరుడు పర్వతాకారుడు యువరాజు వానర వీరుడు సంగరమందు తన భుజబలంబును బ్రకటింప నిశ్చయించుకొన్నాడు హనుమంతుడు లంకకు వచ్చుట కితడే మూలపురుషుడు వానరసేనా సముదాయంబును సమకూర్చుకొని దుర్జయుండై నీపైకి వచ్చుచున్నాడు ఆ యంగదునకు వెనుక భాగమందు మహాబల పరివృతుండైయున్నవాడు నలుడు ఆతడే సముద్రమునకు సేతువును నిర్మించినవాడు ఈ వానరవీరుని వెంబడించియున్న పదినూఱుకోట్ల యెనిమిది లక్షల వానరసైన్యము విజృంభించి జయింపనలవిగాకున్నది నలుడొక్కడే లంకాపట్టణమును మర్దింపగోరుచున్నాడు ముల్లోకములయందును యశమునార్జించుకొన్నాడు అదిగో చూడుము శ్వేతుడను వాడు సుగ్రీవుని చెంతకు వచ్చి వారనసేనల విభజించుచు ప్రోత్సాహమొసంగుచు సత్వరుండై చనుచున్నాడు గోమతీ తీరంబున సంకోచనంబను పర్వతంబునందు వానర రాజ్యమేలెడు కుముదుడను వానరోత్తముని జూడుము ఇతడు వేయి లక్షల వానరులతో గూడి వచ్చుచున్నాడు ఈ

కుముదుడమిత పరాక్రమశాలి దైన్యమావంతయూ లేనివాడు ముక్కోపి, భయంకరుడై కయ్యంబునకు గాలుద్రవ్వుచున్నాడు కపిల వర్ణుడును దీర్ఘనేత్రుడునగు రంభుని జూడుము నూటయొప్పది లక్షల వానరసైన్యముతో గూడి సుదర్శనంబను పర్వతంబున రాజ్యమేలు చుండును ఆ వానరోత్తముడు లంకాపురంబును దహించు వాని మాడ్కి నిశ్చల దృష్టితో నుఱ్ఱూతలూగుచున్నాడు అల్లదే! చూడుము అ నలుబది లక్షల వానరవీరులతో నొప్పారెడు వాడే శరభుడు రమణీయం బొలికెడు సాల్వేయ పర్వతంబున వానర రాజ్యంబేలుచుండును మహాసత్వ సంపన్నుడు యుద్ధమందు వెనుకంజవేయనివాడు సింహనాదంబు గావించుచు యుద్ధమునకు సంసిద్ధుడైయున్నాడు అత్యుత్సాహముతో వానరొత్తములనడుమ దేవనాధుని వోలె వెలుగొందు నాతడే పనసుడు వీరాధివీరుడు ఏబది లక్షల వానరోత్తములతో గూడి పారియాత్ర పర్వతంబున నివసించియుండును ఇక వినతుని జూడుము రెండవ సముద్రమోయన్నట్లు భయంకరమైన వానరసేనతో వెలుగొందుచున్నాడు ఇతడు పర్ణాసానదీజలంబులనుగ్రోలి దత్తీరంబున నరువది లక్షల సేనతో నివసించియుండును క్రోధనుడు, గవయుడను వారలు గూడ లంకను మర్దింప గోరుటకు సిద్ధమై యున్నారు హరుడను వీరుడు వేయికోట్ల సైన్యముతో గూడి నిన్ను జయింపనువ్విళ్లూరుచున్నాడు ధూమ్రుడనువాడు భల్లూకనాధుడు నర్మదానదీజలంబులను గ్రోలుచు ఋక్షవంతంబను పర్వతంబున నుండును

అల్లదిగో! జాంబవంతుడను వానిని జూడుము ఆతడు మిగుల సత్వసంపన్నుడు గురుశుశ్రూషాపరాయణుడు మునుపు దేవాసురుల యుద్ధమందు దేవేంద్రునకు దోడ్పడి పెక్కువరంబులను బడసియున్నాడు ఈ జాంబవంతుని సైనికులు పిశాచంబులుంబోలిన తీక్రూర స్వభావులై పర్వత శిఖరంబులనారోహించి మహాశిలలను బడద్రోయుచున్నారు వీరెవ్వరును మృత్యువునకు భయపడరు దంభుడు, సన్నాదనుడును వారలనుజూడుము దంభుడు సురేంద్రునకు సమరమందు గొప్పసహాయ మొనరించియున్నాడు సన్నాదనుడు వనచరులకు పితామహుడు చతుష్షాజ్జంతువులలో నితనికన్నను బెద్దజంతువు మఱొండులేదు

పూర్వమీతండు దేవేంద్రునితో సమరంబు గావించి యున్నాడు పరాజయ మెఱుంగనివాడు అమరేంద్రునకు సమానుడు గంధర్వకన్యయందు అగ్నిదేవునకు జన్మించినవాడు దేవాసురులకు యుద్ధము జరిగినప్పుడు దేవతలకు సహాయార్థమై యితనిని బుట్టించినారు రావణా! ఆ వానరుడు క్రోధనుడనువాడు ఇతడు వేయికోట్ల వానరవీరులకధిపతి ఆత్మస్తుతి నెఱుంగడు మహాబలాఢ్యుడు శూరుడు లంకాపురంబును మర్దింప గోరుచున్నాడు

ఇదిగో! చూడుము ఈవానరోత్తముడు కేసరి, ఇతడే హనుమంతుని తండ్రి గంగానదీసమీపంబున సుశీరబీజంబను పర్వతంబున విహరించు చుండును ఇతడు సేనాధ్యక్షుడు, వేయి లక్షల వానరులకధిపతి ఆ సేనామధ్యమందున్న వానర వీరుడు ప్రమాథియనువాడు ఆతడు గవాక్షుడు వీరిని బరివేష్టించి వానరసేనలు లంకాపురంబును మర్దించుటకై వచ్చుచున్నవి వానరవీరశిఖామణియగు కేసరి మేరుపర్వతంబుపై నివసించుచుండును కపిల ముఖులును, ధవళముఖులును ఎఱ్ఱని ముఖములు గలవారలును పింగళవర్ణములొలికెడు మోములు గలవారలును, కఱకు గోఱలు గలవారలును, నఖంబులే యాయుధములుగ గలవారలును సింహశార్దూలములను బోలిన వారలును, మహాభుజంగములవంటి వారలును, సుదీర్ఘాంచిత వాంగూలములుగలవారలును, మత్తమాతంగములను బోలిన వారలును, పర్వతాకారులును, మహాజీమూత నిస్వనంబుపోలె సింహనాదము లొనరించు వారలును, వృత్తాకారముతో బింగళ వర్ణములొలికెడు నేత్రంబులు గలవారలును, భయంకరాకారులునగు వానరులెందఱో పర్వతమందు నివసించి యుందురు వీరందఱు లంకాపురంబును ముట్టడించుటకై సిద్ధముగానున్నారు శతబలియను వానరోత్తముడు జయంబుగోరి సూర్యోపాసనగావించుచున్నాడు చూడుము గజుడు, గవాక్షుడు, గవయుడు, నలుడు, నీలుడును వారొక్కక్కరే పదికోట్ల సైన్యముతో గూడియున్నారు వానరులందఱు మహా ప్రభావులు, క్షణమాత్రంబున భూమండలమందునున్న పర్వతంబులను బట్టి చూర్ణము గావించి తూర్పార బెట్టగలరని సారణుడు రావణునితో జెప్పెను

## వానరవీరుల బలంబును శుకుడు రావణునితో జెప్పుట

సారణుడు సాకల్యంబుగా నెఱిగింపకుండుటనుజూచి శకుండు రావణునితో యిట్లనియె రాక్షసేశ్వరా! వానరులు దుర్జయులు, మదపుటేనుగులంబోలిన వారు దైత్యదానవులకిసుమంతేనియు దీసిపోరు సంగరంబున దేవతలను బోలిన శౌర్యమ్ముగలవారు ఎటుబరికించినను వానరసేనలనంతముగా నున్నవి ఈ వానరోత్తములెల్లరు సుగ్రీవుని సచివులు దేవగంధర్వులకు జన్మించినవారు నిరంతరము కిష్కింధాపురంబున నివసించియుందురు కామరూపులు ఆ సుందరులగు మైందద్వివిదులు యుద్ధకోవిదులు వీరిరువురును విరించి యనుమతి వడసి యమృతంబును గ్రోలియున్నారు లంకాపురంబును మర్దించుటకు సిద్ధమైయున్నారు ఆ మైందద్వివిదుల పార్శ్వభాగమున నున్నవారలే సుముఖుడు దుర్ముఖుడను వారలు వీరు పర్వతాకారులు మృత్యువున కువమానులు పదికోట్లసైన్యముతో గూడి [1]లంకాపట్టణంబుపై వచ్చుచున్నారు అదిగో! చూడుము అమత్తకరేంద్రమువోలె నున్నవాడే హనుమంతుడు లంకకు వచ్చి సీతనుజూచి నీతో మాట్లాడిపోయిన వాడితడే నీకితనిని గూర్చి చెప్పనక్కరలేదు కేసరికి క్షేత్రజపుత్రుడు సమీరునకు జన్మించినవాడు మహాప్రభావ సంపన్నుడు కామరూపి, పర్వతాకారుడు సర్వవ్యాపకుడగు సమీరుని వోలెనని వార్యంబగు గమనముగలవాడు బాల్యంబున నొకనాడాకలిగొని ప్రాగ్దిశనుద యించుచున్న బాలభాస్కరుని బట్టి మ్రింగదలంచి పెక్కువేల యోజనంబులెగిరి పోయి సూర్యుని సమీపంబునకుబోవంజాలక దయాద్రిపైబడెను అవ్విధంబునను దయాచలంబున శిలాతలంబు పైబడిన తోడనే యాతని చెక్కిలి భాగము బిన్నమైపోయినది అందువలన హనుమంతుడను నామధేయమాతనికి సార్థకమైనది ఒక్క విశ్వాసపాత్రుడైన వానరుని వలన నాకీతని జన్మవృత్తాంతము దెలిసినది ఈ వాయుసుతుని ప్రభావము వర్ణనాతీతము ఏకాంతముగా దానొక్కడేవచ్చి లంకాపురంబును నేలమట్టము గావింప నువ్విళ్లూరు చున్నాడు రాక్షసరాజా! హనుమంతుని చేరువనో నివసించుచున్నవాడే

రాముడు మహాశూరాగ్రేసరుడు శ్యామలవర్ణుడు పుండరీకనయనుడు దివ్యపురుషుడు ఇక్ష్వాకుకులోద్భవుడు పురుషోత్తముడు సీతాపతి ధర్మమీతని వదలదు ఇమ్మహాపురుషుడు ధర్మమును విడువడు వేదవేదాంగములెఱింగిన పురుష శ్రేష్ఠుడు బ్రహ్మాస్త్రమేగాక సమస్తాస్త్ర మర్మంబు లెఱింగిన మతిమంతుడు ఆకసంబునైనను, పర్వతంబులనైను బాణప్రయోగంబుచేత బ్రద్దలు చేయగలడు ఆ రాముడే నీతో రణంబు గావించుటకై వచ్చుచున్నాడు ఆతని దక్షిణ పార్శ్వంబున నిగనిగ సువర్ణకాంతులీనెడు దేహముగల వాడును, విశాలవక్షుడునగు రాజపుత్రుడే లక్ష్మణుడు రామునకత్యంత ప్రియంబును జేకూర్చెడు ప్రాణప్రియుడు అనుంగుసోదరుడు నీతిశాస్త్రకోవిదుడు సమస్తశాస్త్రము లందాఱితేరిన దిట్ట కోపస్వభావుడు దుర్జయుడు జయశీలుడు రాముని కుడిభుజమును బోలినవాడు అగ్రజుని కొఱకు దనప్రాణంబులనైనను నొడ్డి సమస్త రాక్షసుల దునుమాడనున్నాడు నలువురు రాక్షసులతో గూడి రాముని సవ్యపార్శ్వంబున నున్నవాడే నీ సహోదరుండగు విభీషణుడు మానవేంద్రుడప్పుడే విభీషణుని లంకా రాజ్యమునకు రాజుగా నభిషేకించినాడు సీతమ్మెడు రాజ్యకాంక్షతో నతిసంరంభమున నీపైకి వచ్చుచున్నాడు రామవిభీషణుల నడుమనున్నవాడే కీశాధీశుండగు సుగ్రీవుడు ఈ వానరోత్తముడు కిష్కింధలో నివసించుచుండును నూఱు కమలములుగల కాంచన మాలిక వానరేంద్రుని వక్షస్థలంబున వెలుగొందుచున్నది చక్కగా చూడుము ఈ మాలికదేవతలకు గూడ దుర్లభమైనది దీనిని ధరించిన వాడెన్నడును భండనంబున పరాజయము నొందడు రాముడు రణరంగమందు వాలిని వధించి వానరాధీశునకీ కాంచనమాలను, తారను, శాశ్వతంబగు రాజ్యలక్ష్మిని యొసంగెను నూఱులక్షలొకకోటి నూఱువేలకోట్లు శంఖమనబడును నూఱువేల శంఖములు మహాశంఖమగును నూఱువేల మహాశంఖములు బృందమన బడును నూఱువేల బృందములు మహాబృందమనబడును నూఱువేల మహాబృందములు పద్మమనబడును నూఱువేల పద్మములు మహాపద్మమనబడును నూఱువేలమహాపద్మంబులు ఖర్వంబనబడును నూఱువేలఖర్వంబులు మహాఖర్వంబనబడును నూఱువేల

మహాఖర్వంబులు సముద్రమనబడును నూఱువేల సముద్రములు ఓఘమని చెప్పబడును నూఱువేల యోఘములు మహౌఘమనబడును వేయికోట్లు, నూఱు శంఖంబులు, వేయిమహాశంఖంబులు, నూఱు బృందంబులు, వేయిమహాబృందంబులు, నూఱుపద్మంబులు, వేయి మహాపద్మంబులు, నూఱుఖర్వంబులు నూఱు సముద్రములు, మహౌఘంబులు, కోటి మహౌఘంబులకు సాటి వచ్చు సముద్రంబు కరణినున్న వానరసేనతో సుగ్రీవుడు విభీషణునితో గూడ యుద్ధంబునకు వచ్చుచున్నాడు మహారాజా! క్రూరగ్రహంబు మాడ్కి వెలుగొందుచు మనపైకి వచ్చుచున్న వానరసేనలబారినుండి తప్పించుకొను ప్రయత్నము గావింపుడు ఇది నాకు దోచిన విషయమని శుకుడు రావణునితో జెప్పెను

## రావణుడు కోపోద్రేకుడై శుకసారణులను వెడలగొట్టుట

శుకుడు జెప్పినదంతయు రావణుడాలకించి రామలక్ష్మణులను విభీషణ సుగ్రీవులను, వానరయూథంబును గాంచి మనంబున భయంబుజెంది మహోగ్రుడై శుకసారణులిరువురిని గాంచి పరుషోక్తులచే నిట్లు దద్ధరిల్లంజేసెను శుకసారణులారా! నిగ్రహానుగ్రహంబులు గావించుటకు సమర్థుడగు ప్రభుని చెంత జీవించుచున్న మంత్రులీ విధంబున నప్రియవార్తలెఱిగింప జెల్లునా? యుద్ధారంభసమయంబున మనపైకి వచ్చుచున్న ప్రతికూలురగు రిపులను మీరిట్లు స్తోత్రము సేయుట యుక్తమా? మీరిరువురును రాజనీతిలోసారభూతమైన భృత్యకార్యము దెలియకున్నారు మీరుగురు వృద్ధులను సేవించినదంతయు వ్యర్థము నీతిశాస్త్రము నభ్యసించితిరేగాని దానియర్థమెఱుంగజాలరైతిరి మిమ్ము బోలిన మూర్ఖశిఖామణులగు మంత్రులతో గూడియున్న నేనెప్పుడో శత్రువులచే జిక్కి హతుడై యుండవలసిన వాడను దైవయోగంబుననెట్లో జీవించియున్నాను ఆహా! నా యెదుటనే యెట్టి పరుషోక్తులాడితిరి అరణ్యమందు దావానలంబు భారికింబడిన మహీరుహంబులైనను జీవించి యుండును రాజుకోపాగ్నికి గురియైన యపరాధులెంత మాత్రము జీవింపజాలరు

మంత్రులారా! మున్ను మీరు నాకొనరించిన యుపకారమును మఱవంజాలక శత్రు పక్షంబును ప్రశంసించిన పాపాత్ములయ్యును మిమ్ములను వధింపజాలకున్నాను పదవీచ్యుతులను గావించెదను అదియే చాలు ఇక నాచెంతనుండకుడు కృతఘ్నులను, మిత్రవంచకులను విడిచి పెట్టుటయే వధించినట్లగును వెడలిపొండనియెడు రావణుని మాటలు శుకసారణులాలకించి లజ్జనొంది రాజును జయజయ శబ్దములంబొగడి వెడలిపోయిరి

## వానరసేనలోని మర్మమెఱింగి రమ్మని రావణుడు వేగులవారిని బంపుట

ఆ సమయంబున రావణుడు చెంతనున్న మహోదరుని జూచి రాజనీతి కోవిదులగు చారులను దీసికొని రమ్మనెను రాజాజ్ఞమేరకు వేగులవాండ్రను మహోదరుడు రావించెను ఆ గూఢాచారులు త్వరితముగ వచ్చి నమస్కరించి మహారాజునకు జయము జయమని యాశీర్వదించి నిల్చియుండిరి విశ్వసనీయులును, రాజభక్తి పరాయణులునగు చారులంజూచి యిట్లనియె

మీరిచట నుండి రాముని చెంతకేగి యతని వ్యవసాయంబును, అంతరంగభూతులను ప్రియులగుమంత్రులను బరీక్షించి రండు దశరధసుతుడెట్లు నిదురించును? ఎట్లు మేలుకొనును? అతడే యే కర్తవ్యములను జేయదలంచియున్నాడు ఈ విషయముల నన్నిటిని సమర్థులై సంపూర్ణముగా దెలిసికొని రండు ధీశాలురగు రాజులు చారుని వలన శత్రువు లెఱింగనంతయు దెలిసికొన్నచో యుద్ధమందు సులభముగ విజయలక్ష్మిని బొందగలరు పోయిరండనియెడు రావణుని పలుకులను చారులు విని సమ్మతించి సంతుష్టులై శార్దూలుని బురస్కరించుకొని రాజేంద్రునకు ప్రదక్షిణ మొనరించి వెంటనే మాఱురూపములను దాల్చి సువేలపర్వత సమీపమందు సుగ్రీవ విభీషణ సహితులైయున్న రామలక్ష్మణులను, వానరసేనా సముదాయంబును గాంచి మిగుల భయంబునొంది విహరింపదొడంగిరి అట్లా సేనయందు విహరించుచున్న

చారులను విభీషణుడాకస్మికముగా బట్టుకొనెను అట్లు పట్టుబడిన వారిలో శార్దూలుడు మిక్కిలి దుష్టుడని తెలుపుచు వానరులకప్పగించెను వానరులు శార్దూలుని గడతేర్పబూనిరి రాముడదిజూచి దయార్ద్రహృదయుడై శార్దూలునితోబాటు యితర చారులను గూడ విడిపించెను అట్లు రామునిచే విడిపింపబడిన చారులు వానరులచే దెబ్బలు దిన్నవారలై గాడ నిట్టూర్పులను బుచ్చుచు విమనస్కులై మరలనెట్టులో లంకాపురంబును జేరుకొని రావణుని సమీపించి రాక్షసేంద్రా! రాముడు సువేలాద్రి సమీపంబున లెక్కకు మీరిన వానరసేనతో విడిసియున్నాడని తెలియ బలికిరి ఆ చారుల వాక్యములాలకించి రావణుడు లోలోన భీతిల్లి శార్దూలునితో నిట్టులనియె శార్దూలుడా! నీ మోమేలకో కళావిహీనమై యున్నది మిక్కిలి దీనుడవైయున్నావు మనశత్రువులు క్రోధమానసులై నిన్నేమియు జేయలేదు గదా! అనిన రావణుని పలుకులాలకించి శార్దూలుడిట్టులనియె

## వానరసేనలో దనకు గలిగిన పరాభవమును శార్దూలుడు రావణునకు దెల్పుట

రాక్షసోత్తమా! వానరోత్తములు వేగుల వారికి సాధ్యులుగారు రామరక్షితులగుటంజేసి వారితో సంభాషించుటకుగాని పరీక్షించుటకు గాని సాధ్యముగాదు ఎటు బరికించినను పర్వతాకారులగు వనచరులు మార్గములందు కావలి గాచియున్నారు నేను మాఱురూపంబును దాల్చి సేనలో బ్రవేశించితిని అంతలోనే విభీషణుడు నన్ను గుర్తించి పట్టుకొనెను అతని మంత్రులు నన్ను బట్టి బలాత్కారంబున బహువిధములుగా నేల బడవైచి అటునిటు బొరలించిరి వానరులమిత క్రోధమానసులై నన్ను పిడికిళ్ళతో బొడిచియు, నఱచేతులంజఱచియు బీడించుటయేగాక సైన్యమంతటను ద్రిప్పివిడిచిరి రక్తసిక్తమైన దేహముతో మూర్ఛిల్లితిని ఇంద్రియములు స్వాధీనములో లేకుండెను ఆ సమయంబున వానరులు నన్ను వధించుటకుద్యుక్తులైరి ప్రాణభీతిచేత శరణంబు వేడుచు కరంబులను ముకుళించుకొని యుంటిని అప్పుడు వనచరులు నన్ను రాముని సన్నిధికి గొనిపోయిరి అమ్మహాత్ముడు దయతో రక్షించెను అదృష్టవశంబున జీవించి మరల మీ సన్నిధికి వచ్చితిని

ఇదిగో! చూడుము రాముడు మహార్ణవమునకు సేతువును గట్టి సువేలాద్రియందు సాయుధుడై సమరంబు జేయ సంసిద్ధుడైయున్నాడు త్వరితముగ లంకాద్వారంబు జేరంగలడు గరుడవ్యూహమును బన్నినాడు సేనాసమేతుడై లంకాప్రాకారంబు నావరింపక మునుపే రామునకు సీతాదేవి నిచ్చివేయుము లేదా యుద్ధమునకైనను సిద్ధపడుము ఇది నా యభిమతమని శార్దూలుడు రావణునితో జెప్పెను రాక్షసేంద్రుడామాటలు విని దేవగంధర్వులెత్తి వచ్చినను సీతను రామున కొసంగను నీవు కపిసైన్యమునంతయు జూచితివిగదా! అందులో శూరాగ్రేసరులగు వానరులెవ్వరు? వారిప్రభావమెట్టిది? వారెవ్వరి పుత్ర పౌత్రులగుదురో? విశదముగ జెప్పుము ఆ వనచరుల బలాబలంబు లెఱింగి కర్తవ్యమునకు గడంగెదను కదనంబు గావించువారలు శత్రుబలంబు లెఱుంగవలయుననిన యుత్తమ చారుడగు శార్దూలు డిట్లనియె

## వానర ప్రముఖులను గురించి శార్దూలుడు రావణున కెఱిగించుట

ఆ వానరాధీశుండగు సుగ్రీవుడు ఋక్షరజుని కుమారుడు బవరంబున దుర్జయుడు, జాంబవంతుడనువాడు గద్గదునకనుంగు సుతుండు, ఇతని సహోదరుడు ధూమ్రుడనువాడు ఒక్కడే కదనరంగ మందు లక్షలాది రాక్షసులను దునుమాడిన హనుమంతుడను వానిని మీరెఱుగుదురు గదా! ఆ వానరోత్తముని తండ్రి కేసరి బృహస్పతి కుమారుడు రాక్షసాధీశ్వరా! సుషేణుడనువాడు మహాపరాక్రమశాలి ధర్మాత్ముడు వరుణుని పుత్రుడు సౌమ్యస్వభావముగల దధిముఖుడను వాడు చంద్రుని తనయుడు సుముఖుడు, దుర్ముఖుడు వేగదర్శియను వారలను సురజ్యేష్ఠుడే మృత్యువును వానరులుగా సృజియించినాడేమో! నీలుడనియెడు వానరసేనా నాయకుడు అగ్నిహోత్రుని కుమారుడు హనుమంతుడు వాయుదేవుని బీజంబునకు బుట్టినవాడు అంగదుడు వాలిసుతుండు దేవేంద్రుని మనుమడు బాహుబలాఢ్యులగు మైంద

ద్వివిదులు అశ్వినీ దేవతల కనుంగుబిడ్డలు గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడను వారలైదుగురును ప్రళయకాలాంతకునకు సాటియైన మేటివెుునగాండ్రు యముని కొడుకులు ఇట్టి దేవతలకు బుట్టిన వానరవీరులు పదికోటులున్నారు అందఱి నామంబు లెఱిగించుటకు నాచేతగాకున్నది

ఖరుని, దూషణుని త్రిశిరుని, విరాదుని, కబంధుని వధించిన దశరథసుతుని బలపరాక్రమములకు సాటి వచ్చువాడీ భూలోకమందెవ్వడును లేడు రాముని గుణంబులు వర్ణనాతీతము సుందర విగ్రహుడు, యౌవ్వనము తొణికిసలాడువాడు ఇతని తమ్ముడగు లక్ష్మణుడన్నసోమత్తకరీంద్రమును బోలినవాడు ఇమ్మహావీరుని బాణంబుసోకినచో సురేంద్రుడైనను జీవింపనేరడు శ్వేతుడు జ్యోతిర్ముఖుడను వారలు సూర్యపుత్రులు హేమకూటుడనువాడు వరుణునిపుత్రుడు నలుడు విశ్వకర్మకుద్భవించినవాడు మహాపరాక్రమశాలి బలవంతుడగు దుర్ధరుడు వసుపుత్రుడు, నీతమ్ముడగు విభీషణుడు రామునివలన ఈ లంకారాజ్యాధిపత్యంబు నొందియున్నాడు సువేల పర్వత ప్రాంతములందు విడిసియున్న వానర సైన్యంబు తెఱంగంతయు నీకెఱుంగ దెల్పితిని ఇంకజేయవలసిన కర్తవ్యమెద్దియో నాలోచింపుడని శార్దూలుడు రావణునకు జెప్పెను రాముడనంత సేనాసమేతుడై సువేల శైలప్రాంతమందు విడిసి యున్నాడని చారులు లంకాధీశ్వరున కెఱిగించిరి రాముని బలశౌర్యాదులను రావణుడెఱింగి భయమంది మనమాలోచింపవలసిన సమయమాసన్నమైనది మంత్రులందఱొకచోట జేరవలయునని యాజ్ఞాపించెను రాజాజ్ఞ మేరకు మంత్రులందరు త్వరితముగ వచ్చిరి రావణుడు మంత్రులతో జేయవలసిన కర్తవ్యమును జక్కగా నాలోచించి తన గృహంబునకరిగెను

## మాయచే రాముని శిరంబును గల్పించి రావణుడు సీతకు జూపుట

అటు పిమ్మట మాయలలోబండితుడగు విద్యుజ్జిహ్వుడను రాక్షసుని రావించి తనవెంట నిడుకొని సీతాదేవియున్న వనంబునకుబోయి

విద్యుజ్జిహ్వుడా! మనమిపుడు మాయజేసి సీతను మోసగింతము నీవు నీ మాయాబలంబు చేత రాముని శిరంబును గల్పించి, బాణసహితంబగు మహాధనుస్సుతో బాటు దానిని దీసికొని రమ్ము త్వరపడుమని రావణుడు చెప్పెను విద్యుజ్జిహ్వుడందులకియ్యకొనెను రాక్షసేంద్రుడు సంతుష్టుడై యమూల్యాభరణము నొకదానిని వాని కొసంగెను వెంటనే యశోక వనంబునకేగి రామధ్యాన నిమగ్నయై రాక్షసాంగనలచే రక్షింపబడుచున్న సీతను సమీపించి యిట్లనియె

మంగళస్వరూపిణివగు సీతా! నేనెంత బ్రతిమాలినను నన్ను దరిజేర్పక నీవెవ్వని యందు మక్కువగలిగి యుంటివో వాడు నేడులేడు ఖరుని సంహరించిన నీ భర్తకదనరంగమందు హతుండాయెను నేటితో నీ గర్వమంతయు నశించినది ఇంకనేను నిన్ను బ్రార్థింపవలసిన పనిలేదు ఎన్నాళ్లు దుఃఖింపగలవు? ఎట్టకేలకు నాకు భార్యవు కాగలవనుటలో సందేహములేదు మూఢాత్మురాలా! నీ బుద్ధిని విడువుము గతించిన రామునితో నీకేమి పనియున్నది నా ధర్మపత్నులందఱికిని నీవే పరమేశ్వరివై యుండగలవు అల్పపుణ్యమే నీకున్నది బుద్ధిహీనురాలవు గర్వమును బోవిడిచి మెలంగుము వృత్రాసురుడు చచ్చినట్లు నీభర్త రాముడు నేలగూలెను రిత్తకోర్కెలేల? నన్ను వధించుటకై వానరసేనతో సముద్రోత్తర తీరంబున నీ ప్రాణేశుడు విడిసియుండెను పాపమావానరసేన దారినడచి బడలికను జెంది సుఖనిద్రలో మునిగియుండెను చారులవలన మర్మములెఱిగి ప్రహస్తుని రాక్షససైన్యముతో బంపితిని ప్రహస్తుడు వానరసేనను రూపుమాపి జాగుసేయక నిదురించుచున్న రాముని శిరంబును మహాకరవాలముతో నఱికెను అది జూచి విభీషణుడు భయపడి యాకాశంబునకుద్గమింప రాక్షసులు బట్టుకొనిరి లక్ష్మణుడు వానర ప్రముఖులు దిక్కులకు బారిపోయిరి సుగ్రీవుడు కంఠము విఱిగి నేల బడియున్నాడు హనుమంతుడు రాక్షసులచే హతుడై పడియున్నాడు జాంబవంతుడు సంహరింపబడెను మైందద్వివిదులు ఖండింపబడి నేల కొఱిగి రోదనమొనరించుచు బ్రాణములను గోల్పోయిరి పనసుతుడు పనసపండువోలె ఛిత్రవధగావింపబడి భూమిపై బడియున్నాడు దధీముఖుడు, కుముదుడు, బాణఘాతంబులచే విగత ప్రాణులై

నిశబ్దముగా బడియున్నారు అంగదుడు రాక్షసులచే వధింపబడి రక్తసిక్తమైనదేహముతో భూమిపై బడినాడు నిదురలో మైమఱచియున్న వానరులుకొందఱు హయంబుల చేతను, గజంబులచేతను త్రొక్కబడి మృత్యుదేవతకాహుతియైరి కొందఱు పరుగెత్తుచుండగా రాక్షసులు వెన్నంటి తఱిమి వధించిరి వృక్షచరములు కొందఱు సముద్రమున బడిరి మఱికొందఱు గగన మార్గమునకెగిరిపోయిరి భల్లూకములు వృక్షముల నారోహించినవి సముద్రతీరమందును, పర్వతములందును, వనములందును విహరించుచున్న కపులనుబట్టి రాక్షసులు దునుమాడిరి రక్తసిక్తమైన ధూళిచే గ్రమ్మబడిన రాముని శిరంబును గూడ దెచ్చియున్నాను చూడుమని చెంతనున్న రక్కసినొక దానిని జూచి రాముని శిరంబును శరాసనంబును గొనితెచ్చియున్న విద్యుజ్జిహ్వునిటకు దోడ్కొని రమ్మని యాజ్ఞాపించెను వాడాక్షణమందే రామశిరస్సును, ధనుస్సును గొని వచ్చి సాష్టాంగ నమస్కారముగావించి నిలువంబడియె రావణుడా రాక్షసుని జూచి, రామశిరస్సును సీత ముందుంచుము ఈ దరిద్రురాలు పెనిమిటి గతిని కన్నులారా జూడగలదని విద్యుజ్జిహ్వునితో జెప్పెను ఆ రాక్షసుడు రావణుని మాటలు విని చూపరులకెంతయో ప్రియంబును జేకూర్చెడు రామశిరంబును సీతాదేవి ముందుంచెను రామధనస్సును రావణుడు గైకొని సీతను జూచి యిట్లనియె మూఢాత్మురాలా! ఇదిగో! చూడుము రాముని శిరంబును, అల్లెత్రాటితో గూడిన ధనస్సును, ప్రహస్తుడు గొనివచ్చినాడు ఇంకను రామునిపై భ్రాంతి నీకెందుకు? నాయధీనురాలవుగమ్ము రమ్మని రావణుడు సీతతో జెప్పెను

## రాముని శిరంబును ధనస్సును జూచి సీత దుఃఖించుట

సీతాదేవి రాముని శిరంబును, ధనుస్సును జూచి హనుమంతుని ద్వారా విన్న రామసుగ్రీవుల సఖ్యంబును మనంబున దలపోసికొని యుచ్చైస్స్వరంబున రోదనంబు గావించుచు గడగడవడంకి ఛేదింపబడిన కదళీతరువువోలె నేలంబడి కైకేయిని నిందించి యిట్లు విలపింప దొడంగెను హా! కైకేయీ! నీకోర్కె ఫలించినది కులవర్ధనుడగు రాముడు హతుండయ్యె కలహకారిణీ! రఘువంశమునంతటిని నాశంబు

గావించితివే! ఈ వార్త విన్నచో భరతాదులెట్లు జీవింతురు సర్వలోక ప్రియుండగు రాముడునీకేమి యొగ్గొనరించియుండెను అరణ్యమునకు బంపునాడు నారచీరలొసంగితివే! నీవిప్పుడేమి జూఱ్ఱుకొంటివి ఎంతపనిజేసితివని మూర్ఛిల్లి కొంత తడవునకు దేఱి విశాలాక్షియగు సీత రామశిరస్సును మూర్కొని పనవిపనవి యేడువ దొడంగెను

అయ్యో! జీవితేశ్వరా! వీరరత్నమా! హతనైతిని నీ మరణావస్థను దిలకించి జీవించి యుంటినే! నవవైధవ్యము నాకు సంప్రాప్తమయ్యెనే! రామా! రామా! ప్రాణేశుని ముందు భార్య మరణించునని చెప్పబడి యున్నది అట్లుగాక నాముందట నీవే మరణించితివే! దీనికేమి కారణము నేనుశోకసాగరంబున మునింగియుండ దయార్ద్రహృదయుండవై దరిజేర్పవచ్చి నా కొఱకు నీవు హతుండవైతివే! నీ మరణవార్త విన్నచో మాయత్త కౌసల్యాదేవి గతియేమగునో గదా! ఎంతవిలపించునో! పుత్రుని దలంచి యేమనునో! హా! ప్రాణనాధా! రాముడు చాలకాలము జీవించునని చెప్పిన జ్యోతిష్కులమాట యిప్పుడు సత్యముగ బరిణమించినదే! ఎంతయల్పాయుష్కుడ వైతివి? కాలవాహిని కెదురీదనెవ్వరి తరమగును సర్వభూతములకును కాలమే కారణభూతమై యుండును నీవు సమస్తోపాయంబు లెఱింగినవాడవు నీతిశాస్త్రకోవిదుడవు ఎట్టి యపాయంబులనుండియేని తప్పించుకొను సమర్థుడవు గదా! అయ్యో! యేమఱుపాటున మృతి జెందితివే! కమలలోచనుడా! నాకు వైధవ్యప్రాప్తి జేకూరనున్నందున భయంకరమైన కాళరాత్రియే నిన్ను హరించినది పురుషోత్తమా! నాకుదిక్కెవ్వరు? దిక్కులేని దానిని నన్నొంటిమై విడనాడి వసుధాతలంబును ప్రియురాలంబోలె గౌగిలించుకొని పరుండియున్నావే! నీ చేతను నాచేతను బూజలందుకొనుచున్న నీధనుస్సు గతి యిట్లైనదే! అనఘాత్మా! స్వర్గలోకమందున్న నీతండ్రిని తాతముత్తాతలను జేరుకొంటివా! మీ యిక్ష్వాకు వంశమందుద్భవించిన పుణ్య పురుషులను జూచుచుందువు ప్రియుడా! చిన్నదానను బాల్యమప్పటి నుండియు నిన్నెడబాయంజాలక నీ యర్ధాంగినై యున్నదానను గదా! నే నీ శోకాగ్నిలోబడి కుములుచుండ కన్నెత్తియైనను జూడకున్నావేల? నాతో మాటాడవెందుకు? హా! సఖుడా! నా వివాహ సమయంబున నాపాణి నిగ్రహించునపుడు నిన్నెడబాయక నీతోనుండెదనని ప్రతిజ్ఞ జేసితివే!

దానినిప్పుడు మఱచితివా! దు ఖితనగు నన్ను వెంటనే దీసికొనిపొమ్ము పురుషోత్తమా! పరమప్రియురాలనగు నన్ను విడిచిపోవుట తగునా! మంగళద్రవ్యంబులగు చందనాదులచే నలంకరించి గాఢోపగూహనలో నుంచుకొనుచుంటినో అట్టి నీదేహము గోమాయువులచే నాకర్షింపబడు చున్నదా! ప్రవాసక్లేశమనుభవించుచుండిన మనముమువ్వురిలో లక్ష్మణు డొక్కడేబోయి కౌసల్యను దర్శించినపుడు సీతా రాములెక్కడ? అని ప్రశ్నింపగలదు అప్పుడు లక్ష్మణుడు కన్నీరు రాల్చుచు నీ మరణవార్త నెఱిగించినంతనే యామహాసాధ్వి ప్రాణంబులు విడవకుండునా? ఖరాది భయంకర రాక్షసులను దునుమాడిన నీవు దుర్బలుడగు ప్రహస్తునితో జంపబడితివా? నేను దుష్టురాలను నా కొఱకు క్రూరముగ వధింపబడితివిగదా! రఘువంశమునకు నాశంబు గలిగించు దానని యెఱుంగక నన్ను బరిణయమాడితివి పూర్వజన్మమందెవ్వరో కన్యా దానము చేయదలంచినపుడు నేను విఘ్నముగావించియుంటినేమో! అపాప ఫలమిప్పుడనుభవించుచున్నాను పరమధార్మికుడగు రామునకు ధర్మపత్నినై భోగకాలంబున రామవిరహక్లేశమనుభవించుచు దు ఖాగ్నిలో బడి కుమిలి పోవుచున్నాను రావణా! త్వరితముగ నన్ను రామునిపై బడవైచి దంపతుల నొకటిగాజేర్చి పుణ్యముగట్టుకొనుము నాజీవితేశ్వరుని శిరంబుతో నా శిరంబును అమ్మహాత్ముని దేహముతో నాదేహమును జేర్పుము నేనిదే సహగమనంబు గావించెదనని సీతాదేవి భర్త శిరంబును, ధనస్సును జూచి భరింపరాని దు ఖాగ్నిలో గుమిలిపోయెను

ఆ సమయంబున ద్వారపాలకుడొకడు వచ్చి రావణునకు నమస్కరించి ప్రభూ! సేనానాయకుడగు ప్రహస్తుడు నిన్నుదోడితెమ్మని నన్ను బంపెను మంత్రులందఱు మీదర్శనంబుగోరి నిరీక్షించియున్నారు ఏదో గొప్ప కార్యమున్నదట ఆ కార్యమును నిర్వర్తించుటకై మీయాజ్ఞ కొఱకు గనిపెట్టియున్నారు వారలకు వెంటనే దర్శనమొసంగుడు దయచేయుడనియెడు రాక్షసుని వాక్యంబు లాలకించి యశోకవనంబును వీడి రావణుడు మంత్రులజూడ నరిగెను రావణుడు బోయిన తోడనే రాముని శిరస్సును ధనస్సును అంతర్థానమయ్యెను రాక్షసేశ్వరుడు మంత్రులతో గర్తవ్యమాలోచించి తన హితంబును గోరెడు సేనాధిపతులను

జూచి భేరీ ప్రయోగించి సేనలన్నిటిని రావింపుడు కారణమేమియు జెప్పవలదు పొండని సేనాధ్యక్షులతో జెప్పెను చమూపతులందుల కియ్యకొని మహాసైన్యంబులను రావించి యుద్ధకాముడగు రావణున కెఱిగించిరి

## రాముడు జీవించియున్నాడని సరమాదేవి సీతనూఱడించుట

విభీషణుని సతీమణియగు సరమాదేవి రావణునిచే మోసగింపబడి దుఃఖపరవశురాలై వసుధాతలంబునం బొరలి ధూళిచే గప్పబడియున్న సఖురాలగు సీతాదేవిని జేరంవచ్చి యిట్లూరడింప దొడంగెను అమ్మా! ఊరడిల్లుము భయపడవలదు రాముడు సుఖముగానున్నాడు నేనొక రహస్య ప్రదేశమందు దాగియుండి రావణుడు నీతో జెప్పిన కపటపు మాటలను, నీవు బదులు పలికిన పలుకులను విన్నాను నీ చెలిమి కొఱకు నా ప్రాణంబులైనను విడిచెదను రావణునకు భయపడను రాక్షసేంద్రుడిపుడు వేగిరపాటునంబోయిన రహస్యము గూడ నాకు దెలియును పురుషోత్తముడగు రాముని వధించుట కెవరికలవియగును? రామరక్షితంబగు వానర సేనలను దునుమాడ రాక్షసులకలవియగునా? బాహుబలాఢ్యుడును విశాల వక్షుండును, శ్రీమంతుడును, ధనుర్ధరుండును, ధర్మాత్ముడును సత్కీర్తికాలయమైనవాడును, సోదరుడు లక్ష్మణునితో గూడి సర్వకాల సర్వావస్థలయందును తనను రక్షించుకొనుచు నితరులను గూడ రక్షించువాడును, నీతిశాస్త్ర కోవిదుడును, శత్రుసైన్యములను సరకుసేయక వధించువాడును, జయలక్ష్మీ విరాజమానుండునగు రామచంద్రుని వధింపగల వారెవ్వరు? రాముడు హతుండు కాలేదు సర్వభూతములకును విరోధియు, మాయావియునగు రాక్షసుడు నిన్ను భయపెట్టుటకీమాయను గావించి యున్నాడు సంతోషకరంబగు నా ప్రియవార్త నాలకింపుము నీకు శుభము గలుగును రాముడు సముద్రమును దాటి దక్షిణతీర మందున్నాడు రామలక్ష్మణులిరువురును సుఖులై యున్నారు రాముడు సముద్రమును దాటినాడను విషయము నాలకించియే రావణుడిచటి నుండి వెడలిపోయి

మంత్రులతో నాలోచించుచున్నాడు భయపడవలదని సరమ సీతతో జెప్పుచుండగనే సైనికులు సేయుచున్న భయంకరమైన ధ్వని వినబడెను

సరమాదేవి భయంకరమగు భేరీధ్వని నాలకించి సీతతో నిట్లులనియె ప్రియమైన స్నేహితురాలా! సైనికులను సన్నద్ధులుగా జేయుటకై భేరి వాయింపబడుచున్నది అమేఘ గర్జనము వంటి మహాధ్వని నాలకించి భీతిల్లవలదు రణోత్సాహముచేత రథగజతురంగముల నలంకరించుచున్నారు పదాతి సైన్యములు సన్నద్ధములై తండోపతండములుగా జేరుచున్నవిచూడుము డాలువాఱులు, మైమఱువులు రథగజతురంగములు, రాక్షసులు దాల్చియుండు భూషణాదులు కాంతులను వెదజల్లుచున్నవి ఆకాంతులు నిదాఘకాలంబున నరణ్యమును దహించు కార్చిచ్చు కాంతియుం బోలెనున్నవి ఏనుగులకు గట్టిన గంటలు మ్రోగుచున్నవి తుముల యుద్ధంబు గావించుటకై సన్నాహంబులు జరుగుచున్నవి నీ దు ఖము నేటితో నంతరించినది నిన్ను విజయలక్ష్మి యాలింగనము జేసికోగలదు

కమలపత్రేక్షణుడగు రాముడచింత్యపరాక్రమవంతుడై సంగరంబున రావణుని సంహరించి నిన్ను బొందగలడనుటలో సందియములేదు శత్రుసంహారకుండగు రామునియంకంబున నిన్ను ద్వరలో జూడగలను నెచ్చెలీ! నిన్ను కౌగలించుకొని యుండు విశాలవక్షుడగు రాముని వక్షస్థలంబున నానందబాష్పములొలుక బోయగలవు నీనాథుడు జడలను గట్టిన నీనెఱికురుల చిక్కు విడిపింప గలడు పూర్ణచంద్రుని బోలిన ముఖారవిందమును సందర్శించిన తోడనే పాముకుబుసంబును విడుచునట్లు నీవు దు ఖమును విడువగలవు సస్యముతోనలరెడు భూమి సువృష్టిచే నుల్లసిల్లు చందంబున నీవు నీ జీవితేశునితో గూడి సంతోషాంబుధిని దేలియాడగలవు సూర్యుడు సర్వభూతములకును శుభలక్షణము లొసంగుచుండును అట్టి సూర్యుని శరణు బొందుము నీకు సర్వసుఖములు సమకూరగలవని మధురవచనంబులచే నాకాశము, భూమిని జలంబుచే జల్లచేయునట్లు సీతను సంతతాబ్ధి నీదజేయుచు సరమాదేవి చిఱునవ్వుమొగంబునందోప నిట్లనియె

# రావణుడేమి జేయుచున్నాడో చూచి రమ్మని సీత సరమాదేవితో జెప్పట

అసితేక్షణా! రహస్యంబుగా బోయి నీక్షేమంబును రాముని కెఱిగించి వచ్చెదను గగన మార్గమందు నేను బోవునపుడు వాయువు గరుత్మంతుడు గూడ నన్ను వెన్నంటి వచ్చుటకు సమర్థులు గారనియెడు సరమ మృదుమధుర వాక్యములనాలకించి సీతయిట్లనియె చెలీ! నీవు గగన మార్గమందుగాని, పాతాళమందుగాని స్వేచ్ఛగా విహరించిరాగలవు ఎచ్చటికైనను సులభముగా పోగలవు నాకొఱకెంతటి త్యాగమునైనను జేయగలవు నీయుపకారమును మఱవజాలను నాకాంక్షనీడేర్ప నీకుబుద్ధి బొడమియున్నచో రావణుని చెంతకేగి రహస్యంబులను దెలిసికొనిరమ్ము ఈ పాపాత్ముడు నిర్ధయుడై తన మాయాబలంబున మాటిమాటికిని నన్ను వేధించుచు భ్రాంతిని బుట్టించుచున్నాడు రాక్షసాంగనలు నన్ను నానావిధములుగ భయపెట్టుచున్నారు నేను ప్రాణసంశయంబును బొందియున్నాను నామనస్సునకు నెమ్మదియే లేదు ఈ యశోకవనంబున రావణునిచేత నెప్పటికేమి కీడుమూడునోయని భీతిల్లుచున్నాను ఆ రావణుడేమిచేయు నిశ్చయించునో తద్వృత్తాంతమంతయు నాకెఱిగింపుము నీయందు సదాకృతజ్ఞురాలనై యుండెదను పోయిరమ్మనిన సీతాదేవి వాక్యములను మధురభాషిణియగు సరమాదేవి విని, కన్నీటిచే దడియుచున్న మోమును దడవుచు సీతాదేవీ! దిగులొంద వలదు నేనిప్పుడే బోయి శత్రువుల రహస్యములెఱింగి త్వరితముగ వచ్చెదనని వెడలి పోయెను

సరమాదేవి యవ్విధంబునంబోయి రావణుని సమీపించి మంత్రులతో మంతనములాడుచుండుట నెఱింగి వెంటనే యశోక వనంబునకు వచ్చెను సరమ వచ్చుటంజూచి జనకాత్మజ మిగుల మోదమంది సస్నేహముగ కౌగిలించుకొని దురాత్ముడగు రావణుని నిశ్చయము నెఱిగింపుమనెను ఆబిడ తాను వినివచ్చిన వృత్తాంతమునిట్లు వివరింపదొడంగెను సీతాదేవీ! రావణుని మౌఢ్యమున కెంతని వగతును ఆతని తల్లి కైకసియు, అవిద్ధుడను వృద్ధమంత్రియు జేరందీసి నాయనా!

సత్కార పూర్వకముగ సీతాదేవిని రామచంద్రున కొసంగి సత్కీర్తి నార్జించుకొనుము అట్లు జేయవైతివేని నీకు నాశంబుగలుగును జనస్థానమందు ఖరదూషణాదులను రాముడు సంహరించుటయే యిందులకు నిదర్శనము సముద్రమును దాటి వచ్చి సీతాసాధ్వితో మాట్లాడి రాక్షసులను దునుమాడిపోయిన హనుమంతునిబోలు పురుషుడు భూమండలంబున నున్నాడా! తెలిసి తెలిసియు రామునితో వైరమేలనని తల్లియు, వృద్ధమంత్రియు బహువిధంబుల బోధించిరి ఆ పాపాత్ముడాలకింపడయ్యెను ధనలుబ్ధుడు ధనమును విడువనొల్లని భంగి నిన్నాకలుషాత్ముడు విడువడు భండనంబున ప్రాణంబులను గోల్పోయినంగాని నిన్ను విడువనొల్లడు సచివులతో గూడ నాతడు జేసికొన్న నిశ్చయమిదియే మృత్యుదేవతకనుంగు బిడ్డడగు కతంబుననే రావణునకీ దుర్బుద్ధి బొడమినది రాముడు రణమందు నిశితబాణాగ్నిచే దురాత్ముని వధించి నీతోగూడ నయోధ్యకేగ గలడు దిగులొందవలదని సరమాదేవి సీతాదేవితో జెప్పుచుండగనే భేరీశంఖధ్వని సమన్వితంబగు వానరసైన్యంబు లొనరించెడు సింహనాదములు ధరణీతలంబును గంపింపజేయుచు భయంకరముగ వినబడెను వానరుల సింహనాదము నాలకించి రాక్షసులు రావణుని దోషమువలన మనకు రణమే నిశ్చయమనియు జయముగలుగుట కల్లయనియు భయంబు జెంది దీనులైయుండిరి

## రామునితో సంధి గావించుకొమ్మని మాల్యవంతుడు రావణునకు జెప్పుట

శత్రుపట్టణంబులను శిథిలముగావించు బాహుబలాఢ్యుడును రఘుకులసోముడునగు రాముడు భేరీభాంకారములతోడను, శంఖ ధ్వనుల తోడను, లంకాపురంబున కేతెంచెను ఆ రామసైన్య నినాదమును రాక్షసనాథుడాలకించి మంత్రులను రావించి నానా విధములగు దుర్భాషలాడుచు సభయంతయు బ్రతిధ్వనులీనుచుండ నిట్లనియె మంత్రులారా! మీరందఱు రాముని దూత హనుంతుడొనరించిన సముద్ర తరణంబును, బలశౌర్యాదులను, రామునిసేనలను జక్కగా నుగ్గడించి

నుగ్గడించి నాకు జెప్పితిరి దశరథసుతుని పరాక్రమంబు విని నిరుత్సాహులై యుండొరులను జూచుకొనుచున్న మిమ్మెల్లరిని నేనెఱుంగుదుననిన రావణుని మాటలు విని కైకసికి బిన్నతండ్రియగు మహాపండితుడైన మాల్యవంతుడిట్లు జెప్పదొడంగెను

రావణా! ఏరాజేంద్రుడు అన్వీక్షకీత్ర యీవార్తాదండ నీతులను విద్యలనభ్యసించి నీతిశాస్త్రమునననుసరించి నడచునో యాతడు బహుకాలము రాజ్యలక్ష్మియొడిలోనుఖ్యాతలూగగలడు రిపులను సులభముగా జయింపగలడు వసుధాధీశుడెప్పటికిని నీతిశాస్త్రానువర్తియై కాలముననుసరించి తనకు దౌర్భల్యము చేకూరినప్పుడు శత్రువులతో సందిగావించుకోవలయును శత్రువునకు దౌర్భల్యముగలుగు కాలమును గుర్తించి యుద్ధము చేయవలయును ఇవ్విధంబున స్వపక్షమునభివృద్ధి బొందించుకొనుచు రాజ్యపరిపాలనము గావించుకొనువాడు సకలైశ్వర్య సంపన్నుడై తులతూగ గలడు తన బలము క్షీణించు సమయమెఱిగి సబలుడగు శత్రువుతో సంధిసేయవలయును శత్రువును దునుమాడగల శక్తియున్నచో తిరస్కరించి భండనంబొనరింపవలయును నీతిశాస్త్ర ప్రకారము జూచినచో రాముడు బలవంతుడు అతనితో సంధి గావించు కొనుటమేలని నాయభిమతము సీతనిచ్చివేయుదము సంధిగావించు కొందము దేవర్షులు గంధర్వాదులు రామునకు జయము గలుగ వలయునని కాంక్షించుచున్నారు అట్టి రామునితో విరోధమేల? సంధి గావింపనియ్యకొనుము విరించి సురులకును, అసురులకును, రెండు పక్షములను గల్పించెను ధర్మ మమరులను అధర్మ మసురులను నాశ్రయించి యుండును ఎప్పుడధర్మమున ధర్మమును జయించునో అప్పుడు కృతయుగమందురు ఎప్పుడు ధర్మము ధర్మమును జయించునో అప్పుడు కలియుగమందురు నీవు దిగ్విజయార్థమై లోకంబులన్నియు సంచరించునపుడు ధర్మమును దూరముగా బారదోలితివి అధర్మమును జేరందీసితివి అందువలన రాముడు ధార్మికుడై మనలను మించిన బలవంతుడాయెను అయుధర్మమెంత ప్రమాదము గలిగించునో యెఱుంగక దానినభివృద్ధి బొందించుకొంటివి ధర్మము మనలను నశింపజేయుచు శత్రువు పక్షమునకు బలము జేకూర్చుచున్నది

నీవు విషయాసక్తుడవై నిప్పువంటి మహర్షులకు గీడొనరించితివి ఆఋషుల మనస్తాపమే దేవతలకు బలముగా నేర్పడి మనకీయవస్థను దెచ్చి పెట్టినది అమ్మహర్షుల ప్రభావము మండుచున్న నిప్పువంటిది దానికెదురున్నదా! తపోధనులై ధర్మమునే యభివృద్ధి జేయుచు పరమాత్మను ధ్యానించుచుందురు రాక్షసుల నాశనమునుగోరి వేదపారాయణము గావించుచుందురు గ్రీష్మకాలమందు జలధరంబుల మాడ్కి రాక్షసులు దిగులొంది దిక్కులకు బారిపోవుచున్నారు మహర్షుల యగ్నిహోత్రములనుండి బయలు వెడలుచున్న ధూమము దశదిశల వ్యాపించి నిశాచరుల తేజంబు నడంచుచున్నది పుణ్యస్థలములయందు ఋషులు దృఢనియమంబుతో గావించెడు తీవ్రతపశ్శక్తి వలన రాక్షసులు తపించిపోవుచున్నారు నీవు దేవదానవయక్షాదుల వలన మరణము లేకుండ వరంబును బొందియున్నావు ఇప్పుడు మానవులు, వానరులు, ఋక్షములు, కొండముచ్చులు లంకకు వచ్చి గర్జించుచున్నారు వీరి మూలమున నీకు చావులేనట్లు వరంబులేదు

వివిధంబులగు దివ్యాంతరిక్ష భౌమోత్పాతంబులు బొడముటను దిలకింప నిశాచరుల కందఱకును నాశంబు వాటిల్లునని తోచుచున్నది వారి వాహినులు వికృత రూపములను దాల్చి యత్యుగ్రంబుగా గర్జించుచు లంకాపట్టణంబుపై నంతయు రక్తమును గురియుచున్నది అశ్వములును, ఏనుగులను, రోదనంబు సేయుచు గన్నీరు గార్చుచున్నవి ధ్వజంబులన్నియు ధూలిచే గ్రమ్మబడి వివర్ణములై మునపటివోలె బ్రకాశింపకున్నవి గోమాయువులును, గృధ్రములును తండోపతండములుగా వచ్చి లంకాపురంబుజొచ్చి భయంకరముగ నఱచుచున్నవి నల్లని స్త్రీలు బెదరించుచు గృహంబులలోని పదార్థములన్నిటిని దొంగలించునట్లును, ఎదుట నిలువంబడి తెల్లనిదంతములు తేటబడ, పకపక నవ్వుచున్నట్లును, స్వప్నములు గలుగుచున్నవి అర్ఘ్యము కొఱకై యిండ్లయందుంచి యుండు హవిస్సును శునకంబులు వచ్చి తినిపోవుచున్నవి గోవులయందు గార్దభములు బుట్టుచున్నవి పందికొక్కులు ముంగిసలతో మైత్రి నెఱపుచున్నవి మార్జాలములు శార్దూలములతో జేరుచున్నవి ఊరబందులు శ్వానములతో గలసిమెలసి

యున్నవి కిన్నర రాక్షసులును, మానవులు నొక్కటిగా జేరుచున్నారు ఎఱ్ఱని పాదములుగల పావురములు దైవప్రేరితములై రాక్షసుల నాశంబునే సూచించుచు విహరించుచున్నవి మధుర సల్లాపర్థమై గృహంబులయందు పెంబడియున్న శారికలు మధురకూజితములొనరించుటను మాని వీచీకూచీయని క్రూరధ్వనులంజేయుచున్నవి మృగపక్షులు పోరాడుచున్నవి ముండిత తిరస్కుడును, కృష్ణ పింగళుడునునగు పురషుని రూపమును దాల్చి మృత్యువు భయంకరాకారుడై రాక్షసుల గృహంబులన్నియు బ్రాతస్సాయంకాలములయందు విహరించుచున్నాడు ఎటుజూచినను దుష్టనిమిత్తములనేకములు గోచరించుచున్నవి దీర్ఘముగా నాలోచించుకొనుము ముందుకు బాధగలుగకుండ సుఖపడుమార్గ మరయుమని మాల్యవంతుడు రావణునితో జెప్పెను రావణుడందుల కియ్యకొనకొండుటను గమనించి రాక్షసనాధుని మామ మాఱుపలుక కూరకుండెను

## సంధి కొడంబడనని రావణుడు మాల్యవంతునితో జెప్పట

మృత్యువశంగతుండైన మూర్ఖమతియగు రావణుడు మాల్యవంతుడు జెప్పిన హితవాక్యములను సహింపనేరక పరమకుపిత మానసుండై వదనంబున బొమముడివడగ్రుడ్లను గిఱగిఱ ద్రిప్పుచు మాల్యవంతుని జూచి యిట్లనియె మామా! నీకు శత్రువుల యెడనున్న స్నేహము వెల్లడియైనది నాకు హితముపదేశించునట్లు నటించుచు మోసపుచ్చదలంచి పరుషోక్తులాడితివి ఆ హితంబులగు నీమాటలు విననొల్లను

రాముడు మానవుడు కోతులు సహాయముగాగల నీచుడు జనకునిచే బరిత్యజింపబడినవాడు అరణ్యములలో దిరుగువాడు అట్టి మానవాధముని సమర్థుడని నాయెదుట పొగడుచున్నావు కారణమేదియో నాకు వ్యక్తముగా లేదు సమస్త రాక్షసులకు బ్రభుండనై సురనికరంబునకు గుండెలవియజేయు మహాపరాక్రమవంతుడనగు నన్నిట్లు చుల్కన జేయుచున్నావే! ఎందుచేత? సజాతీయులలో నన్ను బోలిన వీరాధి

వీరుండుండుట సహింపజాలవైతివి గాబోలు! శత్రువులు నిన్ను బ్రోత్సహించిరా? లేక శత్రుపక్షపాతముతో నిట్లు బలుకుచున్నావా? శత్రువుల ప్రోత్సాహములేనిదే పండితుడును, శాస్త్రజ్ఞానమెఱిగిన వాడును, రాజ్యాధికారంబుననున్న వాడును, నిగ్రహానుగ్రహ సమర్థుడునగు రాజును గూర్చి యిట్టి పరుషవచనంబు లాడియుండవు పద్మాసనంబున లేని లక్ష్మీదేవిని బోలియున్న సీతను నేను దెచ్చితిని ఇప్పుడు రామునకు భయపడి మరలనెందుకిచ్చెదను కొలది దినంబులలోనే సమస్త వానరసేనా సమేతుండగు రాముని సుగ్రీవలక్ష్మణులతో గూడ నేను వధించుటను కన్నులార జూడగలవు నాతో దేవతలు గూడ ద్వంద్వయుద్ధము సేయంజాలరు అట్టి నేను యుద్ధమునకు వెనుదీయుదునా? ఒకవేళ రాముడే బలవంతుడైనచో యాతనిచే శిరచ్ఛేదనమైనను బొందుదును గాని నేనెట్టి వానికిని లొంగను ఇది నా సహజస్వభావము వలన గలిగిన దోషము సహజస్వభావమును గోల్పోవంజాలను రాముడు సముద్రమునందు సేతువు నిర్మించినాడిందువేమి! అదియేమి యాశ్చర్యము? ఇదిగో! నాప్రతిజ్ఞ వినుము రాముడు వానరసేనతో సముద్రము దాటివచ్చినను మరల జీవంబులతో వెనుదిరిగి పోవుట కల్ల ఇది సత్యమని నమ్ముము అని రావణుడు మాల్యవంతునితో జెప్పెను ఇట్లతిసంరంభంబున జెప్పుచున్న రావణుని జూచి మాల్యవంతుడు లజ్జితుడై బదులు పలకక రావణునకు జయంబుగలుగు గాక! యని యాశీర్వదించి తన గృహంబునకు బోయెను

అటు పిమ్మట రాక్షసేశ్వరుండు విమర్శ పూర్వకంబుగా నాలోచించి తూర్పు ద్వారమందు ప్రహస్తుని, దక్షిణ ద్వారమందు మహోదర, మహాపార్శ్వులను, పశ్చిమ ద్వారంబున ఇంద్రజిత్తును, ఉత్తర ద్వారమందు శుకసారణులను గాచియుండ నాజ్ఞాపించి యసమానంబగు గుప్తకార్యంబు గావించెను పట్టణమధ్యమందు విరూపాక్షుని బహురాక్షస సమేతముగానుంచెను ఇవ్విధంబున రాక్షసశ్రేష్ఠుడగు రావణుడు లంకాపురంబునకు గుప్తకర్మ సంవిధానంబుగావించి మృత్యుచోదితుండై తనంతకుదాను కృతార్థుడ నైతినని మనంబున దలపోసికొనుచుండెను మంత్రులు రావణ మహారాజునకు జయము జగుమనుచు నాశీర్వదించి

రాజాజ్ఞను శిరంబునందాల్చి తమతమ గృహంబులకేగిరి రాక్షసవల్లభుడు నానావిధ లక్ష్మీ విరాజమానంబగు శుద్ధాంతమునకు వెడలిపోయెను

## లంకావృత్తాంతమును విభీషణుడు రామునికి దెలుపుట

శ్రీరామలక్ష్మణులును సుగ్రీవుడును, పవనాత్మజుడును, ఋక్షేంద్రుడగు జాంబవంతుడును, విభీషణుడును, అంగదుడును, శరభుడును, సుషేణుడును, మైందద్వివిదులును, గజుడు గవాక్షుడును, కుముదుడును, నలుడు, పనసుడు మున్నగు వానర వీరులందఱు లంకాద్వీపంబుజేరి గుమిగూడి యిట్లాలోచించిరి ఇదిగో! రావణ బహుపాలితంబగు లంకాపట్టణంబగు పడుచున్నది దీని శోయగమెంతని వర్ణింపనగును సురాసురోరగ గంధర్వులకైనను జయింపనలవిగాకున్నది గదా! మనకు గార్యసిద్ధియగు తెఱంగెయ్యదియో చక్కగా నాలోచింపుడనియెడు వానర ప్రముఖుల పలుకులను విభీషణుడాలకించి యగ్రామ్యంబులగు గభీరోక్తులచే నిట్లులనియె

వానరోత్తములారా! యనల, శరభ, సంపాతి ప్రఘసులనియెడు నామంత్రివర్యులు నల్వురును లంకాపురంబునకేగి పక్షి రూపంబుదాల్చి శత్రుసేనలు జొచ్చి అక్కడ జేయబడిన యేర్పాటులను జక్కగా బరిశీలించి వచ్చినారు రామా! దురాత్ముడగు రాక్షసేంద్రుని రక్షణ సంవిధానమంతయు నాకు దెల్పినారు దానిని వివరించెద నాలకింపుడు ప్రహస్తుడు సైన్య సమేతుడై తూర్పుద్వారమందును, మహోదరపార్శ్వులు దక్షిణ ద్వారమందును, ఇంద్రజిత్తు ప్రధాన రాక్షసభటులతోగూడి నానా విధములైన యాయుధములను దాల్చి పశ్చిమ ద్వారమందును, రావణుడే నిర్భయుండై యాయుధపాణులగు పెక్కువేల రాక్షసభటులను గూడి యుత్తరద్వారమందును, కావలిగాచి యున్నాడు విరూపాక్షుడు సైన్య సమేతుడై మధ్యగుల్మంబుననున్నాడు

గజయోధులువేవురును, రథికులు పదివేవురును గుఱ్ఱపు వారలిరువదివేవురును, గాల్వురు కోటిమందియు రాక్షసనకత్యంత సన్నిహితులై ప్రియులై సేవజేయుచుందురు నరేంద్రా! వీరిలోనొక్కక్క

రాక్షసునకు బది లక్షల రాక్షసులు పరిజనులై యున్నారు ఇదిగో! వీరే నావుంత్రులు, లంకావృత్తాంతమంతయు గొనితెచ్చినారని చెప్పి ఎంత్రులతోగూడ నా లంకావృత్తాంతమును విభీషణుడు రాముని సన్నిధిలో జెప్పించి మఱియు నిట్టులనియె దశరథాత్మజా! మును రావణుడు కుబేరునితో భండనమొనరింపబోయినపుడు బలపరాక్రమములందును, ధైర్యమందును, దర్పమునందును రాక్షసనాధునకు సమానులైన రాక్షస వీరులఱువది లక్షలమంది వెన్నంటి పోయిరి రామా! నీకు భయంబు గలిగించుటకీవృత్తంతమును జెప్పలేదు నా మీద కినుక వహింపవలదు నీకు మఱింత రోషము గలుగుటకై చెప్పచున్నాను దేవతలనైనను నిగ్రహింపజాలిన నీకెదురెవ్వరు? నీ యనంతమైన చతురంగబలంబుల నేమని కొనియాడగలను రావణుని బరిమార్చుటకు సంసిద్ధుడవుగమ్ము లెమ్మనిన తోడనే రాముడు శత్రువులను వధించుటకై వానరుల కివ్విధంబున నాజ్ఞాపించెను

## ఆయాద్వారములందున్న రాక్షసులను దునుమాడుటకై రాముడు వానరులకాజ్ఞ నొసంగుట

నీలుడా! నీవు సేనాసమేతుండవై తూర్పు ద్వారమందున్న ప్రహస్తునితో యుద్ధము జేయుము అంగదుడా! నీవు సేనా సము దయంబును సమకూర్చుకొని దక్షిణ ద్వారమందున్న మహాపార్శ్వ మహోదరులతో సమరంబు గావింపుము పవన తనయా! నీవు పశ్చిమ ద్వారంబున నుండి భండన మొనరింపుము బలగర్వితుండగు రావణుని నేనే వధియింప సమకట్టియున్నాను ఉత్తర ద్వారంబున నున్న రాక్షసరాజుతో నేను లక్ష్మణుడు సంగరంబు గావించెదము సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు మధ్యమగుల్మంబున యుద్ధము సేయవలయును వానరులందఱు యుద్ధమందు మానవరూపమును దాల్చి విహరింపగూడదు మనసైన్యమని మనము గుర్తించుటకు వానర రూపమును దాల్చియే యుండవలయును నేను లక్ష్మణుడు నీలాంగద హనుమత్సుగ్రీవులును, విభీషణుడును, మేమేద్వ్యరమును మనుష్య దేహంబులతోడనే సమరంబు గావించెదమని రాముడు వానరుల కాజ్ఞాపించెను

అనంతంబగు వానరసైన్యము సువేల ప్రాంతమునంతయు నావరించి లంకాపురంబును ముట్టడింపబోయెను. రాముడు సువేలశైలంబు నారోహింపదలంచి సుగ్రీవ విభీషణులజూచి మధుర వచనంబులతో నిట్లనియె మనమందఱము నీసువేలాద్రి నారోహించి యీ రాత్రియంతయు నిచటనే నివసింతము నీచాత్ముడై నిందితంబగు పరాభార్యాపహరణమ్ము గావించిన రావణుడు నివసించుచున్న లంకాపురంబును గూడ దర్శింతము ఆ రాక్షసాధముని పేరువిన్నచో నా క్రోధాగ్ని మఱింత రగుల్కొనుచున్నది ఆ పాపాత్ముడొనరించిన యపరాధమువలన రాక్షసులెందరో మడియుదురుగదా! ఒకడు మృత్యువశంగతుండై యకార్యంబు గావించినచో వాని మూలంబున కులబలంబులు సంపూర్ణముగ నశించి పోవునని చెప్పుచు శ్రీరాముడు సువేలాద్రి నారోహించెను లక్ష్మణుడు రాముని వెన్నంటి పోయెను సుగ్రీవుడు విభీషణుడు మంత్రులతో గూడ వెంబడించి సువేలశైలంబు నారోహించిరి

హనుమంతుడు, అంగదుడు నీలుడు మైందుడు, ద్వివిదుడు గజుడు గవాక్షుడు గవయుడు శరభుడు, గంధమాదనుడు, పనసుడు, కుముదుడు, హరుడు, రంభుడు జాంబవంతుడు, సుషేణుడు, ఋషభుడు, దుర్ముఖుడు, శతబలియు వీరందఱు వాయువేగంబున రాముని వెంబడించి సువేల పర్వతంబునారోహించిరి రామాదులవ్విధంబున సువేలశైలశిఖరంబు నారోహించి త్రికూట శిఖరాగ్రంబున జెలువమొలుకుచు నాకసంబున వ్రేలాడునట్లున్న లంకాపట్టణంబును దిలకించిరి సుందర ద్వారంబుల చేతను, ప్రాకారాదుల చేతను, సొంపుగులుకుచు రాక్షసులచే నిండయున్న లంకాపురంబును వానరవీరులు జూచి సింహనాదములు గావించిరి సూర్యభగవానుడు సంధ్యారాగంబునం బల్లవితుడై యస్తమించెను రజనీకాంతపూర్ణచంద్రాకృతియై పొడసూపినది విభీషణాదులు రాముని పూజించిరి వానరవీర సమూహ పరివేష్టితుడై యారాత్రి సువేలాద్రి శిఖరంబున సుఖంబుగ నివసించియుండెను

## రాముడు వానరులతో గూడ లంకాపురంబును జూచుట

ఆ వానరోత్తములవ్విధంబున రాతిరంతయు నాసువేలశైలాగ్రమందు నివసించి యుండి తెల్లవారిన ఎదప రమణీయ మొలుకు లంకాపట్టణమందలి వనంబులను, సుందరోద్యానవనంబులను, ఉపవనంబులను కనుల పండువుగా దిలకించి మిగుల నాశ్చర్యమొందిరి

చంపకాశోక పున్నాగసాలతాల తమాల వృక్షములచేతను, పుష్పించిన యేడాకులరటి, యేఱుమద్ది, బొట్టుగు, కొండగోగు, కలిగొట్టు భూరుహంబులచేతను, లతావేష్టితంబులును, దివ్యంబులును, కోమలారుణ పల్లవంబులును, గలిగి సురేంద్రుని యమరావతీ పురంబువోలె లంకాపురంబు రమ్యముగా నుండెను ఆ వనమందలి వనస్పతులు పరిమళమెగబోయు పుష్పములతోడను, ఫలములతోడను కనువిందుసేయుచుండెను సమస్త ఋతుధర్మములతో గూడియున్న వనంబు మధుపంబులతోడ నలరారుచు, కుబేరుని చైత్ర రధవనంబువోలెను, దేవేంద్రుని నందనవనంబువోలెను, ప్రకాశించు చుండెను నిర్ఝరిణులయందు నీరుకోళ్లును, చీకుగొక్కెరలును, నృత్యమును సల్పుచున్న నెమళ్లును చిగురుటాకుల మేపరులను, మధుర కూజితమొనరించు చుండనాధ్వనులను వానరులాలకించుచు, లంకా పురంబునకు జేరువలో శోభనొనగూర్చుచున్న వనంబులను, ఉపవనంబులను ప్రవేశించిరి పుష్పములనుండి పరిమళమును పవనుండు గొని తెచ్చి వనచరులపై జల్లెను

వానరవీరులు సుగ్రీవుని యనుమతి వడసి సింహనాదంబులొనరించుచు త్వరితంబుగ తమ పాదాఘాత వేగంబున భూమిని కంపింపజేయుచు లంకాపట్టణంబునకు బోయిరి లంకా వనంబులలో విహరించుచున్న ఋక్షములు, సింహములు, వరాహమహిషంబులు, హరిణసంతతులు, వానరభీకరాకారంబునకు వెఱచి దశదిశలకు బారినవి శతయోజనంబుల నిడుపును, ముప్పది యోజనంబుల వెడల్పును గలిగి త్రికూట శిఖరంబున తెల్లని మేఘమువోలె నత్యున్నతములగు పురద్వారములును, కాంచనమయంబగు

ప్రాకారమును గలిగి మనోహరముగ లంకాపురంబు నలరారుచున్నది ఆ లంకాపురమందు వేయిస్తంభములచే గైలాస శిఖరంబును బోలిన చైత్య ప్రాసాదమొకటి జూపట్టుచుండెను ఈ ప్రాసాదము నూర్వురు రాక్షసులచే రక్షింపబడుచు లంకాపురంబునకు బొట్టని భూషణమై వెలుగొందుచుండెను అట్టి మనోహరమైన లంకాపట్టణంబును వానరసేనా పరివృతులైయున్న రామలక్ష్మణులిరువురును కన్నులలరగాంచి యాశ్చర్యమొందిరి

రాముడు సుగ్రీవాది వానర యూధపులంగూడి రెండు యోజనముల వైశాల్యముగల సువేల పర్వతమునుండియే దశదిశలను బరికించి చిత్రకూటశిఖరంబున విశ్వకర్మచే దృఢముగా నిర్మించబడిన లంకాపురమందు శ్వేతచామరంబులచే నిరుగెలంకుల వీవబడుచు, జయసూచకంబగు శ్వేత ఛత్రమును దాల్చి రక్తచందనాలంకృతుడై రత్నాభరణ భూషితుండై జీమూతసంకాశుడై వెలయుచున్న రావణుని జూచెను అట్లు వానరోత్తములును, రాముడును, రాక్షస నాధుని జూచుచుండగనే సుగ్రీవుడమితకోపోద్రేకుడై తలవని తలంపుగా సువేలశైల శిఖరమునుండియే రావణుడున్న గోపురముపైకెగిరెను కొంత తడవు సుగ్రీవుడా రాక్షసుని జూచి తృణీకరించి పరుషోక్తులచే నిట్టులనియె

## రావణ సుగ్రీవుల యుద్ధము

ఓరీ! రావణా! నేను లోకేశ్వరుండగు రాముని స్నేహితుడను రామదాసును, అమ్మహాత్ముని తేజోబలంబున నిన్నిప్పుడు వదలను చూడుమని తటాలున బైకెగిరి రాక్షసాధీశుని కిరీటమును నేల బడద్రోసి క్రిందికి వ్రాలెను అప్పుడు రాక్షసేంద్రుడు సుగ్రీవుని జూచి సుగ్రీవా! నా పరోక్షంబున సుందరంబగు కంఠంబుగలిగి గ్రాలుచుంటివి నేడు నాకంటబడుకతంబున కంఠములేనివాడవగుదువు ఇదే చూడుమని శీఘ్రంబున లేచి సుగ్రీవు నొడసిపట్టి నేల బడద్రోసెను వానరేంద్రుడు కందుకముపోలె దటాలున పైకెగిరి రెండుకరంబులచేతను రాక్షసేంద్రుని నేలంబడద్రోసెను ఇవ్విధంబున రావణసుగ్రీవుల దేహమ్ములు

స్వేదజలమయమై రక్తధారలొలుకుచుండ రణమొనరించుచు గొంత తడవు పరస్పర గాఢాలింగనము గావించుకొని నిశ్చేష్టులై మరల విడివడుచు బుష్పములను దొడగిన శాల్మలికింశుక వృక్షముల వోలె బ్రకాశించుచుండిరి ఒండొరుల బిడికిళ్లతో గ్రుద్దుకొనుచు నఱచేతులతో జఱచికొని, మోచేతులతో బొడుచుకొని, నఖంబులచే గీఱుకొని భయంకరమైన ఘోరయుద్ధము జేసిరి గోపురవేది మధ్యంబున బాహుయుద్ధముగావించుచు నొండొరులను ద్రోసికొనుచు కొట్టుకొనుచు వంచుకొనుచు, నీడ్చుకొనుచు దృఢముగ గౌగిలించుకొని ప్రాకార పరిఖలనడుమబడిరి

అట్లు సుగ్రీవ రావణులు నేలబడి మరల యాకసంబునకుద్గమించి యచ్చోటున కొంత తడవుండి గాఢ నిట్టూర్పులను బుచ్చుచు బాహుపాశంబులతో నొకరికొకరు బంధించుకొని శార్దూల సింహముల మాడ్కి యుద్ధంబునబెనంగిరి మఱియు గాఢాలింగనము జేసికొనుచు ఱొమ్ములచే గొట్టుకొనుచునేక కాలంబున నేలబడిరి ఇసుమంతయైనను బడలికను జెందరైరి తమతమ యుద్ధక్రమసాధన చమత్కారము తెల్లమగునట్లు సంగరంబుగావించిరి ఒకరి చిద్రంబునొకరు వెదకుచు నొకరి నొకరు వదియింపనాసక్తులై యాహారము కొఱకు మార్జాలములు పొంచియున్నట్లు పొంచియుండిరి చక్రాకారగమనంబులును, వైష్ణశాఖామండల ప్రత్యాలీఢాలీఢములను స్థానములును, గోమూత్రము వంటి కుటిలగమనంబులును, మొదలుగాగల యుద్ధనైపుణ్యమును వెలార్చుచు యుద్ధంబుగావించుచున్నప్పుడు రావణుడు సోలిపోయి తన మాయాబలంబు జూప నారంభించెను ఆ రావణుని తలంపెఱింగి జయశాలియగు సుగ్రీవుడు తటాలున నాకాశంబున కెగిరి వానర మధ్యంబున నున్న రాముని పార్శ్వభాగమ్ము జేరెను సుగ్రీవుడు మరల వచ్చునని రావణుడచటనే వేచియుండెను సూర్యకుమారుడు రాక్షసేశ్వరుని సోలించి సత్కీర్తినార్జించి పరమసంతుష్టుడై శ్రీరామునకు మరింత రణోత్సాహమ్మును వృద్ధి బొందించెను

## ఆలోచింపకయే సాహసము జేయరాదని రాముడు సుగ్రీవునితో జెప్పుట

సుగ్రీవుని దేహమందు యుద్ధచిహ్నంబులను గాంచి రాముడు కౌగిలించుకొని యిట్లనియె సుగ్రీవా! నీవు నాతో నాలోచింపకయే గొప్ప సాహసంబు గావించితివి చక్కగా నాలోచింపనిదే రాజులిట్టి సాహసంబున కొడంబడరు సాహసప్రియుండవై నాకును విభీషణునకును వానర సైన్యమునకును గొప్ప సందేహమును గలిగించితివి వానరోత్తమా! చక్కగా నాలోచింపనిదే నిట్టి సాహసకృత్యమెన్నడును జేయవలదు నీకేదేని హాని సంభవించినచో భరత శత్రుఘ్నులతోగాని సీతాలక్ష్మణులతోగాని, తుదకు నాదేహముతోగానే, నాకేమి పనియున్నది? నీకిప్పుడే రావణుని వలన ముప్పు గలిగియున్నచో నేనిట్లు నిశ్చయించి యుంటిని ఏమందువా! బవరంబున రావణాసురుని పుత్రమిత్ర పౌత్రాదులతో గూడ దునుమాడి విభీషణునకు లంకాధిపత్య మొసంగి యయోధ్యకేగి రాజ్యమును భరతుని యధీనము గావించి దేహంబును బరిత్యజింప సమకట్టియుంటిననియెడు రాముని వాక్యములను సుగ్రీవుడాలకించి రామా! నీధర్మపత్ని నపహరించిన దురాత్ముడగు రావణుని జూచి పౌరుషంబుగల వాడనై సహింప జాలనైతినని వానరాధీశుండు బదులుపలికెను

## దుర్నిమిత్తములను జూచి రాముడు లక్ష్మణునితో జెప్పుట

అటు తరువాత రాముడు లక్ష్మణుని జూచి యిట్లనియె లక్ష్మణా! ఋక్షవానరవీరులును, రాక్షసవీరులును, సమరంబున బెక్కండ్రు హతులగుదురని తోచుచున్నది పవనంబులు పరుషంబుగా వీచుచున్నవి పర్వతశిఖరంబులు చలించుచు మహీరుహంబులు విఱిగి నేలబడుచున్నవి జలధరంబులు భయంకరంబుగా గర్జించుచు శోణిత బిందువుల వర్షమును గురియుచున్నవి సంధ్యారక్తచందన సంకాశమై గ్రాలుచు పరమ దారుణమై గనుపట్టుచున్నది సూర్యమండలమునుండి మండుచున్న

యగ్నిఖండములు రాలుచున్నవి మృగపక్షులు దినకరున కెదురుగా నిలువంబడి దీనస్వరంబులతో నఱచుచున్నవి ప్రళయకాలమునందుబోలె రాత్రికాలమందు సుధాకిరణుడు కాంతి రహితుడై సంతాపముదయింప జేయుచున్నాడు

సోదరా! సూర్యమండలమంతయు కళారహితమై గానుపించుచున్నది నక్షత్రమండలముగూడ మలినమై యున్నది ఈ దుర్నిమిత్తంబులన్నియు లోక వినాశమునకు దారితీయుచున్నవి వాయసంబులు, శ్యేనంబులు, గృధ్రమ్ములు, నీచపక్షులతో, జేరియున్నవి పేరుంబులు పెరెలుంగున నమంగళధ్వను లొనరించుచున్నవి మనమిపుడు జాగుసేయక సమస్త వానరసైన్యముతోగూడి లంకాపురంబునకు బోవుదమని రాముడు లక్ష్మణునితో జెప్పుచు త్వరితముగ సువేల పర్వత శిఖరంబు నుండి దిగెను ఏది యేకాలంబున జేయవలయునో యా రహస్యంబు నెఱింగిన రాముడు వనచరవల్లభుడగు సుగ్రీవునితో గూడ సర్వానరసేన నంతయు బ్రోత్సాహపరచి యుద్ధంబున కాజ్ఞాపించి పురికొల్పుచు లంకానగరాభిముఖుండై పోయెను విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, నలుడు, నీలుడు, సుషేణుడు లక్ష్మణుడు రాముని వెంబడించిపోయిరి అనంతంబగు ఋక్షవానరసేనా సముదయము గూడ భూమినాచ్ఛాదించి రామచంద్రుని వెంబడించిపోయినది వానరులు వేలకొలది పర్వత శిఖరంబులను మహీరుహంబులను ధరించిరి రామలక్ష్మణులిరువురు సేనాసమేతులైలంకా పురంబు జేరిరి సేనలు రామచంద్రుని యానతిని శిరంబు నందాల్చి దేవతలకేని యెదిరింపనలవిగాని లంకాపట్టణంబు జొచ్చి తమతమ స్థానంబున నిరోధించి విడిసిరి

## సేనలతో గూడ రామలక్ష్మణులు లంకాపురంబు జేరుట

దశరథసుతులగు రామలక్ష్మణులు పాతాళము వోలె భయంబు గొల్పుచు దానవ రక్షితంబగు లంకాపురియుత్తర ద్వారంబును నిరోధించిరి అయుత్తర ద్వారంబున నిరోధించుటకు రామచంద్రుడే సమర్థుడు

అన్యులకలవిగాదు రాక్షస యోధులు ధరించియున్న నానావిధములైన యాయుధములను, వైవములను రాముడు జూచెను వానరసేనాధిపతియగు నీలుడు మైందద్వివిధులతో గూడి పూర్వద్వారంబున నిల్చియుండెను బాహు బలాఢ్యుడగు వాలిసుతుండు ఋషభగవాక్షులను గజగవయులంగూడి దక్షిణ ద్వారంబున గావలియుండెను అంజనానందనుడు ప్రమాది ప్రఘసులు మొదలుగాగల వానరవీరులతో గూడి పశ్చిమ ద్వారంబును రక్షించుచుండెను కీశాధినాధుండగు సుగ్రీవుడు గరుడానిల సమానులగు వానరోత్తములంగూడియుత్తర పశ్చిమ ద్వారంబులనడుమ విహరించుచుండెను ముప్పది యాఱుకోట్లు వానరులు వానరేంద్రుని బరివేష్టించి యుండిరి రామాజ్ఞను శిరంబునందాల్చి లక్ష్మణ విభీషణులు ప్రతిద్వారమందును కోటికోటి వానరుల వంతున వరుసగా నిలిపియుండిరి సుగ్రీవుడు జాంబవంతునితో బహుసైన్యసమేతుడై మధ్యగుల్మంబున నిల్చియుండెను వానర ప్రముఖులందఱును శార్దూలముల వోలె వృక్షములను, పర్వత శిఖరంబులను, కరంబులందాల్చి యపరిమితానందమొందుచు కయ్యంబునకు గాలుదువ్వుచుండిరి

దంతనఖంబులే యాయుధములుగ నలరారుచు పదియేనుగుల బలముగలవారును, నూఱేనుగుల బలముగల వారును, వేయేనుగుల బలముగలవారును, లెక్కకు మిక్కుటముగ నుండిరి కొందఱు వీరులు ఓఘసంఖ్యాకములగు మత్తకరీంద్రములను బోలిన వారును, అప్రమేయంబగు బాహుబలాఢ్యులునగు వానర వీరులందఱును గుమిగూడి శలభములదండువోలె నద్భుతాశ్చర్యముగ నొప్పారుచుండిరి లంకాపురంబు చుట్టును విడిసియున్న వానర సేనలు భూమ్యాకాశంబులు రెండును నిండియున్నట్లుండెను త్రికూట పర్వతమంతయు నాచ్ఛాదితమై లంకాపురంబును ముట్టడించుచున్న వానర యూధంబును గాంచి రాక్షసులద్భుతమొందిరి వనచరులు సేయు సింహనాదములకు లంకాపట్టణమంతయు చలించినది

రాక్షసులను వధించు నిమిత్తమై వానరసైన్యమును యుక్తక్రమంబున నియమించి రాముడు తన మంత్రులతో దీర్ఘముగా

నాలోచించి రాజధర్మంబును దలపోసి విభీషణానుమతంబున నంగదుని బిల్చి యిట్లు జెప్పెను అంగద కుమారా! నీవు ధీరచిత్తుండవై రావణుని యొద్దకేగి నేను జెప్పినట్లే ప్రకారముగ జెప్పుము

## అంగదరాయబారము

రావణుడా! మహర్షులకును, అమరులకును, గంధర్వులకును, అచ్చరలకును, నాగులకును, యక్షులకును, రాజులకును, గర్వాంధుడవై గావించిన యపకారమే నిన్ను నశింపజేయుచున్నది బ్రహ్మచేత బొందిన వరప్రభావమంతయు నేటితో నశించినది నేను భార్యాపహరణకుపితుండనై నిన్ను మట్టుబెట్టుటకు లంకాద్వారంబు జొచ్చియున్నాను నీవు నాచే హతుండవై పుణ్యలోకంబుజేరుకోగలవు రాక్షసాధమా! నీవే బలంబుచేత నన్ను మోసగించి సీత నపహరించితివో! యాబలపరాక్రమము నిప్పుడు జూపుము నీవు సీతను గొనితెచ్చి నాకు సమర్పించి శరణువేడుము అట్లుగాదేని నా కఱకు బాణంబులచే నీ కంఠమునుత్తరించి నీ రాక్షసలోకమునంతయు నరాక్షసంబు గావించెదను ధర్మస్వభావుడగు విభీషణుడు నన్ను శరణు జొచ్చియున్నాడు లంకాధిపత్యమాతడు తప్పక బొందగలడు సందేహమావంతయులేదు మూర్ఖుడా! పాపాత్మా! ధర్మరహితుడవగు నీవు రాజ్యమేలుట కర్హుడవుగాదు నాబాణాగ్ని కాహుతియై గత పాపుడవై పరిశుద్ధుడవు కాగలవు రావణా! నీవు విహంగమవై, మనో వేగంబున ముజ్జగంబులకేగినను జీవింపజాలవు నీకు హితము పదేశించెద నాలకింపుము నీ యసువులు నా పిడికిట నున్నవి నీవింక లంకాపురంబును జూడజాలవు ఇప్పుడేల లంకా పట్టణమంతయు దిరిగి చక్కగా జూచుకొనుము ఇంక నీలోకంబున రాక్షసంబు కాగలదు ఇది నిజమనియు రావణునితో జెప్పుమని రాముడు అంగదునితో జెప్పెను ఆ వానరోత్తముడు రాముని యనుమతి వడసి యాకసంబున కెగిరి ముహూర్తకాలంబున రాక్షసేంద్రుని మందిరంబు జొచ్చి మంత్రులతో గూర్చుండి మంతనములాడుచున్న రావణునకు సమీపంబున బ్రాలి ధగధగమండుచున్న యగ్నికైవడి నిలువంబడి రాముడుజెప్పిన

విషయమంతయు పూసగ్రుచ్చిన చందంబున వివరించి మఱియు నిట్టులనియె రావణా! నేను వాలి కుమారుడను రాముని దూతను, నా పేరు అంగదుడు నీవు వినియేయుందువు రఘుకులసోముడును కౌసల్యాపుత్రుడునగు రాముడిట్లు నీతో జెప్పుమన్నాడు క్రూరుడవగు రాక్షసాధమా! నీవు మొనగాడవైతే నీ పట్టణంబును వెడలివచ్చి నాయెదుర నిల్చి సమరంబు జేయుము పౌరుషము వహింపుము

సపుత్ర జ్ఞాతి బాంధవసహితముగా నిన్ను నీ మంత్రులను వధించెదను అప్పుడు జగత్రయంబులు నిర్భయముగా సుఖంబు నొందగలవు దేవదానవ యక్షగంధర్వోరగ రాక్షసులకును, మహర్షులకును, శత్రుడవు ఋషివర్యులకు బాధ గలిగించు పాపాత్ముడవు నిన్నిప్పుడే రూపు మాపెదను నీవు నన్ను బూజించి సీతను సమర్పించి నా పాదములపై బడుము అట్లు సమ్మతింపవేని నిన్ను దునుమాడి లంకాధిపత్యంబు విభీషణున కొసంగెదను అని రామచంద్రుడు నీతో చెప్పుమన్నాడని యంగదుడు రావణునితో జెప్పెను

అంగదుడాడిన పరుషోక్తులను రావణుడాలకించి కోపపరవశుండై మంత్రులను జూచి 'దుర్బుద్ధియగు నీ యంగదుని బట్టి వధియింపుడని యాజ్ఞాపించెను భయంకరాకారులగు నలువురు రాక్షసులు అంగదుని బట్టుకొనిరి తన బాహువీర్యమును రాక్షసులకు గనబఱచుటకై తననుబట్టుకొనుట కియ్యకొనెను పక్షులను వోలె రాక్షసులను రెండు చేతులనిఱికించుకొని పర్వతాకారమై పరిథ విల్లెడు ప్రాసాదంబు పైకెగసెను రాక్షసనాథుడును, రాక్షసులును, జూచుచుండగనే రాక్షసులాకసంబునుండి క్రిందికి బడిరి అంగదుడు రావణుని ప్రాసాద శిఖరంబును జూచి పాదాఘాతంబున బ్రద్దలు జేసి మహాధ్వని గలుగునట్లు సింహనాదంబుగావించి గగన మార్గమున కెగిరి యాక్షణమే వానరవీరులానందాబ్ధిని దేలియాడునట్లు రాముని పార్శ్వంబు జేరెను

రావణుడు తన ప్రాసాదంబు బ్రద్దలగుటకెంతయు వగచి గాఢ నిట్టూర్పును బుచ్చెను వనచరులు పరమోత్సాహమొంది సింహనాదములు గావించుచు రాముని బరివేష్టించి యుండిరి రాముడు శత్రువును

వధించుటకు వేచియుండెను సుషేణుడు కామరూపులగు వానరసేనతో గూడి సుగ్రీవుని యనుమతి వడసి నాలుగు ద్వారములయందును జాగరూకుడై విహరించుచుండెను నూఱక్షౌహిణులసేనను రాక్షసులు జూచి కొందఱు భయపడిరి మఱికొందఱు యుద్ధోత్సాహులై సంతసించిరి వానరసేనలతో నిండి ప్రాకారంబుగ జూపట్టుచున్న ప్రాకారపరిఖ మధ్య ప్రదేశమును రాక్షసులు దీనులై చూచిరి ప్రాకారపరిఖల మధ్య ప్రదేశంబునంతయు వ్యాపించియున్న వానర యూథంబును గాంచి రాక్షసులు భయంకరమైన కోలాహలమొనరించుచు మహాయుధంబులను దాల్చి ప్రళయకాలమహా ఝుంఝూమరుతము మాడ్కి సంచరించుచుండిరి

## వానరులు లంకాపురంబును ముట్టడించుట

అటుపిమ్మట రాక్షసులు రావణుని మందిరంబునకేగి రాజా! రాముండు వానరసేనా సమేతుడై లంకాపురంబునంతయు ముట్టడించియున్నాడని తెలియజెప్పిరి ఆ వార్తనాలకించిన తోడనే రావణుడు కోపోద్రేకుడై యినుమడిగా నగర రక్షణ సంవిధానంబు గావించి ప్రాసాదంబు పైకెక్కి యుద్ధకాంక్షతో వానరులు భూమండలమునంతయు నాచ్ఛాదించి యుండుటను బరికించి యీవనచరులనెట్లు దునుమాడగలనని చింతాచిత్తిని మాడిపోయెను

ఆ సమయంబున రాముడు సీతను దలంచి మృగశాబాక్షియగు నా ప్రియురాలు రాక్షస పీడితయై దుఃఖార్ణవమందు మగ్నురాలై యుపవాసంబులచే గృశించి కష్టపడుచున్నది గదా! యని దుఃఖించి రోషంబినుమడింప శత్రువులను దునుమాడుడని వానరులకనుమతి నొసంగెను దశరథాత్మజుని యాజ్ఞను శిరంబునందాల్చి వానరవీరులొకరిముందు నొకరు నడచుచు పర్వత శిఖరంబులను, వృక్షములను గైకొని యుద్ధ సన్నద్ధులై సింహనాదములు గావించిరి రావణాసురుండు జూచుచుండగనే వృక్షచరులు సాలతాల శిలాయుధంబులను దాల్చి లంకాపురంబు పైకిబోయి పర్వత శిఖరంబులతోడను పిడికిళ్లతోడను లంకాప్రాకార ప్రదేశములను

అరణ్యంబులను పురద్వారంబులను జూర్ణము గావింపమొదలిడిరి మట్టిగొనితెచ్చి పోసియు బర్వత శిఖరంబులను దృణకాష్ఠమ్ములను వైచియు నిర్మల జలపూరితంబులగు యగడ్తలనుబూడ్చిరి కొందఱు సింహనాదములు జేయుచు గంతులు వేయుచు లంకాపురంబును ముట్టడింపసాగిరి వీరబాహువు సుబాహువు, నలుడను వానరోత్తములు లంకాప్రాకారంబులను బీడింపుచు విడిసిరి తగిన స్థలంబున దండంతయు విడిసెను కుముదుడు జయశాలురగు పదికోట్ల వానరులచే బరివృతుండై స్కంధ వారమందలి తూర్పు ద్వారమందుండెను ప్రమసుడు, పనసుడను వానర వీరులు సేనాసమేతులై కుముదునకు జేయూత నొసంగుచు పూర్వ ద్వారంబుననే యుండిరి శతబలి ఇరువది కోట్ల వానర యూథంబుతో గూడి యాస్కంధావార దక్షిణ ద్వారంబు నావరించి నిల్చియుండెను తారాజన కుండైనసుషేణుడరువదికోటుల వానరసేనతో స్కంధ వారా పశ్చిమ ద్వారంబునావరించి నిల్చియుండెను రామలక్ష్మణులు సుగ్రీవునితో గూడి స్కంధ వారోత్తరద్వారంబున నుండిరి గవాక్షుడు కోటి గోలాంగూలంబులచే బరివృతుండై శ్రీరామచంద్రుని పార్శ్వ భాగమందు నిల్చి యుండెను ధూమ్రుడు కోటి భల్లూకంబులను గూడి దశరథసుతుని పార్శ్వభాగంబున నిల్చియుండెను విభీషణుడు మైమఱువును దొడగి గదాపాణియై యుద్ధసన్నద్ధులై యున్న సచివోత్తములను గూడి రాముని చెంతజేరి యుండెను గజుడు గవాక్షుడు గవయుడు శరభుడు గంధమాదనుడు సమస్త ప్రదేశములందును విహరింపుచు వానర వాహినులను రక్షించుచుండిరి

## రావణుడు యుద్ధమునకు బొమ్మని తన సేనలకాజ్ఞ నొసంగుట

రావణుడు వానరసేనాసన్నివేశక్రమంబంతయు బరికించి మహోద్రేకుడై తన సేనాసముదయమునంతయు సమరంబునకు వెడల నాజ్ఞాపించెను రావణుడాజ్ఞాపించిన తోడనే నిశాచరులందఱు భయంకర ధ్వనులతో సింహనాదంబులు గావించి లక్షలు లక్షలుగా మహాధ్వనులీనెడు

శంఖంబుల బూరించిరి ఆభరణ భూషితులైనీలాంగములతో శంఖంబులను దాల్చి రాక్షసులు మెఱపులతో గూడిన మేఘంబులకైవడి తళతళ మెఱయుచుండిరి రావణుని యాజ్ఞకు బద్ధులై సైనికులందఱు సంతుష్టులై ప్రళయకాలమందు మహోదధి ప్రవాహంబు కరణి బయలు దేరిరి

త్రికూట పర్వత మంతయు వ్యాపించునట్లు వనచరులు భయంకరమైన సింహనాదములొనరించిరి వానరరాక్షసుల సింహనాదంబులు శంఖదుందుభిధ్వనులతో నిండి భూమ్యాకాశంబు లనంతయు వ్యాపించెను రాక్షసుల సింహనాదంబులను గజబృంహితంబులును, గుఱ్ఱంబుల హేషాధ్వనులును రథంబులనేమి ధ్వనులును నొండొంటితో లీనమై చెలంగుచుండెను

## రాక్షసులకును వానరులకును యుద్ధమారంభమగుట

ఇంతలోనే పూర్వము దేవాసురులకుంబోలి రాక్షసులకును వనచరులకును, ఘోరయుద్ధమారంభమయ్యెను నిశాచరులు తమ బలపరాక్రమంబులనుగ్గడించుకొనుచు గదలచేతను, శక్తి శూలాదులచేతను గొడ్డళ్లచేతను, కపులనుప్రహరించిరి వానరేంద్రా! సర్వోత్కర్షంబున నుండుమని యుద్ఘోషింపుచు తమతమ వృత్తాంతంబుల నుగ్గడింపుచు భూజంబుల చేతను, పర్వత శిఖరంబుల చేతను, దంతనఖంబులచేతను, నిశాచరులను వనచరులు గొట్టిరి రాక్షసులు ప్రాకారంబుపైనుండి భిండివాలంబులచేతను, కరవాలంబులచేతను, భూమిపైనున్న వానరవీరులను ప్రహరించిరి భూమిపైనున్న వానరులు మహోద్రేకులై ప్రాకారంబులపై కెగిరి రాక్షసులను నేలబడద్రోసిరి ఆ సమయంబున రాక్షస వీరులకును, వానర వీరులకును గలిగినతుముల యుద్ధము మాంసశోణిత కర్దమమై యత్యాశ్చర్యంబును గొల్పుచుండెను

ఎదురులేని వానరుల ఘోరయుద్ధమును రాక్షసులు జూచి సహింపనేరక రాక్షస రాజునకు జయంబుగోరుచు బంగారు శేఖరంబులతోనలరారెడు తురంగముల తోడను, అగ్ని జ్వాలలంబోలిన ధ్వజంబుల తోడను, సూర్యబింబమును బోలిన రథంబులతోడను,

సుందరంబులగు కంటకంబులతోడను, దశదిశలు మాఱు మ్రోగునట్లు సింహనాదంబులొనరించుచు సంగరంబునకు బయలుదేరిరి వానరులు గూడ కామరూపులైన రాక్షసుల నెదుర్కొనుటకై యుద్ధోత్సాహంబున నడచిరి అప్పుడిరుగెలంకుల వారికిని ద్వంద్వ యుద్ధంబు జేకూరెను మహాతేజోనిలయుడగు ఇంద్రజిత్తు వాలిసుతుండగు అంగదునెదుర్కొని ముక్కంటితో మృత్యువు బోరాడునట్లు భండనంబు గావించెను విభీషణుని సచివుండగు సంపాతి ప్రజంఘునితో బోరు సలిపెను పవనాత్మజుండు జంబుమాలితో సమరంబు గావించెను విభీషణుడు మిత్రఘ్నుడను రాక్షసునితో రణంబొనరించెను గజుడు తపనుడను రాక్షసునితో యుద్ధంబు గావించెను నీలుడు నికుంభునితో బవరంబుగావించెను సుగ్రీవుడు ప్రఘసుడను రాక్షసునితోడను, లక్ష్మణుడు విరూపాక్షునితోడను, మోహరమొనరించిరి మైందద్వివిదు లిరువురును, వజ్రముష్టి, అశనిప్రభుడను రాక్షసులతో భయంకరముగ బోరిరి ప్రతపనుడను రాక్షసునితో దీక్షణ ప్రతాపుడగు నలుడు సంగరమొనరించెను సుషేణుడను వానరోత్తముడు విద్యున్మాలితో సమరంబు గావించెను నగచరులందఱు పెక్కంద్రనిశాచరులతో వివిధ రీతుల ద్వంద్వయుద్ధంబుగావించిరి వానర రాక్షసులకు రోమహర్షణంబగు తుముల యుద్ధము గలిగెను నగచర నిశాచరుల దేహములనుండి రుధిరవాహినులు ప్రవహించెను

ఇంద్రజిత్తు క్రుద్ధుడై వజ్రాయుధంబునకు దుల్యమగు గదచేత నంగదుని గొట్టెను ఆయంగదుడు కాంచనాలంకృతంబగు యింద్రజిత్తుని రథంబును సారథిని, వారువంబులను నుగ్గుగావించెను ప్రజంఘుడు సంపాతిని మూడమ్ములతో గొట్టి బాధించెను అతడాయమ్ములచే నొప్పింపబడి రణరంగమందు నశ్వకర్ణవృక్షంబుచే ప్రజంఘుని బట్టి బరిమార్చెను జంబుమాలి రథగతుండై క్రోధాగ్ని ప్రజ్వరిల్ల రథశక్తిని గొని హనుమంతుని వక్షస్థలంబున బాదెను సమీరనందనుడతిత్వరితగతుండై జంబుమాలి రథంబుపైకుఱికి యతనింబట్టి యుఱచేతంజఱచెను ప్రతపనుడు గర్జించుచు నళుని పైకిగవిసి బాణంబులను బ్రయోగించెను ఆ తీక్ష్ణబాణంబులచే నొప్పింపబడిన నళుండా రాక్షసుని కన్నులను బెఱికి

వైచెను వానర సైన్యమంతయు మ్రింగునోయన్నట్లునోఱుదెఱచుకొని బిరబిరవచ్చుచున్న ప్రమసుని సుగ్రీవుడు సప్తవర్ణవృక్షంబును గైకొని ప్రహరించి వధించెను అగ్నికేతుడు, రశ్మికేతుడు సుప్తఘ్నుడు యజ్ఞకోపుడనువారు రామునిపై నానావిధములైన బాణంబులను ప్రయోగించిరి రాముడది జూచి యగ్నిజ్వాలలవంటి నాల్గు కఱకు బాణములచే నా రాక్షసుల శిరంబులను నేలగూల్చెను వజ్రముష్టి మైందుని పిడికిట పోటులచే బొడువంబడి కోట బురుజు వోలె నేలగూలెను నికుంభడను నిశాచరుండు నీలుని కఱకు బాణములచే నొవ్వంజేసి నవ్వెను నీలుడానికుంభుని రథచక్రమునుంగొని సారథిశిరంబును దెగవేసెను ద్వివిదుడు రాక్షసులందఱు జూచుచుండగనే యుద్ధంబున నశని ప్రభుని బర్వతశిఖరంబుచేత బ్రహరించెను పర్వతంబులచే బవరంబు సేయుచున్న వానరోత్తముని ఆ యశని ప్రభుండు పిడుగులకెనయైన కఱకు బాణంబులచే నొవ్వంజేసెను బాణఘాతంబులచే నొవ్వబడిన ద్వివిదుడు క్రోధారుణలోచనుడై సాలవృక్షంబు నొకదానిని గైకొని యశనిప్రభుని రథాశ్వంబులతో గూడతుత్తునియలు గావించెను విద్యున్మాలి సుషేణునిపై బాణవృష్టిని గురిపించి సింహనాదంబు గావించెను వానరోత్తముడు రాక్షసుని రథంబుపై పెద్ద పర్వతంబును వైచి నుగ్గుగావించెను ఇవ్విధంబున విద్యున్మాలియు సుషేణుడును ఘోర సంగ్రామ మొనరించిరి ఎట్టకేలకు రాక్షసుడుగత ప్రాణుండై నేల కొఱగెను వానరవీరులు రాక్షస వీరుల నెందఱినో ద్వంద్వయుద్ధంబున వధించిరి తునిసిపడిన కరవాలముల చేతను గదలచేతను శక్తుల చేతను, దోమరంబులచేతను, పట్టి సంబులచేతను విఱిగిపడిన రథంబులచేతను నిహతంబులగు గజతురంగములచేతను, భయంకరముగా భక్షణార్థమై విహరించుచున్న గోమాయువులచేతను, యుద్ధభూమి భీభత్సముగా నుండెను దేవాసుర యుద్ధమునకు దుల్యమైన యాదొమ్మి యుద్ధమందు వానర రాక్షసుల మొుండెములు దిక్కులకు జెదరుచుండెను రాక్షసులు రక్తసిక్తములగు దేహములతో దమకు బలంబొన గూర్చెడు సూర్యాస్తమయంబు రాగోరుచు భండన మొనరించుచుండిరి

## ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశంబులచే బంధించుట

అవ్విధంబున వానర రాక్షస వీరులు సమరంబు జేయుచుండగానే సూర్యుడస్తమించెను వానర ప్రాణహారిణియగు రజనీకాంతరయంబున వచ్చెను నలుదెసలనుండియు తిమిరంబులావరించెను ఆయంధకారంబున వనచరులు నిశాచరుండని దలంచి వానరుని, రాక్షసులు వానరుండని దలపోసి రాక్షసుని కన్నుమిన్ను గానక నొండొరులను గొట్టుకొనిరి వధింపుము చీల్చివేయుము పోవలదురమ్ము ఏల పరుగెత్తెదవు అనియెడు ధ్వనులాయంధకారమునందు దుములంబుగా వినబడినవి రాక్షసులు వానరులను భక్షించుచు విహరించుచుండిరి వానర సేన రాక్షస సేనను బాధింపదొడంగెను రామలక్ష్మణులు పెక్కండ్రు రాక్షసులను బాణాగ్నిచే దగ్ధముగావించిరి యుద్ధభూమి రక్తప్రవాహముచే భయంకరముగా నుండెను ఒండొరులను బ్రహరించుకొనుచు గర్జించుచున్న వానర రాక్షసుల గర్జా ధ్వనులతి భయంకరముగా వినబడుచుండెను ఆ సమయంబున భయంకరంబగు కాళరాత్రియందు మేటిరాక్షసులు బాణవర్షమును గురిపించుచు రామునిపైబడిరి ఆ రాక్షసులు గర్జించుచున్న ధ్వనులు ప్రళయకాలంబున నుప్పొంగు సప్తసముద్రముల శబ్దమును బోలియుండెను రాముడాఱు బాణములచేత నార్వురు రాక్షసులను గొట్టెను మహాపార్శ్వుడు, మహోదరుడు, మహాకాయుడు, వజ్రదంష్ట్రుడు, శుకసారణులను రాక్షసులార్గురును రాముని బాణాగ్ని జ్వాలలచే బీడింపబడి మహాసంగ్రామము నుండి దొలగి ప్రాణంబులను దక్కించుకొనిరి రామునకెదురుగానిలువంబడిన రాక్షసులందఱు నగ్నిహోత్రంబున దుమికి నశలభంబులవౌడ్కి నాశంబునొందిరి

బంగారు పింజలుగల బాణజాలంబులు ప్రయోగింపబడు కతంబున మిణుగురుపురువులతో గూడిన శరన్నిశీథంబు వౌడ్కి నొప్పారుచుండెను వానర రాక్షసులు చేయుచుండు సింహనాదములచే బెక్కు గహ్వరంబులతో గూడిన త్రికూట పర్వతము ప్రతిధ్వనుల

నీనుచుండెను నీలాంగులగు గోలాంగూలంబులు రాక్షసులను గౌగిలించుకొని భక్షింపసాగిరి అంగదుడు తన ప్రతివీరుడగు ఇంద్రజిత్తు సారధిని గుఱ్ఱములను దునుమాడెను రధంబు శిధిలమగుటంజేసి రావణుని నందనుడు అంతర్ధానమయ్యెను దేవతలును మహర్షులును, రామలక్ష్మణులును అంగదుని గొనియాడిరి సర్వభూతములును మోదవార్ధిని దేలియాడెను సుగ్రీవుడు విభీషణుడు వానరులు ఇంద్రజిత్తునకు బరాజయంబు గలిగించిన వాలిసుతుని బ్రశంసించిరి పరాజయమొందిన యింద్రజిత్తు దారుణంబగు కోపంబు బూనెను

అట్టి తరుణమందు రాముడు వానరులను జూచి యిట్లు జెప్పెను వనచరులారా! మీరందఱు సుగ్రీవునితో గూడ జాగరూకులైయుండుడు ఈ యింద్రజిత్తు బ్రహ్మవలన వరంబులను బడసి ముజ్జగంబులను మిగుల బాధించుచుండెను ఇప్పుడా రావణుని సుతునకు మృత్యువాసన్నమైనది మన కార్యము సిద్ధించుటకే నిటు వచ్చినాడు మీరందఱు నాకొఱకు సహించి యుండవలసినదిగా గోరుచున్నాను ఆ పాపాత్ముడంతర్ధాన విద్యచే నదృశ్యుడై పిడుగులకైనయైన తీక్ష్ణబాణంబులను బ్రయోగించుచున్నాడు మీరు దిగులొందవలదని రాముడు జెప్పెను అ సందర్భమున నింద్రజిత్తు మహోద్రేకుడై రామలక్ష్మణులపై నాపాదమస్తకంబుదనుక భయంకరమైన నాగబాణంబులను బ్రయోగించి కపటయుద్ధము గావించుచు మాయచే సర్వభూతంబులకదృశ్యుడై వానరసేనను మోహంబు నొందించుచు రామలక్ష్మణులను బంధించెను అట్లు నాగబాణంబులచేత బంధింపబడిన పురుషోత్తములను వానరులు దిలకించి మిగుల చింతనొందిరి

రాముడది జూచి యింద్రజిత్తు కపటయుద్ధమెచటనుండి జేయుచున్నాడో కనుగొని రమ్మని నీలుడు, అంగదుడు, శరభుడు, జాంబవంతుడు, వినతుడు, సానుప్రస్థుడు, ఋషభుడు, ఋషభస్కంధుడను వారికిని సుషేణుని సుతులకిరువురకును నాజ్ఞనొసంగెను ఆ పదిమంది వానరోత్తములు పరమామోద మొందుచుచు మహాభూజంబులను భుజంబులపై నిడుకొని దశదిశలయందును, యింద్రజిత్తునన్వేషింపుచు నాకసంబునకుద్గమించిరి కాని పరమాస్త్ర వేత్తయగు ఇంద్రజిత్తు బ్రయోగించెడు బాణఘాతంబులచే బిన్నగాత్రులై

మేఘావృతుడగు దినకరునివోలె నంధకారమునదాగి యున్న రాక్షస సుతుని వృక్షచరులు గాన్వరైరి, సూదిమొనమోపుటకైనను అవకాశము లేని యట్లు రామలక్ష్మణులపై గఱకు బాణంబులను రాక్షసుడు ప్రయోగించెను దశరథనందనుల దేహములనుండి రుధిరధారలొలుకు చుండ పుష్పితంబులగు ఫలాశవృక్షముల మాడ్కి బ్రకాశింపదొడంగిరి

అప్పుడు కాటుక రాశియుంబోలె నీలవర్ణుడగు నాయింద్రజిత్తు మిగులకోపోద్రేకుడై రామలక్ష్మణులను జూచి యిట్లనియెం దశరథాత్మజులారా! నేనంతర్థానమునొంది భండనం బొనరించుచుండ సురేంద్రుడు గూడ నన్నుజూడ జాలడయ్యెను అతడు సమీపించుటకు గూడ వెఱచి యశక్తుడై దూరముగనుండెను పాపము మీ సంగతి వేఱుగా జెప్పుటేమున్నది? మీరు మానవులు నాతో బోరుటేడ? నాగపాశబద్ధులైతిరి ఇప్పుడే మిమ్ములను యమసదనంబున కనిపెదను నాకోపము వ్యర్థముగాదు చూడుడని రామలక్ష్మణులతో జెప్పుచు సింహనాదము గావించెను అమ్మహాయుద్ధంబున నీలవర్ణుడగు యింద్రజిత్తు తన విశాలమగు ధనువును సారించి మాటి మాటికిని తీక్ష్ణములగు బాణాగ్నిని గురిపించి రామలక్ష్మణుల మర్మస్థానంబులను నొప్పించెను నెత్తుటందోగుచు భిన్నాంగములు గలవారై శరబంధంబున బద్ధులై యశక్తులై యార్తులై యుద్ధభూమియందు రాజనందనులు శయనించి యుండిరి సెలయేఱులనుండి జలంబు బ్రవహించుచందంబున దశరథసుతుల దేహంబుల నుండి రక్తధారలు ప్రవహించుచుండెను బాణమయతల్పంబున బరుండియున్న పురుషోత్తముడగు రాముని లక్ష్మణుడు జూచి బ్రతుకుపై నాశవీడి మిగుల దుఃఖించెను వనచరులందఱు రాముడు నేలబడియుండుటెఱింగి దుఃఖాబ్ధి నీదిరి హనుమంతుడు మొదలుగా గల వానర ప్రముఖులందఱు యుద్ధభూమియందు బవ్వళించియున్న రామలక్ష్మణులను బరివేష్టించి నిలువంబడి మిక్కిలి యార్తులై దుఃఖాంబుధి నిమగ్నులైరి వర్షించి నిల్చువారి వాహకంబుకైవడి నాయింద్రజిత్తు తన కార్యంబును నెరవేర్చియు పరమించెను అప్పుడు విభీషణుడు సుగ్రీవుడు రాముడున్న స్థలంబునకు వచ్చిరి హనుమంతుడు, నీలుడు, ద్వివిదుడు, మైందుడు, సుషేణుడు, కుముదుడు, అంగదుడు, నెత్తురుచే దడుపబడి

బాణసమూహావృతదేహులై నిశ్చలులై గాఢ నిట్టూర్పులను బుచ్చుచున్న రామలక్ష్మణులను గాంచి దుఃఖించిరి వానరులెటు జూచినను యింద్రజిత్తును గనుంగొన జాలరైరి విభీషణుడు మాయనవలంబించి చూచి మాయాచ్ఛాదితుడగు నాయింద్రజిత్తును గనుంగొనెను తన ప్రభావముచేత రామలక్ష్మణులు పడియుండుటెఱింగి సంతుష్టాంతరంగుడై రాక్షసులను సంతోషింప జేయుచు నిట్లనియె

రాక్షసులారా! ఖరదూషణాదులను వధించిన మహాబలశాలురగు రామలక్ష్మణులు నాశరపరంపరలచే నాశంబునొంది యున్నారు చూడుడు సురాసురులకును మహర్షులకును, రామలక్ష్మణులను నాగపాశ బంధమునుండి విడిపింపనలవిగాదు ఏ రాముని నిమిత్తమై నాతండ్రియగు రాక్షసేంద్రుడు దుఃఖపీడితుడై నిద్రాహారంబులుమాని చింతాచితిని మ్రగ్గుచుండెనో యట్టి రాముని నేడు వధించితిని వర్షర్తువునందు నదీజలంబువోలె నాకులంబునొందెడు జనులందఱు సంతోషమొందునట్లు రాజకుమారులను దునుమాడితిని రామలక్ష్మణుల విక్రమంబును వానరవీరుల వీర్యంబును, శారదనీరదములవోలె వ్యర్థములైనవని యింద్రజిత్తు రాక్షసులతో జెప్పెను అట్లు చెంతనున్న రాక్షసులతో జెప్పి రావణనందనుడు నీలుని, మైంద ద్వివిదులను, జాంబవంతుని, హనుమంతుని, గవాక్షశరభులను, అంగదుని అగ్నిజ్వాలలవంటి కఱకు బాణంబులచే నొప్పించి తోడి రాక్షసులను జూచి పకపక నవ్వుచు రామలక్ష్మణులు హతులై నేలబడి యున్నారు చూడుమనెను రాక్షసులమితాశ్చర్యమొందిరి సంతుష్టులై సింహనాదంబులు గావించుచు నింద్రజిత్తును బూజించిరి రామలక్ష్మణులు మృతిబొందిరని నిశ్చయించి ఇంద్రజిత్తు పరమామోదమందుచు లంకాపురంబు బ్రవేశించెను

## రామలక్ష్మణులకు భయములేదని విభీషణుడు సుగ్రీవునితో జెప్పట

రామలక్ష్మణుల దేహంబులాపాదమస్తకమును బాణమయమైయుండుటం సుగ్రీవుడు జూచి భయపడికన్నీళ్లు గార్చుచుండెను

వెలవెలంబోవుచు బాష్పములొలుక బోయుచున్న సుగ్రీవుని విభీషణుడు జూచి యిట్లనియె సుగ్రీవా! భయంబు వదలుము బాష్పకణంబులు విడువకుము యుద్ధంబులన్నియు నిట్టివే! సర్వకాలములయందును జయమే చేకూరదు మన భాగ్యవశంబున మహాత్ములగు రామలక్ష్మణులు త్వరలో మూర్ఛదేఱగలరు వానరేంద్రా! నీవు ధైర్యంబు బూని నాకును ధైర్యంబు గలిగింపుము సత్యమును, ధర్మము నవలంభించియున్న సత్పురుషులకు మృత్యుభయంబుగలుగునా? దుఃఖింపవలదని జలంబును గైకొని మాయామోహని వారకరంబగు విద్యచే నభిమంత్రించి విభీషణుడు సుగ్రీవుని కన్నులను దుడిచి మఱియు నిట్లనియెం సుగ్రీవా! అధైర్యపడుటకిది సమయంబుగాదు సుమా! సమస్త కార్యంబులకును హాని గలిగించెడు యధైర్యమును దూరముగ బోదోలి రాముని నమ్మి వెంబడించి వచ్చిన వానరసైన్యమునకు శ్రేయంబుగలిగించుట కాలోచింపుము రామలక్ష్మణులకు మూర్ఛదేఱువఱకుజాగరూకులై రక్షింపుడు త్వరలోనే మూర్ఛదేఱి మనభయంబును బోగొట్టగలరు వీరికేయుపాయములేదు ప్రాణభయమంతకులేదు వానరులు భయపడి వికృతాంగులై పలాయన మంత్రమును పఠించెదమని యొకరిచెవిలో నొకరు గుసగుస లాడుకొనుచున్నారు నీవు ధైర్యమవలంబించి నీ సైన్యము నాశ్వాసింపుము నేను నలుదిశలయందును సంచరించి సైన్యమునకు సంతోషమొనగూర్చెదను వానరులు తొలినాడు ధరించిన కుసుమదామములను బాఱవైచుభంగి భయమును విడుతురని విభీషణుడు సుగ్రీవునితో చెప్పి భయముచేత నఱచుచున్న వానర సైన్యము నాశ్వాసించెను

మహామాయావియగు ఇంద్రజిత్తు సైన్యసమేతుడై లంకాపురంబు జొచ్చి నిండోలగంబుననున్న తండ్రిని జేరంజని నమస్కరించి రామలక్ష్మణులను వధించి వచ్చితినని ప్రియమార బలికెను ఆ ప్రియవార్తనాలకించి రావణుడపరిమితమోదడోలనూగుచు నాసనంబున నుండి దిగ్గనలేచి కుమారుని బిగికౌగిట జేర్చి నాయనా! రామలక్ష్మణుల నెట్లు వధించితివి? ఆవిధమంతయు దెలుపుమనిన నాగపాశబద్ధులను గావించి తానొనరించిన విధమంతయు విశదముగ దెల్పెను ఇంద్రజిత్తు

మాటలాలకించి రావణుడు పరమసంతుష్టుడై రామభయంబువలన గలిగిన సంతాపమును విడిచి కుమారుని మెచ్చుకొనెను

## యుద్ధంబున హతులై పడియున్న రామలక్ష్మణులను సీతకు జూపుమని రావణుడు రాక్షస స్త్రీలతో జెప్పుట

హనుమంతుడు, అంగదుడు నీలుడు, సుషేణుడు కుముదుడు నలుడు, గజుదు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు జాంబవంతుడు ఋషభస్కంధుడు, రంభుడు శతబలి పృధువను వానరోత్తములందఱు శోకవ్యాకుల చిత్తులై రామచంద్రుని బరివేష్టించి కాచియుండిరి వానరసైన్యమును వ్యూహంబుగా దీర్చి వృక్షములను చేతంబూని వానర ప్రముఖులందఱు జాగరూకులై నలుదెసలను బరికించుచుండిరి

అప్పుడు రావణుడమితానందమొంది ఇంద్రజిత్తును బంపి సీతకు గావలియున్న రాక్షసాంగనలను బిలిపించి యిట్లనియె త్రిజటాది రాక్షసాంగనలారా! ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు విగతజీవులై రణరంగమందు బడియున్నారని సీతకు దెలిపి పుష్పకంబుపై నెక్కించుకొని పోయి రామలక్ష్మణులను జూపుడు ఎవ్వనినండగాగొని గర్వించి నాకు వశంబు గాకుండెనో యట్టి సీతతో దనకండగానున్న రాముడు నిహతుడయ్యెనని విశదపఱపుడు ఇంకెక్కడి రాముడు? నిర్విచారయై దుఃఖమును వీడి నన్ను బొందగలదు నన్ను కన్నెత్తియైనను జూడక నిరంతరము ధ్యానించుచున్న తన జీవితనాధుడిక దక్కడని విశాలాక్షియగు సీతకెఱిగింపుడు తనకు దానే నన్ను బొందగల సమయమాసన్నమైనదని రావణుడు రాక్షస స్త్రీలతో జెప్పి రామలక్ష్మణులు యింద్రజిత్తుచే జంపబడిరని చాటించెను ఆ స్త్రీలు తమ రాజాజ్ఞ మేరకు బుష్పక విమానంబును దీసికొని యశోకవనంబున కేగి భర్త వియోగముచే గృశియించియున్న సీతను పుష్పక విమానంబుపై నెక్కించుకొని పోయి యుద్ధభూమియందు బడియున్న వానరసేనను, రామలక్ష్మణులను జూపిరి

రాక్షసులందఱు సంతోషముతోనుండుటయు వానరలు రామలక్ష్మణులచే చేరువలో దుఃఖార్తులై యుండుటయు శిథిలములైన కవచములతో ధనస్సులను జాఱవిడిచి బాణపూతంబులచే గాయములు గలదేహములతో ఎర్రబారి బడియున్న రామలక్ష్మణులను జూచి మృతిబొందిరని తలంచి దుఃఖపరవశురాలై యిట్లు విలపింప దొడంగెను

## యుద్ధభూమి యందు నాగపాశబద్ధులై పడియున్న రామలక్ష్మణులను జూచి సీత దుఃఖించుట

హా! నన్ను బుత్రవతి యనియు, వైధవ్యము దరిజేరదనియు సాముద్రిక లక్షణమెఱింగినవారు మునుపు జెప్పియుండిరి గదా! ఇప్పుడు నాజీవితేశుడు నిహతుడగుట వలన వారిపలుకులసత్యములైనవి నాప్రియుడశ్వమేధయాగములొనరించుననియు, సత్రంబులు గావించుననియు మహాత్ములు నుడివి యుండిరి ఇప్పుడమ్మహాత్ములందఱు కల్లలాడిరని దోచుచున్నది మునుపు జ్యోతిశ్శాస్త్రవేత్తలగు భూసురులందఱు నన్ను మంగళకరియని చెప్పియుండిరి ఇప్పుడు నాప్రాణేశుడు హతుండయ్యె వారందఱు అబద్ధము జెప్పిన వారలైరి వీరశిఖామణి యగు రాజసుతునకు భార్యవు గ గలవు ధన్యాత్మురాలవని జెప్పిన జ్యోతిశ్శాస్త్రవేత్తల మాటలేమైనవి? పద్మరేఖలు నాపాదములయందు స్పష్టముగా గోచరించుచున్నవి ఈ రేఖలు గల స్త్రీలు మహా రాజులకర్ధాంగులై సామ్రాజ్య పట్టాభిషిక్తులగుదురని శాస్త్రకోవిదులు జెప్పుదురుగదా! వనితలు నిర్భాగ్యులై వైధవ్యంబు నొందెడు దుష్టలక్షణము లెంతవెదకినను నాకు గానరావు నాకున్న శుభలక్షణములెందుబోయెను? మహాఫలంబొనగూర్చెడు పద్మాకారరేఖలు వ్యర్థములైపోయెనా? నాకేశంబులు సూక్ష్మములై సమములై నీలముగానున్నవి నాకనుబొమలు కలియుకున్నవి నాపిక్కలు గుండ్రములై వెండ్రుకలు లేకున్నవి నాదంతములు విరళముగాక దట్టముగా నొకటితో నొకటి గలిసియున్నవి లలాట ప్రదేశములును నయనంబులును, కరచరణంబులును, చీలమండలును, తొడలును బలిసియున్నవి నాప్రేళ్లు గుండ్రములై నఖములచే నొప్పారుచు స్నిగ్ధములై సమముగా నున్నవి

నావక్షోజములొండొంటిచే నొరసికొని మొనలు పల్లముగా నుండి చక్కగా బలిసియున్నవి నాభియు మిక్కిలి లోతుగలిగి యున్నతములగు పార్శ్వములతో నొప్పారుచున్నది నాతనుద్యుతిరత్నంబును బోలె స్నిగ్ధముగా నున్నది నాదేహములోనున్న వెంట్రుకలతిమృదువుగానున్నవి నీపాద సరోజములలోని పదిప్రేళ్లను భూమినానియుండుటంజేసి శుభలక్షణాంగివని శాస్త్రజ్ఞులునుడివిన వాక్యములేమైనవి నాకరచరణంబులు బూర్ణమై నయవాకారరేఖతో నొప్పారుచు ప్రేళ్లయందెంత మాత్రము సందులేనివై కాంతులను వెదజల్లుచున్నవి సదామందహాసోర్మిచలితమై వెలయుచుండువన్న బ్రాహ్మణుల వాక్యములన్నియు రిత్తవోయినవి రామలక్ష్మణులు జనస్థానమంతయు నాకొఱకు వెదకి వెదకి వేసారి నాజాడ దెలిసి సముద్రమును దాటి లంకాపురంబుజేరి యింద్రజిత్తు మాయావాగురంబున దగుల్కొని హతులైరిగదా!

సోదరులిరువురును వారుణాస్త్రమును ఆగ్నేయాస్త్రమును ఐంద్రాస్త్రమును, వాయువ్యాస్త్రమును బ్రహ్మశిరోనామకాస్త్రములను బొందియుండిరే! ఆ యస్త్రజాలమిపుడెచ్చటికి బోయెను నే ననాథనైతిని గదా! మనోవేగముగల శత్రువు కంటబడినను నశింపజేయునట్టి రాముడు సోదరునితోగూడ యుద్ధమందు నేలబడియుండుట కాలవైపరీత్యముగాక మరేమున్నది? కాలవాహిని కశక్యమేదియులేదు దైవమునకెదురేమియు నుండదుగదా! పదునాల్గుసంవత్సరములరణ్యవాసము గడిపి సీతాలక్ష్మణ సమేతుడై వచ్చుచున్న రామునియెన్నడుజూతునోయని కాంక్షలూరుచున్న కౌసల్యయేమగునో! ఆమెను దలంచుకొన్నచో నాహృదయము బ్రద్దలగుచున్నది హా రామా! హా లక్ష్మణా! నాగతియేమని విలపించెడు శ్రీరాముని సతీరత్నమును గాంచి త్రిజట యిట్లోదార్చెను

సీతా! దుఃఖింపవలదు నీ జీవితనాథుడు జీవించియున్నాడు లక్ష్మణుడు గూడ సజీవుడై యున్నాడు వారిరువురి ముఖాంబుజములు కళలొలుకుచున్నవి యోధులందఱు కళారహితులుగాకున్నారు రామలక్ష్మణులే మృతిబొందియున్నచో స్వర్గంబున జన్మించిన యీ పుష్పక విమానము నిన్నిట్లు వహింపదు వానర సైన్యమంతయు దొట్రుపడక భీతిజెందక జాగ్రత్తతో సోదరులిరువురిని రక్షించుచున్నది

భయమందవలదు అమ్మా! నీ యందలి నాకుగల స్నేహముచేత నీకింతదూరము జెప్పితిని ఎన్నడును నీతోనే నసత్యము పలికి యెఱుంగను ఇంకముందుకు గూడ నసత్యము బలుకను నీవు మహాపతివ్రతవు అందుచేత నాకు నీయందు వాత్సల్యము గలిగినది రహస్యమెఱిగించితిని అమరేంద్రునితోనేకీభవించి సురాసురులెదురొడ్డి నిల్చినను రామలక్ష్మణులను యుద్ధమందు జయింపగలుగుదురా? అన్నదమ్ములు మూర్ఛలోమునింగియున్నను ముఖపద్మములు కాంతిదఱుగకున్నవి జీవించియే యున్నారు సందియమూవంతయులేదు నీవిట్లు మూర్ఛజెందుచు బలుమాఱు దుఃఖాబ్ధి నీదకుము పోదము రమ్మని త్రిజట సీతనోదార్చెను సురసుతోపమానయగు సీత త్రిజట వాక్యములాలకించి నమస్కరించి త్రిజటా! నీమాట ప్రకారమే రామలక్ష్మణులు సజీవులై యుండెదరు గాక! యని బదులు పలికెను త్రిజట రాక్షస స్త్రీలతో గూడ మనోవేగమునకెనయైన పుష్పక విమానంబులో సీతను గొనిపోయి యశోకవనంబు జేర్చెను జనకాత్మజ దశరథసుతులను దలపోసి మిక్కిలి శోకించెను

సుగ్రీవుడాదిగాగల వానరోత్తములందఱు నాగపాశబద్ధులగు రామలక్ష్మణులను బరివేష్టించి దుఃఖార్ణవంబున మగ్నులై యుండిరి ఆ సమయంబున వీర్యవంతుడును, ధీశాలియగు రామచంద్రుడు మూర్ఛదేరి గాఢమైన బాణఘాతంబులచే బాధింపబడుచు రక్తసిక్తమైన దేహములో దీనవదనుడై పడియున్న లక్ష్మణుని జూచి భరింపరాని దుఃఖాబ్ధి నీదుచు నిట్లులనియె

## నాగపాశబద్ధుడైన లక్ష్మణునిజూచి రాముడు దుఃఖించుట

హా! సమరంబున నిర్జితుడై భూమిపైబడి పొరలుచున్న తమ్ముని కన్నులారా జూడగంటినే! ఎంతటి నిర్భాగ్యుడను, ఇక నాప్రాణంబులతో గాని సీతతోగాని పనియేమున్నది? భూమండలమంతయు నన్వేషించినచో భూసుతకు సాటియైన వనితామణిని సంపాదింపవచ్చును గాని లక్ష్మణునిబోలిన తమ్ముని బడయనగునా? సుమిత్రానందనుడు లేని నాజీవితమేల? ఈ వానరులందఱు జూచుచుండగనే ప్రాణంబులు

విడిచెదనం నేనయోధ్యకేగి నాతల్లులకేమని చెప్పుదునం? పుత్రదర్శనలాలసయగు సుమిత్రాదేవి నాసుతునెక్కడ విడిచి వచ్చితివన్న నేనేమి జెప్పుదును భరత శత్రుఘ్నుల ముఖమెట్లు జూడగలను? అయ్యో! నేనెట్లు సహించి జీవింతును? న నిమిత్తమై లక్ష్మణుడు బాణతల్పంబున తనువు మఱచిపడియున్నాడు గదా! నేనెంత పాపకర్ముడను దుష్టుడను ఔరా! రక్కసులను విలుతుమార్చిన లక్ష్మణుడిపుడు శత్రువులచే నిహతుడై పడియున్నాడు నేనరణ్య వాసము వచ్చునపుడు వెంబడించి వచ్చిన నాసోదరుని వెంబడించి యమసదనంబునకేగెదను వేయిజేతులు గల కార్తవీర్యునతిక్రమించి బాణంబులుప్రయోగించెడు వీరాధివీరుండగు లక్ష్మణుడు హతుడై నేలబడియుండుటకేమని వగతును విభీషణునకు లంకాధిపత్యమొసంగెదనని బాసనొసంగితిని ఇప్పుడసత్యవాదినైతిని ఈయనృతవాక్యమే నన్ను దహించు ననుటలో సందియములేదు సుగ్రీవా! నీవిప్పుడే బయలుదేరి కిష్కంధనుజేరుకొమ్ము నేనులేని తరుణంబు గనుంగొని రావణుడు నిన్ను తఱిమికొట్టును అంగదుని వెంటనిడుకొని సమస్త వానరసైన్యముతోగూడ సముద్రమును దాటిపొమ్ము నీలుడు, నలుడు హనుమంతుడు, జాంబవంతుడు గవాక్షుడు అంగదుడు, మైందద్వివిదులు కేసరి, సంపాతి గవయుడు, శరభుడు గజుడు మొదలగు వానరోత్తములందఱు నా నిమిత్తమై ప్రాణములయందాసనువీడి చక్కగా సమరంబు గావించిరి వానర రాజా! ఎంత ప్రయత్నించినను దైవము నతిక్రమించుటకు మానవులకలవిగాదు నీవు ధార్మికుడవై శక్తివంచన లేకుండ స్నేహితుని కార్యమొనరించితివి వానర వీరులారా! మీరందఱు త్యాగశీలురై మిత్ర కార్యమును గావించితిరి ఇంక మీరు బోవచ్చును అనుజ్ఞ నొసంగితిని బయలుదేఱుడనియెడు ర ముని వాక్యములాలకించి వానరులందఱు బాష్పకంబు లొలుకబోసిరి

## విభీషణుడు గదాపాణియై రామలక్ష్మణులంజేరవచ్చుట

కాటుకవోలె నల్లని దేహముగల విభీషణుడు గదాపాణియై త్వరితముగ రామలక్ష్మణులున్న చోటునకు వచ్చుచుండెనం వానరులావిభీషణుని గాంచి ఇంద్రజిత్తు మరల వచ్చుచున్నాడని భయపడి

పలాయనమంత్రమును జపించిరి వ్యాకులమొంది పరుగిడుచున్న వానరులను సుగ్రీవుడు చూచి ఔరా! ఏమిది? సముద్రమందెదురుగాలిచే గొట్టబడిన యోడకరణి సైన్యమంతయు బరుగిడిపోవుచున్నదేలననిన వాలిసుతుండిట్లనియె వానరేంద్రా! రామలక్ష్మణులు దేహమంతయు బాణంబులచే గ్రుచ్చబడి నెత్తుటందోగుచున్నారే! నీవు చూడకున్నావెందుకు? అనిన రామలక్ష్మణులిట్లు పడియుండుట వలననే యాయుధంబులు బాఱవైచి వనచరులిట్లు పరుగెత్తుచున్నారని సుగ్రీవుడు బదులు చెప్పెను

ఇంతలోనే బాహుబలాఢ్యుడగు విభీషణుడు గదాపాణియైవచ్చి సుగ్రీవుని యాశీర్వదించి రామలక్ష్మణులను జూచి కన్నీరు గార్చెను విభీషణుని జూచి యింద్రజిత్తని తలంచి వానరులందఱు భయపడిదిక్కులకు బారిపోవుచున్నారు జాంబవంతా! నీవు పారిపోవుచున్నవానరసేనను నిలువరించి విభీషణుడు వచ్చినాడు ఇంద్రజిత్తుగాడని ధైర్యంబు జెప్పుము జాగ్రత్తపడుమనిన తోడనే భల్లూకరాజు పరుగిడుచున్న వానర వాహినులను మరలించి ధైర్యంబును బురికొల్పెను జాంబవంతుని మాటలు విని వానరులందఱు విభీషణుని జూచి భయంబు విడిచి మరలివచ్చిరి విభీషణుడు రామలక్ష్మణులను గాంచి పరమదుఃఖితుడై సలిలంబునుగొని వారికన్నులను దుడిచి రోదన మొనరించెను అహా! పరాక్రమవంతులును, యుద్ధప్రియులునగు రాజకుమారులు నిష్కపటులై సంగర మొనరించుచుండ మాయావియగు ఇంద్రజిత్తు కపట యుద్ధంబున నాగపాశంబుచే బంధించి యెంతటి దుష్కార్యమొనరించెను ఆ కుటిలాత్ముడు తల్లికడుపు జెఱపబుట్టినాడు దేహమంతయు బాణములుగ్రుచ్చుకొని నేలపైబడి నిదురించుచున్న ముండ్లపందులుంబోలె జూపట్టుచున్నారు గదా! నేనెవ్వరినాశ్రయించి ప్రతిష్ఠను బొంద దలంచితినో! యా పురుషశ్రేష్ఠులే నేలపై బరుండి విగతజీవుల మాడ్కినున్నారు నాకిఁక రాజ్యకాంక్షతో బనియేమి? నేను జీవించియున్నచో రావణుడూరక విడుచునా! రాక్షసేశ్వరుని ప్రతిజ్ఞ నెరవేరినది నాగతియేమగునో! ఎందుబోదును ఎవ్వరాదరింతురని దుఃఖార్ణవమందీదెడు విభీషణుని వానరేశ్వరుండు కౌగలించుకొని యిట్లనియె

విభీషణా! దుఃఖింపవలదు ఇంత బేలవైతివేల? నీకు లంకాధిపత్యంబు తప్పక లభింపగలదు సందియంబు నొందవలదు రావణుండతని పుత్రులతోగూడ కృతకృత్యుండు గాజాలడు రామలక్ష్మణులకు దీనివలన ప్రాణహాని సంభవింపదు త్వరలో మూర్ఛదేరి రావణుని బరిమార్పగలరు చింతిల్లవలదని సుగ్రీవుడు మృదు వచనములతో విభీషణున కెరిగించెను తదుపరి తన చెంతనున్న మామయగు సుషేణుని జూచి వానరనాథుండిట్లనియె

## గరుత్మంతుడు వచ్చి రామలక్ష్మణులను నాగబాణములనుండి విముక్తి గావించుట

మామా! దశరథాత్మజులు మూర్ఛదేఱిన పిమ్మట వీరిని దీసికొని ఈ వానరసేనాసహితంబుగ నీవు కిష్కంధకు వెడలిపొమ్ము నేను పుత్రబంధుసమేతముగా రావణాసురుని బరిమార్చి సీతాదేవిని దెచ్చెదను పోయిరమ్మనిన వానరేంద్రుని వాక్యములాలకించి సుషేణుడిట్లనియె సుగ్రీవా! మహాభయంకరమగు దేవాసుర యుద్ధమును మునుపు నేను జూచియున్నాను ఆ యుద్ధమందు బాణపీడితులై మూర్ఛిల్లిన వారిని, మృతులైన వారిని బృహస్పతి మృత సంజీవని మున్నగు విద్యల చేతను మూలికల చేతను చికిత్స చేసి బ్రదికించి యుండెను ఆ దివ్యౌషధంబులను గొనితెచ్చుటకు సంపాతియును పనసుతుండును సమర్థులు క్షీరసాగరమును దాటిపోయి సంజీవకరణి, విశల్యకరణియను రెండు మూలికలను దెచ్చునట్లాజ్ఞాపింపుము క్షీరసాగరములో మునుపు దేవతల మృతమునుమథించిన స్థలమందు చంద్రద్రోణ పర్వతములున్నవి ఆ రెండు పర్వతములందును సంజీవకరిణి విశల్యకరణియను దివ్యౌషధములున్నవి ఆ యౌషధములందు దేవతలచే నుంచబడినవి వాయుసుతుండగు హనుమంతుని గూడ చంద్రద్రోణపర్వతముల చెంతకనుపుము త్వరపడుమని సుషేణుడు సుగ్రీవునితో జెప్పెను

అవ్విధంబున వానరోత్తములు సంభాషించుచుండగనే విద్యుల్లతలతో గూడ జలధరంబులనెగురగొట్టుచు సాగరమంతయు

గలంచుచు మేదినీతలంబు గడగడవడంకు చందంబున పెనువాయువొకటి వీచెను లంకాద్వీపమందలి మహాభూరుహనిచయంబులన్నియు గొమ్మలు విఱిగి కూకటివ్రేళ్లతో గూడ సాగరంబున బడెను అపయోరాశియందున్న జలజంతువులు, సర్పములు, భయపడిలోనికి బాఱిపోయినవి వానరులందఱు తేజోనిలయుండగు గరుత్మంతుని చూడగలిగి ఇంద్రజిత్తుచే బ్రయోగింపబడిన నాగబాణములన్నియు వైనతేయునిజూచి రామలక్ష్మణులను వదలి భయంబునొంది పరుగిడినవి గరుత్మంతుడు రామలక్ష్మణులను జూచి వారలచేత బూజలందుకొని తన రెండు కరంబులచే చంద్రబింబములవంటి మోములను దడవెను వెంటనే దశరథసుతుల దేహంబులుగాయంబులుమాసి స్నిగ్ధవములైనవి రామలక్ష్మణు లత్యుత్సాహులైరి వైనతేయుడు రాజసుతులను గౌగిలించుకొనెను అప్పుడు రాముడు గరుడుని జూచి యిట్లనియె అయ్యా! మీయనుగ్రహంబున మేము ధన్యులమైతిమి ఇంద్రజిత్తు వలన జేకూరిన మహావ్యసనంబుగడచినది మునుపటివోలె బలాఢ్యులమైతిమి నిన్ను బొడగాంచినప్పటి నుండియు నాతండ్రిని నా పితామహుండగు ఆ జనకమహారాజును జూచినట్లున్నది నీవెవ్వరు? నాకాశ్చర్యముగనున్నది తెలియంబలుకుమనిన గరుత్మంతుడా నందబాష్పములొలుకబోయుచు నిట్లనియె రామా! నీకునేను బ్రాణస్నేహితుడను అత్యంతప్రియుండను నాపేరు వైనతేయుడందురు క్రూరకర్ముడగు ఇంద్రజిత్తు మిమ్ములను బంధించియుండు నాగపాశంబులను విడిపించుటకు దేవదానవులకు గాని, గంధర్వులకుగాని యలవిగాదు ఆ వృత్తాంతమాలకించి నీకు సాహాయంబు జేయు నిమిత్తమిచటికి వచ్చితిని తీక్షణదంష్ట్రములును, విషోల్బణంబులు నగు కద్రువకు బుట్టిన మహోరగంబులు ఇంద్రజిత్తు మాయా ప్రభావంబున జేసి బాణాకృతులదాల్చి నిన్ను బొందినవి ఆ సర్పంబులు నన్ను జూచి మిమ్ములను విడిచి పరుగెత్తినవి

ధర్మజ్ఞుడా! సత్యపరాక్రముడా! రామా! మీ యన్నదమ్ములెంతో ధన్యజీవులు భాగ్యవంతులు మీకిక భయంబులేదు మహాభయంకరంబైన నాగపాశబంధమునుండి మిమ్ములను విముక్తిగావించితిని ధర్మమేర్పడుటకిట్లు జేసితిని యుద్ధమందే మఱుపాటు నొందక

జాగరూకుండవై యుండుము రాక్షసులు మహామాయావులు కపటయుద్ధ మొనరించుటయే వారిస్వభావము మీరు నిష్కపటమానసులై సమరంబుగావింతురు అదియే మీకు బలంబును జేకూర్చును రాక్షసులనెంత మాత్రము నమ్మవలదు ఈ నిదర్శనమే నీకనుభవము గలిగించినదిగదా! యని గరుత్మంతుడు రాముని గాఢాలింగనము గావించుకొని పోయివచ్చెదనని యిట్లు చెప్పనారంభించెను రామా! నీవు నా చెలికాడవు ధర్మజ్ఞుడవు నేనెట్లు నీకు చెలికాడనైతినని యిప్పు డడుగవలదు సమరంబున గృతకృత్యుడవైన పిమ్మట మనమైత్రిని దెలిసికొనగలవు నీశరపరంపరలచే లంకయందుండు రాక్షసులందఱిని వధించి, బాలవృద్ధులు మాత్రము మిగులునట్లు చెయుము నీ విరోధియగు రావణుని సంహరించి సీతాదేవిని బొందగలవు నీకు శుభము గలుగుగాక! నేనుబోయి వచ్చెదనని రామలక్ష్మణులను రోగులుగా జేసి వానరులనడుమ వెలుగొందుచున్న రాజసుతులకు ప్రదక్షిణమొనరించి కౌగలించుకొని వాయుదేవునివోలె నాకాశమార్గంబునుబట్టి వెడలిపోయెను

సుఖశరీరులైన సుందరమూర్తులగు దశరధసుతులను గాంచి వానరులందఱు పరమసంతోషభరితులై లాంగూలములను విదళించుచు సింహనాదములుగావించిరి భేరీమృదంగములను వాయించి శంఖములను బూరించిరి భుజంబుల నాస్ఫాలించుచు నానావిధములగు వృక్షములను బెకలించి కరవాలంబులను దాల్చి యుద్ధ సన్నద్ధులై నిల్చి లంకాద్వారంబుల నరికట్టిరి నిశిసగమగు వేళయందు వానరులుచేయు సింహనాదములు వర్షర్తువునందు గర్జించు గంభీర ఘనంబులమాడ్కి నతిభయంకరముగ వినవచ్చుచుండెను

## యుద్ధమునకు వెడలుచున్న ధూమ్రాక్షునకు దుర్నిమిత్తములగు పడుట

వానరులుసేయు సింహనాదములను రాక్షసులతో గూడ రావణుడాలకించి స్నిగ్ధంబగు గంభీర ధ్వనితో మంత్రులను జూచి యిట్లనియె సచివులారా! వనచరులిట్లు గర్జించుటకు హేతువేమై

యుండును అమ్మహాధ్వనులచే సముద్రము సంక్షోభము నొందుచున్నది రామలక్ష్మణులు బంధింపబడియుండగా వారెందుకిట్లు పరమ సంతోషభరితులైరో సందేహముగ నున్నది మీరు శీఘ్రముగా బోయి చూచిరండని రాక్షసులకాజ్ఞనొసంగెను రాక్షసులమిత్సోహులై బయలుదేరి పోయి సుఖులైయున్న రామలక్ష్మణులను వానరసేనను గాంచి భయభ్రాంతచిత్తులై మిగుల దుఃఖించి రాక్షసేంద్రుని యొద్దకు బరుగిడి వచ్చి యిట్లనిరి

రాజేంద్రా! నాగపాశబద్ధులై పడియున్న రామలక్ష్మణులిపుడు ఆ పాశములను తెగదెంచుకొని మత్తకరీంద్రముల మాడ్కి యుద్ధభూమి యందు వెలుగొందుచున్నారు మేము జూచి వచ్చితిమని రాక్షసులు జెప్పిరి రావణుడాపలుకులాలకించి దుఃఖాగ్నిలో గుములుచు ముఖంబు వెలవెలబోవనిట్లనియె ఔరా! ఇంద్రజిత్తు వరప్రసాదంబుచే బడసిన తీక్షణములగు బాణంబులచే రామలక్ష్మణులను బంధించి వచ్చియుండెను గదా! వారట్టి బంధమునుండి విముక్తి జెందుటకు హేతువేమైయుండును? అక్కటా! రాక్షససేనకంతయు బ్రాణసంశయము గలిగించునట్లుగ దోచుచున్నదే! పెక్కుమార్లు యుద్ధమందు శత్రువులను బలిగొన్న నాగబాణంబులు నేడేలకోనిష్ఫలములైనవి గదా! యని రావణుడమిత కోపోద్రేకుడై వేడినిట్టూర్పులను బుచ్చుచు రాక్షసులమధ్యనున్న ధూమ్రాక్షుని జూచి యిట్లనియె ధూమ్రాక్షా! నీవు సైన్య సమేతముగా బోయి వానరసేనలను రామలక్ష్మణులను వధించిరమ్ము పొమ్మని యాజ్ఞాపించెను ధూమ్రాక్షుడు రాజాజ్ఞను శిరంబునందాల్చి పరమ సంతుష్టుడై రాక్షసేంద్రునకు నమస్కరించి రాజసదనంబును వీడి బయలుదేరెను సేనాధ్యక్షుడగు ధూమ్రాక్షుని యనుమతివేరకు భయంకరాకారులగు రాక్షసులు శూలముద్గరంబులను, దండములను, ముసలంబులను పరిఘంబులను, భిండివాలంబులను బల్లెములను, ఈటెలను, గొడ్డళ్లను మొదలగు నానావిధాయుధంబులను కరంబులను బూని కవచధారులై మేఘంబుల మాడ్కి గర్జించుచు, ధ్వజాలంకృతములై నానావిధములైన ముఖంబులుగల గార్దభములను బూన్చిన రథంబులపై గూర్చుండి యుద్ధమునకు బయలువెడలిరి కొందఱుత్తమ కరీంద్రములనారోహించిరి

ధూమ్రాక్షుడు సింహగర్జన మొనరించుచు, తోడేళ్లను, సింహములను బోలిన ముఖంబులు గల గాడిదలచే నలంకరింపబడిన దివ్యంబగు రథంబునారోహించి రాక్షస పరివృతుండై పకపక నవ్వుచు హనుమంతుడున్న పశ్చిమద్వారంబున కేగెను అట్లు బయలుదేరిపోవుచున్న ధూమ్రాక్షుని రథంబున కడ్డముగా దుర్నిమిత్త సూచకంబులెన్నియో గోచరించినవి రథంబు శిరంబుపై గృధ్రమొకటి వ్రాలినది శవంబులను భక్షించుచున్న భయంకరమగు పక్షులు ధ్వజంబుపై వ్రాలినట్లు వ్రాలి నేలబడినవి రుధిరార్ద్రమగు తెల్లని మొండెమొకటి వికృతిధ్వనితో రోదనంబు గావించుచు ధూమ్రాక్షుని సమీపమందు బడినది భూకంపముగలిగినది జలధరము రుధిరవర్షము గురిసినది ఎదురుగాలి భయంకరముగ వీచినది కకుభంబులను గాఢ చీకట్లు గ్రమ్ముకొన్నవి ఈ దుర్నిమిత్తములను గాంచి ధూమ్రాక్షుడు దుఃఖించెను రాక్షసులందఱు దుఃఖాబ్ధినీదుచు మూర్ఛలో మునింగిరి ధూమ్రాక్షుడు కడపటికి గుండెరాయి జేసికొని రాక్షసులను గూడి యుద్ధోత్సాహంబుతో బురంబువెలువడి రామబాహుపాలితమైన సముద్రంబు కరణి నలరారుచున్న వానరసేనాసముదయంబును గాంచెను

## ధూమ్రాక్షుని హనుమంతుడు దునుమాడుట

యుద్ధంబునకు సన్నద్ధులైయున్న వానరులందఱు ధూమ్రాక్షుడు వచ్చుటను బరికించి పరమామోదమందుచు సింహనాదంబులొనరించిరి అప్పుడు వనచరులకును, నిశాచరులకును దుముులంబుగా మహా సంగ్రామము ప్రారంభమయ్యెను వానర రాక్షసులు వృక్షములచేతను శూలముద్గరాద్యాయుధంబుల చేతను నొండొరులను బ్రహరించుకొనుచు భయంకరముగా భండనంబుగావించిరి భయంకరాకారులగు రాక్షసులు లెక్కకు మిక్కుటముగా వానరులను వధించిరి వానరులమితతేజోవంతులై వృక్షములచేత పెక్కండ్ర రాక్షసులను జూర్ణముగావించిరి గదా పట్టిస కూటముద్గరాద్యాయుధంబులచేత రాక్షసులు వానరులను బ్రహరించిరి ఆయుధంబులచేవిదారితులైన జయశీలురగు వానరులు భిన్నదేహులై

మహారోషంబున వృక్షములను బెనుశిలలనుజేకొని రాక్షసులను గొట్టి ముద్దగావించిరి వానరుల ముష్టి ఘాతంబులచే గొందఱు రాక్షసులు నోట నెత్తురను గ్రక్కుకొనిరి మఱికొందఱు రాక్షసులు వానరులచే బ్రక్కలంబట్టి రెండుగా జీల్చివేయబడిరి వృక్షములచే మఱికొందరిని నలియగొట్టి కుప్పవేసిరి శిలల చేత జూర్ణము గావించిరి దంతములచేత గొఱికిరి వానరులు బ్రయోగించెడు పర్వత శిఖరమ్ములచే రధంబులు, గార్ధభములు గజములు ధ్వంసమ్ములై రాక్షస కళేబరంబులచే యుద్ధభూమి నిండియుండెను

వానరులు తీక్ష్ణములగు నఖంబులచే రాక్షసుల ముఖంబులపై విదారింపనెత్తుటందోగుచు మూర్ఛిల్లి మహీతలంబున బడిపోయిరి కొందఱు రాక్షసులు వానరులపైబడి గర్జించుచు నఱచేతులతో దట్టివైచి ఱఱిమికొట్టిరి వనచరులమితోద్రేకులై రాత్రించరులను బడికిళ్లతో బొడిచియు, పాదంబులచే దన్నియు దంతములచే గొఱకుచు వృకములనుబెళ్లగించి బ్రహరించిరి నిశాచరులు వనచరుల ధాటికాగజాలక బరుగిడిపోయిరి పారిపోవుచున్న రాక్షస సైన్యమును ధూమ్రాక్షుడు జూచి కుపితుడై వానరసేనను హింసింప నారంభించెను

అప్పుడు కొందఱు వనచరులు బ్రాసముద్గరదాడితులై నేలకొఱగిరి పరిఘంబులచేతను, బిండివాలంబులచేతను, మఱికొందఱుమడిసిరి కొందఱడ్డకత్తులచేనఱకబడి మృత్యువాత బడిరి మఱికొందఱు బారిపోయిరి కొందఱు గుండెలు పగిలిచచ్చిరి మఱికొందఱు త్రిశూలములచే బొడువంబడి ప్రేగులు వెలికివచ్చి చీల్చబడి చనిపోయిరి అవ్విధంబున వనచర, రాత్రించరులకు శిలాపాదపాయుధములచే ఘోర సంగ్రామము జరిగెను

అల్లెత్రాళ్ల ధ్వనులేవీణారవములుగను, ఆయాసముచేగలుగు వెక్కిళ్లే తాళములుగను, మందవచనంబులే మధురగానములుగను యుద్ధగాంధర్వమెంతయు బ్రకాశించుచు రమ్యమొగబోయుచుండెను అప్పుడు ధూమ్రాక్షుడమిత కోపోద్రేకముతో ధనుర్ధరుడై వీర్యోత్సేకంబున బకబక నవ్వుచు బాణవృష్టిని గురిపించుచు కపులను దిక్కులకు

దళిమికొట్టెను ధూమ్రాక్షుండు వానరులను దళిమికొట్టుటను హనుమంతుడెఱింగి పరమకుపితుడై పెనుశిలనొకదానింగైకొని రక్కసునిపైకి బోయి వానిరథంబుపై బడవేసెను ధూమ్రాక్షుడు తనపైకి వచ్చుచున్న శిలను గాంచి గదను చేతంబూని త్వరితముగ రథమునుండి లంఘించి నిల్చుండెను ఆ పెనుశిల రాక్షసుని రథంబును, చక్రకూబరంబులను, గుఱ్ఱంబులను, ధ్వజంబును విల్లును నుగ్గుజేసి వైచినది అట్లు రథంబును వాయుసుతుండు నుగ్గుగావించి, వృక్షములచేత రాక్షసులను బాఱద్రోలి పర్వత శిఖరంబునొక్కదానిని కరంబునందాల్చి సింహనాదంబొనరించుచు ధూమ్రాక్షునిపై కుఱికెను తనపైకి వచ్చుచున్న హనుమంతుని రాత్రించరుడు జూచి గదను కరంబునంబూని యెదురొడ్డి నిల్చి పవనాత్మజుని శిరంబుపై మోదెను ఆ గదా ఘాతంబును గరువలిసుతుండు సరకుజేయక ధూమ్రాక్షుని శిరంబుపై బర్వత శిఖరంబు నెత్తివైచెను ఆ నిశాచరుండు పర్వతశిఖరంబుచే దాడితుండై సమస్తావయవంబులు వివశంబులై పర్వతంబుకరణి నేలంగూలెను హతశేషులగు రాక్షసులది జూచి పరుగెత్తిపోయిరి వాయుసుతుండు ధూమ్రాక్షుని దునుమాడి రణరంగమంతయు రక్తధారలుప్రవహింపజేసి వనచరులచే బూజితుండై పరమామోదమందెను

## అంగదుడు వజ్రదంష్ట్రుని హతమార్చుట

పవనతనయునిచేత పాపాత్ముడగు ధూమ్రాక్షుండు మడియింపబడుట నాలకించి రావణుడు కోపావేశంబున వేడి నిట్టూర్పులను బుచ్చుచు మహాశూరుండగు వజ్రదంష్ట్రుని గాంచి యిట్లనియె వీరాగ్రేసురుండగు వజ్రదంష్ట్రుడా! నీవీ క్షణమందే సైన్య సమేతుడవై బయలుదేరిపోయి దశరథసుతులను, సుగ్రీవాది వానరులను వధించిరమ్ము పొమ్మని యాజ్ఞాపించెను మాయావియగు వజ్రదంష్ట్రుడు ధనుర్ధరుడై కిరీటాది భూషణంబులను కవచంబులను ధరియించి యలంకరింపబడిన రథంబునకు ప్రదక్షిణంబు గావించి దాని నారోహించెను రాక్షసవీరులందఱు మహోల్లాసముతో నాయుధపాణులై గజంబుల నారోహించి బయలుదేరిరి ఆ నీలదేహులగు రాక్షస వీరులు

ప్రావృట్కాలమున మెఱుపులతో గూడి గర్జించెడు మేఘంబులకైవడి నొప్పారుచు అంగదుడున్న లంకాదక్షిణద్వారంబునకు వెడలిరి అప్పుడివ్విధంబున వారికశుభనిమిత్తంబులు బొడసూపెను

మేఘశూన్యమగు గగనవీధి నుండి తీవ్రమైన కొఱవులు ధరాతలంబుపై బడినవి గోమాయువు లగ్నిజ్వాలలను గ్రక్కుచు దారుణంబుగ నఱచుచున్నవి క్రూరమృగంబులు నిశాచరుల మరణంబును సూచించెను భయమోహితులై రాక్షస వీరులు భూమిపై బడి కలతజెందిరి మహాపరాక్రమశాలియగు వజ్రదంష్ట్రుడీ యుత్పాతంబులన్నియు బరికించి యెట్టకేలకు ధైర్యంబు బూని యుద్ధోత్సాహంబున బయలుదేరెను జయశీలురగు ప్లవంగపుంగవులు రాక్షసులనుజూచి దశదిశలు మాఱుమ్రోగు చందంబున సింహనాదములొనరించిరి వానర రాక్షసులకు తుముల యుద్ధంబు ప్రారంభమయ్యెను ఒండొరులతిభయంకరంబుగ నానావిధాయుధపాణులై ఘోరసంగ్రామమొనరించి క్షతగాత్రులై కంఠములు విఱిగి నెత్తుటందోగుచు నేలకొఱగిపోయిరి వృక్షశిలా యుధంబులు ప్రయోగించెడు ధ్వనియు రథనేమి ధ్వనియు ధనుర్ధ్వనియు శంఖభేరీమృదంగాది ధ్వనులు వినువారల హృదయంబులు బ్రద్దలగునట్లు వినబడుచుండెను

ఆయుధ ప్రయోగంబులచే తృప్తిజెందక కొందఱు బాహు యుద్ధంబునకు గడంగిరి వానరులుకొందఱు రాక్షసుల నఱచేతు లంజఱచియు పాదంబులందన్నియు, పిడికిళ్లంబొడిచియు వృక్షంబులం మోదియు మోకాళ్లంగ్రుమ్మియు యుద్ధోన్మత్తులై వధించిరి పాపము రాక్షసులు భిన్నదేహులై నేలంబడిపోయిరి వజ్రదంష్ట్రుడు వానరు లొనరించెడు ఖండనంబున కచ్చెరువొంది శరపరంపరల చేత నొప్పించుచు ప్రళయకాలంబునం బాశహస్తుండగు కాలునికైవడి భయంకరాకారుడై రణరంగమందు విహరించుచుండెను ఆయుధ విద్యాకౌశలంబునందారి తేఱిన రాక్షసవీరులు పరమకుపితులై వానరసైన్యమును వధించిరి అంగదుడీవిచిత్రమును గాంచి ప్రళయకాలమందలి యగ్నిహోత్రునికైవడి మహోద్రేకుడై వృక్షంబుచే రాత్రించరులనందఱను సింహంబు క్షుద్రమృగంబులంబోలె జక్కాడెను రాక్షసవీరులెందరో శిరంబులు బ్రద్దలై

ఛిన్నాభిన్నములైన పాదపంబులమాడ్కి నేలబడి ప్రాణంబులు విడిచిరి వానర రాక్షస కళేబరంబుల చేతను రుధిరధారల చేతను యుద్ధభూమి భయంకరమై యుండెను హారకేయూరాది నానావిధభూషణాలంకృతమై అస్త్రశస్త్రంబుల చేత గదనరంగమంతయు నొప్పారుచు తారకామణుల చేతను, సుధాకరునిచేతను, అలంకరింపబడిన శరన్నిశీథమ్ముచందంబున ప్రకాశించినది అంగదుని ధాటికాగజాలక రాక్షస సేనవాయువేగంబునకు వారి వాహినివోలె చలించినది

అంగదుని విజయంబును రాక్షసుల పరాజయంబును వజ్రదంష్ట్రుడు జూచి కోపారుణలోచనుండై వానర సేనలపై బాణవర్షంబును గురిపించెను రాక్షసప్రముఖులందఱు రథారూఢులై నానావిదాయుధంబుల చేత వెనుదీయక యుద్ధంబు గావించిరి వానరశూరులు పెనుశిలలను, వృక్షములను కరంబులంబూని ఘోరసంగరమొనరించిరి వానర రాక్షసులు తలలు పగిలి కరచరణంబులు విఱిగి నెత్తుటందోగుచు భూమిపైబడి యుండిరి గ్రద్దలు కాకులు, నక్కలు తండోప తండములుగా వారిని జుట్టుముట్టి యుండెను రాక్షస సేనవానరసేన నెదిరింపజాలక భగ్నమై పరుగెత్తినది అప్పుడు వజ్రదంష్ట్రుడు కోపోద్రేకుడై వానర సేనంజొచ్చి శరపరంపరలచేత భేదింపదొడంగెను వానరులు భీతిజెంది ప్రజలు ప్రజాపతి మఱుంగుజొచ్చు చందంబున వాలికుమారు నాశ్రయించిరి అంగదుడది జూచి వజ్రదంష్ట్రు నెదుర్కొనెను ఇరువురును పరమక్రుద్ధులై సింహము మదపుటేనుగులకైవడి పోరుసల్పుచు విహరించిరి మత్తకరీంద్రమును జిల్లకోలలతో బొడుచునట్లు వాలిసుతుండగు అంగదుని జీవస్థానంబు లందు వేయి బాణంబులచేత రక్కసుండు నొప్పించెను అంగదుడు రక్తసిక్తమైన దేహముగల వాడై కోపించి వృక్షము నొకదానిని గూకటి వ్రేళ్లతోగూడ బెకలించి వజ్రదంష్ట్రుని పైకి విసరెను తనపైకి వచ్చుచున్న భూజంబును గాంచి రాక్షసుడు సంభ్రమంబునొందక బాణంబులచే బెక్కువ్రయ్యలుగా ఖండించెను రాత్రించరుని పరాక్రమమునకు నాశ్చర్యమొంది వనచరుడొక్క విశాల పర్వతంబును గొని విసరివైచి సింహనాదంబు గావించెను వజ్రదంష్ట్రుడు తనపైకి వచ్చుచున్న పర్వతంబునుజూచి గదను చేతంగొని నిర్భయుడై నేలకు లంఘించెను

అంగదుడాతరుణము గనిపెట్టి రక్కసుని సమీపించి వాని గద నపహరించెను పర్వత ప్రయోగంబునకు రాక్షసుని రథము, చక్రము, కూబరము గుఱ్ఱములు నుగ్గైపోయెను అంతలో వాలి తనయుడు వృక్షములచే నొప్పారెడు విశాల పర్వతంబు నొక్కదానినెత్తి వజ్రదంష్ట్రుని శిరంబుపై బడవైచెను ఆ దెబ్బకు రాక్షసుడు నెత్తురు గ్రక్కుచు మూర్ఛిల్లి కొంత తడవునకు మూర్ఛదేఱి పరమకుపితుడై చేరువ నిల్చియున్న యంగదుని గదచేత గొట్టెను

ఆ యంగద వజ్రదంష్ట్రులిరువురును ముష్టి యుద్ధమునకు గడంగి రక్తసిక్తములైన దేహంబులతో నంగారక బుధులుంవోలె బద్ధవైరంబున బోరు సల్పుచుండిరి అట్లు కొంతతడవు ఘోర యుద్ధంబుగావించి మరల వృక్షములతో గొట్టుకొనిరి అటు పిమ్మట అంగదుడు డాలును - కరవాలంబును గైకొని నిల్చెను వజ్రదంష్ట్రుడు గూడ డాలును వాలును దీసికొని నిలువంబడెను వారిరువురును పరస్పర విజయంబును గోరి భయంకరమైన భండన మొనరించుచు నొండురులను బ్రహరించుకొనిరి వనచరుండును, నిశాచరుండును నెత్తురొలికెడుగాయంబుల చేత బుష్పించిన మోదుగ వృక్షముల వోలె వెలుగొందుచుండిరి అలసట జెంది కొందతడవు గూర్చుండిరి తెప్పపాటంతలోనే వానరోత్తముడు లేచి కఱకు గఱవాలంబుచేత రాత్రించరుని శిరంబును ఖండించెను వజ్రదంష్ట్రుడు నేలగూలెను రాక్షసులందఱు భయమోహితులై సిగ్గుచే మొగంబులు వంచుకొని పారిపోయిరి వజ్రదంష్ట్రుని వధించిన వాలిసుతుండు వానరులచే బూజింపబడి వానర సేనల నడుమ సురనాధుని వోలె శోభతో వెలుగొందెను

## అకంపనుని హనుమంతుడు హతమార్చుట

అంగదునిచే వజ్రదంష్ట్రుడు వధింపబడుట నాలకించి రాక్షసేశ్వరుండు కోపోద్రేకుడై బ్రేవాలచేతులు మొగుడ్చుకొని నిలువంబడియున్న సేనాధ్యక్షుని దిలకించి యిట్లనియె సమస్తాస్త్రంబుల యందును బండితుడగునీ యకంపనుని రాక్షస సమేతంబుగా

యుద్ధంబునకు వెడలునట్లాజ్ఞాపింపుము ఇతడు శత్రువులను వధించుటలో నతిసమర్థుడు నిపుణుడైన సేనా నాయకుడు తన సేన నేమఱక రక్షించుకొనువాడు ఎల్లవేళల యందును నా హితంబు గోరెడు యుద్ధ ప్రియుడు శత్రువుల దహింపజేయువాడు రామలక్ష్మణులను సుగ్రీవాది వనచరులను వధించి రాగలడని నుడివెను సేనాధీశుడు రావణుని యాజ్ఞను శిరసావహించి సేన నాయత్తపఱచెను భయంకరులగు రాక్షసోత్తములందఱు యుద్ధోన్మత్తులై బయలుదేరిరి మేఘవర్ణుడును, మేఘగర్జనము వంటి మహాధ్వని గలవాడునగు అకంపనుడు రథారూఢుడై రాక్షసులచే బరివేష్టింపబడి సమరంబునకు బయలుదేరెను మహాసంగ్రామ మందు దేవతలకుగూడ నలవిగాని వాడగు కతంబున నకంపనుడను నామంబు సార్థకమైనది రాక్షసులనడుమ నాతడు సూర్యుని వోలె వెలుగొందు చుండెను

అకంపనుడవ్విధంబున యుద్ధోన్మత్తుడై వేగంబున బోవుచుండ నతని రథంబునకు బూన్చిన గుఱ్ఱంబుల కాకస్మికంబుగా దైన్యంబు జేకూరినది అమితోత్సాహముగల యా యకంపనుని యెడమ కన్నదరినది మోముతెల్లబారినది కంఠధ్వని మిక్కిలి డగ్గుత్తిక నొందినది పెనుగాలి వీచినది ఆకసమంతయు మేఘావృతమైనది మృగ పక్షులన్నియు భయంకరముగ గూసినవి ఆ యకంపనుడామహోత్పతంబుల సరకు సేయక కదనరంగము కేగెను మహాపారావారంబంతయు గలంగు చందంబున రాక్షసులు సింహనాదంబులు గావించిరి వానరసేనలా భయంకరమైన ధ్వని నాలకించి పాదపంబులను, పర్వతములను బెకలించి కరంబులను దాల్చి యుద్ధమునకు సిద్ధమై నిలువంబడి యుండెను రామ కార్యార్థమై ప్రాణంబులనైనను విడువ సంసిద్ధులైయున్న వనచరులకును రావణుని నిమిత్తమై జీవంబులనైనను విడువ నిశ్చయించుకొన్న నిశాచరులకును ఘోర సంగ్రామము జరిగెను మహాబలశాలురగు వానర రాక్షసులు భండనంబు గావించెడు సింహనాదంబులు దిక్కులు నిండి చెలరేగినవి ఆ వనచర రాత్రించరుల త్రొక్కుడు వలన రేగిన పరాగము భూస్వభావము చేత రక్త వర్ణమై దశ దిశలను గ్రమ్ముకొన్నది విదలింపబడిన తెల్లని పట్టువోలె ధవళకాంతుల నీనెడు పరాగముచే గప్పబడియుండు

కతంబున గదన రంగమందున్న పదార్థములనుగాని యొండొరులంగాని వానర రాక్షసులు కనుంగొన జాలక గగ్గోలు పడజొచ్చిరి ధ్వజ చిహ్నంబులు గాని- మైమఱువులు గాని-గుఱ్ఱములు గాని-రధములు గాని- అయుధములుగాని గానబడవయ్యెను ఆ తుముల యుద్ధమందు సింహానాదముల ధ్వని మాత్రము వినబడుచుండెను ఒకరి రూపములొకరికి గోచరింపవయ్యెను ఆ చీకటి యందు గుర్తింపజాలక వానరులు వానరులను, రాక్షసులు రాక్షసులను-గొట్టుకొనిరి తమతమ వారినే వధించుకొనిరి యుద్ధభూమి రుధిరార్ద్రమై బురదగలదిగా నుండెను ధూళి రక్తముతో మిళితమై యణగి పోయినది పీనుగు పెంటలతో రణరంగమంతయు నిండిపోయినది

అంతటితో దనివిజెందక వానర రాక్షసులు వృక్షముల తోడను పెనుశిలల తోడను-గదలతోడను-పరిఘంబులతోడను-దోమరంబుల తోడను-పరాక్రమంబున నొండొరులు గొట్టు కొనుచు ఘోర యుద్ధంబు గావించిరి వనచరులు రాక్షసులను-రాక్షసులను వనచరులను-లెక్కకు మిక్కుటముగ వధించిరి భయంకరాకారుడగు నా యకంపనుడు రాక్షసులందఱిని బురికొల్పుచుండెను ఇంతలో కుముదుడు-నలుడు మైందుడు-ద్వివిదుడనను వానర వీరులు వృక్షధరులై రాక్షసులపైబడి మహాసంగ్రామ మొనరించి తండోప తండములుగ వధించిరి అకంపనుడా ఘోరకృత్యమును జూచి కుపితుడై సారధీ! పెక్కండ్రు వానరులు జేరి మన రాక్షసులను గుంపులు గుంపులుగా రూపుమాపుచున్నారు నేనిప్పుడే వానరులను వధింప గోరుచున్నాను త్వరితంబుగ రధంబును దోలుమనిన తోడనే సారధి యట్లే గావించెను అకంపనుడు కోపోద్రేకుడై వానరులపై బాణవర్షమును గురిపించెను వనచరులారక్కసుని యెదుట నిలువం జాలక రణభంగులై పరుగిడ జొచ్చిరి

అకంపనునిచే జిక్కి మృత్యువు వాతబడనున్న వానరులను వాయుసుతుండు గాంచి రాక్షసుని మీది కడరెను తమకు దోడుగా వచ్చిన హనుమంతుని జూచి వానర వీరులందఱు సంతోషించుచు యాతని మఱుంగు జేరి బరివేష్టించిరి సురేంద్రుడు వర్షమును గురిపించునట్లు వడి యకంపనుడు హనుమంతునిపై బాణ వర్షమును గురిపించెను ఆ కఱకు బాణంబుల

సరకు సేయక సమీర నందనుడు రాక్షసుని బరిమార్ప వలయునని మనంబున నిశ్చయించుకొని పాదాఘాతంబున భూమి గడగడలాడ నా యకంపనుని సమీపించి క్రోధావేశంబున సింహనాదము గావించుచు దినకరుని వోలె దుర్ధరుడైయుండెను తన చేత నాయుధంబు లేమింజేసి పర్వతంబు నొక దానిని బెకలించి మహాధ్వని గదుర చేత బట్టుకొని గిఱగిఱంద్రిప్పెను పర్వత శిఖరంబునెత్తుకొని ఎచ్చుచున్న వాయుసుతుని దూరము నుండియే జూచి యర్ధ చంద్రాకార బాణంబులచే రాక్షసుడు పర్వత శిఖరంబును దుత్తునియలు గావించెను అంజనా నందనుడిది జూచి కోపగర్వంబులు పెనంగొనుచుండ మహాపర్వతంబును బోలియున్న మద్దివృక్షము నొకదానిని బెకలించి పరమామోదమున దేలియాడుచు-నవ్వుచు గిఱగిఱంద్రిప్పుచు మదగజములను-మావటీలను- రథంబులను-రథికులను-గాలిబంటులను పెక్కంద్ర రాక్షసులను జూర్ణము గావించెను క్రుద్ధుడై కాలుని భంగిపై బడవచ్చుచున్న హనుమంతుని రాక్షసులు జూచి భయకంపితులై పాఱిపోయిరి అకంపనుడీవిచిత్రమును గాంచి కుపిత మానసుడై సింహనాదంబు గావించి తీక్ష్ణములును- మర్మభేదంబులునగు పదునాలుగు బాణంబులచే, బవన తనయుని బాదించెను హనుమంతుడు చలింపక వృక్షములతో గూడియున్న పర్వతంబు మాడ్కి నిశ్చలుడైయుండి మహావేగంబున మహీరుహంబు నొక్క దానిని బెకలించి రాక్షసోత్తముని తలపై గొట్టెను ఆ యకంపను డాదెబ్బతో హతుండై నేలబడి విలవిల దన్నుకొని ప్రాణంబులను గోల్పోయెను ఆ రాక్షస వీరుడు నేలబడిన తోడనే భూకంపము గలిగినపుడు వృక్షములు చలించునట్లు రాక్షసులందఱు చలించి దుఃఖార్ణవమందు మగ్నులై యాయుధంబులను బాఱవైచి వెనుకకు దిరిగి చూచుచు సంభ్రాంతులై మానంబువిడిచి పరాజితులైనిట్టూర్పులు బుచ్చుచు లంకకు బరుగిడిపోయిరి వనచరుల మితోత్సాహముతో హనుమంతుని జేరి పూజించిరి అంజనేయుడు సంతుష్టుడై 'మీ యందఱి సహాయంబు చేతనే నాకు జయంబుచేకూరినది గాని వేఱుగాద''నుచు వానరులకు బదులు పూజలొనరించెను జయలక్ష్మీ విరాజమానులగు వానరులు సింహ నాదంబులు గావించిరి బలవంతులగు రాక్షసులదరిపడిరి కైటభాసురుని దునుమాడిన విష్ణువువోలె వీరలక్ష్మీ విరాజ మానుడై విలసిల్లెడు హనుమంతుని దేవతలు గూడ పూజించిరి

రామలక్ష్మణులును-సుగ్రీవ ప్రభృతులగు వానర వీరులను-విభీషణుడును హనుమంతునెంతయు గౌరవించిరి

## నీలుడు ప్రహస్తుని బలిపొర్చుట

అకంపనుడాహవంబున గూలుటకెంతయు రాక్షసేంద్రుడు క్రోధావేశుడై దైన్యంబునొంది విచారమగ్నుడై మంత్రులతో నాలోచించి పిమ్మట పూర్వాహ్ణంబున లేచి సేనావ్యూహంబులను బరికించుచు లంకనంతయు గల యందరిగి వానరులచే ముట్టడింపబడుటకెంతయు గోపించి సభామండపంబున కరుగుదెంచి యుద్ధకోవిదుండగు ప్రహస్తుని జూచి యిట్లనియె యుద్ధ విశారదుండవగు ప్రహస్తుడా! శత్రుసేనలాకస్మికంబుగా వచ్చి పట్టణంబును ముట్టడించి పీడింపుచున్నవి లంకా పట్టణంబును విడిపించుట కన్యుల కలవిగాదని నాకు దోచుచున్నది ఇక్కార్యంబును నేనుగాని-కుంభకర్ణుడుగాని-నీవుగాని-ఇంద్రజిత్తుగాని- నికుంభుడు గాని సాధింప సమర్థులము బలసంపన్నుడవగు నీవతిత్వరిత గతింబోయి విజయ లక్ష్మిని వరింపుము వానరులు చంచల హృదయులు యుద్ధశిక్ష నెఱుంగనివారలు చిత్తస్థైర్యమంతకును లేని వారలు నీ కంఠధ్వని నాలకించినచో భయకంపితులై పరుగిడి పోదురు అప్పుడు రామలక్ష్మణులు నిరాలంబులై నీచేత జిక్కుదురు యుద్ధమందు జయాపజయంబుల నిర్ణయింప జాలము మనము యుద్ధము జేయకున్నచో శత్రువులు మనలను వధియింపక విడువరు కాన యుద్ధము చేయుటయే శ్రేయమని నా యభిమతము ఇందులకు నీవేమందువు? నీ యభిమతమేమి? నీ యభిప్రాయముతో మేమేకీభవింతుము తెలియ బలుకుమనిన ప్రహస్తుడు రాక్షసేంద్రునితో నిట్లులనియె

రాక్షసాధీశ్వరా! ఈ సంగతి క్రొత్తది గాదు గదా! ఇంతకుమున్నే సమర్థులగు సచివులతో నాలోచించన విషయమే మామామాకు మతభేదముగలిగి కలహము గూడ జరిగినది సీతను రామున కొసంగినచో శ్రేయంబొనగూడునని నేను నిశ్చయించియే యుంటిని అట్లు సీతనివ్వనిచో యుద్ధము గలుగునను సంగతి మున్ను నాకు దెలిసినదే! రాక్షసరాజా!

నీవలన దానంబులను-సన్మానంబులను బడయుచు సాంత్వన వచనంబులచే నిరంతరము పూజలందుకొనియెడు నేను కాలంబు వచ్చినప్పుడు నీకు ప్రియంబొనగూర్చెడు కార్యంబెద్దియేనియు జేయకుందునా? నీ కొఱకు యుద్ధమందు ప్రాణంబులైనను దారవోయుటకు సంసిద్ధుడనై యున్నాను భార్యాబిడ్డలను-ధనమును- రక్షించుకోవలయుననియెడు కాంక్ష నాకు లేదు నీకార్యంబు గావించుటయే నాకు ముఖ్య కర్తవ్యమైయున్నది ఇదియే నానిశ్చయంబని ప్రహస్తుడు ప్రభువునకు వెల్లడించి తనముందట నున్న సేనాధిపతులను జూచి రాక్షససేన నతిత్వరితంబుగ గొనిరండని యాజ్ఞాపించెను సేనాధ్యక్షులు వెంటనే ప్రహస్తుని యాజ్ఞమేరకు ద్వారంబున రాక్షససేనలంగూర్చిరి

ఈవార్త మాత్రంబున వివిధాయుధ ధారులగు మత్త కరీంద్రములను బోలిన రాక్షస వీరులచే లంకా పట్టణముంతయు నిండిన దయ్యెను రాక్షస వీరులందఱు నగ్నిహోత్రంబున జయావహంబులగు హోమంబులొనరించిరి బ్రాహ్మణులను గంధ పుష్పాక్షతాదులం బూజించిరి ఆజ్యపుష్పాది గంధములతో గూడిన గంధవహుడు మనోహరముగ వీచుచుండెను అప్పుడు యుద్ధసన్నద్ధులగు రాక్షసులు వివిధములైన విరిసరులను కంఠసీమల దరించి-ధనుస్సులతోడను- కవచంబులతోడను రావణునకభినందనము గావించి ప్రహస్తుని బరివేష్టించి నిలువంబడిరి అప్పుడు ప్రహస్తుడు భయంకరంబైన భేరిని వాయింపజేసి సర్వశోభితమై గుఱ్ఱములచే బూన్చబడిన రథంబు నారోహించెను ఆ రాక్షస సేనాధ్యక్షుడు లంకాపురంబునువీడి సేనాసమేతముగా బయలు దేరిపోవుచుండ మేఘ గర్జనమును బోలిన భేరీధ్వనియు-శంఖధ్వనియు- నానావిధవాద్యంబుల శబ్దములును నలుదెసలకలముకొనియె రాక్షసవీరులు సింహనాదంబులు గావించుచు ప్రహస్తుని ముందునడచిరి నరాంతకుడు- కుంభహనుడు- మహానాదుడు- సమున్నతుడు ననుమంత్రులు నలుగురును ప్రహస్తుని బరివేష్టించి నడచిరి వ్యూహములుగా దీర్చబడిన మహాసేనంగూడి ప్రళయ కాలమందు కాలుని బోలిన ప్రహస్తుడు బవరంబునకు బయలు దేరెను రాక్షసులొనరించెడు సింహనాదములకు లంకా పట్టణమందలి సర్వజంతు జాలములు భయపడి వికృత స్వరంబుగా నఱచినవి జంబుకంబులు నోట

నగ్నిజ్వాలలను గ్రక్కుచు నఱచినవి గగన వీధి నుండి కొఱవిగట్టియవంటి తేజస్సు పడినది కరువలి కఠినముగ వీచినది చంద్రసూర్యాది గ్రహములు మలీమసమైగను పట్టుచున్నవి జలధరంబులతి పరుషంబుగా గర్జించుచు ప్రహస్తుని రథమున అతని ముందునడచు వారలను దడియునట్లుగ నెత్తురువాన గురిసినది గృధ్రమొక్కటి ప్రహస్తుని ధ్వజాగ్రంబునకు దక్షిణాభిముఖంబుగ వ్రాలి రెండు ఱెక్కలను ముక్కుచే గఱచికొనుచు నిల్చును రాక్షసుండదిగాంచి ముఖకాంతిని గోల్పోయి వివర్ణముఖుండయ్యెను సమర్థుడగు సారథిచేతి నుండి ములుగోల తటాలున నేలబడినది సమభూమియందే గుఱ్ఱములు జారిపడెను ప్రహస్తుడు వివర్ణుడగుటయే గాక నిరుత్సాహుడయ్యెను

బలపౌరుషంబులు గల ప్రహస్తుడు యుద్ధమునకు వచ్చుటంజూచి వానర సేనలు నాన విధాయుధ ధారులై యుద్ధంబున కెదురొడ్డి నిల్చిరి ఆయుధములు లేమింజేసి వానరులు వృక్షములను, పెనుశిలలను బెళ్లగించుటచే మహాధ్వని చెలరేగెను ఇరువాగుల సైన్యములను సంతుష్టిని బొంది సింహానాదంబులొనరించెను శలభము గ్నిహోత్రమును జొచ్చినట్లు దుష్టబుద్ధియగు ప్రహస్తుడు సుగ్రీవుని పాలితంబై వృద్ధిబొందుచున్న సేన సముద్రమందు బ్రవేశించెను

అటుపిమ్మట శత్రుసంహారకుండగు శ్రీరామచంద్రుడు దరహాసవదనుడై ప్రహస్తుడు వచ్చుటంగని విభీషణునితో నిట్టులనియె విభీషణా! ఈ మహాకాయుడగు రాక్షసుడు గొప్ప సేనాసముదయంబుతో వచ్చుచున్నాడు ఈతడెవ్వడు? వీనిని జూడ మిక్కిలి పరాక్రమవంతుడని తోచుచున్నది ఇతనింగూర్చి జెప్పుమనిన రామునితో విభీషణుడిట్లనియె రామచంద్రా! యీ రాత్రించరుడు రావణుని సేనాధ్యక్షుడు ప్రహస్తుడను నామముగలవాడు లంకాపట్టణమందు రాక్షసేశ్వరుని సైన్యమునందు మూడవ భాగమీ ప్రహస్తుని యధీనములో నుండును ఇతడస్త్రకోవిదుడు అమిత బలపరాక్రమ సంపన్నుడు సుప్రసిద్ధుడని విభీషణుడు జెప్పెను మహాకాయుడగు ప్రహస్తుడు రాక్షసవీరులతో గూడ సింహనాదములు గావించెను వానరులది జూచి పరమకుపితులై సింహనాదములు గావించిరి

రాక్షస వీరులు ధరించియున్న ఖడ్గములు శక్తులు, బాణంబులు శూలంబులు ముసలంబులు, గదలు, పరిఘంబులు ప్రాసంబులు నెంతయు ప్రకాశించుచుండెను, వానరోత్తములు పుష్పితంబులగు వృక్షములను, పెనుశిలలను బట్టుకొని యుద్ధమునకు సంసిద్ధులై నిలువంబడిరి వానర రాక్షసులొండొరులంగలసి శిలా వర్షంబును గురియుంచుచు బెనంగనారంభించిరి పోరు ఘోరంబయ్యె ఆ ఘోరయుద్ధమందు వానర రాక్షసులనేకులు వధింపబడిరి నిశాచరుల శూలంబులచే గొందఱు వానరులు వధింపబడిరి మఱికొందఱు చక్రములచేతను, పరిఘంబులచేతను, గొడ్డళ్లచేతను, ఛేదింపబడిరి బాణఘాతంబులచే గుండెలు పగిలి మఱికొందఱు విగతజీవులైరి కరవాలములచేత కొందఱు ఖండింపబడి యెగురుచు నేలబడి మృతిజెందిరి

వనచరులదిగాంచి పరమకుపితులై నిశాచరులను తండోప తండములుగా పాదపమ్ములచేతను, పర్వత శిఖరంబుల తోడను జావమోదిరి వానరుల వజ్రస్పర్శంబులగు పిడికిళ్లతో బొడువంబడి కొందఱు రాక్షసులు దంతములును, కన్నులును రాలిపోయి నోట నెత్తురు గ్రక్కుచు నేలంబడి తన్నుకలాడిరి వానర రాక్షసులు సేయు సింహనాదంబుల శబ్దము తుములంబైనింగి ముట్టి చెలంగినది భయంకరముగా క్రుద్ధులై యొండొరులు యుద్ధము జేసిరి నరాంతకుడును, గుంభహనుడును మహానాదుడును సమున్నతుడునను ప్రహస్తుని మంత్రులు నలువురును జెలరేగి వనచరులను అనేక విధములుగా వధించిరి ద్వివిదుండిదిగాంచి పర్వత శిఖరంబుచే నరాంతకుని నేలపాలుగావించెను దుర్ముఖుండను వానరుడు పెద్ద వృక్షమునొకదానిని బెకలించి సమున్నతుడను రాక్షసుని మట్టుబెట్టెను జాంబవంతుడమిత క్రోధావేశుండై పెనుశిలనొక్క దానిని గైకొని మహానాదుని వక్షస్థలంబుపై వైవనతడు నేలబడి ప్రాణంబులు విడిచెను తారునిచే వృక్షంబుతో నతడు నేలబడి ప్రాణంబులు విడిచెను తారునిచే వృక్షంబుతో గొట్టబడి కుంభహనుడు కుంభిణీతలంబునబడి మృతినొందెను నలువురు మంత్రివర్యులిట్లుమడియుటం బ్రహస్తుడు దిలకించి సహింపజాలక ధనుర్ధరుడై వానరులతో ఘోరయుద్ధంబు గావించి యసంఖ్యాకంబులగు బాణంబులతో వనచరులను నొప్పించెను ప్రర్వతాకారంబులగు వానర

రాక్షసుల శరీరంబులు పడియుండుట వలన యుద్ధభూమి భయంకరమై యుండెను రుధిరధారలచే గదనరంగమంతయు నిండి వసంత ఋతువునందు బుష్పించిన పలాశవృక్షంబుల మాడ్కి బ్రకాశించుచుండెను శరదృతువునందలి హంససార పక్షులతో సౌందర్య మెగబోయుచుండు నదిని అవలీలగా దాటునట్లు, దుస్తరమై గనుపట్టెడు యుద్ధభూమి యనెడు నదిని వానర రాక్షసులు దాటిరి

అంతలో రథగతుండై తన మీదికి వచ్చుచున్న ప్రహస్తుని నీలుడు జూచెను ధనుర్ధరులలో నుత్తముడగు ప్రహస్తుడు తన దనుస్సు నాకర్ణాంత మాకర్షించి నీలుని బాణవృష్టిని గురిపించెను ఆ బాణంబులు లక్ష్యంబు దప్పక నీలుని దేహమునందు బ్రవేశించి యావలికి బోయి భూమిపై బడినవి నిప్పువంటి బాణంబులచే గొట్టబడిన నీలుడమిత క్రోధావేశుడై భూజంబు నొక్కదానిని బెకలించి ప్రహస్తుని బ్రహరించెను రాక్షసోత్తముడట్లు వృక్షంబుచే గొట్టబడి మఱింత క్రోధోద్దీపితుండై వానరోత్తమునిపై తీక్షణములగు బాణవర్షంబు గురిపించెను ఆ బాణంబుల నివారింపనశక్తుడై కన్నులు మూసికొని సరకుసేయక నీలుడోర్చియుండి మహోద్రేకుడై మహావృక్షంబు నొకదానిని గైకొని ప్రహస్తుని గుఱ్ఱములను జావమోదెను వెంటనే రాక్షస సేనానాయకుని ధనుస్సునొడిసి పట్టుకొని తునియలుగా జేసి సింహనాదంబు గావించెను అవ్విధంబున రాక్షసుడు విరధుడును, విధనుష్కుడును గావింపబడిన భయంకరమైన ముసలంబుచేతంబూని రథంబునుండి నేల కుఱికెను పరస్పర బద్ధవైరమినుమడింపనీల ప్రహస్తులిరువురును మదగజంబుల మాడ్కి నొండొరులందాకి నిలిచిరి సింహశార్దూలవములకును, వృత్రాసుర దేవేంద్రులకును, సరియైన నీలప్రహస్తులు తీక్షణంబులగు కోఱలచే నొండొరుల దేహంబులు గాయంబులువడ పరస్పర జయంబు గోరి కొంతసేపు మల్లయుద్ధంబు గావించిరి అటుపిమ్మట ప్రహస్తుడు ముసలంబునుగైకొని నీలుని లలాట ప్రదేశంబున గొట్టెను ఆ వ్రేటునకు రక్తము కాలువలై ప్రవహించెను రక్తసిక్తమైన దేహమ్ము గలవాడై నీలుడొక మహాభూరుహమ్మును గైకొని ప్రహస్తుని వక్షస్థలమ్ముపై గొట్టెను రాక్షసుండా దెబ్బను సరుకుసేయక మహాముసలంబును కరంబునందాల్చి వనచరుని

పైకి బరుగెత్తెను నీలుడది గ్రహించి మహాశిల నొకదానిని గైకొని ప్రహస్తుని మస్తకంబుపై బడవైచెను అమ్మహా శిలచే బ్రహస్తుని శిరంబు పెక్కు వ్రక్కలై రూపఱిపోయెను నఱుకబడిన భుజంబువోలె రాత్రించరుడు తటాలున నేలంగూలెను ఆ బాహు విక్రముండగు ప్రహస్తుని దేహమునుండియు శిరంబునుండియు పర్వతంబు నుండి సెలయేఱు బ్రవహించు భంగి రుధిరవాహినులు దొరలెను ప్రహస్తుడు నేలబడిన తోడనే రాక్షసులందఱు భయమంది లంకకు బరుగిడిపోయి దుఃఖాగ్నిని బడిరి జయశాలియగు నీలుడు రామలక్ష్మణులచేతను వానరులచేతను గొనియాడబడుచు పరమామోదంబున దేలుచుండెను

## రావణుడు రామునిచే యుద్ధమందు పరాజితుడగుట

వానరవరిష్ఠుడగు నీలుచే బ్రహస్తుడు గూలిన వార్త రాక్షసులవలన రావణుడాలకించి శోక క్రోధంబులు మనంబున బెనంగొన, చేరువనున్న రాక్షసోత్తములను జూచి దేవోత్తములకమరేంద్రుడు జెప్పువిధంబున నిట్లనియె రాక్షసోత్తములారా! సురేంద్రుని బలంబునైనను వధియింపగల సమర్థుడగు సేనానాయకుని సపరివారంబుగా బిలుకు మార్చిన మన శత్రువులగు వానరులను హ్రస్వదృష్టితో జూడందగిన వారలుగారు నేనిక యాలోచింపవలసిన పనిలేదు నేనే సమరంబునకు బయలుదేరి శత్రువులను రూపుమాపి విజయలక్ష్మిని వరించి వచ్చెదను కార్చిచ్చు కాననంబును దగ్ధమ్ముగావించునట్లు నా బాణాగ్నిచే రామలక్ష్మణులను వానరులను దగ్ధముగావించెదనని యుద్ధోన్మత్తుడై యుత్తమాశ్వంబులచే బూన్చబడిన రథంబునారోహించెను శంఖభేరి పణవాది వాద్యధ్వనులచేతను భుజస్ఫాలనసింహనాదమ్ములచేతను, నానావిధస్తోత్రములచేతను రాక్షసోత్తముడగు రావణుడు కొనియాడబడుచు యుద్ధమునకు బోయెను అప్పుడు రాక్షసులచే బరివృతుండై రాక్షసరాజు భూతలంబుచే బరివేష్టింపబడిన రుద్రునికైవడి తేజోనిలయుడై పట్టణంబును వెలువడి పాదపంబులను, శిలలను దాల్చి నిల్చియున్న భయంకరమైన వానరసేనాసముద్రమును గాంచెను

భుజగేంద్రుని బోలిన బాహువులుగల శ్రీరామచంద్రుడు వానర సేనాపరివృతుండై మహాభయంకరముగ బరతెంచెడు రాక్షస సేనంజూచి రాక్షసోత్తముడగు విభీషణునితో నిట్లులనియె విభీషణా! వివిధ రీతుల నొప్పారెడు ధ్వజములతోడను ప్రాస ఖడ్గశూలాది యాయుధములతోడను, ధనుస్సులతోడను ఐరావతంబులను బోలిన యుత్తమగజముల తోడను బరతెంచుచున్న శూరమయంబగు నీసేనయెవ్వనిది? వివరింపుమనిన రాముని వాక్యములాలకించి విభీషణుడు రాక్షసోత్తముల బలాతి శయంబులను జెప్పదొడంగెను రామా! ఇదిగో! బాలభాస్కరునిభంగి వెలుగొందుచు నేనుగుపై గూర్చుండి బరతెంచు వాడే రావణుని పుత్రుడగు అకంపనుడు ఆ రధారూఢుడై సింహధ్వజములరనింద్ర ధనుస్సున కెనయగుధనస్సును జ్యాకర్షణంబున ధ్వనింపజేయుచు వచ్చుచున్నవాడే బ్రహ్మదత్తవరుండగు ఇంద్రజిత్తు రధగతుండై యతిప్రమాణాకారంబగు ధనుస్సును ధ్వనింపజేయుచు వింధ్యాస్తమహేంద్ర పర్వతాకారుడై చనుదెంచువాడే యుతికాయుడు నవోదితంబగు సూర్యబింబమును బోలిన నయనమ్ములు గలిగి ఘంటాధ్వనిశోభితంబగు గజంబునెక్కి గర్జించుచువచ్చుచున్నాడో! వాడే మహోదరుడు సువర్ణాభరణంబులచే నలంకరింపబడి సంధ్యామేఘ యుక్తంబగు పర్వతంబుకరణి నొప్పారుచు నుత్తమాశ్వంబు నారోహించి వచ్చువాడే పిడుగువంటి పిశాచుడు మెఱపువోలె మిఱుమిట్లు గొల్పుచు వజ్రాయుధంబును బోలినశూలంబును దాల్చి పర్వతాకారంబగు వృషభంబునారోహించి వచ్చుచున్నవాడే యశశ్శాలియగు త్రిశిరుడు విశాల వక్షస్థలము గలిగి మేఘాకారుడై పన్నగరాజ ధ్వజంబుగలిగి ధనుర్విస్ఫారణంబు గావించుచు నిచటికి వచ్చుచున్నవాడే కుంభడు సువర్ణమయమగు వజ్రమణులతో నలంకరింపబడిన పరిఘంబునెత్తుకొని బరతెంచుచున్నవాడే నికుంభుడు ఈతడు రాక్షససైన్యమునకంతయు ముఖ్యుడు ఘనకార్యములొనరించిన ఘనుడు ఆ ధనుర్బాణఖడ్గంబులతో గదనంబున కరుగుదెంచు వాడే నరాంతకుడు ఈతడు పర్వతశిఖరంబులచే బవరంబుజేయువాడు

చంద్రతుల్యంబగు శ్వేతఛత్రంబు ప్రకాశించుచున్నది గదా! ఆరధమందే దేవతల గర్వంబడంచిన మహాత్ముడగు రావణుడు రాక్షస

పరివృతుండై భూతములచే సేవింపబడుచున్న రుద్రునికైవడి దేజరిల్లుచున్నాడు కిరీటధరుండును, కుండలాలంకృత మోముగలవాడును, హిమవత్పర్వతాకారుండును జితేంద్రియుడునగు రాక్షసేంద్రుడు సూర్యుని వోలె వెలుగొందుచున్నాడు చూడుమని విభీషణుడు రామునితో జెప్పెను అప్పుడు రాముడు రావణుని జూచి విభీషణునితో నిట్లనియె విభీషణా! రాక్షసరాజగు రావణుడెంత తేజోనిలయుడై వెలుగొందుచున్నాడు! చూడజూడ మహాప్రతాపుడుగా గనపట్టుచున్నాడు ఏమాశ్చర్యము దినకరునివోలె దివ్యతేజంబున దేజిచూడనలవిగాకున్నాడు గదా! ఈతని దేహంబునకున్న తేజస్సు దేవదానవులలో నెవ్వరికిని గన్పట్టదు భటులన్నునో పర్వతాకారులు మహాతేజోవంతులు దేదీప్యమానంబులగు నాయుధధారులై కొండలతో ఢీకొని యుద్ధంబు గావింపసమర్థులై వెలయుచున్నారు భయంకరాకారులగు రాక్షసులచే బరివేష్టితుండై మహాకాయంబులగు భూతములచే బరివృతుండగు యమధర్మరాజువోలె రావణు డొప్పారుచున్నాడు దైవవశంబున నీ పాపాత్ముడు నేడు నా యెదుటంబడియె సీతాపహరణంబువలన రగుల్కొనిన నా కోపాగ్ని నేటితో జల్లారగలదు చూడుమని రాముడు ధనుర్ధారియై లక్ష్మణ సహితుడై యుద్ధంబునకు సన్నద్ధుడై నిల్చియుండెను

ఆ సమయంబున రావణుడు రాక్షసులను జూచి, మీరందఱు నావెంట వచ్చియున్న చిద్రంబు దెలిసికొని శత్రువులు లంకాపురంబు జొచ్చి నాశంబు గావింతురు మీరందఱు వెనుకకు బోయి జతుష్పధగృహంబుల యందును, పురద్వారంబులయందును, భద్రముగా గాచియుండుడని యాజ్ఞాపించెను రాజాజ్ఞను శిరంబునందాల్చి రాక్షసులు వెనుకకు బోయిరి రాక్షసులను వెనుకకు బంపి రావణుడు మహానీరాకరంబును మహామత్స్యంబుగలంచు కైవడి వానరసేనాసముద్రమును గలంచెను రావణుడు దేదీప్యమానంబులగు ధనుర్బాణంబులను దాల్చి త్వరితగతినరుగు దెంచుచున్న విచిత్రమును గాంచి వానరేంద్రుడగు సుగ్రీవుడు పెక్కుభూజంబులచే నిండియున్న పర్వతశిఖరంబునొక్కదాని నాతని పైకి విసరెను రాక్షస నాధుండది గాంచ బాణంబులచే బర్వత

శిఖరంబును దునియలు గావించి నేలగూల్చి యమిత కోపోద్రేకుడై మృత్యువుంబోలిన నొక్క దివ్యబాణంబును ధనుస్సున సంధించి సుగ్రీవ వధార్థమై ప్రయోగించెను వజ్రాయుధంబును బోలిన బాణము రావణ బాహుముక్తంబై కుమారస్వామి ప్రయుక్తంబగు శక్తి క్రౌంచపర్వతంబును భేదించు కైవడి వానరేంద్రుని భేదించెను సుగ్రీవుడాబాణఘాతంబుచే బీడింపబడినవాడై తెలివిదప్పి వెలవెలంగూయుచు నేలబడెను వానరాధీశుండు మూర్ఛిల్లి నేలబడుట కెంతయు సంతసించి రాక్షసులు సింహనాదంబులు గావించిరి

అంతలో గవాక్షుడు గవయుడు, ఋషభుడు, జ్యోతిర్ముఖుడు, నభుడు కాయంబులను బెంచుకొని పర్వతంబులను కరంబులను దాల్చి రాక్షసరాజేంద్రుని మీదికడరిరి ఆ వానరవీరులు తనపైవేసిన పర్వతంబులను దీక్ష్ణ బాణంబులచే దుల్తినియలు గావించి వానరోత్తములను బాధించెను ఆ వానరవీరులు రావణుని బాణఘాతంబులచే బిన్నదేహులై నేలంబడిరి అంతటితో దనివిజెందక దానవోత్తముడు వానరసేననంతయు బాణాగ్నిచే ముంచివైచెను వానరులు భీతిల్లి యఱచుచు శరణ్యుడగు రాముని శరణుజొచ్చిరి మహాత్ముడును మహాధనుర్ధరుండునగు రామచంద్ర భగవానుడీవిచిత్రవైఖరింగాంచి వానర రక్షణార్థమై ధనుర్ధారియై త్వరితంబుగ భండనంబునకు బయలు దేరెను అప్పుడు సుమిత్రాసూనుండగు లక్ష్మణుండు రాముని జేరంబోయి చేమోడ్పుగిలించి పరమార్థయుక్తంబగు మాటను జెప్ప దొడంగెను అన్నా! ఈ దురాత్ముని దునుమాడుటకు నీవు బోవలయునా? నీతో యుద్ధంబు జేయు యోగ్యత రావణాసురునకు లేదు నేనుబోయి వధించి వచ్చెదను నాకనుజ్ఞ నొసంగుమనియెడు లక్ష్మణునితో రాముడిట్లనియె

లక్ష్మణా! నీకోర్కె మేరకు యుద్ధంబునకు బోయిరమ్ము రావణుడు మహాతేజోవంతుడు జాగ్రత్తగా సమరంబు గావింపుము ఆతడు యుద్ధకోవిదుడు అత్యాశ్చర్యకరంబుగ బవరంబున విహరించును ఈ రాక్షసేశ్వరుండు క్రోధావేశుండాయెనేని ముజ్జగంబులైనను నీతని ముందల నిలువంజాలవు వాని చిద్రంబులను జూచి ప్రహరింపుము నీ ఛిద్రంబులను జక్కగా సవరించుకొనుము జాగ్రతాయత్తచిత్తుండవై నీధనుస్సుతో నిన్ను

రక్షించుకొనుచు సమరంబు సలుపుము పోయి రమ్మనియెడు రాముని మృదుమధుర వాక్యములాలకించి మైపులకలెగయ లక్ష్మణుడు సోదరుని గౌగిలించుకొని పూజించి నమస్కరించి యుద్ధమునకు బోయెను వారణహస్తబాహువులుగల సుమిత్రా సుతుండు దేదీప్యమానంబగు భీమచాపంబును కరంబున దాల్చి ఖిన్నులై నేలంబడియుండు వనచరులపై శరవృష్టి జాలంబును గురిపించుచున్న రావణుని జూచెను బవరంబునకు బరతెంచుచున్న లక్ష్మణుని పవనాత్మజుడు జూచి భృత్యుండనగునేనుండగా లక్ష్మణుడు యుద్ధంబు గావించుటేలనని బాణపరంపరలను సరకుగొనక రాక్షసేంద్రునిపై కడరెను ధీశాలియగు హనుమంతుడు రావణుని రథంబుజేరంజని కుడిభుజంబెత్తి రావణుని గుండెలదరనిట్టులనియె రావణా! నీవు దేవదానవగంధర్వయక్షులను జయించి యున్నావు ఇదినిజము నీకు వానరుల వలన భయంబుగలదు ఇదిగో! నాదక్షిణ బాహువు నిన్ను వధించి చిరకాలము నీదేహంబున నివసించియున్న జీవుని వెడలగొట్టగలదు చూడుమని హనుమంతుడు రావణునితో జెప్పెను భయంకర పరాక్రముండగు రాక్షసనాథుడు హనుమంతుని వాక్యములాలకించి కోపారుణలోచనుండై యిట్లు చెప్పెను హనుమంతుడా! త్వరితముగ రమ్ము నిర్భయముగ నన్ను బ్రహరింపుము ఒకకోతి లంకాధీశుని యుద్ధమందు గొట్టెననియెడు శాశ్వతయశంబు నాపాదించుకొనుము తదుపరి నీపరాక్రమంబు దెలిసికొని నిన్ను రూపుమాపెదను రమ్మనియెడు రాక్షసేంద్రుని పలుకులాలకించి పవనతనయుండిట్లనియె

రాక్షస రాజా! మున్ను నాచే దునుమాడబడిన నీ తనయుండగు యక్షునొకమారు దలంచుకొనుము యుద్ధమునకు సిద్ధముగమ్ము లెమ్మని యెడు కరువలిసుతుని వక్షస్థలంబున రావణుడఱచేతంజఱచెను ఆ వ్రేటునకు జలించి పవనాత్మజుడు కొంత తడవటులనేయుండి స్థైర్యంబు దెచ్చుకొని పరమక్రుద్ధుడై రాక్షసవల్లభుని ఱొమ్ముపై నఱచేతంజఱచెను ఆ యఱచేతిదెబ్బకు భూకంపము వలన బర్వతంబు చలించునట్లు బాహుబలాఢ్యుడగు రావణుడు చలించెను క్రూరుండగు రాక్షసేశ్వరుండు చలించుటంజూచి వనచరులు, ఋషులు దేవతలు, అసురులు, పరమానందసాగరంబున నీదుచుగోలాహలంబు గావించిరి అప్పుడు

రావణుడూరటనొంది హనుమంతుని జూచి యిట్లనియె సమీరనందనా! లెస్సలెస్స నీవు నాకు శత్రుడవైనను నీ బలపరాక్రమ సంపద కెంతయునలరితిని నిన్ను మెచ్చుకొనుచున్నాననియెడు రావణుని పలుకులను మారుతి యాలకించి రావణా! నీవు నాచేగొట్టబడిన వాడవయ్యును చావక బ్రదికియున్నావే! నా పరాక్రమమేల కాల్పనా? దురాత్మా ఇంకొకమాఱు నన్ను బ్రహరింపుము ఊరక నన్ను నీవేల పొగడుకొనెదవు నా ముష్టిఘాతముచే నిన్ను యమసదనంబునకనిపెదను రమ్మనిన తోడనే రాక్షసేశ్వరుండమిత కోపోద్రేకుడై దక్షిణ హస్తంబున దృఢంబుగా బిడికిలియులవరించి త్వరితంబుగ పవనతనయుని వక్షస్థలంబునంబొడిచెను ఆ దెబ్బకావాయుసుతుండు చలించి సోలిపోయెను అతిరథుండగు రాక్షస వల్లభుండిదిగాంచి హనుమంతుడు దెప్పరిల్లిన గష్టవుని శీఘ్రంబున నాచోటునెడబాసి నీలుని మీది కేగి పన్నగతుల్యములైన శరజాలంబు నాతనిపై గురిపించెను వానరసేనా నాయకుండగు నీలుడు బాణఘాతంబులచే బీడింపబడినవాడై పర్వతశిఖరంబు నొకదానిని రాక్షసరాజుపై బడవైచెను హనుమంతుడంతలో దెప్పరిల్లి యుద్ధోన్మత్తుడై నలుదిశలను బరికించి నీలునితో యుద్ధంబుజేయుచున్న రావణుని జూచి రావణా! నాతో దప్పించుకొనిపోయి మఱియొకనితో యుద్ధమునకు గడంగితివి నిన్ను వెన్నంటిదఱుముట యుక్తముగాదు నిన్ను వదలితినని వాయుసుతుండు బలికెను

నీలుడు తనపై బడవైచిన పర్వత శిఖరంబును యేడు తీక్ష్ణబాణంబులచే ఖండింపనది తునియలై నేలంగూలెను వానర సేనాధ్యక్షుడదిగాంచి ప్రళయకాలాగ్నికైవడి మండిపడి ఇనుమద్ది వృక్షములను పుష్పించిన మామిడి వృక్షములను, నానావిధములైన భూరుహంబులను, రావణునిపైకి విసరెను ఆ వృక్షములన్నింటిని కఱకు బాణంబులచే ఖండించి రాక్షసేంద్రుడు నీలునిపై బాణవర్షమును గురిపించెను ఆ రావణుని బాణవృష్టిచే వనచరుడభివృష్టుడై తన యాకారంబును హ్రస్వంబుగావించుకొని రాక్షసనాథుని ధ్వజాగ్రంబు మీదికి బ్రాలెను రాత్రించరుడది గాంచి క్రుద్ధుడై మండిపడెను నీలుడు ధ్వజాగ్రంబున నుండియే సింహనాదంబుగావించెను నీలుని జూచి

రామలక్ష్మణులును హనుమంతుడును మిగుల నాశ్చర్యమొందిరి నిశాచరుండు నీలుని లాఘవంబున కమితాశ్చర్యమొంది ఆగ్నేయాస్త్రంబును గైకొనెను వానరులందఱు నీలుని కొనియాడుచు సింహనాదంబులు గావించి మహార్ణవంబున దేలియాడిరి ఆగ్నేయాస్త్రంబుతో నభిమంత్రింపబడిన శరంబును గైకొని రాక్షస వల్లభుండు నీలుని జూచి వానరోత్తమా! నీవు మాయలునేర్చినవాడవు మహాలాఘవంబుచే నొప్పారుచున్నావు నీవు సమర్ధుడవైతే నీ ప్రాణంబులను దక్కించుకొనుము ప్రాణ రక్షణార్ధమై మాయచె నీవు దాల్చెడు నానా విధములైన రూపంబులన్నియు నేను బ్రయోగించెడు దివ్యాస్త్రముచే నదృశ్యమైపోగలవు ఇదే చూడుమని యాగ్నేయాస్త్రంబుచే బాణంబు నభిమంత్రించి నీలునిపై విడిచెను అ దివ్యాస్త్ర జ్వాలలచే దహింపబడుచు దటాలున ధ్వజాగ్రము నుండి నీలుడు భూమిపైబడెను తండ్రియగు నగ్నిహోత్రునిచే ననుగ్రహింపబడినవాడై దివ్యాస్త్రముచే విసంజ్ఞుడై మోకాళ్లానుకొని నేలంబడెను కాని మృతుండుకాజాలడయ్యెను రావణుడు నీలుని మూర్ఛలో మునుంగజేసి యుద్ధోత్సుకుడై లక్ష్మణుని మీది కడరెను అడ్డము వచ్చిన సుగ్రీవాదులను వారించి రావణుడు భూమి కంపించునట్లువడి ధనస్సును జ్యాకర్షణంబున ధ్వనింపజేసెను

ధనస్సును ధ్వనింపజేయుచున్న రావణుని లక్ష్మణుడు జూచి రావణా! వానరులతో యుద్ధము జేయుచున్నావేల? ఇదియే నీ పరాక్రమమునకు నిదర్శనము రమ్ము నాతో యుద్ధంబుజేయు మనినెడు గంభీరోక్తుల నాలకించి క్రుద్ధుడై రాక్షస వల్లభుండిట్లనియె లక్ష్మణా! నీకు వినాశకాలంబు దాపురించినది అందులకే నీకీ విపరీత బుద్ధిబొడమినది నా భాగ్యవశంబున నేడు నా దృష్టి పథంబునంబడితివి ఈ క్షణమందే నాబాణంబులచే హతుండవై యమసదనంబున కేగగలవు రమ్మని గర్జించెను అట్లు గర్జించుచున్న రాక్షసేంద్రుని జూచి తృణీకరించి లక్ష్మణుడిట్లనియె పాపాత్ములలో శ్రేష్ఠుడా! రాక్షసాధీశ్వరా! మహా ప్రభావసంపన్నులిట్లు గర్జింపరు నిన్ను నీవే పొగడకొనెదవేల? నీ బలపరాక్రమంబులు నేను చక్కగా నెఱుంగుదును నాకు దెలియనిదేమున్నది? నేనిదే ధనుర్బాణమ్ములు ధరించి నిల్చియున్నాను

శూరుండవైతే యుద్ధమునకు రమ్ము వ్యర్థప్రలాపంబులచే నాత్మస్తుతిజేసికొనుట వలన ప్రయోజనమేమున్నదనిన తోడనే రావణుడు లక్ష్మణునిపై నేడు బాణములు ప్రయోగించెను ఆ శరంబులనేడింటిని సుమిత్రాసుతుండతిసులభముగా ఖండించెను తన బాణంబులను ఖండించుటకెంతయు క్రోధోద్దీపితుడై లంకాధిపతి దశరథసుతునిపై తీక్ష్ణ బాణంబులంబ్రయోగించెను లక్ష్మణుండదిగాంచి ధనుస్సువుండలాకారంబు గావించి రాక్షసేంద్రునిపై నిశిత బాణవర్షంబును గురిపించి రావణుండేయు బాణంబులను ఖండించుచు గలతనొందడాయెను సుమిత్రాసుతుని బాణంబులచే బీడింపబడినవాడై యూతని శరలాఘవంబునకమితాశ్చర్యమొంది మరల తీక్ష్ణములగు బాణంబులను రాక్షసేశ్వరుడు ప్రయోగించెను రాముని తమ్ముడు రావణుని వధార్థమై వజ్రాయుధంబునకును, పిడుగునకును సమానమైన వాడిబాణంబులను వింటంగూర్చి ప్రయోగించెను రాక్షసనాథుండు లక్ష్మణుండేసిన బాణంబులన్నింటిని ఖండించి తనకు బ్రహ్మదేవుడిచ్చిన ప్రళయకాలాగ్నితుల్యంబగు దివ్యశరంబు సంధించి దశరథనందనుని లలాటంబునాటనేసెను లక్ష్మణుడు చలనంబునొంది మూర్ఛిల్లి కొంత తడవునకు తేఱుకొని రావణునిచేతిలోనున్న ధనుస్సును ఖండించి తృప్తిజెందక తీక్ష్ణాగ్రంబులుగల మూడు బాణంబులచే రాక్షసరాజును బాధించెను రావణుడాదెబ్బలచే మూర్ఛిల్లి యెట్టకేలకు దెలివొంది బ్రహ్మదేవునిచే బడసిన శక్తిని గైకొని శీఘ్రంబున లక్ష్మణునిపై బ్రయోగించెను లక్ష్మణుడెదిరించి శక్తిని తనబాణంబుచే గొట్టెను కాని లాభములేకపోయెను ఆశక్తి విశాలమైన సుమిత్రాసుతుని వక్షస్థలంబుజొచ్చినది లక్ష్మణుడు మూర్ఛనొంది భుమిపై బడెను రావణుడతిత్వరితముగ వచ్చి లక్ష్మణునెత్తుకొని పోవందలంచి కరంబులచే నతనింబట్టుకొనెను హిమవత్పర్వతము, మందరపర్వతము, మేరుపర్వతములకంటె భారమైగనుపట్టెను ముల్లోకంబులనైనను యెత్తవచ్చును గాని లక్ష్మణునెత్తుటతిదుర్లభముగ నున్నదని రాక్షసలోకనాథుండు దలంచెను

బ్రహ్మదేవుని శక్తి లక్ష్మణుని వక్షస్థలమును జొచ్చినంతనే తనది విష్ణుదేవుని యంశమేనని దలంచి స్మరించెను అమ్మహాత్ముడు

మానుషాకారంబునొందిన సాక్షాద్విష్ణుదేవుని యంశముగుకతంబున దేవశత్రువాతనిని లేవనెత్తుటకు సమర్థుడు కాజాలడయ్యెను అదిజూచి వాయుసుతుండమితక్రోధావేశుడై రావణునిపైబడి వజ్రంబున కెనయగు పిడికిలిచే రాక్షసనాథుని రొమ్ముపై బొడిచెను ఆ ముష్టిఘాతంబునకు రావణుడు భూమిపై మోకాళ్లనబోరగిలంబడినోళ్ల నుండియు, గన్నుల నుండియు శ్రవణములనుండియు, రక్తమును గ్రక్కెను ఇట్టట్టు బొరలాడుచు జేష్టలుదక్కి రథమధ్యంబునబడి పరితపించుచుండెను భయంకర పరాక్రముండగు రాక్షసేంద్రుడు మూర్ఛితుండగుటంజూచి వానరులు మహర్షులు, దేవేంద్ర ప్రముఖులగు దేవతలు సంతోషాబ్ధినీదుచు గోలాహలంబు గావించిరి రావణ ప్రహారంబున మూర్ఛితుండగు లక్ష్మణుని శత్రువులకు గదలింపనలవిగాకున్న పవన తనయుండు పరమభక్తుండగుటంజేసి సులభముగా రాముని సన్నిధికి గొనిపోయెను ఆశక్తి దుర్జయుండగు లక్ష్మణునివీడి మరల రావణుని రథంబు జేరుకొనెను లక్ష్మణుడు వెంటనే మూర్ఛదేఱియాఱిన గాయములు గలవాడై తన్మయ చింత్యమైన విష్ణుదేవుని యంశముగ స్మరించెను

మహాతేజుండగు రావణుడుగూడ మూర్ఛదేఱి తీక్ష్ణములగు బాణములను గొప్ప ధనువును గైకొని నిలువంబడెను గొప్పవీరులు నేలబడుటంగాంచి వానరులు పరుగెత్తుచుండిరి రాముడది జూచి క్రోధావేశుండై రావణుని మీదికడరెను అప్పుడు సమీరకుమారుండరుగు దెంచి రామా! విష్ణుదేవుడు వైనతేయునెక్కి గూర్చున్నట్లు నీవు నాపై గూర్చుండుము జాగరూకుండవై రావణునితో రణంబొనరింపుమని హనుమంతుడు రామునితో జెప్పెను రాముడందులకియ్యకొని బలవంతుడగు నయ్యాంజనేయు నారోహించెను మనుజ లోకేంద్రుడ వ్విధంబున మారుతినారోహించి రదగతుండగు రావణుని జూచి విష్ణుదేవుడు బలిచక్రవర్తి మీదికి బోవుచందంబున క్రుద్ధుడై ధనుర్ధరుడై యాతని మీది కడరెను వెంటనే మహాధ్వనిగదురజ్యాశబ్దంబు గావించి రావణుని జూచి యిట్లనియె రాక్షసశ్రేష్ఠుడవగు రావణా! నిలునిలువుము నాకింతటి యపకారంబుదలపెట్టిన నీవెచ్చటికి బోయి విముక్తుడవు కాగలవు

అమరేంద్రుడు, యముడు దినకరుడు విధాత అగ్నిహోత్రుడు శంకరుడు మొదలగు వారందఱడ్డుపడినను, దశదిశలకు బరుగెత్తినను, నాయెదుటంబడిన నీవు తప్పించుకోజాలవు సువూ! నీ విపుడు శక్తిచేగొట్టబడిన యాతడే మరల వచ్చి నీతో యుద్ధంబు గావించి నిన్ను నీ పరివారమునను వధింపగలడు తొందరపడవలదు ఇప్పుడు నీ యెదుటనున్న నేనే జనస్థానమందు పదునాల్గువేలఖరదూషణాదులను ఖండించిన వాడనని రాముడు చెప్పుచుండగనే రావణుడు రామునకు వాహనమైయున్న వాయుసుతునిపై బ్రళయకాలాగ్ని తుల్యంబగు తీక్ష్ణబాణంబులను బ్రయోగించెను హనుమంతుని తేజస్సు మఱింతయధికమాయెను రావణునిచే గాయంబులు గావింపబడిన కరువలినందుని దశరథనందనుడు జూచి కుపితుడై రావణుని రథంబును, గుఱ్ఱములను, ధ్వజంబును, ఛత్రంబును, సారథిని శరపరంపరలచే ఖండించెను సురేంద్రుడు వజ్రాయుధంబుచే మేరుపర్వతంబును గొట్టు చందంబున వజ్రంబునకును పిడుగునకును సరివచ్చు బాణంబుచే రావణుని విశాల వక్షస్థలంబున గొట్టెను పిడుగుపడినను సురనాథుండు వజ్రాయుధంబుచే గొట్టినను గలతనొందక జలింపని రావణాసురుండు రాముని బాణఘాటికాగంజాలక చలనంబునొంది చేతనున్న ధనుస్సును గూడ జారవిడిచెను రావణుడు మూర్ఛితుడగుటంజూచి రాముడొక యర్ధచంద్రబాణంబుచే సూర్యవర్ణంబులొలికెడు కిరీటమును ఖండించెను సంగరంబున ఖండింపబడిన కిరీటశిఖరముగలవాడై నిర్విషంబగు సర్పంబువోలెను, మంటలులేని యగ్నివోలెను, కాంతిరహితుడగు సూర్యునివోలెను నిస్తేజస్కుడైయున్న రావణాసురుని రాముడుజూచి రాక్షసరాజా! నీవు మహాభయంకరంబగు కార్యంబొనరించియున్నావు మేటి వీరులనెందఱినో గీటడగించినావు అందువలన పాపమిప్పుడలసి యున్నావు యమసదనంబునకు బంపక విడిచితిని యుద్ధపరిశ్రాంతుడవై యున్నావు నేననుజ్ఞయొసంగెదను లంకకుబోయి కొంత విశ్రమించి రథారూఢుడవై ధనుర్ధరుడవై రమ్ము నీవు మరల రథగతుండవై రణంబునకు వచ్చినప్పుడు నా బలంబుజూపెదను పోయిరమ్మనిన తోడనే రావణుడు గర్వంబును విడిచి లజ్జితుడై శీఘ్రంబున లంకాపురంబు బ్రవేశించెను రామలక్ష్మణులు వానరదేహంబులందు నాటియుండిన బాణంబులను బెరికించి

వారిబాధలను దీర్చిరి రావణుడు పరాజితుండగుటకు సురులు, నసురులు, దిక్పాలురు జలచరంబులు భూచరంబులు మహర్షులు, నాగులు మొదలగుగాగల సర్వభూతంబులు సంతోషాబ్ధినీదెను

## రావణుడు తన పరాభవమునకు వగచి కుంభకర్ణుని నిద్రలేపుమని రాక్షసులకాజ్ఞాపించుట

రామబాణభయపీడితుండై భగ్నదర్పుడై పరముదు ఖితుడై రావణుండు లంకాపురంబు జొచ్చి మృగరాజును జూచి మాతంగము భయపడునట్లును పన్నగము పక్షీంద్రుని గాంచి భయమందు రీతిగను మహాబలుండగు రామచంద్రుని జూచి భీతచిత్తుడయ్యెను రామబాణంబులను దలంచి తలంచి మఱింత భయకంపితుడై కాంచనమయంబగు దివ్యసింహాసనంబుననాసీనుడై రాక్షసులనుజూచి యిట్లనియె

రాక్షసవీరులారా! నేను మహేంద్ర సమానుడనై మనుష్యమాత్రుని వలన పరాజయంబునొందితిని గదా! నేజేసిన తపస్సంతయు వ్యర్థమై పోయినది మానవుల వలన నీకు భయముగలుగునని సురజ్యేష్ఠుడు మున్ను నాకు జెప్పియుండెను అమ్మహాత్ముని వాక్యమునేటికి సఫలంబాయె దేవదానవ గంధర్వయక్షరాక్షసపన్నగుల వలన మృత్యువు లేకుండ బ్రహ్మవలన వరంబునొందితిని మనుష్యులవలన జావులేకుండు నట్లు వరంబడుగనైతిని మునుపు యిక్ష్వాకువంశోద్భవుండగున నరణ్యుడు నాచే వధింపబడునప్పుడు రాక్షసకులాధమా! నిన్ను పుత్రపౌత్ర మిత్రబంధు వర్గముతో గూడ రూపుమాపగల మహాపురుషుడొకడు నా వంశంబున జన్మింపగలడని శాపంబిచ్చియుండెను దశరథసుతుండగు రాముడే యమ్మహాపురుషుండు గాబోలును మున్ను వేదవతిని బలాత్కరించి యుంటిని అప్పుడాబిడ మఱుజన్మమందు నిన్ను నీవంశమును నశింప జేయుదునని శాపమొసంగియుండెను అమ్మహాభాగ్యురాలగు వేదవతియే జనకపుత్రియగు సీతగా జన్మించినది పార్వతి నందీశ్వరుడు, రంభ, పుంజికస్థల మునుపు జెప్పినట్లే పరిణమించినది తప ప్రభావముచేత జెప్పబడిన

ఋషివర్యుని వచనంబెన్నటికిని రిత్తవోదు మీరందఱు దీనిని చక్కగా దెలిసికొని శత్రుసంహార విషయమునందు జక్కగా బ్రయత్నింపుడు పురద్వారములయందును గోపుర శిఖరంబులయందును రాక్షసులను గావలియుంచుడు దేవదానవుల క్రొవ్వడగించువాడును బ్రహ్మశాపంబు వలన నిరంతరము నిద్రించువాడునగు కుంభకర్ణుని నిద్రలేపుడు ప్రహస్తుడు బవరంబున నిహతుడయ్యె నేను పరాజితుండనైతిని నిద్రా పరవశుండై యున్న కుంభకర్ణుని నిద్ర నుండి మేలుకొల్పుడు వాడుబుద్ధిహీనుడై నిశ్చింతగా నిదురింపుచున్నాడు ఇవ్విధంబున నాఱేడెనిమిది తొమ్మిది మాసంబులు విడువక నిద్రించుచుండును అతడు యుద్ధాలోచనసభకువచ్చియుండియు రానివానియట్లు యుద్ధా రంభమునకు ముందు తొమ్మిదవ దినంబున నిద్రబోయెను ఆ మహాబలుని నిద్రమేలుకొల్పినచో రామలక్ష్మణులను వానరులను వధించిరాగలడు సమస్త రాక్షసులలో నీతండతిముఖ్యుడు నన్నుబోలిన శాపగ్రస్తుడు గాడు యుద్ధమందు పరాజయమొందిన నేనిపుడాతని నిద్రనుండి మేల్కొలుపుట దోషమేమియులేదు కష్టసమయమందు తోడ్పడని కుంభకర్ణుడుండియు నాకేమి ప్రయోజనము మీరతిత్వరితంబుగ బోయి కుంభకర్ణుని నిద్రనుండి మేల్కొలుపుడని రావణుడు రాక్షసులాకాజ్ఞాపించెను

## రాక్షసులు నిద్రనుండి కుంభకర్ణుని మేల్కొలుపుట

రాక్షసులు రాక్షసేంద్రుని యానతిని శిరంబునందాల్చి పరమసంభ్రాంతచిత్తులై కుంభకర్ణుని గృహంబునకుంబోయిరి ఆ గృహంబొకటిన్నఱామడ వైశాల్యము గలిగి రమణీయంబుగ నలరారుచుండెను అట్టి గృహద్వారంబు జొచ్చి కుంభకర్ణుని గాఢనిట్టూర్పులచే వెనుకకుంద్రోయబడుచు నెట్టకేలకు గాఢయత్నమును సల్పిలోనంబ్రవేశించిరి రాక్షసులందఱు నొక్కటిగా జేరి వికృతాకారుడై నిదురించుచు పర్వతంబుకరణి జూపట్టుచున్న రావణుని తమ్ముని మేలుకొల్పసాగిరి రోమమయంబగు దేహమును భయంకరములగు నాసారంధ్రములను, పాతాళమునుంబోలిన వక్త్రంబును, గలిగి

భయంకరమైన నిట్టూర్పులతో నిదురించుచున్న కుంభకర్ణుని కొంత తడవాశ్చర్యముతో జూచిరి నిదుర మేల్కొన్న తోడనే కుంభకర్ణుని తృప్తిబరచుటకై మేరుపర్వతమువంటి మాంసపురాశిని సిద్ధపరచిరి నానావిధములైన యన్నములను రాసులు రాసులుగా నుంచిరి రుధిరభాండములను, మద్యభాండములను నిచిరి శ్రేష్ఠములగు చందనాది ద్రవ్యములను, కుంభకర్ణుని దేహంబునకలందిరి పరిమళంబును గురిపించెడు కుసుమదామములచే రాక్షసునలంకరించిరి సుగంధ దీపము వేసి రాక్షసోత్తముని పొగడిరి శంఖములను బూరించిరి మేఘముల వోలె గర్జించిరి ఏకకాలంబున దొమ్మిగానఱచిరి ఇట్టటు గదలించి కొట్టిరి మహాధ్వని గావించిరి పక్షులు భయమంది దిక్కులకు బారినవి యెంతప్రయత్నించినను సుప్తుడగు కుంభకర్ణుడు మేలుకొనకుండుట కెంతయు విసిగి పర్వతశిఖరమ్ములను, ముసలమ్ములను, గదలను, వృక్షములను, గుదియలను దీసికొని కొట్టిరి పిడికిళ్లతో బొడిచిరి బలవంతులగు రాక్షసులు కుంభకర్ణుని నిట్టూర్పు గాలిచే నిలువంజాలరైరి శ్రమజెందియు తమ ప్రయత్నమును వీడక మృదంగములను, పణవంబులను, భేరులను, శంఖములను ఏకకాలంబున వాయించిరి ఎంతమేలు కొల్పినను నాతడు మేల్కొన డాయెను

రాక్షసులు మఱింత గాఢప్రయత్న మొనరించి యుష్ట్రములను, అశ్వములను, గార్దభములను, మత్తకరేంద్రములను, కుంభకర్ణుని మీదికి దోలి త్రొక్కించిరి కొయ్యలచేతను, గుదియలచేతను, ముసలంబులచేతను, తమబలము కొలది గొట్టిరి అమ్మహాధ్వని లంకాపురంబంతయు వ్యాపించినది ఏమిజేసినను రాక్షసుడు మేలుకొనడయ్యెను నిశాచరులు పరమకుపితులై పిడికిళ్లతో బొడిచి తలవెంట్రుకలనుబట్టి లాగిరి చెవులను గొఱికిరి నూర్లకొలది బానల నీళ్లను చెవులలో బోసిరి అప్పటికిని కుంభకర్ణుడు కదలడయ్యె కూటముద్గరంబులచేతలయందును, వక్షస్థలమందును గొట్టిరి వేయి యేనుగులచే ద్రొక్కించిరి ఆ వేయి యేనుగుల త్రొక్కుడు లాతని మేనుంజిన్న పురుగు ప్రాకినట్లై మేల్కొని భయంకరముగ నావులించుచు బైకి లేచెను అభరణాలంకృతంబగు కుంభకర్ణుని శరీరము ప్రావృట్కాల మందుకొక్కెరలతో గూడి వర్షించు వారి

వాహినివోలె ప్రకాశించెను మండుచున్న నిప్పులమాడ్కి నయనద్వయంబు మహాగ్రహాంబులో యన్నట్లుండెను సమస్త భక్ష్యంబులను రాక్షసులు ముందుబెట్టిరి అతడు వానినెల్లభక్షించెను మాంసమును దినిరుధిరంబుకు గ్రోలి బానలనుండు మేదస్సును మద్యంబును గ్రోలెను అట్లు సంతృప్తి జెందిన కుంభకర్ణుని రాక్షసులు సమీపించి పరివేష్టించి నమస్కరించి నిల్చిరి నిదురచే గలుషితములైన కన్నులతో రాక్షసులందఱిని బరికించి యిట్లనియె రాక్షసులారా! రావణునకు క్షేమమేగదా! మీరెందుకు నన్ను నిద్రనుండి మేల్కొలిపితిరి ఏదో భయంబు వాటిల్లుకతంబుననే నన్నింత త్వరలో నిద్దుర నుండి లేపినారు నేనిపుడే దేవేంద్రునిగాని, అగ్నిహోత్రునిగాని, ఛేదించి రావణుని భయంబు నుండి గట్టెక్కించెదను స్వల్పకార్యమునకై మాయగ్రజుండిట్లు నన్ను మేలుకొలుపడు కారణమేదియో వివరింపుడని రాక్షసులను కుంభకర్ణుడడిగెను

అప్పుడు రావణుని మంత్రియగు యూపాక్షుడు సంరంభముతో బలుకుచున్న కుంభకర్ణునకు నమస్కరించి కుంభకర్ణా! మాకెప్పుడును దేవతల వలన కొంచెమేనియు ప్రాణభీతి లేదు మనుష్యుని వలన మహాభయంబు సంప్రాప్తమైనది ఇంతటి భయము దేవదానవుల వలన గూడ మాకెన్నడును గలిగియుండలేదు సీతాపరహరణంబువలన రాముడధిక క్రోధావేశుడై మాకింతభయంబు జేకూర్చినాడు పర్వతాకారులగు వానరులు లంకాపురంబును ముట్టడించి యున్నారు ఇంతకు మున్నొక వానరుడు వచ్చి యిమ్మహా పట్టణమంతయు దగ్ధము గావించి యక్షకుమారుని బరిమార్చెను సూర్యతేజుండగు రామునిచే యుద్ధమందు రావణుడు పరాభవమొంది మృతప్రాయుడై యున్నాడు దేవదానవుల కలవిగాని కార్యమునిప్పుడు రాముడొనరించియున్నాడు మృతప్రాయునిగా దలంచి రాముడు రాక్షసేశ్వరుని విడిచిపెట్టినాడు ఇది నిక్కంబని యూపాక్షుడు కుంభకర్ణునితో జెప్పెను యూపాక్షుని పలుకులను కుంభకర్ణుడాలకించి క్రోధారుణలోచనుడై మండిపడి నేనిప్పుడే బోయి రామలక్ష్మణులను వానరసేనను యుద్ధంబున నుగ్గు గావించి వారిరుధిర మాంసమ్ములచే రాక్షసులకు సంతృప్తి గావించి యటు పిమ్మట రావనుని జూచెదనని జెప్పెను

మహాదర్పంబున కన్నుగానక క్రోధావేశుండై పలుకుచున్న కుంభకర్ణుని జూచి మహోదరుండు చేమోడ్పుగిలించి యిట్లు జెప్పెను కుంభకర్ణా! నీవు రావణాసురుని దర్శించి గుణదోషంబులను జక్కగా విమర్శించి తదుపరి యుద్ధమునకు బోయిన శత్రువులను వధించి విజయలక్ష్మిని వరింపగలవు అనినతోడనే కుంభకర్ణుడు రాక్షసులందఱు బరివేష్టించి యుండ రావణుని గృహంబునకు బోయెను రాక్షసులందఱు బోయి సింహాసనాసీనుండగు రావణునకు నమస్కరించి యివ్విధంబున వక్కాణించిరి రావణరాజా! నీ తమ్ముడు కుంభకర్ణుడు నిద్రనుండి మేల్కొన్నాడు అమ్మహావీరునకేమి యాజ్ఞ నొసంగెదవు? యుద్ధంబునకట్లే బొమ్మనెదవా? నీ దర్శనార్థమిచటికి రమ్మనెదవా? తెలియంబలుకుమని రాక్షసులు రావణునితో జెప్పిరి రావణుడమితానందమొంది సంతుష్టుడై రాక్షసులంజూచి కుంభకర్ణుని జూడ గోరుచున్నాను అతని బూజించి యిచటికి దోడ్కొని రండు పొండనెను రాక్షసులు బోయి రావణుడు నిన్నుజూడ గోరుచు నువ్విళ్లూరుచున్నాడని కుంభకర్ణునితో జెప్పిరి అన్నగారి యాజ్ఞనాలకించి దుర్దర్షుడగు కుంభకర్ణుడు శయనంబునుండి లేచి సంతుష్టుడై స్నానమాచరించి యలంకరించుకొని మద్యంబును గొనితెండని రాక్షసులకాజ్ఞాపించెను వారు రెండు వేలకుండల మద్యంబునుదెచ్చి సమర్పించిరి ఆ మద్యంబును గ్రోలి మత్తుడై ప్రళయకాలమందలి యమునికైవడి బ్రకాశించెను రాక్షస పరివృతుండై పాదవిన్యాసంబులచే బుడమి గడగడ వడంక దేవేంద్రుడు బ్రహ్మదేవుని గృహంబునకు బోవుకరణి కుంభకర్ణుడు రావణుని గృహంబునకేగి నమస్కరించెను పర్వత శిఖరంబునకు సమానుడగు కుంభకర్ణుడు రాజమార్గమును బట్టి బోవుచుండుటను వానరులు జూచి భయకంపితులైరి కొందఱు శరణ్యుడగు రాముని శరణు జొచ్చిరి కొందఱు నేలబడిరి మఱికొందరు దిక్కులకు బరుగిడిరి కొందఱు నేలబరుండిరి

# విభీషణుడు కుంభకర్ణుని వృత్తాంతమును రామునితో జెప్పుట

మహాతేజోనిలయుండును, వీరావతంసుడునగు శ్రీరాముడు ధనుర్ధరుండై పర్వతాకారదర్శనుండగు కుంభకర్ణుని జూచెను మునుపు త్రివిక్రమావతారంబు ను దాల్చిన శ్రీమన్నారాయణమూర్తి వోలె జూపట్టుచు సూతనాభ్ధమునకు సమానవర్ణుడగు రాక్షసోత్తముని జూచి మరల నవ్వానరసేన యంతయు భయపడి పలాయనమంత్రమును పఠించెను రాముడాశ్చర్యమొంది విభీషణుని జూచి యిట్లనియె విభీషణా! పర్వత సంకాశుండును, కిరీటధరుండును, కపిలనేత్రుండునగు వీరాధి వీరుండొకడు విద్యుల్లతలతో గూడిన జలధరంబు మాడ్కి జూపట్టుచున్నాడు ఈతడెవ్వడు? భూమికంతయు ధ్వజంబువోలెనత్యున్నతాకారుడై యున్నాడు వనచరులీతని గాంచి పరుగిడిపోవుచున్నారు రాక్షసుడా? అసురుడా! నేనింత దనుకనిట్టి భూతంబు నెన్నడును జూడలేదు ఇతని కథా వృత్తాంతము నెఱిగింపుమనిన రామచంద్రునితో విభీషణుండిట్లనుడువ నారంభించెను

రామా! ఈ రాక్షసోత్తముడు విశ్రవసుని పుత్రుడు ఇతని పేరు కుంభకర్ణుడు యుద్ధమందు యమధర్మరాజును, దేవేంద్రుని జయించిన బాహుబలాఢ్యుడు ప్రమాణంబున కుంభకర్ణుని బోలిన రాక్షసుడును మఱొక్కడు లేడు ఈతడు దేవదానవ గంధర్వ యక్షులను, పన్నగాదులను బలుమారు బవరంబున జయించినాడు శూలపాణియై సమర రంగమందు నిలువంబడియుండగా దేవతలందఱు నా మహావీరుని ప్రోల నిలువం జాలక త్రైలోక్య సంహారకర్తయగు కాలుడేయని భ్రమించి భయంబు చేత బాఱిపోయిరి రాక్షసులవోలె వరదాన మీతనికి లేదు స్వభావసిద్ధమైన మహాపరాక్రమశాలి ఇతడు జన్మించిన తోడనే క్షుధార్థుడై పెక్కువేల ప్రాణులను భక్షించెను ఇది జూచి ప్రజలందఱు పరమభీతులై సురేంద్రుని శరణు జొచ్చి యాతని వృత్తాంత మాతనికెఱిగించిరి అమరేంద్రుడమిత క్రోధావేశుడై కుంభకర్ణుని వజ్రాయుధముచే గొట్టెను కుంభకర్ణుడాదెబ్బకు చలించి గొప్ప సింహనాదము గావించెను ఆ సింహనాదము నాలకించి

ప్రజలందఱు మఱింత భయపడిరి ఆ రాక్షసోత్తముడాగ్రహోదగ్రుడై ఐరావతము దంతమూడబెఱికి దేవేంద్రుని వక్షస్థలమందు గొట్టెను సురనాధుడా దెబ్బకు సోలిపోయెను అప్పుడు సురులు, దేవదానవులు, బ్రహ్మర్షులు, పరమందు భీతులైరి దేవేంద్రుడు ప్రజాసముదాయమును వెంటనిడుకొని సురజ్యేష్ఠుని సన్నిదికేగి కుంభకర్ణుని దుష్కృత్యములను దెలుపుకొనిరి ప్రజలనుబట్టి భక్షించుటయును, అమరగణంబునవమాన పఱచుటయును, ఋష్యాశ్రమంబుల నశింపజేయుటను, పరభామినుల నపహరించిటయును మొదలుగాగల విషయములన్నియు విరించి కెఱుగ దెల్పిరి మహాత్మా! కుంభకర్ణుడీ విధంబున ప్రజలను భక్షించుచున్నచో త్వరలోనే లోకంబంతయు శూన్యంబుగాగలదని దేవేంద్రుడు విన్నవించుకొనెను బ్రహ్మదేవుడు ఇంద్రుని మొరాలకించి రాక్షసులనందఱిని రావించి వారలలో గుంభకర్ణుని బొడగాంచెను ఆ రాక్షసుని జూచిన తోడనే పితామహునకు గూడ గుండెలదరి కొంత తడవునకు ధైర్యంబు దెచ్చుకొని కుంభకర్ణునితో నిట్లులనియె కుంభకర్ణా! లోకనాశంబు కొఱకు విశ్రవసుండు నిన్ను సృజియించినాడు ఇది నిక్కువంబు నీవిది మొదలుకొని నిరంతరము చచ్చినట్లుబడి యుండుమని శాపం బొసంగెను ఆ క్షణమందే కుంభకర్ణుడు శాపగ్రస్తుడై బ్రహ్మదేవుని ముందట నిద్రనొంది పడిపోయెను రావణుడది గాంచి పరమభీతుడై సురజ్యేష్ఠునిజూచి యిట్లు బలికెను బ్రహ్మదేవుడా! ఇదేమన్యాయము చక్కగా సమృద్ధిజెంది బంగారు పండు వృక్షమును ఫలములతో దులతూగెడు సమయమందు ఛేదించెదవేమి? ఇతడు నీకు మునిమనుమడు గదా! దయారహితుడవై కుంభకర్ణునిట్లుల శపించుట నీకు భావ్యమగునా! నీ యమోఘమైన వాక్యము రిత్తవోవునే! వీడు నిద్రించుటకు సందియము లేదు ఐతే నిద్రించుటకును, మేలుకొనుటకును, కాలనియమ మేర్పరుపవలయునని రావణుడు బ్రహ్మదేవునితో జెప్పెను అప్పుడు విరించి యనుగ్రహించి ఆఱుమాసములు నిద్రబోవుచు నొక దినము మేలుకొనుచుండు గాక! యని వరంబొసంగెను ఆఱుమాసముల కొక్కమాఱు నిద్రనుండి మేల్కొని క్షుధార్తుడై నోఱు దెఱచుకొని లోకంబులను భక్షింపగలడని పరమేష్ఠి రాక్షసేశ్వరునితో జెప్పెను రామా! రావణుండిప్పుడు నీ బయంబునకు వెఱచి కుంభకర్ణుని నిద్రనుండి

మేల్కొలిపినాడు ఈ కుంభకర్ణుడు గృహంబు వెలువడి పరమ క్రుద్ధుడై వానరులను భక్షించుటకు వచ్చును వానరులిప్పుడే పరుగెత్తుచున్నారు క్రోధావేశుండగు రాక్షసోత్తము నెదుట నిల్చియెట్లు వారింపగలరు? ఇది యొక్క గొప్పయంత్రము దీనిని రాక్షసులు పైకెత్తినారని వానరులకు ధైర్యము జెప్పవలయును అప్పుడు నిర్భయులై నిలువంగలరని విభీషణుడు రామునితో జెప్పెను

రాముడు విభీషణుని హితవచనంబులాలకించి వానర సేనాధీశుండగు నీలునిజూచి వానరోత్తమా! నీవు సమస్త సైన్యములను వ్యూహములుగ దీర్చి లంకాపురమందలి పురద్వారమ్ములను, జర్యాగృహంబులను, ఆనకట్టలను నాక్రమించి జాగరూకుడవై యుండుము వానరులందఱు పర్వత పాదపాయుధంబులను ధరించి యుద్ధమునకు సిద్ధముగ నుండుట్లాజ్ఞాపింపుము అనిన తోడనే నీలుడు రాముని యానతిని శిరంబునందాల్చి వానరసేనకాజ్ఞ నొసంగెను సేనానాయకుని యనుమతి మేరకు పర్వతాకారులగు గవాక్షుడు, శరభుడు, హనుమంతుడు, అంగదుడు పర్వతశిఖరములను గైకొని లంకాద్వారంబుల నిరోధించిరి జయశీలురై తేజరిల్లెడు వానరులు భూజంబులను బెకలించి శత్రుసైన్యములను మర్దించిరి నానావిధ పర్వతంబులు కరంబులందాల్చి మహామేఘ సమూహంబుకైవడి వానర సైన్యము ప్రకాశించెను

## కుంభకర్ణుడు రావణుని గృహంబునకేగుట

కుంభకర్ణుడు కొంచెము నిదురకైపు చెలంగ రాక్షసులచే బరివృతుండై రాజమార్గమున నడచుచుండ పౌరులు మేడలపైనుండి పుష్పవర్షమును గురిపించిరి బంగారు కిటికీలతో సూర్యమండలంబుకరణి తళతళలాడుచు రమణీయమెుగబోయు రావణుని గృహంబును కుంభకర్ణుడు కన్నులారగాంచెను భాస్కరుడు పయోధర సమూహమును జొచ్చునట్లు రాక్షసేంద్రుని గృహంబు బ్రవేశించి అమరేంద్రుడు పితామహుని దర్శించు విధంబున దూరము నుండియే దివ్య సింహాసనాసీనుండగు

రావణుని కుంభకర్ణుడు దర్శించెను ద్వారంబును దాటిలోపల పుష్పక విమానంబున నాసీనుడై దు ఖార్ణవంబున నీదుచున్న సహోదరుండగు రావణుని జూచి చింతించెను రాక్షసాధీశుడు తమ్ముని జూచిన తోడనే సింహాసనమునుండి లేచి బిగియార గౌగిలించుకొని యాసనంబు చెంతకు గొనితెచ్చెను కుంభకర్ణుడగ్రజుని పాదములకు నమస్కరించి యేమి కార్యార్థమై నన్ను బిలిపించితివని యడిగెను రావణుడు తమ్ముని మరల కౌగిలించుకొని దివ్యసుందర సింహాసనంబుపై గూర్చొనుటకనుమతి నొసంగెను

ఆసనగతుండగు కుంభకర్ణుడు కోపారుణలోచనుండై రావణుని జూచి యిట్లనియె అన్నా! నిదురలో మునింగియున్న నన్నింత యక్కఱతో లేపుటకు గల కారణంబెద్ది? నీకిప్పుడెవ్వని వలన భయంబు గలిగినది? ఎవ్వడిప్పుడు మరణంబునొందుటకు సంసిద్ధుడై యున్నాడు నా కెఱిగింపుమనిన రావణుడు కోపోద్రేకుడై తమ్మునితో నిట్లు జెప్పెను కుంభకర్ణా! నీవు సుఖనిద్రలో నుండుటంజేసి నాకు రామునివలన జేకూరియున్న భయంబు నీకు దెలియదు దశరథసుతుండు సుగ్రీవాది వానరులతో సముద్రమునకు సేతువు నిర్మించి లంకాపురంబు జొచ్చి మనలను సమూలంబుగా ఖండింపనున్నాడు లంకాపట్టణమంతయు వానరమయమ్మైయున్నది వనంబులను ఉపవనంబులను జూడుము రాక్షసులలోనుత్తమ వీరులెందరో వానర వీరులచే బరిమార్పబడిరి వానరవీరులలో నొక్కడును జచ్చినట్లు నేనింతవఱకు జూడలేదు అపజయమన్నది వారికిలేదు తమ్ముడా! నీవైనను వానరులందఱిని దునుమాడి లంకాపురంబును రక్షింపుము అందులకే నిన్ను నిద్రనుండి లేపితిమి నా బొక్కసంబంతయు సెలవైనది మేటి రాక్షసవీరులందఱు హతులైరి బాలవృద్ధులు మాత్రము శేషించి యున్నారు లంకాపట్టణంబును రక్షించు భారమంతయు నీదే దేవాసురులను యుద్ధమందు గెల్చియున్నావు ఆ పరాక్రమము నిప్పుడవలంబింపుము నిన్నుబోలిన బలవంతుడెందును లేడు యుద్ధప్రియుడవు బంధుప్రీతిగలవాడవు నాకు ప్రియంబును, హితంబునగు నీ యుత్తమ కార్యంబొనరింపుము మహావాయువు లేచి శరన్మేఘంబులను

బారదోలు భంగి నీవు నీ పరాక్రమంబుచేత శత్రుసైన్యములను బాఱదోలి నా మనోవ్యథను దీర్పుమని రావణుడు కుంభకర్ణునితో జెప్పెను

## కుంభకర్ణుడు రావణునకు రాజనీతి బోధించుట

రావణాసురుని పలుకులను కుంబకర్ణుడాలకించి దరహాసవదనుడై యిట్లు జెప్పదొడంగెను అన్నా! మనమాలోచన సేయునప్పుడే దోషము సంభవించునని నిశ్చయించుకొంటిమో యాదోషమే నిన్నావరించుకొన్నది హితుల వాక్యములాలకింప కింతటి దురవస్థనుదెచ్చి పెట్టుకొంటివి అయ్యో! సీతాపరహరణ రూప పాపకార్య మెంతటి ఫలంబును జేకూర్చినది ఆ పాపఫలమును నిప్పుడు బొందినావు పరాక్రమ గర్వంబున సీత నపహరించుటకు మున్నే చక్కగా నాలోచింపవైతివి గుణదోషంబులరయ వైతివి ముందు వెనుక లాలోచింపక కార్యములొనరించు రాజేంద్రుడు న్యాయాన్యాయంబు లెఱుంగని వాడగును దేశకాల విరుద్ధములగు కార్యంబు లొనరించినచో విపరీతంబులై అపరిశుద్ధులచే వ్రేల్వంబడిన హవిస్సులువోలె వ్యర్థములగును మంత్రివర్యులచే జక్కగా నాలోచించి తాబలిష్ఠుడై శత్రువు దుర్బలుండై యున్నప్పుడు గావింపవలసిన యుద్ధంబనం యుత్తమ కర్మమునను తానును, తనశత్రువును సమానులైయుండు సందర్భమందు చేయునట్టి సంధియను మధ్యమ కర్మంబునను తాను దుర్బలుడై శత్రువులు బలిష్ఠుడై యున్నప్పుడు గావించెడు దానంబను నధమ కర్మంబును, కర్మముల యారంభోపాయము, పురుష ద్రవ్య సంపత్తు - దేశకాల విభాగము, విఘ్న నివారణము, కార్యసిద్ధి యను నీయైదింటితో బొసంగి కార్యమును సాధించెడు రాజు సమర్థుడనంబడును సన్మార్గుడగును మంత్రులతో జక్కగా నాలోచించి నీతిశాస్త్ర ప్రకారము కార్యముజేయ నిశ్చయించు వాడు మిగుల సమర్థుడు

రావణ రాజా! ప్రాత కాలమందు ధర్మమును, మధ్యాహ్నమందు అర్థమునను, సాయంకాలమందు కామంబునను, పురుషుడు సేవింపవలయునని శాస్త్రమందు విదింపబడియున్నది అటుగాదేని ప్రాత కాలమందలి ధర్మార్థములను, మధ్యాహ్నకాలమందర్థ ధర్మములను,

సాయంకాలమందు కామార్థములను సేవింపవలయును లేదా! సాయంకాలమందు ధర్మార్థకామంబులనియెడు మూడింటిని సేవింపవలయును కామమును మాత్రము సర్వకాలములయందును సేవించువాడధముడు రాజుగాని, రాజంతటివాడుగాని, మఱెవ్వడుగాని యీ మూడు పక్షములను జక్కగా నాలోచించి యుత్తమమగు దానినాలకింపడో! యాతని శాస్త్రజ్ఞానమంతయు వ్యర్థమైపోవును ధీరుడై కాలంబును గుర్తించి మంత్రివర్యులచే దీర్ఘాలోచన మొనరించి యయ్యైకాలంబుల ధర్మార్థ కామంబులను వదలక నాచరించవలయును శత్రువు పరిస్థితులను బట్టి యాతని సమీపించి ధనము సమర్పించుట గాని, మంచిమాటలు చెప్పుకొనుట గాని వారలలో వారలకు విరోధమును గల్పించుట గాని, సమరంబొనరించుట గాని యీచతుర్విధోపాయంబులలో రెండింటినిగాని, మూడింటినిగాని, ఆయ్యైకాలంబులకు దగిన రీతిగా నొనరించెడు వానికి దు ఖంబు దరిజేరదు ఏదికార్యమో, యేది యకార్యమో మంత్రులతో జక్కగా నాలోచించి యుక్తమైన దానినొనరించుచు రాజు లోకమందు సుఖపడును

నీతిశాస్త్రార్థమించుకేనియు నెఱుంగని పశుప్రాయులగు పురుషులు, ధరాధినాథుడు మూర్ఖుడైనచో ఆలోచన సభయందు బ్రవేశించి తమ ప్రగల్భతనుజూపుచు బ్రేలెదరు శాస్త్రాభ్యాస మెఱుంగని వారలును, నీతిశాస్త్రము దెలియని వారలును జెప్పెడి మాటలు కీడొనరించును కావున సంపద నపేక్షించువారలు దానినెంత మాత్రము చేయరాదు ప్రాగల్భ్యముచే నహితమగు దానిని హితము వోలె బ్రేలుచు కార్యంబును జెఱుపజూచు వారలను రాజు పరీక్షించి మంత్రసభనుండి గెంటింపవలయును మంత్రులు పాయజ్ఞులగు శత్రువులతో జేరి రాజేంద్రుని జెఱచుటకై యాతనిచే విపరీతములగు కార్యంబులను జేయించెదరు శత్రువులచే లంచములు దీసికొని వారలకు వశవర్తులై తనకత్యంత మిత్రులుంబోలె నటించుచున్న మంత్రుల రహస్యమును, వారి వ్యవహారములను రాజు తెలిసికోవలయును శత్రుకార్యములను దెలిసికొని తన్నుతాను రక్షించుకోజాలని రాజు అనర్థములను బొందుటయే గాక రాజ్యలక్ష్మిని గూడ బోగొట్టుకొనును అన్నా! యీ విషయమునందు మనతమ్ముడు

విభీషణుడేమి జెప్పియున్నాడో! జ్ఞప్తియందుంచుకొని దానింజేయుము అదేమనకిప్పుడు హితము నాకుదోచిన దానింజెప్పితిని నీకేమి దోచుచున్నదో! చక్కగా నాలోచింపుమని కుంభకర్ణుడు రావణునితో జెప్పెను కుంభకర్ణుడు చెప్పిన మాటలు రాక్షసేంద్రుడాలకించి కోపోద్రేకుడై బొమముడి పాటుగదుర నిట్లనియె కుంభకర్ణా! నీవు నాకంటె చిన్నవాడవు పూజనీయుడగు గురుదేవునివోలె నన్నెందుకు శిక్షించెదవు ఊరక బ్రయాసమెందుకు? ప్రయోజనమేమున్నది? నీతిని గూర్చి యాలోచించుటకిది కాలముగాదు నీ పరాక్రమము నిప్పుడవలంబిపకున్నచో ప్రయోజనమేమున్నది? భ్రాంతి యజ్ఞానబల పరాక్రమంబులచే గలిగిన గర్వంబువలన నేదియో చేసినాము చేసిన కార్యము మరలరాదు దానిని పలుమాఱు జెప్పుట వ్యర్థము గడచిన దానిని గూర్చి ధీమంతులు దుఃఖింపరు మనమిప్పుడు చేయవలసినదేదియో చేయవలయును నీకు నాయందు స్నేహము గలదేని మాఱు మాటాడక యుద్ధమునకు బయలు దేరుము నాయక్రమంబువలన గలిగిన దోషమును నీ పరాక్రమమువలన బోగొట్టుము యుద్ధము తప్పదనియెడు విషయము నీకు దెలియునుగదా! కార్యనాశంబునొంది దీనుడై విలపించెడు వానికి సాహాయ్యంబు గావించెడు మిత్రుడే మిత్రుడు నీతిదప్పి బాధజెందెడు వారలకు సాహాయ్యము గావించెడు బంధువే బంధువు అని రావణుడు కుంభకర్ణునితో జెప్పెను కుంభకర్ణుడు కోపముతో మాట్లాడుచున్న రావణుని వాక్యములాలకించి మెల్లగా మృదువచనంబులచే నిట్టులనియె రావణా! రాక్షస రాజోత్తమా! ఈపరితాపమును దూరముగ బారదోలుము కోపంబును గూడ బరిత్యజించి స్వస్థచిత్తుడవై యుండుము

## కుంభకర్ణుడు యుద్ధమునకు బయలు దేరుట

నేను జీవించియుండగా నీకీ దుఃఖమెందుకు? ఎవ్వని నిమిత్తమై నీవు బరితాపమొందుచున్నావో! యారాముని దునుమాడెదను సోదరా! నీకు నేనుదమ్ముడను బంధువుడనగుకతంబున సర్వావస్థలయందును నీకు హితముపదేశింపవలసిన విధి నాకున్నది అందువలన నీకింతదనుక

హితముపదేశించితిని అంతియేగాని మతొండుగాదు నేనిదేబోయి వానరసేనను ఎరుగిడజేసి రామలక్ష్మణులను వధించి రాముని శిరంబును గొనితెచ్చెదను అప్పుడు సీత శోకాగ్నిలోబడగలదు బంధుమిత్రులను బోగొట్టుకొని యున్న రాక్షసులందఱు రామ మరణంబును కన్నులలర గాంచి సంతోషింపగలరు సుగ్రీవుడు నెత్తుటందోగుచు నేలబడియుండ గలడు నీవు నయనోత్సవముగ జూడగలవు నేను రాక్షస సమేతుండనై నిన్ను రక్షించుచుండ రాముడెట్లు నిన్ను వధింపగలడు? నన్ను బరిమార్చినచో గదా! నిన్ను రాముడు బరిమార్చుట నా విషయమై నాకెంత మాత్రము ఎరితాపములేదు ఇప్పుడే నాకాజ్ఞ నొసంగుము నీశత్రువు లందఱిని బిలుకుమార్చి వచ్చెదను దేవేంద్రుడు, యముడు, అగ్నిదేవుడు, వాయుదేవుడు, కుబేరవరుణులు వచ్చినను యెదిరించి వారలతో బోరాడగలను నన్నుజూచినచో దేవేంద్రుడు దిక్కులకు బారిపోవును బ్రతుకుపై నాశగలవాడెవ్వడును నాయెదుట నిలువంజాలడు నాకేయాయుధంబులక్కఱలేదు చేతులతోనే గొట్టి శత్రువులను రూపుమాపెదను రాముడు నా ముష్టిఘాతముల కోర్చి నిలువంబడినచో యాతని బాణంబులు నా రుధిరంబును గ్రోలగలవు నేనుండగా నీకు దుఃఖమేల? శత్రుసంహారము కొఱకు సంసిద్ధుడనైయున్నాను రాముని వలన సంభవించిన భయంబును విడువుము రామలక్ష్మణులను, హనుమత్సుగ్రీవులను మొదలుగాగల వానరులనందఱిని బవరంబున బరిమార్చెదను నీకు సత్కీర్తి నార్జించెదను నేను కోపంబునొందినచో దేవతలు గూడ పుడమిపై బడగలరు కాలుని బిలుకుమార్చెదను అగ్నిహోత్రుని బట్టి భక్షించెదను సూర్యుని తారామండలమును నేలకు బడద్రోయుదును జలరాశిని గుటుక్కున మ్రింగెదను భూమిని బ్రద్దలు చేయుదును పర్వతములను జూర్ణముగావించెదను సర్వభూతములను భక్షించెదను మూడులోకంబులైనను నాకొక్కపూట యాహారమునకే చాలవు నాతో యుద్ధమెట్లు చేయును? రామలక్ష్మణులను వదించి వానరులందఱిని భక్షించెదను నీకు సుఖంబు గలిగించెదను ఉత్తమమైన మధ్యమును గ్రోలి మోదవార్ధినీదుచు గ్రీడింపుము సంతాపమును విడిచిపెట్టుము రాముడు వదింపబడిన పిమ్మట సీత నీస్వాధీనములో నుండగలదు చింతింపవలదని కుంభకర్ణుడు రావణునితో జెప్పెను

# రావణ కుంభకర్ణులను మహోదరుడు యుద్ధమునకు బురికొల్పుట

మహాకాయుండును, మహాబలుండునగు కుంభకర్ణుని పలుకులాలకించి మహోదరుండిట్లనియె కుంభకర్ణుడా! నీవు యుత్తమ కులమందు జన్మించితివి ఐనను లాభమేమి? నీవు మోటువాడవు అల్పబుద్ధివి గర్వాంధుడవు కార్యాకార్యముల తెఱంగును గుర్తించెడు నైపుణ్యము నీకులేదు రాక్షస నాథుండు న్యాయాన్యాయము లెఱుంగని మొఱకుడు గాడు నీవు బాలుండవగు కతంబున మోటువాడవై వ్యర్థముగా ప్రేలుచున్నావు రావణుడు దేశకాలవిభాగములనుజక్కగా నెఱింగినవాడు తనయొక్కయు, శత్రువుల యొక్కయు వృద్ధి క్షయములను సమముగ నుండుటను గుర్తెఱింగినవాడు మహాపండితోత్తముడు నీవలె బలము గలిగియు నల్పబుద్ధిగలవాడు గాదు వృద్ధసేవయన్న నీకు దెలియదు నిన్నుబోలిన వానికి గూడ చేయరాదని తోచిన కార్యమును రావణుడెట్లు చేయగలడు ధర్మార్థ కామములకు వేఱువేఱుగా ఫలముగలుగునంటివి అధర్మముగావించుట వలన నీకే ఫలము గలిగినదని రావణునితో జెప్పితివి ధర్మార్థకామములకు నియతములున్నవనుటకు నీకు బ్రమాణమే మున్నది సమస్త ఫలములకును కారణభూతమైనది కర్మ సత్కర్మ మొనరించినచో సత్ఫలమును, దుష్కర్మమొనరించినచో దుష్ఫలంబును జేకూరునని చెప్పవలయునుగదా! పరిశీలించి చూడగా దుష్కర్మము లాచరించుట వలన సత్ఫలములు గలుగుచున్నవి సత్కర్మము లాచరించుటవలన దుష్ఫలితములు చేకూరుచున్నవి కావున నీవిట్లు చెప్పుట తగదు ధర్మార్థములును, అధర్మానర్థములును శ్రేయస్సునే గలిగించును ఒకప్పుడవియే దుఃఖమును గూడ నొనగూర్చుట సంభవించును ఇంతియే గాని వానికి దుఃఖమే ఫలితమని చెప్పుట సరిగాదు పురుషులు యిహపరంబులకుపకరించు కర్మములును జేయుచున్నారు కామమునవలంబించెడు పురుషునకీకర్మములన్నియు నీ లోకమందు మిక్కిలి సుఖంబొనగూర్చును సీతనపహరింపవలయునని రాక్షసేంద్రుడు తలంచెను వేమందఱు దానికి జేయూత నొసంగితిమి

రాక్షసాధీశుండిందులో నాలోచింపక జేసిన యక్రమమేమియులేదు నేనొక్కడనే యుద్ధమునకు బోయెదనని యుగ్గడించితివి ఆ మాట గూడనయుక్తము ఆ సాధువు చెప్పెదనాలకింపుము

జనస్థానమందు ఖరదూషణాదులను దునుమాడిన రామ లక్ష్మణులను రణమందు నీవొక్కడవే జయింపజాలవు అది దుస్సాధ్యము రాముని పేరు విన్నచో రాక్షసులందఱు జడియుచున్నారు దివ్యతేజస్సుతో నలరెడు దశరథసుతుని సన్నిధికెవ్వడు పోగలుగును క్రోధావేశంబుననున్న సింహమువోలె దుర్ధర్షుడైయున్న దశరథ రాముని సంగతి దెలియక నిదురించుచున్న మహాభుజంగమును మేల్కొలుపు చందంబున నాతని పైకి బోజూచుచున్నావు రాముని ప్రేరాలమున రాక్షస సైన్యము నిలువంబడినచో ప్రాణసంశయము నొందును అట్లుండగా నీ వొక్కండవే యుద్ధమునకు బోవుట నాకు సమ్మతముగాదు తాను దుర్బలుండై మహాబలుండగు శత్రువును అల్పునిగానెంచి సరకుసేయక పైబడిపోయినవాడు ప్రాణములు పోగొట్టుకొనును రాక్షసోత్తమా! దినకరునకు దీటువచ్చెడు రామునితో నొంటరిగా యుద్ధమెట్లు చేయగోరెదవు? అని మహోదరుండు కుంభకర్ణునితో జెప్పి రాక్షసులనడుమ నున్న రావణాసురుని జూచి యిట్లనియె

రాక్షసాధీశ్వరా! నీవు సీతాదేవిని చేజిక్కించుకొనియు మాటలాడుచున్నావు నీవు కోరిన తోడనే యాబిడ నీ స్వాధీనముగాగలదు జనకాత్మజ నీ వశ్యయగుట కొక్కయుపాయంబు నాకు దోచుచున్నది అందులకియ్య కొందువేని చెప్పెద నాలకింపుము

నేనును, ద్విజిహ్వుడును, సింహ్రాదియును, కుంభకర్ణుడును, వితర్దనుండును అనుమేమైదుగురును రాముని వధించుటకై పోవలయునని చాటింపుము మేము శక్తి వంచనలేకుండా యుద్ధంబు గావించెదము రామలక్ష్మణులను జయించితిమా! మనకేలాటి యుపాయముతోను బనిలేదు రాముడు దుర్జయుండై జీవించెనా! మేమందఱు బాణములచేత గాయములు జేసికొని రుధిరధారలతో రామనామములు చెక్కబడిన బాణములను గైకొని యుద్ధభూమి నుండి యిచ్చటికి వచ్చి

రామలక్ష్మణులను భక్షించి వేసినావని కేకలు వేయుచు నీ చరణ సరోజములకు నమస్కరించెదను అప్పుడు నీవపరిమితమోద డోలనూగుచు బహుమానములొసంగుము ఒక రాక్షసుని యేనుగుపై నెక్కించి రామలక్ష్మణులు వధింపబడిరని పట్టణమంతయు జాటింప బంపుము రాజా! నీవమితానందసాగరమున దేలుచందంబున భృత్యులకు దాసదాసీ జనంబులకు భోగ్యపదార్థములను, ధనంబును నొసంగుము భటులకు కుసుమదామములను, వస్త్రములను, మధ్యంబును మిక్కుటముగ నొసంగుము నీవు సంతోషముతో మద్యమును గ్రోలుము రామలక్ష్మణులు రాక్షసులచే భక్షింపబడిరను వార్తను పట్టణమంతయు సీత యొద్దకు బోయి పతివియోగము వలన గలిగిన శోకమును బోకార్చి మృదుమధుర వాక్యములతో బలుకరించుచు ధన ధాన్యములను, ఉత్తమ పదార్థజాలంబును, రత్నములను, సీతాదేవి కొసంగి యామెమనస్సు నాకర్షించుకొనుము ఆమెకు వేఱు నాథుడులేమింజేసి భీతిచే నీకు వశ్యయగును స్త్రీలు స్వభావంబుననే చపలత్వముగల వారుగదా! ఈకపటోపాయముచేత సుందరాకారుడగు రాముని మరణవార్తను విని వేరే యాశలేకపోవుట వలన సీత నీ స్వాధీనము కాగలదు దుఃఖంబు ధినిమగ్నురాలై యెట్టకేలకు నిన్నాశ్రయించును నేను దీర్ఘాలోచనమొనరించి నీకు హితంబు గఱిపితిని నీవు రాముని యెదుటంబడుదువేని ముప్పుగలుగును నీకాంక్ష యిచ్చటనే నీడేఱును యుద్ధము చేయకుండటయే సుఖము నీ కోర్కెదీరిన పిమ్మట యుద్ధముతో బనిలేదు సైన్యమును నశింపజేయక తాను ప్రాణసందేహము నొందక, యుద్ధమాడకనే శత్రువులను జయించెడు రాజేంద్రుడు సత్కీర్తినార్జించి రాజ్యలక్ష్మిని బొంది బహుకాలము సుఖించునని మహోదరుడు రావణునితో జెప్పెను

## కుంభకర్ణుని రావణుడు యుద్ధమునకు బంపుట

మహోదరుని వాక్యములను కుంభకర్ణుడాలకించి మహోద్రేకుడై యిట్టి మాటలింక జెప్పవలదు భద్రముగ నుండుమని యతని బెదరించి

రాక్షసోత్తముని జూచి యిట్లనియె అన్నా! నా పరాక్రమము నీకు దెలిసియే యున్నదిగదా! నేనిప్పుడే బోయి దురాత్ముడగు రాముని బరిమార్చి నీ భయంబుడిపెదను సుఖముగా నుండుము వానరులు మహాశూరులు జలములేని మేఘములవోలె వ్యర్థముగనిట్లు గర్జింపరు అసదృశంబుగా కర్తవ్యంబు గావించి నా గర్జనంబును కదనరంగమందు జూపెద జూడుము శూరులు తమ్ముదాము పొగడుకొనరు అవమానోక్తుల కిసుమంతేనియు సహింపజాలరు ఎవ్వరికిని దెలియకుండగనే తమంతకు దాము గొప్పకార్యమొనరింతురు

మహోదరుడా! పండితోత్తములమని దురహంకార పీడితులగు నిన్ను బోలిన వారు బీరువులై బుద్ధిహీనులై బోధించిన బోధనాలకించియే రాక్షసేంద్రు డిట్టి యాపదకు గురియైనాడు యుద్ధము పేరు విన్నతోడనే భయపడునట్టి మీరలు రాజేంద్రున కెల్లప్పుడును నిచ్చకములాడుచు నాతడు బోయిన మార్గమునుబట్టి పోవుచు నింతకు దెచ్చితిరి లంకాపురంబును రాజుమాత్రము శేషించు చందంబున గావించితిరి బొక్కసముతోబాటు సైన్యమంతయు నశింపజేసినారు మీరందఱు రాజునకు శత్రువులుగాని మిత్రులు గారని నాకు దోచుచున్నది మీయందఱి తప్పువలన సంభవించిన దోషనివృత్తికై నేను భండనంబున కేగుచున్నానని కుంభకర్ణుడు పలుకగా రావణుడు పకపక నవ్వి తమ్మునకిట్లు బదులు పలికెను యుద్ధవిచారదుండవగు కుంభకర్ణా! ఈ మహోదరుడు యుద్ధమునకు వెఱచి యిట్లు బలుకుచున్నాడు నిన్నుబోలిన బలవంతుడగు తమ్ముడును, స్నేహితుడును, నాకెందు బోయినను దొఱకడు తమ్ముడా! నీవు బోయి శత్రువులను రూపుమాపి జయలక్ష్మిని గొనితెమ్ము నా భయంబు బాపగల బలాఢ్యుడవనియే నిన్ను నిద్ర నుండి లేపినాను శీఘ్రముగ యుద్ధమునకు బోయిరమ్ము నీవు శూలంబును కరంబునందాల్చి పాశహస్తుడవగు కాలుని మాడ్కి భయంకరాకారుడవై దుర్ధర్షుడవై దశరథసుతులను, వనచరులను, భక్షింపుము నీ భయంకరాకారమగు రూపమును జూచిన తోడనే కోతులన్నియు బరుగిడిపోవును రాజకుమారులకు గుండెలు బ్రద్దలగును పోయి రమ్మని రావణుడు జెప్పి కుంభకర్ణుడు జయించునను నమ్మకముతో సంతుష్టుడై

కళంకములేని కలానిధివోలె నుండెను కుంభకర్ణుడగ్రజుడు జెప్పిన మాటలు విని పరమసంతుష్టుడై బవరంబునకు బయులు దేరి నిప్పులు గ్రక్కుచున్న తీక్షణమైన శూలములను గైకొని నేనొక్కడనే బోయెదనని రావణునితో జెప్పెను అప్పుడు రావణుడు కుంభకర్ణుని జూచి తమ్ముడా! ఏకాకివై యుద్ధమునకు బోవంజనదు శూలముద్గరాదులను ధరించి సైన్య సమేతుడవై సమరంబునకు బొమ్ము వానరులమిత పరాక్రమశాలురు వేగవంతులు గాఢయత్నమొనరించు వారలు ఏకాకిగానున్న వానిని గాని, ఏమఱుపాటున నున్నవానిని గాని దంతములచే జీల్చి వధించెదరు నీవు జాగరూకుడవై సైనికులతో గూడి పొమ్ము వానరులందఱిని రూపుమాపి జయలక్ష్మిని గొనిరమ్ము పోయిరమ్మని రావణుడు కుంభకర్ణునితో జెప్పి సింహాసనము నుండి పైకిలేచి సువర్ణమయమగు రత్నహారమును తమ్ముని కంఠసీమ నలంకరించెను బాహుపురులను, అంగళీయకములను, దివ్యాభరణములను, చంద్రబింబమును బోలిన ముక్తాహారమును, కర్ణకుండలములను, పరిమళభరితమైన కుసుమదామములను కుంభకర్ణున కొసంగి యలరింపజేసెను నీలమణులతో జేయంబడిన మొలత్రాడును ధరించి అమృతమథనమునకై వాసుకిచేజుట్టబడిన మందరపర్వతము మాడ్కి రావణుని తమ్ముడు ప్రకాశించెను ఇవ్విధంబున సర్వభూషణా లంకృతుండై చక్కగా వ్రేల్వంబడిన యగ్నిహోత్రునిభంగి కుంభకర్ణుడు వెలుగొందుచున భేద్యమైన మైమఱుపును దాల్చి సంధ్యాకాలమందలి మేఘముచే గప్పబడిన హిమత్పర్వతంబు కరణినెంతయు ప్రకాశించెను త్రిశూలంబును గరంబునందాల్చి త్రివిక్రమావతారంబును దాల్చిన నారాయణుని భంగిదేజరిల్లుచు రావణుని గౌగిలించుకొని యాతని చుట్టును ప్రదక్షిణంబు గావించి సాష్టాంగనమస్కారము జేసి సమరంబునకు దరలెను రావణుడు మహాబలశాలియగు కుంభకర్ణుని జక్కగా నాశీర్వదించి సాగనంపెను రథికులందఱు గుమిగూడి శంఖభేరీధ్వనులు చెలరేగ నుత్తమాయుధధారులై రథికశ్రేష్ఠుడగు రాక్షసోత్తముని వెంబడించిరి రాక్షసులు భుజంగములను, ఉష్ట్రములను గార్దభములను, గుఱ్ఱములను, సింహములను, గజములను, మృగములను, పక్షులను, ఆరోహించి కుంభకర్ణుని వెంబడించిరి రాక్షసాంగనలు పుష్పవర్షమును గురిపించిరి గర్వంబున నొడలుదెలియక రుధిరపానమత్తుడై బయలుదేరెను

ఆయుధధారులగు నల్లనికాటుకరాశి వంటి దేహంబుగల రాక్షసులు శూలంబులను, ఖడ్గంబులను, పెక్కుబారలుగల పరిఘంబులను, గదలను, ముసలంబులను, తాళవృక్షంబులను, ధరించి కుంభకర్ణుని వెంట నడచిరి నూఱుధనుస్సుల వెడల్పును ఆఱువందల ధనుస్సుల పొడవును, బండిచక్రములంతటి కన్నులును గలిగి మహాకాయంబుతో భయంకరుడై మహాపర్వతంబుకరిణి నొప్పారుచు దహింపబడిన పర్వతంబువోలె దనవెంట వచ్చుచున్న రాక్షసులను కుంభకర్ణుడు సమీపించి పాతాళకుహరాకారంబగు నోరువిప్పి వికృతంబుగ నవ్వి యిట్లనియె రాక్షసులారా! ఇప్పుడు లంకాపురంబంతయు వానరులు చుట్టుముట్టడించుటకు రామలక్ష్మణులే కారణము కావున దొలుత వారినిరువురను దునుమాడుట ముఖ్యకర్తవ్యమై యున్నది ఇప్పుడే రామలక్ష్మణులను రణమందు జంపెదను అగ్నిశలభములను దహించు చందంబున వానరులను రూపుమాపెదను అరణ్యమందు విహరించెడు నగచరజాతి మావంటి విలాస పురుషులకొక లెక్కలేదనియెడు కుంభకర్ణుని పలుకులాలకించి రాక్షసులందఱు సముద్రముప్పొంగు విధంబున మోదవార్థినీదుచు మహాధ్వని గావించిరి

కుంభకర్ణుడవ్విధంబున యుద్ధమునకు బోవుచుండ మహాభయంకరములగు యశుభ నిమిత్తంబులెన్నియో బొడసూపినవి జలధరంబులు జ్వాలలతోడను, పిడుగులతోడను, గార్దభవర్ణములై గానుపించినవి భూమి గడగడవడంకినది గోమాయువులు నోటమంటలను గ్రక్కుచు నఱచినవి గృధ్రములు మాలికవోలె మార్గమందు బారులుగట్టి వ్రాలినవి కుంభకర్ణుని యెడమ కన్నును, యెడమభుజమును జలించినవి భాస్కరుడు కాంతిహీనుడయ్యెను వాయువు సుఖంబుగా వీవదయ్యెను కొఱవి యొక్కటి యాకాశమునుండి క్రిందికి బడినది రాక్షసుడు కాలచోదితుండై మహాభయంకరంబులగునాయుత్పాతంబులను సరకుగొనక యుద్ధమునకు బోయి వానరులను దిలకించెను పర్వతాకారుడగు కుంభకర్ణుని జూచి వానరులు దశదిశలకు బాఱిపోయిరి రావణుని తమ్ముడది జూచి సంతోషించి మేఘమువోలె గర్జించెను ఆ మహాధ్వని నాలకించి ఛేదింపబడిన సాలవృక్షంబులగైవడి వనచరులందఱు నేలంబడిరి కింకరులతో గూడిన యమధర్మరాజువోలె గుంభకర్ణుడు శత్రువులను వధింపబోయెను

## కుంభకర్ణుడు వానరులతో యుద్ధము జేయుట

పర్వత శిఖరాకారుండగు కుంభకర్ణుని సింహనాదము నాలకించి భయంబున బరుగిడుచున్న వానరులను అంగదుడుజూచి నలుని, నీలుని, గవాక్షుని, కుముదుని జూచి యిట్లనియె సౌమ్యులగు వానరులారా! మీరు క్షుద్రవానరులకైవడి భయపడి పరుగిడుచున్నారు మీ స్వరూపమును బలపరాక్రమములను, కులధర్మములను మఱచి పరుగెత్తిపోవుట న్యాయమా! ఎచ్చటికి బోయెదరు? వెనుకకు మరలిరండు ప్రాణములపై మీకింత తీపియా? భయమొందకుడు ఈతడు యుద్ధవీరుడు గాదు ఇది మనలను భయపెట్టుటకు నిర్మింపబడిన యంత్రము రాక్షసులచే నిర్మింపబడిన యీయంత్రమును మనమందఱు ధైర్య సాహసములతో నశింపజేయుదము రండు మరలిరండనియెడు వాలిసుతుని వాక్యములను వానరులాలకించి యూఱటనొంది అందఱుంజేరి పాదపంబులను, పర్వతంబులను, కరంబులంబూని యుద్ధభూమికేగి పరమక్రుద్ధులై మత్తకరీంద్రముల మాద్కి, కుంభకర్ణుని బ్రహరించిరి పర్వతశిఖరంబుల చేతను, పెనుశిలలచేతను, పుష్పితంబులగు వృక్షములచేతను, వానరులెంత గొట్టినను మహాబలుండగు కుంభకర్ణుడు చలనంబు నొందదయ్యెను పర్వతశిఖరములు, వృక్షములు, అతని దేహమునకు దగిలి నూఱు వ్రయ్యలై నేలబడినవి

ప్రజ్వరిల్లెడు కార్చిచ్చు వనంబులను దహించి భస్మంబు గావించు చందంబున కుంభకర్ణుడు పరమకుపితుడై మహాపరాక్రమశాలురగు వానరవీరులను వధింప బూనెను పెక్కండ్రు వానరోత్తములు రాక్షసోత్తమునిచే నిహతులై దేహమంతయు రుధిరధారలొలుకుచుండ నేలంబడి యెఱ్ఱని పుష్పములుగల వృక్షంబుల పగిది నొప్పారుచుండిరి కుంభకర్ణుని ధాటికాగజాలక యొకరినొకరు తిరిగి చూడకుండ లంఘించి పరుగిడసాగిరి కొందఱు సాగరంబున బడిరి కొందఱాకాశంబున కుద్గమించిరి మఱికొందఱు సేతుమార్గమును బట్టి పరుగెత్తి పోయిరి వెలవెలంబోవు ముఖంబులతో గొందఱు మిట్టపల్లపు భూములకు బరుగులిడిరి వృక్షంబులు కొన్ని వృక్షంబుల నారోహించినవి కొన్ని

పర్వతంబులకుఱికినవి కొందఱు జలరాశినిబడి మునిగిపోయిరి కొందఱు వానరులు గుహలలోనికేగి తలలందాచుకొనిరి కొందఱు భయభ్రాంతులై దిక్కుదోచక గూర్చుండిరి కొందఱు నేలంబడిరి మఱికొందఱు మూర్ఛలో మునింగి చచ్చినట్లు పడియుండిరి ఇవ్విధంబున పరాజితులై పరుగులిడుచున్న కపులను అంగదుడు జూచి యిట్లు చెప్పెను ఎదురలేని పరాక్రమ సంపన్నులగు వానరులారా! నిలువుడు, నిలువుడు పరుగెత్తవలదు యుద్ధమునకు సన్నద్ధులై మరలిరండు మీరీయుద్ధ భూమినుండి భయపడి పరుగెత్తినచో భూమినంతయు దిరిగినను తలదాచుకొనుటకు మీకు చోటు దొరకదు అందఱు మరలిరండు ప్రాణములు రక్షించుకొనియు మీకేమి ప్రయోజనము? మీరలాయుధంబులను విసర్జించి పరుగిడిపోయినచో మీ ధర్మపత్నులే మిమ్ములను యెగతాళి సేయుదురు పౌరుషముగల వారలకిది మరణముకంటే గొప్పదిగదా! మనమందఱు సత్కుల సంజాతులమై యుండియు క్షుద్రవానరులవోలె భయపడి పరుగిడు చున్నారే! ఎందుబోయెదరు పరాక్రమంబును గోల్పోయి పరుగెత్తుచున్న మీరందఱు నల్పులని చెప్పబడుదురు మేమిట్టి వారమనియు, అట్టి వారమనియు మీరందఱు మున్ను నాత్మస్తుతి జేసికొన్నవారలే గదా! నేడదిమఱచి పరుగెత్తుట తగునా? ఆ ప్రగల్భములన్నియునేడెందు బోయినవి ఎందులకింతటి పిఱికిపందలైతిరి మనకాయుస్సు స్వల్పమై యుద్ధమందు నిహతులైనచో వీరస్వర్గమలంకరించెదము ఈ పదవి యెవరికి లభ్యము కాగలదు? వనచరులారా! భండనంబున శత్రువులను వధించి సత్కీర్తి నార్జించుకొందము లేదా యుద్ధంబున ప్రాణంబులను గోల్పోయి బ్రహ్మలోకమునను బడయుదము ముందుచున్న నిప్పును జూచి శలభంబుదాటి పోవంజాలని యట్లు కుంభకర్ణుడు రాముని బారింబడి తప్పించుకొని పోవంజాలడు ప్రాణరక్షణ కొఱకు బరుగిడినచో మనమిన్నినాళుల నుండియు నార్జించిన కీర్తి నశించి పోవును ధీరచిత్తులై నిలువుడని అంగదుడు వానరులతో జెప్పెను అంగదుని వీరోచిత వాక్యములాలకించి వానరులు తమ పిఱికితనంబు నిట్లు వెల్లడించుకొనిరి అంగదా! మేముకుంభకర్ణునకెదురొడ్డి నిలువంజాలము భయంకరముగ మమ్ములను మర్దించుచున్నాడు తాళంజాలక ప్రాణ రక్షణార్థము

పరుగెత్తుచున్నాము మాకు గావలసినది ప్రాణమేనని జెప్పుచు దశదిశలకు బాఱిపోయిరి అప్పుడా యంగదుడు వీరోచిత వాక్యములతో వానరులను యుద్ధమునకు బురికొల్పెను అంతలోనే హనుమంతుడు వచ్చి తోడ్పడెను పవన తనయుడు వచ్చుటను గాంచి వానరవీరులమితానందమొంది సుగ్రీవాజ్ఞ కెదురుచూచుచు యుద్ధసన్నద్ధులై నిల్చియుండిరి ఋషభుడు, శరభుడు, మైందుడు, ధూమ్రుడు, నీలుడు, గుముదుడు, సుషేణుడు, గవాక్షుడు రంభుడు, తారుడు, ద్వివిదుడు, పనసుడు మొదలగు వానర వీరులందఱు హనుమంతుని ముున్నిడుకొని యతిత్వరితముగ యుద్ధాభిముఖులై బయలుదేరిపోయిరి మహాకాయులగు వనచరోత్తములు అంగదుని మాటలు విని పరమసంతుష్టులై ప్రాణంబులపై నాశ వదలి తమ పరాక్రమంబులనుగ్గడించు కొనుచు శౌర్యవంతులై యుద్ధోత్సాహంబుచే దుములంబగు యుద్ధంబు గావించిరి వృక్షములను, గొప్పపర్వతములను, కరంబులంబూని కుంభకర్ణుని దఱిమి కొట్టిరి కుంభకర్ణుడమిత క్రోధావేశుడై వానరులను నానావిధములుగా గొట్టి బాఱందోలెను పెక్కండ్రు వానరులు నేల గూలిరి గరుత్మంతుడు సర్పముల నొడిసి పట్టునట్లు కుంభకర్ణుడు యుద్ధరంగమందు వానరులందఱిని బట్టి భక్షింపదొడంగెను వానరులు గుమిగూడి ధైర్యంబును గోల్పోవక పాదపంబులను పర్వతంబులను బట్టుకొని యుద్ధమునకు వెనుదీయక నిలువంబడిరి అంతలోనే ద్వివిదుడు పర్వతంబునొక దానిని గైకొని కుంభకర్ణుని పైకి విసరెను అది గుఱితప్పి యాతనిపై బడక రాక్షససేనపైబడి గుఱ్ఱములు, ఏనుగులు, రథంబులు చూర్ణమై పోయెను అదిజూచి ద్వివిదుడు మఱొక్క పర్వతశిఖరంబును దీసికొని విసరెను ఆ దెబ్బచేత రణరంగమంతయు రుధిరప్రవాహములచేత నిండిపోయెను రాక్షస రథికులతిక్రోధమానసులై భయంకరముగ సింహనాదము లొనరించుచు వానరోత్తముల శిరంబుల నెన్నింటినో ఖండించిరి వానరులు గూడ వృక్షములను బెకలించుకొని రాక్షసులను రథగజతురంగములను, ఉష్ట్రములను ధ్వంసముగావించిరి మారుతాత్మజుడనంతమైన యాకసంబున కెగసి పర్వత శిఖరంబులను, నానావిధములైన వృక్షములను, కుంభకర్ణుని శిరంబుపై వర్షించెను కుంభకర్ణుడా వృక్షములను దట్టివేసి

శూలంబును గైకొని పర్వతశిఖరంబులను భేదించెను నిశితమైన శూలంబును కరంబునందాల్చి వానరసేనను దఱుముచున్న రాక్షసునకు పవనాత్మజుడు పర్వతంబు నొకదానిని బెకలించి యుద్ధముగా నిల్చి కుంభకర్ణుని గొట్టెను రాక్షసోత్తముని దేహము నుండి మేదస్సు, రక్తము ప్రవహించి క్షోభ నొందింపజేసెను తటిత్ప్రకాశసంకాశుండగు రావణుని తమ్ముడు శూలమును గిఱగిఱం ద్రిప్పుచు కుమారస్వామి శక్తిచే గ్రౌంచపర్వతంబును భేదించుకరణి పవన తనయుని వక్షస్థలంబునం బొడిచెను వాయుసుతుండు మూర్ఛితుడై నోట రక్తమును గ్రక్కుచు ప్రళయ కాలమేఘగర్జారవమువోలె భీకరంబుగా నఱచెను హనుమంతుడు మూర్ఛితుడగుటంజేసి రాక్షసులమితానందమొంది సింహనాదంబులు గావించిరి వానరులు భయమంది, దిక్కులకుంబరచిరి నీలుడదిజూచి చెదరిపోయిన సేనలను నిలువరించి కుంభకర్ణునిపై నొక్క పర్వతంబును బడవేసెను ఆ రాక్షసుడా పర్వతంబును బిడికిటంబొడువగా నది బ్రద్దలై యగ్నికణంబులు రాల్చుచు నేలంబడినది ఋషభుడు, శరభుడు, నీలుడు, గవాక్షుడు, గంధమాదనుడను ఐదుగురు వానరోత్తములు కుంభకర్ణుని జుట్టు ముట్టి పర్వతంబుల చేతను - పాదపంబులచేతను, అఱచేతుల తోడను, పాదముల చేతను, బిడికిళ్ల చేతను బ్రహరించిరి ఆ దెబ్బలన్నియు నాతనికి సుఖస్పర్శముగా దోచినవిగాని కించెత్తైనను బాధగలిగింపవయ్యెను ఆ తరుణంబున కుంభకర్ణుడు ఋషభుని రెండు చేతులతో బిగియారగౌగిలించుకొని గట్టిగా నదిమెను భయంకర బలుండగు ఋషభుడు రాక్షసుని భుజ పీడితుడై నోట రక్తమును గ్రక్కుచు నేలంబడెను మఱియు ముష్టిఘాతంబుచే శరభుని వధించి నీలుని మోకాటంగ్రుమ్మి, గవాక్షు నఱచేతం బ్రహరించెను గంధమాదనుని కాలదన్నెను పాపమాదెబ్బలకు వానరోత్తములు మూర్ఛనొంది ఛేదింపబడిన మొదుగ వృక్షంబుల పగిదినేలంగూలిరి వనచరులవ్విధంబున నేలంగూలుటం జూచి పెక్కువేల వానరులు కుంభకర్ణుని పైకిబోయి యా పర్వతాకారుని దంతములతో గొఱికి నఖంబులతో గీఱి, పిడికిళ్లతో బొడిచి మోకాళ్లతో గ్రుమ్మిరి ఆ రాక్షసోత్తముండిది జూచి పరమకుపితుడై గరుత్మంతుడు సర్పంబులను భక్షించు చందంబున వానరులను భక్షింపదొడంగెను పాతాళకుహరంబును బోలియున్న కుంభకర్ణుని

నోటినుండియు, చెవులనుండియు ముక్కు రంధ్రములనుండియు వనచరులు వెడలివచ్చు చుండిరి అట్లు వెడలి వచ్చుచున్న కోతులను రాక్షసోత్తముడుజూచి విఱిచి భక్షింపమొదలిడెను మఱియు నాతడు ప్రళయకాలాగ్ని హోత్రునివాడ్కి రౌద్రాకారుడై మహీతలంబంతయు రక్తమాంసమయంబొనరించెను స్వేచ్ఛావిహారమును సల్పుచు నిదాఘకాలమందు యెండియున్న యరణ్యములను దహించునట్లు కుంభకర్ణుడు వానరసేనలను దహించెను వృక్షచరులు గుంపులు వీడి నాయకుడు లేమింజేసి పరభీతచిత్తులై రోదనంబు గావించిరి తుదకు దిక్కుదోచక రాముని శరణుజొచ్చిరి అంగదుడు వానరులకు బరాభవము చేకూరుటంజూచి పర్వతశిఖరంబు నొక్కదానిని గైకొని కుంభకర్ణుని శిరంబుపై గొట్టెను ఆ దెబ్బకు రాక్షసుడమిత కోపోద్రేకుడై మండిపడుచు నంగదునెదుర్కొని శూలంబు నాతనిపైకి విసరెను యుద్ధవిశారదుండగు వాలిసుతుండు తన లాఘవంబుచేత శూలంబు బారినుండి తప్పించుకొని రాక్షసుని వక్షస్థలంబుపై గొట్టెను కుంభకర్ణుడాదెబ్బకు మూర్ఛిల్లి కొంత తడవునకు దెప్పఱిల్లి పరమకుపితుడై పిడికిలి నలవరించి యంగదుని బొడిచెను అంగదుడాదెబ్బకు మూర్ఛిల్లి నేలకొఱగెను కుంభకర్ణుడది జూచి శూలంబును కరంబునందాల్చి సుగ్రీవునిపై బోయెను రావణుని తమ్ముడు తనపైకి వచ్చుటంజూచి సుగ్రీవుడు యుద్ధోత్సాహుడై గంతులు వైచుచు పర్వత శిఖరంబు నొకదానిని గైకొని గిఱగిఱంద్రిప్పుచు త్వరితంబుగా బోయెను సుగ్రీవుడు వచ్చుటంజూచి కుంభకర్ణుడభిముఖంబుగా నిల్చెను అప్పుడు వానరేంద్రుడు రాక్షసోత్తముని జూచి యిట్లనియె

కుంభకర్ణా! రణరంగమందు గొప్ప వానరవీరులను బడవైచినావు అన్యులకలవిగాని ఘనకార్యమొనరించినావు వానరసైన్యములను భక్షించినావు మహాయశంబు నార్జించుకొంటివి వానరులను వదలుము అల్పులతోనా! నీ రణకౌశలంబు జూపుట రా రమ్ము, ఇదిగో! నేను వేయుచున్న పర్వతంబునకు సహించి నిలువుము అంతియే చాలును రమ్మని సుగ్రీవుడు కుంభకర్ణునితో జెప్పెను ఆ మాటలు రాక్షస శ్రేష్ఠుడాలకించి ఓహో! నీవు విరించి మనుమడవు బ్రహ్మపుత్రుడగు ఋక్షరజుని కుమారుడవు బలపరాక్రమ సంపన్నుడవు ఇదంతయు మాకు

జక్కగా దెలియును నీవేల గర్జించెదవు? రారమ్మనిన తోడనే సుగ్రీవుడు వజ్రాశని సమానంబగు నప్పర్వతంబును గిఱగిఱంద్రిప్పుచు జొమ్ముపై బడవైచెను అప్పర్వతంబు చూర్ణమై పోయెను వానరులా విచిత్రమును జూచి భయపడి దుఃఖంబునొందిరి రాక్షసులమితానంద భరితులై సింహనాదంబు లొనరించిరి కుంభకర్ణుడమితోద్రేకుడై సుగ్రీవునిపైకి శూలంబును బ్రయోగించెను హనుమంతుడదిజూచి తక్షణమే యచ్చోటున కుద్గమించి కుంభకర్ణుడు ప్రయోగించిన శూలంబును బట్టుకొని మోకాలికానించి విఱిచి వైచెను కాంచనాలంకృతంబగు తీక్ష్ణమైన శూలంబును విఱుచుటంజూచి వానరులు పరమహామోదమొంది సింహనాదములొనరించుచునలుకెలంకులకును బరుగెత్తుచు, గంతులు వైచుచు వాయుసుతుని బూజించిరి తన శూలంబు విఱవబడుటకెంతయు కుపితుడై లంకామలయపర్వతము నుండి శిఖరంబును బెకలించి సుగ్రీవునిపై బడవేసెను ఆ దెబ్బకు వానరరాజు మూర్ఛిల్లి నేలంబడెను రాక్షసులది జూచి సంతసించి సింహనాదంబులు గావించిరి కుంభకర్ణు డద్భుతంబును భయంబును గలిగించు పరాక్రమముతో జేరంజని యాతనింబట్టి ప్రచండ వాయువు పయోధరంబును గొనిపోవు చందంబున గొనిపోయెను సుగ్రీవుని హరించితిమేని రామలక్ష్మణులతో గూడి యున్న వానరసైన్యమునంతయు నపహరించినట్లగునని కుంభకర్ణుడు దలపోసెను సుగ్రీవుని రావణుని తమ్ముడపహరించుకొని పోవుచుండగా దేవతలందఱు నాశ్చర్యమొందిరి

వానరసేనలు పరుగిడుటయు సుగ్రీవుడు కుంభకర్ణునిచే బట్టువడుటయుంజూచి వాయుసుతుండిట్లు దలపోసెను ఔరా! వానరాధీశుండు రాక్షసునిచే బట్టువడినాడే! ఇంకనే జేయవలసిన కర్తవ్యమెద్ది? ఈ పర్వతాకారుడగు కుంభకర్ణుని బిడికిటంబొడిచి భిన్నదేహుని గావించి సుగ్రీవుని విడిపించెదను అప్పుడు వనచరులందఱు సంతోషాంబుధినిమగ్నులయ్యెదరు వానరేంద్రుడేమి సామాన్యుడా దేవాసురులును, ఉరగులును, యేకమై వచ్చి పట్టుకొన్నను విదిలించుకొని రాగల సమర్థుడు గదా! ఇప్పుడేమియు భయములేదు మూర్ఛితుండగు కతంబున నింతదనుక దెలియకున్నాడు త్వరితంబుగ మూర్ఛదేరి

రాగలడు వానరులకు హితమొనగూర్చగలడు నేను విడిపించినచో యమ్మహావీరునకు మనోదు ఖమును హానియు జేకూరును సుగ్రీవుడు ఎచ్చ్వటకు వనచరులకు ధైర్యంబును బురికొల్పుచు నిచ్చటనే యుండెదనని మారుతాత్మజుడాలోచించుచుండెను

కుంబకర్ణుడు సుగ్రీవునెత్తుకొని పోవుచుండుటం జూచి రాక్షసులు సుగంధజలంబును గురిపించిరి ఆ చల్లదనమునకు సుగ్రీవుడు మూర్ఛదేఱి కుంభకర్ణుని భుజంబుపై నుండి లంకాపురంబులోని రాజమార్గమును జూచుచు నేనిట్లు బట్టువడియున్నానే! ఏమి ప్రతీకారమొనరింపవలయు నని అలంచి ఎఱకుగోళ్లతో శత్రువు చెవులను గిల్లి దంతములతో ముక్కు గొఱికి బాధించెను ఆ బాధకు సహింపజాలక సుగ్రీవుని నేల బడవైచి నలిపి కొట్టెను రాక్షసులచే ననేక విదంబుల బ్రహరింపబడియు సరకుసేయక నతిత్వరితంబుగ గగన మార్గమున కెగిసి రాముని జేరెను ముక్కుచెవులను బోగొట్టుకొని వికృతాకారుడై కుంభకర్ణుడు శోణితార్ద్రదేహుడై నిర్ఘరిణులతో గూడియున్న పర్వతంబు కరణి జూపట్టుచు భీమ, విక్రముండై యుద్ధాభిముఖుడయ్యెను నీలాంజనరాశి వోలె నలరారెడు దేహముగల రక్కసుండొక ముద్గరంబును కరంబునందాల్చి వానర సైన్యంబు జొచ్చి భక్షింపసాగెను మఱియు బుభుక్షాపీడితుండై రక్తమాంసముల యందాసగొన్నవాడై వానరులను యెలుగుబంట్లను రాక్షసులను పిశాచములనుగూడ భక్షింపదొడంగెను వానరులు పాదపశిలా యుధంబులచే గొట్టుచున్నను సరకుసేయక రక్తమాంసములెల్ల బుగ్గసందులనుండిగారుచుండ దొఱికిన వారందఱిని మ్రింగుచుండెను వనచరులు వెఱగంది రాముని శరణు జొచ్చిరి కుంభకర్ణుడు వానరుల వెన్నంటి దఱుముచు యేడెనిమిది వందలను, ఇరువది ముప్పది వందలను చేతులంగ్రుచ్చి యెత్తి భక్షింపదొడంగెను

లక్ష్మణుడిది యెఱింగి కుపితుడై కుంభకర్ణు నెదుర్కొనియేడు బాణంబులారక్కసుని దేహముపై నాటించెను ఆ రాక్షసోత్తముడు లక్ష్మణుని సరకుగొనక పాదఘాతంబులచే భూమి బ్రద్దలగునట్లు రాముని మీది కేగెను

## కుంభకర్ణుడు రామునిచే జిచ్చేట

రామచంద్రుడు తన మీదికి వచ్చుచున్న కుంభకర్ణునిపై బయుంకరాస్త్రంబొండు సందించి నిశితబాణంబులను బ్రయోగించి తొమ్మన నాటంజేసెను రామబాణఘాతంబులచే రాక్షసోత్తముడుమిత క్రోదావేశుడై నోటినుండి యగ్నిజ్వాలలు బయలుదేరుచుండ రావాభిముఖుడై పరుగెత్తెను రాముడది జూచి కుంభకర్ణుని గదను, సర్వాయుధములన్నిటిని నేలబడగొట్టెను రావణుని తమ్ముడు నిరాయుధుడై ముష్టియుద్ధము గావించెను రాముని బాణంబులచె గూల్చబడిన రుదిరార్ద్రదేహుడై కుంబకర్ణుడు పర్వతంమునుండి సెలయేఱు ప్రవహించు బతి నొప్పారుచు మహోద్రేకుడై వానరులను రాక్షసులను, భల్లూకములను భక్షించుచు యుద్ధరంగమందు స్వేచ్ఛగా విహరించుచుండెను అంతటిలో దనివిజెందక రాక్షసుండొక పర్వత శిఖరంబును గిఱగిఱం ద్రిప్పి రామునిపై వైచెను పురుషోత్తముండగు రామచంద్రుడు కాంచనాలంకృతంబగు లక్ష్యంబు దప్పని సప్తబాణంబులచే బర్వత శిఖరంబును ఖండించెను మేరుశిఖరాకారుండగు కుంభకర్ణుడు రెండు వందల వానరుల వీరులపై కడరెను రాముడదిజూచి రాక్షస వీరుని బాణంములన్నింటిని నేల బడగొట్టెను

అప్పుడు సుమిత్రా సూనుండు రాముని జూచి యిట్లనియె అన్నా! కుంబకర్ణుని వధించుటకనేకోపాయంబులున్నవి ఈ రాక్షసుడు రక్తముచేత దాసి మత్తుడైయున్నాడు ఇతనికి వానరులనియు, రాక్షసులనియు దెలియకున్నది రాక్షసులను వానరులను బట్టి మ్రింగుచున్నాడు చూడుమని వానరులకివ్విధంబున ననుమతినొసంగెను వానరులారా! మీరందఱు కుంభకర్ణునిపై నారోహించి నిలువుడు ప్రముఖ సేనాధిపతులందఱు నీతని కదలమెదలనీయక బట్టియుండుడు మీరట్లుగావింతురేని దుర్బుద్ధియగు రక్కసుడు నేలబడుటయేగాక వానరులను జంపకుండును జాగరూకులై మెలగుడనిన లక్ష్మణుని వాక్యములాలకించి వనచరులందఱు సంతుష్టులై కుంభకర్ణునారోహించిరి దుష్టగజంబు మావటీ~నిని విదలించు విధంబున రాక్షసోత్తముడు తనపై

నారోహించియున్న వానరులందఱిని విదిలించివైచెను రాముడదిగాంచి దుష్టుని వధించు నిమిత్తమై కాంచనాలంకృతముగు యుత్తమధనువునొండు గైకొని క్రోధారుణలోచనుండై నిప్పులురాల వానరులమితానంద భరితులగునట్లు రోషావేశుడై లక్ష్మణునితో గూడ కుంభకర్ణుని మీది కడరెను

మహాకాయుడును కిరీటధారుండునగు కుంభకర్ణుని శోణితాప్లుతమైన సర్వాంగములను, దిగ్గజంబును ధిక్కరించుచు దుర్వారుడై వెదకి వెదకి వానరులను భక్షించు వానిని, మేఘము వర్షించు విధంబున వక్త్రంబు నుండి రక్తంబు స్రవించు వానిని నాలుకచే రక్తమును నాకుచు క్రోధారుణలోచనుండై కాలునిబోలియున్న వానిని, రాముడు జూచి ధనుస్సును సారించెను రాముని వింటినారిధ్వని నాలకించి సహింపజాలక రాముని మీదికి బోయెను తన మీదికి పర్వతాకారుడగు రాక్షసుడు బరతెంచుటంగాంచి రాముడిట్లనియె రాక్షస రాజా! కుంభకర్ణా! రా రమ్ము! భయపడవలదు నేను ధనుర్ధరుండనైయున్నాను చక్కగా జూడుము అమరేంద్రుని జయించిన వాడనని దలంచెదవు గాబోలు! నేను రాముడను సురేంద్రుడను గాను ఇంక స్వల్పకాలములోనే నిన్ను వధించెదను దీర్ఘనిద్రలో మునింగెదవు రమ్మనియెడు రాముని మాటలాలకించి కుంభకర్ణుడు ఈతడే రాముడు గాబోలునని వికృత స్వరంబున బకబక నవ్వుచు గోపోద్రేకుడై వానరులగుండెలవియ రామచంద్రుని మీదికి బరుగెత్తి కదనరంగమందున్న రాముని జూచి మేఘ గంభీర నిస్వనంబున కుంభకర్ణుడిట్లనియె రామా! నేను విరాధుడను గాను కబంధుడంతకును గాను పొదలమాటున దాగియుండి నీవు చంపిన వాలిని గాను మారీచుడను గాను వారందఱిని వధియించితినని గర్వింపవలదు నేను కుంభకర్ణుడను ఇదిగో! ఇనుముతో జేయబడిన భయంకరాకారంబగు ముద్గరంబును గన్నులలర జూడుము దీనిచేతనే మునుపు దేవదానవులను జయించితిని ముక్కుచెవులు పోయిన వాడనని చుల్కనగా జూడవలదు ముక్కుచెవులు పోయినను నాకు బాధలేదు ఇక్ష్వాకుకుల తిలకా! రామా! రమ్ము! శీఘ్రంబున నీ పరాక్రమంబును నాపై గనబఱుపుము నీ పౌరుష పరాక్రమములెఱింగిన పిమ్మట నిన్ను బట్టి భక్షించెదను రా రమ్మనియెడు కుంభకర్ణుని పలుకులాలకించి వజ్రతుల్యములగు బాణములతో రాముడు

గొట్టెను రాక్షసోత్తముడిసుమంతేనియు జలింపడాయెను ముద్గరంబుచేత బాణములను నివారించుకొనెను శ్రీరాముడు వాయవ్యాస్త్రంబునుదీసి ముద్గరసహితంబుగా కుంభకర్ణుని బాహువును ఖండించ వైచెను రాక్షసోత్తముడు బిన్నబాహుడై భయంకరముగ నఱచెను

రామాస్త్రముచె ఖండింపబడిన ముద్గరసహితమైన హస్తము వానర సైన్యమును దునుమాడినది పరాజితులైన వనచరులు దు ఖాగ్నిలో గుమ్ములుచు భయపడి గడగడవడంకుచు మహాభయంకరమైన రామకుంభకర్ణుల ద్వంద్వయుద్ధమును జూచిరి వాయవ్యాస్త్రము చేతనొక కరంబు ఖండింపబడియుండియు కుంభకర్ణుడు రెండవ కరంబుచే నొక భూరుహంబును బెకలించుకొని రాముని మీద కడరెను సాలవృక్షసహితంబుగా నాతని మఱొక్క బాహువును గూడ నైంద్రాస్త్రము చేత రాముడు ఖండించెను ఆ ఖండితంబైన బాహువు నానావిధ మహీరుహంబులను పర్వతంబులను వానరులను, రాక్షసులను, జూర్ణముగావించుచు నేలంబడినది రెండు చేతులును దెగిపోయి యఱచుచు తన మీదికిరయంబున వచ్చుచున్న కుంభకర్ణుని జూచి రాముడర్ధచంద్రమువోలె నలరెడు బాణంబులను దీసికొని యాతని పాదంబులను ఛేదించెను ఆ రాక్షస వీరుని పాదంబులు నేలంబడుచున్న ధ్వని దిక్కులను, పర్వతగుహలను, మహాంబురాశియందును, లంకాపురమందును వానరరాక్షసులసేనలయందును నిండి చెలంగినది అవ్విధంబున ఖండిత పాణిపాదుడై నోరుదెఱచుకొని గర్జించుచు రాహువు చంద్రుని గబళింపబోవుకైవడి రాఘవుని మీదికి రాక్షసుండు బోయెను రాముడు నిశితబాణపరంపరలను కుంభకర్ణుని నోటినిండ నింపివేసెను అప్పుడు రావణుని తమ్ముడూపిరాడక నోట మాటలు రానందున గట్టిగా నఱచుచు నెట్టకేలకు మూర్ఛనొందెను వజ్రాయుధతుల్యమగు దివ్యబాణంబు నొక్కదానిని రాక్షసోత్తమునిపై బ్రయోగించెను పిడుగునుబోలిన యా దివ్యబాణము దశదిశల వెలుగొందుచు బోయి సురేంద్రుడు వృత్రాసురుని శిరంబు ఖండించుమాడ్కి మహా పర్వత శిఖరాకారంబును పెనుకోఱలు గలదియును చలించుచున్న చారుకుండలములచే నొప్పారునదియునునగు కుంభకర్ణుని శిరంబును

రాముడు ఖండించెను కుండలాలంకృతమగు శిరంబు ఖండన వేగంబున నాకాశగతంబై రాత్రియందుదయించిన పునర్వసు నక్షత్రముల రెండింటి నడుమనుండు చంద్రబింబమువోలె వెలుగొందెను రామబాణంబుచే గొట్టబడిన శిరంబు నేలబడునప్పుడు చర్యాగృహంబులును, పురద్వారంబులును ప్రాకారంబులును విఱిగి నేలగూలినవి కుంభకర్ణుని కళేబరంబు నేల బడునప్పుడు చుట్టునున్న వానరులనేక కోట్లు నలిగిపోయిరి పర్వ తాకారంబగు కళేబరంబు నీరాకరంబునంబడి మొసళ్లను, మత్స్యములను, మహాభుజంగములను మర్దించి నేలపైకి బడినది భూమియు పర్వతంబులు చలించినవి సురులమితానంద సాగరంబున దేలియాడుచు సింహనాదంబులు గావించిరి దేవర్షి మహర్షులును, దేవతలును ఉరగులును, గరుడగుహ్యకులును, యక్షగంధర్వాదులును, గగనవీధినుండి రామపరాక్రమమున కమితానందమొంది యాశ్చర్యనిమగ్నులైరి కుంభకర్ణుడు హతుడగుటం జూచి రాక్షసులు భయమంది రోదనంబు గావించిరి రాహుముఖ విముక్తుడగు సూర్యభగవానుడు దేవలోకంబున తిమిరంబును బోగొట్టి ప్రకాశించుభంగి రామచంద్ర భగవానుడు వానరసమూహము నడుమ దివ్యతేజోనిలయుడై వెలుగొందెను వానరులందఱు దేదీప్యమానుడగు రాముని బూజించిరి

## కుంభకర్ణుని మరణవార్త నాలకించి రావణుడు దుఃఖించుట

రామునిచే గూలినకుంభకర్ణుని జూచి పోయి రాక్షసులు రావణునకిట్లు దెల్పిరి రాక్షసేశ్వరా! మృత్యుసమానుడగు కుంభకర్ణుడు వానరసేననంతయు జయించి పెక్కుమంది వానరులను భక్షించి యెట్టకేలకు రామతేజంబున విగతజీవుండాయెను అతని కళేబరము సముద్రమందుబడినది శిరంబు లంకాపుర ద్వారంబు నడ్డగించి భయంకరమైయున్నది రాజా! యేమని దెల్పుదుము నీతమ్ముడు రామబాణాగ్నిచే దావాగ్ని దగ్ధముగావించిన వృక్షంబు మాడ్కి దగ్ధమై

పెండాకారంబు నొందియున్నాడని రాక్షసులు రావణుని కెఱిగించిరి రావణుడు తమ్ముని మరణవార్త నాలకించి దు ఖాగ్నిలో గుములుచు నేలగూలెను దేవాంతకుడు, నరాంతకుడు త్రిశిరుడు అతికాయుడు పినతండ్రి మరణవార్త నాలకించి దు ఖాబ్ధినీదుచు రోదన మొనరించిరి మహోదర పార్శ్వాలు తమ సహోదరుడగు కుంభకర్ణుడు రామునిచే నేల గూలుటకెంతయు దు ఖితులైరి రావణుడు కొంతతడవునకు మూర్ఛదేఱి తమ్ముని దలంచుకొని దీనుడై యిట్లు విలపింపదొడంగెను

అయ్యో! సహోదరా! నన్నెడబాసి పోయితివా? వీరాధివీరుండవు శత్రుగర్వంబును రూపుమాపువాడవు మహాబలపరాక్రమ సంపన్నుడవు దైవగతంబున నన్ను వీడి యమసదనంబున కరిగితివా? నా దు ఖమును, బంధుజనుల దు ఖమును దీర్చెదవని కొండంత యాశతో నుంటినే! నన్ను నైరాశ్య జలధిని ముంచి నీ దారిని నీవేగితివా? నా దక్షిణ భుజము కూలిపోయినది దేవాసురులకు భయపడకెట్లుందును నేనిప్పుడే వధింపబడితిని తమ్ముడా! కాలాగ్ని రుద్రుని బోలియున్న నిన్ను రాముడెట్లు బరిమార్చెను? వజ్రాయుధంబున కైనను వెఱవని నీవు రామబాణంబులకెట్లు గురియై నేలంబడి నిదురించుచున్నావు? అక్కటా? దేవతలందఱు మహర్షులతోగూడ గుమిగూడి గగనవీధి నుండి కన్నులార నిన్నుజూచుచు సింహనాదము లొనరించుచున్నారు అన్యులకలవిగాని వానరవీరులు లంకాద్వారంబుల నారోహింతురు ఇది ముమ్మాటికిని నిశ్చయంబు ఇంక నాకీ రాజ్యభోగము లెందుకు సీతతో నాకేమి పనియున్నది? సోదరా! నిన్నెడబాసి నేనెట్లు జీవింతును నీవు బోయిన చోటునకే నన్నుగూడ గొనిపొమ్ము నిమిషమైనను నీయెడబాటున కోర్వగలనా? నాచేబరాభవమొందిన దేవతలందఱు నన్ను జూచి పరిహసింతురు నేనెందుబోదును మహాత్ముడగు నా యనుంగు తమ్ముడు విభీషణుడు జెప్పిన మంగళకరంబగు మాటలను అజ్ఞానినై విననొల్లకింతటి యాపదకు గురియైతిని అతని పలుకులే యధార్థములైనవి ప్రహస్తుడును నీవును నాశంబు నొందిన పిమ్మట విభీషణుని మాటలు నా మనస్సును బీడించుచున్నవి పరమధార్మికుడును, శ్రీమంతుడునునగు నాతమ్ముని వెడలనడిచి కొంపతీసి దానికి ఫలితము దుఃఖరూపమున

నాకనుభవమునకు వచ్చినది నేనిక దుఃఖసాగరంబును దాటజాలనని రావణుడు పరిపరి విధంబుల పనవిపనవ యేడ్చి మూర్ఛనొంది నేలంబడెను

## త్రిశిరుడు దుఃఖించుచున్న తండ్రి నోదార్చుట

శోకాక్రాంతుడై శోకసాగరమగ్నుడై విలపించుచున్న రావణుని త్రిశిరుడు జూచి యిట్లోదార్చెను తండ్రీ! మా పినతండ్రి బలపరాక్రమ సంపన్నుడు దైవయోగంబున హతుండయ్యెను దీనికెవ్వరేమి చేయగలరు మిమ్ముబోలిన ధీశాలురిట్లు దుఃఖింపరు ముజ్జగంబులను ముప్పు తిప్పలు బెట్టగల భీమపరాక్రమోపేతుండవగు నీవే యిట్లు ప్రాకృతుని చందంబున దుఃఖించినచో ప్రయోజనమేమున్నది? ఎందుకిట్లు దుఃఖించెదవు నీకు బ్రహ్మదత్తమైన శక్తియు, కంకటంబును, బాణంబును, ధనుస్సును, వేయిగార్ధభములచే బూన్చబడిన మహారథంబును గలవు ఒకప్పుడునీవే యమాయుధంబును జేపట్టకయే దేవదానవులను జయించియున్నావు ఇప్పుడా రాముని గూడ జయింపగలవు రాక్షసాధీశ్వరా! యూరడిల్లి యుండుము నేను సమరంబునకేగి గరుత్మంతుడు రగంబులను నశింపజేయునట్లు నీ శత్రువులను దునుమాడివచ్చెదను అమరేంద్రుడు శంబరాసురుని వోలెను, విష్ణుదేవుడు నరకాసురుని వోలెను, నేనిప్పుడే రాముని దునుమాడి వచ్చెదను నిశ్చింతగా నుండుమని త్రిశిరుడు రావణునితో జెప్పెను రావణుడు తనయుని పలుకులాలకించి కాలచోదితుండగుటం జేసి తనకు బునర్జన్మము నొందినదోయన్నట్లు దలంచుకొనెను

రాక్షసోత్తములగు దేవాంతకుడును, నరాంతకుడును, అతికాయుడును త్రిశిరుని వాక్యము లాలకించి యుద్ధోత్సాహంబున గర్జించుచు సమరంబునకు నేనుబోయెద, నేనుబోయెదనని పలికిరి పరాక్రమశాలురును, మాయాకోవిదులును, దేవగంధర్వాదుల గర్వంబడంచిన వారును శాస్త్రజ్ఞానముగలవారును సూర్యతేజస్కులునగు కుమారుల నడుమ దేవతలనడుమనున్న దేవేంద్రుని పగిది రావణుడు

ప్రకాశించుచు బిగియారసుతులను గౌగిలించుకొని వారి రక్షణార్థమై తన తమ్ములైన మహోదర పార్శ్వులను బంపెను త్రిశిరుడును అతికాయుడును, దేవాంతకుడును నరాంతకుడును మహోదర పార్శ్వులును, కాలచోదితులై యాయుధప్రహారంబుల బారినుండి తప్పించెడు యోధులను సుగంధ ద్రవ్యములను బూసికొని రావణునకు బ్రదక్షిణమొనరించి కదనంబున కరిగిరి మహోదరుడు మత్తకరీంద్రము నారోహించెను త్రిశిరుడుత్తమాశ్వంబులను బూన్చిన రథంబును, అతికాయుడొకయుత్తమరథంబు నారోహించిరి నరాంతకుడు మనోవేగంబును, మహాకాయంబును గలిగియున్న శ్వేతాశ్వంబుపైనెక్కి గూర్చుండెను దేవాంతకుడు వజ్రములచేత నలంకరింపబడిన పరిఘంబును కరంబునందాల్చి విష్ణుదేవునివోలె నలరారెను మహాపార్శ్వుడు మహాగదను కరంబునందాల్చి కుబేరుని భంగి బ్రకాశించెను ఈ రాక్షసులార్వురును కిరీటాది భూషణాలంకృతులై గొప్ప సేనలంగూడి లంకాపురంబును వీడి బయలుదేరిరి ఉత్తమాయుధ ధారులగు రాక్షస వీరులు మహోదరాదులను వెంబడించిరి రాక్షసుల యాయుధపంక్తి శారద జీమూతములవోలె ధవళకాంతులను వెదజల్లుచు హంసల పంక్తులవోలె బ్రకాశించుచుండెను

## త్రిశిరుడాదిగాగల రాక్షసులు అంగదాది వానరులచే మడియుట

ఆ రాక్షసులార్వురును శత్రువులనైనను దునుమాడవలెను లేదా రణరంగమందసువులనైనను గోల్పోవలయునని దృఢనిశ్చయులై యుద్ధదుర్మదులై గర్జించుచు సింహనాదంబు లొనరించుచు, శత్రువులను దిరస్కరించుచు, బాణంబులను గైకొని బవరంబునకు బోయిరి వారి భుజస్ఫాలన ధ్వనులచేత భూమి గడగడలాడెను సింహనాదములచే నాకాశము బ్రద్దలగునట్లుండెను అట్లు పరమామోదమొందుచు యుద్ధోత్సాహులై పెనుశిలలను, పాదపంబులను, బట్టుకొని యుద్ధంబునకు సన్నద్ధులై వానరసైన్యమును రాక్షసులు జూచిరి గజాశ్వరథసంకీర్ణమై

వచ్చుచున్న రాక్షస సైన్యమును వానరవీరులు జూచి సంతుష్టులై సింహనాదంబులు గావించిరి రాక్షసులు వానరుల సింహనాదంబులాలకించి సహింపజాలక భయంకరముగ గర్జించిరి వానరవీరులు పాదపశిలాయుధంబులను దాల్చి పరమక్రుద్ధులై రాక్షస సైన్యమందు స్వైర విహారమును సల్పిరి రాక్షసులు వానరులపై బాణవర్షమును గురిపించిరి రాక్షసులకును, వానరులకును భయంకరమైన యుద్ధము జరిగెను నిశాచరులు గురిపించుచున్న బాణవర్షమున కెదురొడ్డి నిల్చి వృక్షచరులు వృక్షములను పెనుశిలలను, పర్వతంబులను అసదృశముగ గురిపించిరి ఉభయసైన్యములందును, యుద్ధోత్సాహమినుమడింప సింహనాదంబులు గావించిరి వనచరులు యుద్ధంబున సంక్రుద్ధులై పైకెగిరి రాక్షసులను, రథంబులను, అశ్వములను, గజములను, రాళ్లతో గొట్టి చూర్ణముగావించిరి పిడికిట పోటులచే గొందఱు రాక్షసులు గ్రుడ్లను మిటకరించుచు నేలబడి యఱచిరి రాత్రించరులు కఱకు బాణములను, శూలముద్గరాదులను, ఖడ్గములను, శక్తులను గైకొని వానరులను వధించిరి ముహూర్తమాత్రంబున గదనరంగమంతయు శోణితాప్లుతమైన శవంబులచే నిండిపోయినది రాక్షసులు వనచరులతోనే వనచరులను బట్టి కొట్టిరి వృక్షచరులు నిశాచరులనుకొని నిశాచరులతోనే గొట్టిరి వానరులు ప్రయోగించెడు పెనుశిలలను రాక్షసులు బట్టుకొని వారినే గొట్టిరి వానరులు రాక్షసుల చేతియాయుధములను బట్టుకొని రాక్షసులనే వధించిరి మఱికొందఱు వానరులు రథంబును యేనుగు చేతను, ఏనుగును గుఱ్ఱంబు చేతను, విచిత్రముగ వధించిరి వానర రాక్షసుల పోరు రానురాను భయంకరమై గనుపట్టెను రణరంగమంతయు దుర్గమంబై యుండెను

ఆ తుములయుద్ధమందు వానరులకు జయంబును, రాక్షసుల కపజయంబును గలుగుటను గాంచి మహర్షులు దేవతలు మోదార్ణవమున దేలియాడిరి ఆ సమయంబున నరాంతకుడు వాయువేగంబునకు దీటైన గుఱ్ఱంబు నెక్కి నిశితశూలాయుధంబును గైకొని మహాంబుదిని మత్స్యంబు ప్రవేశించునట్లు వానర సైన్యములో బ్రవేశించి యేడువందల వానరులను వధించి చీకాకు బరచెను విద్యాధరులు మహర్షులాదిగాగల వారందఱు

వానరసేన యందు విహరించుచున్న నరాంతకుని జూచుచుండిరి ఆ రాక్షసవీరుని విహారగమనంతయును మాంసశోణితమయమై యుండెను దావానలంబు వనంబులను దగ్ధంబు జేయుకరణి వానరసేనలను దహించెను నరాంతకుని ప్రాసంబుచే బొడువంబడిన వానరులు పర్వతంబుకరణి నేలంబడిరి అప్పుడాతడు వర్షాకాలమందలి వాయువు వోలె వానరసైన్యమందంతటను స్వేచ్ఛగా విహరించెను వానరులు భయపడి పరుగిడుటకు గాని, నిల్చుటకుగాని, కదలుటకుగాని యశక్తులై మహాధ్వనిగలుగునట్లఱచిరి అంతలో కుంభకర్ణునిచే మూర్ఛలో మునింగియున్న వానరోత్తములు మూర్ఛదేఱి సుగ్రీవునిచెంత నిలువంబడిరి నరాంతకునకు వెఱచి యిట్టటు పరుగెత్తుచున్న వానరసేనను సుగ్రీవుడుజూచి అంగదునితో నిట్లనియె అంగదా! నీవీ క్షణమే బోయి యశ్వారూఢుడై వానరులను వధించుచున్న రాక్షసుని రూపుమాపి రమ్మని యాజ్ఞాపించెను

వానరేంద్రుని యానతిని శిరంబునందాల్చి తారాసుతుండు జీమూత సంఘము నుండి సూర్యుడు వెలువడి వచ్చినట్లు మేఘాకారమై యొప్పారెడు వానరసైన్యము నుండి బయలుదేరెను నానావిధములైన పర్వతములను కరంబునందాల్చి యుండుటచేత గైరికాదిధాతువులచే నొప్పుచున్న పర్వతంబుకరణి వానరోత్తముడు ప్రకాశించుచునే యాయుధంబును గైకొనక నఖదంతములనేయాయుధంబులుగా దలంచి నరాంతకుని జేరంజని యిట్లు చెప్పెను నరాంతకా నిలునిలుము ఈ యల్పవానరులతో నీకేమి పనియున్నది? వజ్రతుల్యంబగు నీప్రాసంబును నా వక్షస్థలంబుపై నొక్కమాఱు వేయుమనిన అంగదుని వాక్యములను రాక్షసుండాలకించి పెదవి గొఱుకుకొని కృష్ణసర్పంబువోలె గాఢ నిట్టూర్పులను బుచ్చుచు కుపితుడై మండుచున్న ప్రాసమును గిఱగిఱందిప్పుచు నంగదునిపై వైచెను వజ్రసమానమగు వాలిసుతుని వక్షస్థలమునకు దగిన ప్రాసము విఱిగి నేలబడెను విఱిగిపోయిన ప్రాసమును జూచి యఱచేయినెత్తి నరాంతకుని గుఱ్ఱమును గొట్టెను ఆ యశ్వరాజము నాలుక గొఱుకుకొని నేలగూలెను రాక్షసుండమిత క్రోధావేశుడై పిడికిలి నెత్తి వానరోత్తముని తలపై బొడిచెను అంగదుడు

తలబగిలి నేడిరక్తమును గార్చుచు మూర్ఛిల్లి కొంత తడవునకు దెప్పతిల్లి నరాంతకునిబలంబున కాశ్చర్యము నొందెను వాలిసుతుండు వజ్రమునకెనయైన తన పిడికిలి నలవరించి మహోద్రేకుడై రాక్షసుని రొమ్ముపై బొడిచెను ఆ ముష్టి ఘాతంబుచే రొమ్ము బ్రద్దలై నలిగి పైకుద్గమించి రక్తధారలచే దోగుచు వజ్రాయుధంబుచే బర్వతంబుకరణి నేలంగూలెను నరాంతకుడు నేలబడిన తోడనే వానరుల మితానందాబ్ధినీదిరి రాముడాశ్చర్యము నొంది అంగదుని శ్లాఘించెను అంగదుడు సంతుష్టుడై మరల యుద్ధ సన్నద్ధుడాయెను

దేవాంతకుడును, త్రిశిరుడును, మహోదరుడును, నరాంతకుడంగదునిచే హతుండగుట కెంతయువగచి రోదనమొనరించిరి మహోదరుడు మేఘ సమానంబగు మహాగజంబు నారోహించి అంగదుని దరిమెను దేవాంతకుడు తన తమ్ముడు నేలగూలినందుకు దుఃఖితుడై దేదీప్యమానంబగు పరిఘంబుగొని వాలిసుతుని మీదికి బోయెను వీరుండగు త్రిశిరుడు సూర్యబింబముపోలె వెలుగొందెడు యుత్తమాశ్వంబులు బూన్చిన రథంబారోహించి వాలిపుత్రునితో సమరంబు జేయుటకరిగెను మహావీరులగు రాక్షసోత్తములు ముప్పురును తన మీదికి వచ్చుటంజూచి వానరోత్తముడు గొప్ప భూజంబునొక్కదానిని బెల్లగించి సురనాథుడు వజ్రాయుధమును బ్రయోగించు చందంబున దేవాంతకునిపై విసరెను త్రిశురుడది జూచి నిశిత బాణంబులచే నావృక్షమును భేదించెను అంగదుడు వెంటనే యాకాశంబున కుద్గమించి మహీరుహంబులను, పర్వతంబులను గురిపించెను త్రిశురుడు సంక్రుద్ధుడై వాని నన్నిటిని గఱకు బాణంబులచే ఖండించివేసెను మహోదరుడు పరమక్రుద్ధుడై వజ్రతుల్యములగు తోమరంబులచే నంగదుని వక్షస్థలముపై గొట్టెను దేవాంతకుడు మఱింత క్రోధమానసుడై పరిఘంబుతో వాలిసుతుని గొట్టెను ఏకకాలంబున ముప్పురు రాక్షసవీరులచే నెదిరింపబడియు వాలిసుతుండిసుమంతేనియు వ్యధనొందడాయెను పరమ దుర్జయుండగు వానరోత్తముడు మహావేగంబున పైకెగిరి మహోదరుండెక్కియున్న మహాగజంబు నఱచేతందట్టి వైచెను ఆ దెబ్బచేత యేనుగు కన్నులూడి పడెను మదగజము సహింపజాలక గట్టిగా నఱచెను ఆ యేనుగుదంత

మూడవబెఱికి దానిచేత దేవాంతకుని గొట్టెను ఆ వ్రేటునకు రాక్షసుడు వాయువుచే ద్రోయంబడిన వృక్షంబుకైవడి నిశ్చేష్టుడైపడి రక్తమును గ్రక్కెను కొంతతడవునకు దేవాంతకుడు దెప్పరిల్లి పరిఘంబును గైకొని గిఱగిఱం ద్రిప్పి యంగదుని గొట్టెను వానరశ్రేష్ఠుడా దెబ్బకు బోరగిలంబడి వెంటనే పైకి లేచెను వానర రాజపుత్రుడు లేచుటంజూచి రాక్షసరాజపుత్రుడగు త్రిశిరుడు మూడు బాణంబులచే నొసటంగొట్టెను మువ్వురు రాక్షసులు చేరి యంగదునిపై బడుటను జూచి హనుమంతుడు, నీలుడు తోడ్పడిరి నీలుడొక పర్వత శిఖరంబును త్రిశిరునిపై వైచెను ధీమంతుడగు రావణపుత్రుడా పర్వతశిఖరంబును గఱకుబాణంబులచే దునియలు గావించెను అది జూచి దేవాంతకుడు పరిఘంబును బూని పవన తనయుని మీదికి బోయెను తన మీదికి వచ్చుచున్న దేవాంతకుని జూచి హనుంతుడాతనిపై కెగిరి శిరంబుపై వజ్రతుల్యంబగు పిడికిటం బొడిచి రాక్షసుల గుండెలవయునట్లు సింహనాదంబు గావించెను ఆ ముష్టిఘాతంబుచే రావణుని పుత్రుడగు దేవాంతకుని శిరంబు పెక్కు వ్రక్కలై దంతములును, నేత్రములును, నేలరాల నాలుక వెలువడి విగతజీవుండై త్వరితంబుగ ధరణీతలంబుపై వ్రాలెను దేవాంతకుడు హతుండగుటను జూచి త్రిశిరుండమిత క్రోధావేశుడై నీలుని వక్షస్థలంబుపై నిశితబాణ పరంపరలను గురిపించెను

అంతలో మహోదరుడు క్రుద్ధుడై మందరపర్వతంబును భాస్కరుండారోహించునట్లు పర్వతాకారమగు మఱియొక మత్తకరీంద్రము నెక్కి సమరంబునకు వచ్చి నీలుని వక్షస్థలమందు బాణవృష్టిని గురిపించెను వానరసేనా నాయకుండవ్విధంబున రాక్షసుని బాణవర్షంబుల నభివర్షితుడై రుధిరార్ద్రదేహుడై కదల మెదలక స్తంభితుడాయెను మఱికొంత తడవునకు మహాభయంకరవేగుడగు నీలుడు తెలివొంది వృక్ష సమూహాలంకృతంబగు నొకపర్వతంబును బెల్లగించి యెగసి వచ్చి మహోదరుని శిరంబుపై గొట్టెను ఆ దెబ్బకు మత్త కరీంద్రముతో గూడ మహోదరుండు గత ప్రాణుండై పర్వతంబువోలె నేలకొఱగెను త్రిశిరుడు తన పిన్నతండ్రి నేలబడుటంజూచి క్రుద్ధుడై హనుమంతుని తీక్ష్ణ బాణజాలంబుచే నొప్పించెను హనుమంతుడమిత క్రోధమానసుడై పర్వత శిఖరంబును బ్రయోగించెను

త్రిశిరుండా పర్వత శిఖరంబును తన కఱకుబాణంబులచే బెక్కు వ్రయ్యలు గావించెను పవనాత్మజుడది జూచి రావణాత్మజునిపై వృక్ష వర్షమును గురిపించెను ఆ వృక్షజాలంబును త్రిశిరుడు ఖండించి సింహనాదంబు గావించెను అంజనానందనుండది గాంచి మహోద్రేకుడై మహాగజంబును మృగరాజు చీల్చునట్లు రాక్షసుని గుఱ్ఱంబును నఖంబులతో జీల్చివైచెను త్రిశిరుండు క్రూరాత్రింబోలినశక్తిని గైకొని హనుమంతునిపై బ్రయోగించెను పవనతనయుండా శక్తినిబట్టి విఱిచి సింహనాదంబు గావించెను వానరులది జూచి సంతసించి మేఘగర్జన మొనరించిరి త్రిశిరుడు కరవాలంబును గైకొని సమీరనందనుని ఱొమ్ముపై గొట్టెను వాయుసుతుండా వ్రేటునుగొని రాక్షసుని ఱొమ్ముపై నఱచేతంబ్రహరించెను రావణాత్మజుండ దెబ్బకు మూర్ఛితుడై చేతియాయుధంబు జాఱిపడ నేల కొఱగెను మారుతాత్మజుండా రాక్షసుని ఖడ్గంబును బెఱికికొని రాక్షసలోకము తల్లడిల్లునట్లుగా సింహనాదంబొనరించెను త్రిశిరుండంతలో బైకి లేచి పిడికిటంబొడిచెను హనుమంతుడదిక క్రోధావేశుడై తీక్షణంబగు ఖడ్గంబుచే కిరీటకుండలాలంకృతంబులగు త్రిశిరుని మూడు శిరంబులను ఖండించెను ఆకాశము నుండి నక్షత్రములు రాలుకరణి రజనీచరుని మూడు శిరంబులు నేల రాలినవి రాక్షసులది జూచి వెఱగంది దిక్కులకు బాఱిరి వానరులు వాయుసుతుని శ్లాఘించుచు సంతోషాంబుధి నిమగ్నులైరి

త్రిశిరమహోదరులు వధింపబడుటకెంతయును వగచి మహాపార్శ్వుడధిక క్రోధావేశుడై దేదీప్యమానమై రక్తపుష్పమాలికలచే నలంకరింపబడిన గదను కరంబునందాల్చి ప్రళయకాలునిభంగి మండిపడుచు వానరుల మీదికి బోయెను వనచరుల పైకి వచ్చుచున్న రావణుని తమ్ముని జూచి బాహుబలసంపన్నుడగు ఋషభుడొక్కగంతులో ముందునకెగిరి యాతని మ్రోలనిలువంబడెను అమ్మహాపార్శ్వుడు కోపించి వజ్రతుల్యంబగు గదచే వానరవీరుని వక్షస్థలంబుపై గొట్టెను ఆ గదాఘాతంబునకు ఋషభుడు మూర్ఛిల్లి కొంత తడవునకు దెప్పరిల్లి మహాపార్శ్వుని మీదికెగిరి గదను బెఱికికొని పలుమాఱు గిఱగిఱంద్రిప్పి రాక్షసుని మస్తకంబుపై బాదెను మహాపార్శ్వుండా దెబ్బకు దంతములు, నయనంబులు రాలి నేలంబడి విగతజీవుడయ్యెను మహాపార్శ్వుడు

నేలబడిన తోడనే సముద్రమును బోలిన రాక్షస సైన్యము భయమంది దిక్కులకు బాఱిపోయెను

## అతికాయుడు లక్ష్మణునిచే గూలుట

పిన్నతండ్రులును, అన్నదమ్ములును, యుద్ధంబున నిహతులగుటంజూచి పర్వతాకారుండగు యతికాయుడుగ్రుడై వేయి సూర్యుల వోలె వెలుగొందుచున్న రథంబునారోహించి వానరులమీది కదరి ధనుస్సు సారించి సింహనాదంబు గావించెను వానరులందఱు అతికాయుని జూచి కుంభకర్ణుడే మరల లేచి వచ్చినాడని భయభ్రాంతులై యిట్టటు పారిపోవ దొడంగిరి రావణాత్మజుని సింహనాదంబునకు భీతిల్లి నిర్విణ్ణులై శరణ్యుడగు రాముని శరణు జొచ్చిరి రథగతుండై పర్వతాకారంబుతో ధనుర్ధరుడై వచ్చుచున్న రాక్షసుని దూరమునుండియే రాముడుజూచి యాశ్చర్య నిమగ్నుడై విభీషణునితో నిట్టులనియె

విభీషణా! సహస్రాశ్వంబులచే బూన్పబడిన విశాలరథంబుపై బర్వతాకారంబుతో బరిఢవిల్లుచు ధనుర్ధరుడై వచ్చుచున్న సింహలోచనుండగు రాక్షస సింహుడెవ్వడు? కాంతలీనెడు శూలములచేతను, ప్రాసములచేతను, తోమరములచేతను, మృత్యువునాలుకలను బోలిన శక్తులతోడను బరివేష్టితుడై మెఱపులతో గూడిన మేఘంబు కరణి వెలుగొందుచు వచ్చుచున్న యీ వీరుడెవ్వడు? ఈతని ధనుస్సు లింద్ర ధనుస్సును బోలియున్నవి రథంబు ధ్వజపతాకములచే నలరారుచు నలుగురు సారథులచే దోలబడుచు మేఘగర్జనమును బోలిన ధ్వనిగలదై మిఱుమిట్లుగొల్పుచున్నది ఆ రథంబుపై ముప్పది యొనిమిది తూణీరములున్నవి ధనుస్సులు లెక్కకు మిక్కుటముగ నున్నవి రెండు ఖడ్గములు రథంబున నీతని పార్శ్వభాగంబుల నలంకరించి యున్నవి ధీరుడై యెఱ్ఱని పుష్పమాలికను కంఠమున దాల్చియున్నాడు నీలవర్ణుడై మృత్యువువోలె మహావక్త్రంబు గలిగి సూర్యుని పగిది దేజరిల్లుచున్నాడు కర్ణకుండలములచే నలంకరింపబడియున్న యీ వీరుని మోము పునర్వసు నక్షత్రముల నడుమ వెలుగొందెడు పూర్ణచంద్రబింబమును బోలియున్నది

ఈ రాక్షసోత్తముని జూచి వానరులు భయపడి పరుగెత్తుచున్నారు ఈ రథికోత్తముడెవ్వడో నాకెఱిగింపుమనియెడు రాము వాక్యము లాలకించి విభీషణుండిట్లనియె

రామా! ఇతడు ధాన్యమాలిని కుమారుడు అతికాయుడు ఇతని బాహుబలంబు నాశ్రయించియే లంకాపురంబు నిర్భయముగ నున్నది రాక్షసేంద్రుడగు రావణునకు సమానుడు రాక్షసాధీశుని కుమారులలో నీతడు సమర్థుడని పేరెన్నిక గన్నవాడు వృద్ధులను సేవించును విద్యావంతుడు, సర్వాస్త్రవేత్తలలోనుత్తముడు గుఱ్ఱపుస్వారి యందగ్ర గణ్యుండు ధనుర్విద్యాపారంగతుడు ఏనుగుమీదను, రథంబు మీదను, స్వైరవిహారమును సల్పుటయందు ప్రావీణ్యము గలవాడు సామదాన భేదోపాయంబులు చక్కగానెఱింగినవాడు నీతిశాస్త్రకోవిదుడు ఇతడు ఘోరతపంబొనరించి బ్రహ్మవలన దివ్యాస్త్రములను బడసి శత్రువులను జయించియున్నాడు దేవాసురులచే వధ్యుడు గాకుండుట కీతనికి ద్దివ్యకవచంబును మహారథంబును సురజ్యేష్ఠుడొసంగెను ఈ యతికాయుడనేకమార్లు దేవతల నోడించెను యక్షులను వధించి రాక్షసులను రక్షించెను సురేంద్రుని వజ్రాయుధమును స్తంభింపజేసిన వరుణుని పాశంబును గూడ నీతడు ప్రతిహతము గావించియున్నాడు రాక్షసోత్తముడు బుద్ధిమంతుడు దేవదానవుల గర్వంబడంచినవాడు రావణుని పుత్రుడు ఇతని వధించుటకు శీఘ్రముగా బ్రయత్నింపుడు ఆలసించినచో బాణాగ్నిచే వానరులను దగ్ధము చేయునని విభీషణుడు జెప్పెను

అంతలోనే యతికాయుడమితోద్రేకుడై వానరసైన్యంబుజొచ్చి జ్యానాదంబొనరించి పలుమాఱు సింహనాదంబుగావించెను అతికాయుని సింహనాదంబునాలకించి కుముదుడు, మైందుడు, నీలుడు, శరభుడుననియెడు వానరోత్తములు పాదపంబులను, పర్వతశిఖరంబులను గైకొని యెక్కుపెట్టున నతికాయునెదిరించిరి అస్త్రకోవిదుండగు రావణనందనుడు కాంచనాలంకృతమగు బాణపరంపరలచే వారిని బాధించెను సింహము మృగ సమూహమును జీకాకు పరచునట్లుగ రాక్షసుండు వానరులను జీకాకు పఱచెను బాణపీడితులై వృక్షచరులేమి

చేయుటకును దోచకుండిరి అతికాయుడంతలో వానరులను బీడింపనొల్లక ధనుస్తూణీరంబులతో రాముని జేరంబోయి గర్వముతో గూడిన పరుషోక్తులతో నిట్లులనియె రామా! నేను రథంబున ధనుర్బాణధరుండనై రణంబుజేయు కాంక్షతో నిల్చియున్నాను భయపడి పరుగెత్తెడు వానరులతో సమరంబొనరింపను యుద్ధోత్సాహంబున నన్నెదిరించు వాడెవ్వడో యిప్పుడు నాపై యుద్ధమునకు రావచ్చును ధీరుడెవ్వడో ముందునకు రమ్మనియెడు రావణుని తనయుని పలుకులను సుమిత్రా తనయుండాలకించి క్రోధారుణలోచనుడై యమ్ములపొదినుండి బాణంబెత్తి యతికాయుని ముందు నిలుఎంబడి జ్యానాదంబు గావించెను ఆ జ్యావల్లీనాదంబు భూమియందును పర్వతములందును, దిక్కులందును వ్యాపించి రాక్షసుల గుండెలను దద్దరిల్లజేసెను లక్ష్మణుని ధనుర్ధ్వని నాలకించి రాక్షసోత్తముడమితాశ్చర్యమునొంది దశరథసుతుని జూచి యిట్లనియెం లక్ష్మణా! నీవు పిన్నవాడవు పరాక్రమంకార్యము లందసమర్థుడవు మృత్యువును బోలిన నాతో యుద్ధంబు జేయవచ్చితివా? ఎంతమాట వెనుకకు మరలిపొమ్ము నాచే విడువంబడు నస్త్రంబుల ధాటికి హిమత్పర్వతంబును, భూమ్యంతరిక్షములును, సహింపజాలవు హాయిగా నిదురలో మునింగియున్న ప్రళయకాలానలము నేల బ్రజ్వలింప జేసెదవు ధనుస్సును వీడి తరలిపొమ్ము నన్నెదిరించి నిష్కారణముగా ప్రాణంబులేల గోల్పోయెదవు? నాకెదురొడ్డి నిల్చిన పిమ్మట మరలిపోక ధీరచిత్తుండవై నిలువగలిగితివేని రమ్ము ఈ క్షణమందే నీప్రాణంబులను బలిగొని యమసదనంబునకు బంపెదను త్రినేత్రుని త్రిశూలమును బోలియున్న నా బాణంబులను బరికింపుము రా రమ్మని యతికాయుడు లక్ష్మణునితో జెప్పి వింటబాణంబు సంధించెను మహాతేజోనిలయుడగు సుమిత్రా సుతుండతికాయుని జూచి పరమకుపితుండై గభీరార్థముగల మాటలతో నిట్లులనియె

దురాత్మా! ఏల ప్రేలదవు? ఈ మాటల వలన నీవధికుండవెట్లైతివి? ఎవ్వరైనను కార్యము జేయుటవలన శూరులనిపించుకొందురు గాని తమమ్ముదామను పొగడుకొనుటవలన శూరులగుదురా? నేనిదే ధనుర్బాణంబులు ధరించి నిల్చితిని ఇప్పుడు నీ బలంబుజూపుము

కార్యరంగమునకు గట్టువడి నీ స్వరూపమెట్టిదో గనబరచుము ఊరక నీయంతకు నీవేల పొగడుకొనెదవు? యుద్ధంబున పౌరుషంబు జూపువాడే శూరుడు గాని యాత్మశ్లాఘిశూరుడెట్లగును? నీవు సర్వాయుధంబులను ధరించి ధనుర్ధరుడవై రథంబును నారోహించి యున్నావు నీ బాణ పరంపరలచేత గాని, దివ్యాస్త్రములచేత గాని నీ బలపరాక్రమము నెఱుక పఱచుము అటుపిమ్మట చక్కగా పక్వమైన తాటిపండును తొడిమనుండి పవనుడు రాల్చునట్లు నా శరంబులచే నీ శిరంబును బడద్రోసెదను కాంచన భూషణంబులగు నా బాణంబులతిత్వరలో నీ రుధిరంబును గ్రోలగలవు బాలుడనని నన్నెంత మాత్రము చుల్కనగా జూడవలదు బాలుడను గాని, వృద్ధుడను గాని భండనంబున మృత్యువును బోలినవాడనని తలంచుము త్రివిక్రమావతారంబున విష్ణుదేవుడు బాలుడై ముల్లోకంబులను మూడడుగులచే ద్రొక్కలేదా? వ్యర్థ ప్రలాపములెందుకు? రమ్మనియెడు రాముని తమ్ముడనియెడు వాక్యములను రజనీచరుండాలకించి యమిత క్రోధోద్దీపితుడై యుత్తమ బాణంబొండు గైకొనెను విద్యాధరులును, భూతములును, దేవతలును, దైత్యులును, మహర్షులును, గంధర్వులును, వారియుద్ధంబు జూడ వచ్చిరి రావణాత్మజుడు వింట బాణంబును సంధించి లక్ష్మణునిపై ప్రయోగించెను సుమిత్రాసూనుడు తనపైకి వచ్చుచున్న సర్పతుల్యంబగు తీక్షణ బాణంబును అర్ధచంద్రబాణముచే ఛేదించెను ఆ బాణంబు ఖండింపబడుటంజూచి పరమకుపితుడై పంచబాణంబులను గైకొని లక్ష్మణునిపై ప్రయోగించెను దశరధసుతుండా బాణంబులను కఱకుబాణంబులచే ధ్వంసము జేసి నిశితబాణంబునొండు గైకొని వింటంగూర్చి యాకర్ణాంతమునాకర్షించి రాక్షసోత్తముని లలాటంబునం గొట్టెను అప్పుడాతడు రుధిరార్ద్ర దేహుడై చలించెను అతికాయు డివ్విధంబున కొంతయూరడిల్లి లక్ష్మణా! నీవిట్లు బాణప్రయోగంబు గావించి నాకు మిక్కిలి శ్లాఘనీయుడవగుచున్నావు ఇదే చూడుమని రథగతుండై యొకటి, మూడు, అయిదు, ఏడు బాణంబులను దీసి వింటసంధించి రాజనందనునిపై ప్రయోగించెను తనపై ప్రయోగించిన బాణంబులన్నింటిని రామానుజుడు ఖండించివైచెను రావణపుత్రుడదిగాంచి కుపితుడై నిశితంబగు నొక్క దివ్యబాణంబును దీసి లక్ష్మణుని వక్షస్థలంబుపై గొట్టెను ఆ బాణఘాతంబుచే దశరధసూనుని వక్షస్థలమునుండి, మదపుటేనుగు

దేహమునుండి మదజలంబు స్రవించుమాడ్కి వేడిరక్తము స్రవించెను వెంటనే తనమేనంనాటబడిన బాణంబులను పెఱికి వైచి బాధను నివారించుకొని, నిశితబాణంబొండు గైకొని దివ్యాస్త్ర మంత్రముతో గూర్చి ఆగ్నేయాస్త్ర మంత్రముచే నభిమంత్రించెను మహాతేజోనిలయుడగు రావణుని సుతుండు సౌర్యాస్త్రంబును స్మరించి ఆ యస్త్రమంత్రముచే సర్పతుల్యమగు బాణము నభిమంత్రించెను లక్ష్మణుడా యాగ్నేయాస్త్రాలభిమంత్రించి యముడు కాలదండమును బ్రయోగించు చందంబున నతికాయునిపై బ్రయోగించెను అతికాయుడుదిజూచి సూర్యాస్త్రాభిమంత్రితంబగు బాణంబును బ్రయోగించెను ఆ బాణంబు లాకసంబున ధళతళమెఱయుచు సర్పంబుల పగిది నొండొంటందాకి దహించుకొని నిస్తేజంబులై భస్మీభూతములై భూతలంబునంబడియె రావణపుత్రుండమితోద్రేకుడై ఐషీకాస్త్రమును బ్రయోగించెను లక్ష్మణుడాయస్త్రమును ఐంద్రాస్త్రముచే గొట్టెను తాను బ్రయోగించిన యైషీకాస్త్రమ్ము ప్రతిహతంబగుటంజూచి రాక్షస రాజనందనుడు క్రుద్ధుడై యామ్యాస్త్ర మంత్రంబుచే బాణంబు నభిమంత్రించి లక్ష్మణునిపై బ్రయోగించెను దశరథ రాజనందనుడది జూచి వాయువ్యాస్త్రంబుచే దానింగొట్టి మేఘుంబువర్షమును వర్షించునట్లు బాణవర్షమును గురిపించెను ఆ బాణములతికాయుని మైవంఅవును దాకి యుక్కుమేకులు విఱిగినేలంబడునట్లు విఱిగి నేలబడినవి లక్ష్మణుడు గురిపించిన బాణవర్షమంతయు వ్యర్థమగుటందిలకించి వేయి మహాబాణంబుల వర్షించెను అభేద్యమగు కవచంబును ధరించియున్న రాక్షసోత్తమునిపై బురుషోత్తముడు బాణవర్షంబుల నెంత వర్షించినను కించిత్తైనను నాతడు బాధనొందడాయెను

ఆ సమయంబెఱింగి వాయుదేవుడు లక్ష్మణుని జేరంవచ్చి యిట్లు జెప్పెను రాజనందనా! ఈ యతికాయుడు బ్రహ్మదేవుని వరప్రసాదమువలన నభేద్యమగు కవచంబును ధరించియున్నాడు వేఱేవిధంబున నితని వధించుటకలవిగాదు బ్రహ్మాస్త్రముచే బరిమార్చు మనియెడు వాయుదేవుని వాక్యములాలకించి లక్ష్మణుడు త్వరితంబుగా బ్రహ్మాస్త్రమంత్రంబు జపించి బాణంబును ధనుస్సున సంధించెను

చంద్రసూర్యాదిగ్రహంబులు భయంబునొందిరి భూవ్యాకాశంబులును, దిక్కులును, చలించినవి యమకింకరుని బోలిన యమ్మహాబాణంబును బ్రహ్మాస్త్ర మంత్రముతో నభిమంత్రించి సుమిత్రాసుతుండు సూటిగా విడిచెను లక్ష్మణునిచే విడువంబడి మిణుగురులు గ్రక్కుచు నగ్ని హోత్రంబు కైవడి బరతెంచుచున్న బాణంబును అతికాయుడు శక్తులచేతను, అష్టులచేతను, గదలచేతను, గొడ్డళ్ల చేతను, శూలములచేతను గొట్టెను అమ్మహాస్త్రము భయంకరాకారంబులగు నయ్యాయుధంబులను సరకుగొనక ధగధగమండుచుబోయి యయ్యతి కాయుని కిరీటాలంకృతంబగు శిరంబును ఖండించి వైచెను ఆ శిరంబు హిమత్పర్వత శిఖరంబు మాడ్కి దటాలున నేలగూలెను అతికాయుని శిరంబునేలబడుటందిలకించి హతశేషులగు రాక్షసులందఱు పరమదుఃఖితులై వికృతస్వరంబు గానుచ్చైర్నాదంబున రోధన మొనరించిరి నాయకోత్తముని గోల్పోయి భయపడి యుద్ధభూమిని వదలి లంకాభిముఖులై త్వరితంబుగా బోయిరి దురాసదుండగు శత్రువును నేలగూల్చి వికసితకమలంబు పగిది విజయంబునొంది వెలుగొందెడు లక్ష్మణుని వానరులందఱు సంతుష్టులై పూజించిరి

## అతికాయుని మరణవార్త నాలకించి రావణుడు దుఃఖించుట

మహాపరాక్రమశాలియగు తన తనయుండు లక్ష్మణునిచే గూలుటకెంతయు ఖిన్నుడై రావణుడిట్లు బలికెను ఆయుధధారులలో నుత్తముడగు ధూమ్రాక్షుడు అకంపనుడు, ప్రహస్తుడు, కుంభకర్ణు డాదిగాగల రాక్షస ప్రముఖులెన్నడును పరాజయంబునొంది యెఱుంగరు యుద్ధప్రియులై శత్రుసైన్యములను జయించుచుండిరి అట్టి యుద్ధకోవిదులను రాముడు వధించినాడు వీరాధివీరులగు రాక్షసులెందఱో వధింపబడిరి ఖరదూషణాదులను వధించిన పరాక్రమశాలురగు రామలక్ష్మణులను గూడ నా సుతుండగు ఇంద్రజిత్తు వరలబ్ధంబులైన దివ్యబాణంబులచే బంధించినాడు దేవాసురులకు గాని

యక్షగంధర్వకిన్నరులకుగాని యలవిగాని బంధమునుండి రామలక్ష్మణులు విముక్తులైరి అది ప్రభావమా? మాయయా? మోసమా? నాకెఱుకబడకున్నది నాయాజ్ఞాను వర్తులై బవరంబునకేగిన రాక్షస వీరులందఱు వానరవీరులచే వధింపబడిరి రామలక్ష్మణులను, సుగ్రీవాది వానరులను విభీషణుని దునుమాడగల సమర్థుడెవ్వడో నాకేమియు దోచకున్నది రాముని యెదుట బడిన రాక్షసులందఱు లయమై పోయినారే! హా! రాముని బలంబెంతగొప్పది? ఆతని యస్త్ర బలమునెంతని కొనియాడనగును నా శరహితుండగు నారాయణుడే రాముడు గాబోలునని తలంచెదను ఆతని భయంబునకు వెఱచి లంకాపురద్వారంబులను బంధించి యున్నాము రాక్షసులారా! మీరలేమఱక మిమ్ములను రక్షించుకొనుచు లంకాపురంబును జాగ్రత్తగా రక్షింపుడు అశోకవనంబులోనికెవ్వరిని జొరనీయరాదు మీమీ సేనాభాగములందు గస్తీతిరుగుచు జాగరూకులై మెలగుచుండవలయును సాయంసమయములందుగాని, నిశిసగముగువేళగాని, ప్రాత కాలమునందు గాని, ఎల్లవేళలయందును, వానరులు సేయు కార్యములను బరిశీలింపుచుండుడు వానరులని చుల్కనగా జూడరాదు శత్రుసైన్యము సమరంబునకు గడంగియున్నదా? ఊరకున్నదా? మనపైకి వచ్చుచున్నదా? మీరందఱు దెలిసికొనుచుండవలయునని రాక్షసేంద్రుడు రజనీచరుల కాజ్ఞాపించెను రాక్షసులందులకియ్యకొనిరి రావణుడు పుత్రశోకమును భరింపజాలక దీనుడై గాఢ నిట్టూర్పులను బుచ్చుచు మండిపడుచు దన గృహంబునకు బోయెను గృహంబు జేరిన పిమ్మట యతికాయాదులందఱు హతులగుటకెంతయు వగచి మూర్ఛిల్లి కొంతతడవునకు దేఱుకొని తమ్ములను, తనయులను దలంచుకొని పనవి పనివి యేడ్చెను

## ఇంద్రజిత్తు తండ్రినోదార్చి యుద్ధమునకు బోవుట

దు ఖసముద్రమందుమగ్నుడైయున్న జనకుని జూచి యింద్రజిత్తు యివ్విధంబున నోదార్చెను తండ్రీ! ఇంద్రజిత్తు జీవించియుండగా నీవిట్లు విలపింపనేటికి? నా బాణఘాతంబులకెదురొడ్డి నిల్చిన వాడెవ్వడును

ప్రాణంబులు దక్కించుకోజాలడు నేనిప్పుడే బోయి రామలక్ష్మణులను బాణంబులచే జీల్చిచెండాడెదను చూడుము ఇదే నా ప్రతిజ్ఞనాలకింపుము అమరేంద్రుడును, యముడును విష్ణుదేవుడును మిత్రుడును, సాధ్యులును, అశ్వనీదేవతలును, అగ్నిహోత్రుడును, చంద్రసూర్యులును నా పరాక్రమమును గుర్తింపగలరు రామలక్ష్మణుల నమోఘ బాణంబుల కెఱగావించెదనని తండ్రితో జెప్పి యాతని యనుమతి వడసి వాయు సమానంబగు వేగంబుగల యుత్తమ కంచరగాడిదెలచే బూన్చబడిన రధంబునారోహించి రావణపుత్రుండగు యింద్రజిత్తు రణరంగమున కేగెను

రాక్షసులందఱు పరమామోదమందుచు ధనుర్ధరులై కొందఱు గజంబులను, కొందఱుత్తమాశ్వంబులను నారోహించి సర్వాయుధధారులై యింద్రజిత్తును వెంబడించి పోయిరి రాక్షసులు దన్ను బ్రస్తుతించుచుండ రాక్షసోత్తముడు పేరోలగంబునకేగెను చంద్రబింబమును బోలిన యాతని ధవళ చత్రంబు తళతళ మెఱయుచుండెను సుందర చామరంబులచే రాక్షసులు వీచిరి సూర్యునిచే నాకాశంబు బ్రకాశించు చందంబున యింద్రజిత్తుచే లంకాపురంబంతయు బ్రకాశించెను అప్పుడా యింద్రజిత్తు దివ్యరధంబు నొందుటకై మంత్రపూర్వకంబుగా అగ్నిహోత్రమునందు హోమము గావించుచు జుట్టును రాక్షసులను కావలియుంచెను గంధమాల్యసహితంబుగా సంస్కృతంబులైన హవిస్సును, బేలాలను, అగ్నిహోత్రమునందు హోమము గావించెను ఱెల్లునకు బదులు ఆయుధములను, తాంద్రపుల్లలు సమిత్తులును, ఎఱ్ఱని వస్త్రములును, నల్లని యినుప స్రువంబును నుంచుకొని తోమరంబులతోను, ఱెల్లుతోను, అగ్నిపరిస్తరణంబుగావించి జీవించియున్న నల్లమేకను, పశువుగాబట్టి హోమంబొనరించెను ఒక్కమాఱు సమిత్తులతో జ్వాలింప జేయబడిన యగ్నిదేవుడు విజయసూచక చిహ్నములతో బొగలేక పెనుజ్వాలలతో వెలుగొందుచు తానే ప్రదక్షిణముగ జుట్టుజ్వాలలతోను సువర్ణభూషణముల తోను బ్రాదుర్భవించి యావిస్సును బ్రతిగహించెను

అవ్విధంబున నింద్రజిత్తు బ్రహ్మాస్త్రమును జపించి యమమ్మహాస్త్రముచే దనరధమును, ధనుస్సును మొదలుగాగల

వానినన్నింటని యభిమంత్రించెను అదిజూచి యాకాశము గ్రహములతోడను, చంద్రనక్షత్రములతోడను భయమంది చలించినది అట్లు హోమంబు గావించి రాక్షసోత్తముడు ధనుర్బాణ ఖడ్గ రథాశ్వసారథి సహితంబుగా నాకాశంబునకుద్గమించి యంతర్థానమయ్యెను రాక్షస సైన్యమంతయు యుద్ధోత్సాహంబున గర్జించుచు బయలువెడలెను

## ఇంద్రజిత్తు వానరులతో యుద్ధము జేయుట

ఇంద్రజిత్తు క్రోధావేశుడై రాక్షసులను జూచి, మీరలమితానందముతో స్వేచ్ఛగా సమరంబు గావింపుచు వానరులందఱిని వధింపుడని యాజ్ఞాపించెను రావణాత్మజుని యనుమతిమేరకు రాక్షసులు బాణంబులచేతను, తోమరంబులచేతను, అంకుశములచేతను వానరులను బ్రహరించిరి ఇంద్రజిత్తు రాక్షస సహితుడై వానరులను వధింపబూనెను వృక్షచరులమితోద్రేకులై గుమిగూడి వృక్షంబులను గైకొని యుద్ధకర్కశుండగు రావణనందనుని మీదికి బోయిరి ఇంద్రజిత్తు కుపితుడై వనచరుల దేహములను జించి చెండాడెను ఒక్కొక్క బాణంబునకు తొమ్మండ్రుగురిని, ఐదుగురను, ఏడ్గురను, ఖండించి రాక్షసుల కమితానందమెునగూర్చెను వానరులు బాణపీడితులై రక్తసిక్తదేహములతో జయమునందాశను వీడి దేవతలచే గొట్టబడిన యసురుల మాడ్కి మహీతలంబున బడిపోయిరి ప్రముఖవానరులదిగాంచి కోపోద్రేకులై కిరణజాలంబుచే వెలుగొందెడు సూర్యుని మాడ్కి దురాధర్షుడై వెలుగొందుచున్న యింద్రజిత్తుమీదికి బోయిరి ఆ వానరవీరులు కొందఱు భిన్నదేహులై ధైర్యంబును గోల్పోయి భయంబు నొంది పరుగెత్తిరి మఱికొందఱు రామకార్యార్థమై పరాక్రమంబును గోల్పోవక ప్రాణంబులపై నాశను వీడి గర్జించుచు పెనుశిలలనాయుధములుగాగొని వెనుదీయక యుద్ధంబు గావించిరి వృక్షములను, పెనుశిలలను, పర్వత శిఖరంబులను ఇంద్రజిత్తుపై వర్షించిరి రాక్షసోత్తముండా శిలావర్షమును బాణంబులచే నివారించి సర్పతుల్యములగు బాణంబులను బ్రయోగించి వానరసైన్యమును భేదించెను పదియునెనిమిది కఱకు బాణంబులచే

గంధమాదనుని, తొమ్మిది బాణంబులచే నలుని గొట్టెను మఱియు నేడు బాణంబులచే మైందుని, ఐదు బాణంబులచే గజుని నొప్పించెను అంతటితో దనివిజెందక జాంబవంతుని పదిబాణములతోడను నీలుని ముప్పది నిశిత విశిఖంబుల తోడను బాధించెను సుగ్రీవుని ఋషభుని, అంగదుని ద్వివిదుని వరప్రభావముగల బాణపరంపరలచే మూర్ఛలోమునుంగ జేసెను వానరసైన్యములను ప్రళయ కాలాగ్ని వడవున నిశితశరంబులచే జించి చెండాడెను వానరసైన్యమంతయు తన శరజాలంబుచే మూర్ఛలో మునింగి రక్తమందు దొరలాడుచు నిశ్చేష్టయై యుండుటంగాంచి ఇంద్రజిత్తు పరమామోదమొందెను

ఎరలకొంత తడవునకు రావణాత్మజుడు తన సైన్యమును వీడి వానర సైన్యమందు జొరబడి యదృశ్యుడై యాకసంబునకెగసి నీలంబుదము వర్షించు చందంబున వానరసేనలపై బాణవృష్టిని గురిపించెను ఆ రణమందు పర్వతాకారులగు వానరులు రాక్షసనందనుని బాణంబులచే గొట్టబడి భిన్నదేహులై మాయాబద్ధులై వికృత స్వరంబుగా నఱచుచు దేవేంద్రుని వజ్రాయుధముచే గూలు పర్వతంబుల మాడ్కి నేలగూలిరి కఱకు బాణములు వానరులపై బడుటను గాంచిరేగాని మాయచే బ్రచ్ఛన్నుడై యున్న రావణపుత్రుని జూడ జాలకుండిరి ఇంద్రజిత్తు హనుమంతుని, సుగ్రీవుని, అంగదుని, గంధమాదనుని జాంబవంతుని, సుషేణుని, వేగదర్శిని, మైందుని, ద్వివిదుని, గవాక్షుని, గజుని, గోముఖుని, కేసరిని, హరిలోముని, విద్యుదంష్ట్రుని, సూర్యాననుని, జ్యోతిర్ముఖుని, దధిముఖుని, పావకాక్షుని, నలుని, కుముదుని మొదలుగాగల వానరోత్తములనందఱును బ్రహ్మాస్త్రమంత్రముచే నభిమంత్రితంబులగు ప్రాసములచేతను, శూలములచేతను, కఱకు బాణములచేతను, నొప్పించి తనివిజెందక రామలక్ష్మణులపై సూర్యకిరణ తుల్యములగు శరజాలవృష్టిని కుప్పంగూరలుగా వర్షించెను

ఇంద్రుజిత్తు తనపై బెక్కు బాణవర్షంబులు గురిపించుటనుజూచి జలవర్షంబుగా భావించి లక్ష్మణునితో నిట్లనియె తమ్ముడా! ఈ రాక్షసుడు బ్రహ్మాస్త్ర ప్రభావంబునంజేసి వానరసైన్యమును వధించి మనలను శరపరంపరలచే బాధించుచున్నాడు అమ్మహాత్ముడు బ్రహ్మదేవుని

వరప్రసాదంబుచేత నంతర్హితుండై బ్రహ్మాస్త్రముచే మనల నొవ్వజేయు చున్నాడు మన కన్నుల కగపడకున్నాడు ఇప్పుడా రాక్షసోత్తముని వధించుట కలవిగాదు భగవానుడగు బ్రహ్మదేవుని మహిమ యచింత్యమని తలంచెదను నీవు నాతో గూడ బాణపాతంబుల కోర్చియుండుము ఇంద్రజిత్తు శరజాలంబును గురిపించి సర్వదిశలను నీ రంధ్రముగా గప్పుచున్నాడు వానరోత్తములు నేల గూలుటవలన సైన్యమంతయు కాంతి రహితముగనున్నది మనమందఱు యుద్ధంబును మానుకొని మూర్ఛితులమై క్రోధోత్సాహములను గోల్పోయి నేలంబడి యుందము ఆతడదిజూచి సంతుష్టిజెంది జయలక్ష్మి లభించెనని సంతోషాంబుధిని నీదుచు లంకాపురంబునకు బోగలడు మనమిప్పుడింద్ర జిత్తు బాణంబులచే బీడింపబడినట్లు పడియుందమని రామలక్ష్మణులు మాటాడుకొని నేలంబడిరి రాక్షసశ్రేష్ఠుండది గాంచి సంతోషించి యుద్ధమధ్యంబున సింహనాదంబు గావించి లంకాపురంబు బ్రవేశించెను

## బ్రహ్మదేవుని గౌరవించుటకై రామలక్ష్మణులు ఇట్లభినయించుచున్నారని విభీషణుడు జెప్పుట

రామలక్ష్మణులు మూర్ఛితులై పడియుండుటను వానరసేనలు జూచి గుండెలదరి మూర్ఛనొందెను సుగ్రీవుడు, నీలుడు, అంగదుడు, జాంబవంతాదులు మూర్ఛితులై యుండుటవలన యేమియు దెలియంజాలక పోయిరి రాక్షసోత్తముడును, ధీశాలియునగు విభీషణుడు భయవిహ్వలులైయున్న వానరసైన్యమును దిలకించి యిట్లు చెప్పెను వనచరులారా! భయంబును వీడుడు, ఇంద్రజిద్బాణంబులచే గొట్టబడిన రామలక్ష్మణులు మూర్ఛలో మునింగియున్నారని మీరెంత మాత్రమును శోకింపవలదు వారు బ్రహ్మదేవుని గౌరవించుటకై యిట్లభినయించు చున్నారు మరేమియుగాదు బ్రహ్మదేవుడొసంగిన బ్రహ్మాస్త్రముచే రాజకుమారులు బద్ధులైయున్నారు ఇంతమాత్రమునకేల దుఃఖించెదరు? ధైర్యమవలంబింపుడని విభీషణుడు పలికెను

హనుమంతుడు బ్రహ్మాస్త్రమును గౌరవించుటకై ముహూర్తకాలము బద్ధుడై యుండ తదుపరి విభీషణుని జూచి రాక్షసోత్తమా! బాహుబలాఢ్యులగు నీ వానర వీరులందఱు వధియింపబడియున్నారు గదా! ఇందులోనెవ్వరు ప్రాణంబులను దాల్చియున్నారో! వారల నాశ్వాసింతము రమ్మనియెడు పలుకులకు విభీషణుడామోదించెను ఇరువురును రాత్రియందు కొఱవికట్టెలను చేతులయందు బట్టుకొని రణరంగమందు బడియున్న వానరవీరులను వెదుకదొడంగిరి కొందఱు తోకలు, చేతులు, తొడలు కాళ్లు, వ్రేళ్లు, కంఠములు తెగిపోయి నెత్తుటందోగుచున్న వానరులను దేదీప్యమానంబులగు యాయుధములను జూచిరి ఐదు ఘడియలలో నఱువది కోటుల వానరవీరులను ఇంద్రజిత్తు వధించినాడు వారిలో హతులై పడియున్న సుగ్రీవుని, అంగదుని, నీలుని, శరభుని, గంధమాదనుని, గవాక్షుని, సుషేణుని, వేగదర్శిని, ఆహుకుని, మైందుని నలుని, జ్యోతిర్ముఖుని, ద్వివిదుని, పనస్సుదాదిగాగల వానరోత్తములను రాక్షసోత్తముడును వానరోత్తముడును జూచిరి సముద్రసమానమగు వానర సేనయందు జాంబవంతునన్వేషించిరి

ఇవ్విధంబున వెదకుచు వృద్ధుడును, జ్ఞానవృద్ధుడును, బ్రహ్మపుత్రుడును, చల్లాఱునగ్నిహోత్రునివోలె నున్నవాడునగు జాంబవంతుని విభీషణుడు దిలకించి సమీపంబునకేగి యిట్లు బలుకరించెను పూజనీయుడవగు జాంబవంతుడా! ఈ నిశితబాణఘాతంబులచే నీ ప్రాణంబులు నశింపకున్నవిగదా! ప్రజాపతి సుతుండవగు నీకెంతటి గతిపట్టినదని విలపించుచున్న విభీషణుని వాక్యములాలకించి బ్రహ్మసుతుండిట్లనియె రాక్షసరాజా! విభీషణా! నీకంఠధ్వని నాలకించి నిన్ను గుర్తించితిని నిశితశరజాలంబులచే బీడింపబడుకతంబున నిన్ను కన్నులతో జూడజాలకున్నాను రాక్షసోత్తమా! అంజనానందనుడు జీవించియున్నాడా? త్వరితంబుగ దెలుపుమనియెడు జాంబవంతుని వచనంబులాలకించి విభీషణుడిట్లు బదులు పలికెను బ్రహ్మపుత్రా! రామలక్ష్మణులను విడిచి హనుమంతునే యడుగుచున్నావేల? వాయుసుతునిపై గనబరచిన గాఢానురాగము సుగ్రీవునియందుగాని, అంగదుని యందుగాని, రామునియందుగాని

జూపవైతివేల? దీనికి కారణమేమని విభీషణుడు జాంబవంతుని ప్రశ్నించెను ఆ పలుకులాలకించి జాంబవంతుడిట్లు జవాబు చెప్పెను విభీషణా! అందఱిని విడిచి మారుతాత్మజునే ముక్కువతో నడిగినందులకు కారణమెఱిగించెద నాలకింపుము ఆ వీరాధివీరుండొకడు జీవించియున్నచో వానరసైన్యమంతయు నశించినను మనకు భయుము లేదు అంజనానందనుండొకడు హతంబైనచో మనమెల్లరము జీవించియున్నను జచ్చిన వారలమే నాయనా! వాయుదేవునకు సమానుడైన వాయుసుతుండు జీవంబులతో నుండునేని మాకుగూడ బ్రతుకుపై నాశ గలు(గునని జాంబవంతుడు పలుకు చుండగనే హనుమంతుడాజ్ఞాన వృద్ధుని చేరంజని శాస్త్రోక్త నియుమంబున పాదములను బట్టుకొని నమస్కరించి పలుకరించెను పవనాత్మజుని కంఠధ్వని నాలకించిన తోడనే ప్రజాపతి సుతునకు బునర్జన్మము నొందినట్లయ్యెను అప్పుడు జాంబవంతుడు హనుమంతుని జూచి పవన తనయా! ఇటురమ్ము ఈ వానరులకిపుడు రక్షకుడెవ్వడును లేడు నీవు పరాక్రమమందు సంపూర్ణుడవు కాన నీ వనచరుల రక్షించు భారమునీయదే సుమా! నీ బలపరాక్రమమును జూపవలసిన కాలము వచ్చినది మరెవ్వరును నిన్ను బోలిన పరాక్రమవంతులిపుడు లేరు ఋక్షవానరసైన్యములకు సంతోషము గలుగజేయు బాధ్యత నీదే మూర్ఛలో మునింగియున్న రామలక్ష్మణులకు సుఖంబొనగూర్చుము

## ఓషధి పర్వతంబును గొనితెచ్చి వానరులను రక్షింపుమని జాంబవంతుడు హనుమంతునితో జెప్పుట

సమీరనందనా! నీవు సముద్రము మీదుగా పర్వతోత్తమంబగు హిమవత్పర్వతంబునకు బొమ్ము అచ్చట నత్యున్నతంబగు ఋషభమును కాంచన శిఖరంబును కైలాస శిఖరంబునుజూడగలవు ఆ శిఖరంబుల రెండింటి నడుమ దేదీప్యమానమై సమస్తౌషధులతో నిండియున్న ఓషధిపర్వతంబను శిఖరంబునొకదానిని జూడగలవు ఆ పర్వత శిఖరంబున బుట్టి దేదీప్యమానమై దశదిశల వెలుగొందెడు విశల్యకరణి, మృత సంజీవని,

సౌవర్ణకరణి సంధానకరణియునను నాలుగు దివ్యౌషధులను నయనోత్సవముగ జూచి నీ వత్యంత త్వరితంబుగ గొనిరమ్ము వానరులందఱిని బ్రదికించి వారల కూఱట గలిగింపుము నీకు శుభమగుగాక! పోయి రమ్మని జాంబవంతుడు చెప్పెను

జాంబవంతుని వాక్యము లాలకించి హనుమంతుడు మహార్ణవంబు కరణి నుప్పొంగి పర్వత శిఖరంబుపైకి లంఘించి పాదఘాతంబుచే బర్వతంబును బాధించుచు రెండవ పర్వతమోయన్నట్లు జూపట్టుచుండెను ఆ త్రికూటపర్వతము హనుమంతుని యౌద్ధత్యమునకు నిలువంజాలక శిఖరంబులు చూర్ణములయ్యెను విఱిగిన వృక్షములతోడను, చూర్ణములైన శిలలతోడను హనుమద్వేగంబునకు గడగడవడంకుచున్న పర్వతమందు వానరులు నిలువంజాలరైరి పవనాత్మజుడు లంకాపురంబును సముద్రసహితంబుగా భూవలయంబును జలింపజేసి యక్షగంధర్వకిన్నరులు గడగడలాడునట్లు దేహమును బెంచెను పాదంబులచే బర్వతంబును ద్రొక్కుచు భూమ్యాకాశంబులు బ్రద్ధలగునట్లు భయంకరముగా గర్జించెను రాక్షసులాభీకరంబైన గర్జననాలకించి నిశ్చేష్టులైయుండిరి

హనుమంతుడప్పుడు శ్రీరామచంద్రునకు నమస్కరించి రామకార్యార్థమై భయంకర వేగుండై సర్పమునుబోలిన వాలంబునెత్తి వీపును వంచి చెవులను ముడుచుకొని బడబాముఖమువంటి వక్త్రంబుదెఱచి యాకాశంబున కెగిరెను అతని వేగంబునకు వృక్షసమూహములు, పర్వతంబులు, బహుదూరంబుగాబోయిపడినవి వాయుసుతుండు హిమవత్పర్వతంబునకు బోవుచు పర్వతములను, వనములను, సరస్సులను, నదులను, చెఱువులను, పట్టణంబులను సమృద్ధములగు జనపదంబులను జూచుచు శ్రమయించు కేనియు లేక నత్యంత వేగంబున బోయి హిమవత్పర్వతంబు జేరి దేవతలచేతను, మహర్షులచేతను, బూజింపబడుచున్న పవిత్రాశ్రమములను బ్రహ్మకోశ తీర్థమును, కైలాస పర్వతమును అమరేంద్రుడు తపంబొనరించిన చోటును, రుద్రబాణస్థానమును, హయగ్రీవక్షేత్రమును, బ్రహ్మకపాలమును, యమకింకిరులు విశ్రమార్థము నిల్చియున్న స్థలమును, ఇంద్రునకు

పితామహుండు వజ్రమునొసంగిన స్థానంబును, కుబేరస్థానంబును, సూర్యుని బంధనక్షేత్రమును, బ్రహ్మాసనంబును, శివధను క్షేత్రమును, భూమినుండి పాతాళ ప్రవేశరంధ్రమును ఋషభపర్వతంబును, కాంచనశృంగమును, రాత్రులందు వెలుగొందుచున్న సర్వోషధి పర్వతంబును కన్నులలరగాంచి యాశ్చర్య నిమగ్నుడై పర్వతంబు నంతయు విహరించి యోషధులనన్వేషించెను ఆ పర్వతోత్తముసందున్న దివ్యౌషదులు హనుమంతుడు తమ్ముదీసికొని పోవునని యంతర్ధానంబు నొందియుండెను అమ్మహాత్ముడు వెదకి వెదకి వేసారి క్రోధావేశుడై పెద్ద బంకె వేసి యోషధిపర్వతమును జూచి యిట్లనియె

ఓషధిపర్వతమా! రాముని యందుగూడ నిర్దయంను బూనియున్నావే! నీ నిశ్చయమిదియేనా! నా బాహుబలమ్ముచేత నిన్ను బెల్లగించి చూర్ణముగావించెద చూడుమని పర్వత శిఖరంబును బెల్లగించి గరుత్మంతుని వోలె యాకాశంబున కెగిరి సూర్యుని సన్నిధిలో రెండవ సూర్యుని భంగి వెలుగొందెను అంజనానందనుండా పర్వతంబును కరంబునందాల్చి కదలి వచ్చుచుండగా సుదర్శనంబును ధరించి యున్న మహావిష్ణువువోలె బ్రకాశించుచుండెను పర్వతంబును గొనివచ్చుచున్న పవనతనయుని జూచి వానరులందఱు మోదార్ణవమునదేలుచు గర్జించిరి హనుమంతుడు తనకార్యసిద్ధినెఱుగ దెల్పుచు పులకితగాత్రుడై సింహగర్జన మొనరించెను లంకానివాసులగు రాక్షసులందఱు భయపడి గట్టిగా నఱచిరి సమీర కుమారుడు త్రికూట పర్వతంబున నివసించియున్న వానర సేనామధ్య మందోషధి పర్వతముతో గూడ వ్రాలి వానరోత్తములకు నమస్కరించి విభీషణుని కౌగలించుకొనెను ఆ దివ్యౌషధుల గంధము నాఘ్రాణించిన తోడనే బాణ పీడితులగు రామలక్ష్మణులును, వానర వీరులును, సుఖంబున లేచిరి బవరంబున బరిమార్పబడిన వానరులందఱు నిదుర నుండి మేల్కొన్న వారి మాడ్కి పైకిలేచిరి మొదటి నుండియు యుద్ధమందు వానరులచే మరణించిన రాక్షసులను రావణునాజ్ఞచే నెవ్వరికిని దెలియకుండ సముద్రమందు బడవేయంబడిరి హనుమంతుడు నాయోషధి పర్వతమ్మును గొనిపోయి హిమత్పర్వతంబు జేర్చి మరల రాముని సన్నిధికి జేరుకొనెను

## లంకాపురంబును దహించి రమ్మని సుగ్రీవుడు వానరుల కాజ్ఞ నొసంగుట

వానర రాజేంద్రుడగు సుగ్రీవుడు పవన తనయుని జూచి యా సమయంబున జేయవలసిన కార్యంబెఱిగించుచు నిట్లు జెప్పెను మారుతాత్మజా! తమ్ముడగు కుంభకర్ణుడును, కుమారులును యుద్ధమందు నిహతులగుటంజేసి రావణుండిప్పుడు రణంబునకు రాడు మన వానరవీరులలో వేగవంతులగు బలశాలురందఱు దివిటీలను జేకొని త్వరితంబుగ లంకాపురంబుకు బోండని వానరేంద్రుడాజ్ఞాపించుచు హనుమంతునితో జెప్పెను వానరోత్తములారాత్రియందే సుగ్రీవునాజ్ఞను శిరంబునందాల్చి దివిటీలు చేతంబూని లంకాపురాభిముఖులై పోయి రాక్షసులను దఱుమగొట్టిరి పురద్వారంబుల యందు కావలిగాచియున్న రాక్షసులందఱును భయపడి పరుగిడిరి వానరులది జూచి సంతసించి తమకెదురు లేనందున పురద్వారములందును, కోటబురుజులందును, రాజవీధులయందును ప్రాసాదములందును నిప్పుబెట్టిరి అప్పుడా యగ్నిహోత్రము వేలకొలది నిశాచరుల నికేతనంబులను, పర్వతములను బోలియున్న మేడలను, మేడలందున్న అగరుహరిచందనంబులను సుందరములైయున్న ముత్యాలను, వజ్రములను, పవడములను, పట్టుచీరలను, శాలువలను, కంబళములను, సువర్ణభూషణములను, ఆయుధములను, అశ్వములను, కవచములను, కంఠభూషణములను, గజాశ్వముల కవచములను, ఖడ్గములను, ధనుస్సులను, బాణంబులను, తోమరంబులను, అంకుశములను, శక్తులు వింజామరులను, పులిచర్మములను, సుగంధాది ద్రవ్యములను దహించివైచెను

హేమచిత్ర తనుత్రాణములు దాల్చినవారలు, కుసుమ దామములను, దివ్యాంబరములను దాల్చిన వారలు, మద్య పానమత్తులైయున్న వారలు, ప్రియురాండ్ర చీరలను బట్టుకొని రతిలోలురైయున్న వారలు, మాంసాదులను భక్షించుచు సురాదులను గ్రోలుచున్న వారలు మృదుల తల్పములందు ప్రియురాండ్ర తోడంబరుండి యున్నవారలు, భయపడి బిడ్డల నెత్తుకొని దశదిశలకు బరుగిడుచున్న

వారలు, లక్షలాది రాక్షసులగ్నిహోత్రమునబడి దగ్ధమై పోయిరి సౌందర్యమెంగబోయు సౌధరాజములెన్నియో మంటగలిసెను మంటలెగయుచున్న లంకాపురద్వారంబులు మెఱపులతో గూడిన మొయిలులవోలె ప్రకాశించినవి దేవేంద్రుని వజ్రాయుధముచే గొట్టబడిన మహాపర్వతశిఖరంబుల మాడ్కి నేలగూలుచున్న గృహంబులలోని స్త్రీలు, విమానములందు నిదురించుచున్న స్త్రీలు తమ యాభరణములన్నిటిని దీసిపాఱవైచి హా హా కారంబులు గావించిరి ఆ యగ్నిజ్వాలలవు కొనుచుండ భయమొంది మావటీలు యేనుగులను, అశ్వరక్షకులు గుఱ్ఱములను కట్లుద్రెంచి విడిచిపెట్టిరి ఆ గజతురంగములు భయసంభ్రమములచే బరుగెత్తుచుండ ప్రళయకాల తరంగముల యుద్ధతికోర్వజాలని మకరంబులు గల మహార్ణవము కరణి జూపట్టుచుండెను లంకాపురంబు దహింపబడుచుండగా సముద్రమంతయు నెఱ్ఱని జలంబుగలదిగా వెలుగొందుచుండెను స్త్రీలొనరించెడు హా హా కారంబులు పదియోజనములదనుక వినబడు చుండెను వానరుల సంతోషధ్వనులు, నిశాచరుల రోదనధ్వనులు దశదిశలయందు ప్రతిధ్వనించుచుండెను

అప్పుడు రామలక్ష్మణులుత్తమ ధనుస్సులను రెండింటిని గైకొని నారిసారించిరి అమ్మహాధ్వనితుములంబై రాక్షసులకు భయంబు జేకూర్చెను సంక్రుద్ధుడై ధనుస్సును ధ్వనింప జేయుచున్న రాముడు పరమేశ్వరుని మాడ్కి వెలుగొందుచుండెను వృక్షచరుల కోలాహలంబును రాక్షసుల రోదన ధ్వనిని రాముని జ్యానాదమణచి వేసినది రాముడు ప్రయోగించిన బాణంబులచే కైలాస శిఖరంబున కెనయైన లంకాపురద్వారంబు బ్రద్ధలై నేలగూలినది అదిజూచి రాత్రించరులు యుద్ధ సన్నాహము గావించి సింహనాదము లొనరించిరి రాక్షసుల సింహనాదమ్ములాలకించి సుగ్రీవుడు వానరులతో నిట్లులనియె వానరోత్తములారా! మీరందఱు బోయి రావణాంత పురంబునకు జేరువలోనున్న ద్వారంబుజేరి యుద్ధంబు జేయుడు రాజాజ్ఞనుల్లంఘించు వానిని వధింపుడు పోయిరండని వానరేంద్రు డాజ్ఞాపించిన తోడనే వృక్షచరులు మండుచున్న దివిటీలను కరంబులనుదాల్చి పోయి

ద్వారంబున నిలువంబడిరి రావణుండది గాంచి కోపావేశంబున విజృంభించి కుంభకర్ణుని కుమారులగు కుంభుని, నికుంభుని యుద్ధమునకు బంపెను యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రజంఘుడు, కంపనుండును వారలు కుంభుని కుంభలతో గూడ బోయిరి ఆ బలశాలురగు రాక్షసులకు రావణుడిట్లని యాజ్ఞాపించెను రాక్షసులారా! మీరలతిత్వరితంబుగ బోయి జయలక్ష్మిని వరించి రండు పోయిరండనెను

## వానర రాక్షసుల యుద్ధము

రాక్షసులందఱు రావణు నాజ్ఞవేంరకు యుద్ధోత్సాహులై బయలుదేరి సింహనాదము లొనరించిరి వానరుల చేతులలో వెలుగుచున్న దివిటీల కాంతులకు వానర రాక్షససేనలు మిగుల ప్రకాశించుచుండెను సర్వాయుధములను దాల్చి వచ్చుచున్న భయంకరమైన రాక్షససేనలను వానరసేనలు జూచి గర్జింపుచు కదన భూమికి గదలిపోయెను రాక్షస సైన్యమంతయు నగ్నిలో దుముకబోయెడు శలభంబుల మాడ్కి వానరసైన్యములో జొరబడెను వృక్షచరులది జూచి కోపోద్రేకులై పిడికిళ్ల తోడను, పర్వతముల తోడను, రాక్షసులను ప్రహరించిరి రాక్షసులు కరవాలంబులచే వానరుల మస్తకంబులను ఖండించిరి వానరోత్తములు రాక్షసోత్తములను గొందఱిని బరిమార్చిరి ఉభయసేనలలో నొకరితో నొకరు వీరాలాపము లాడు కొనదొడంగిరి ఉభయసైన్యములకును ఘోర యుద్ధము ప్రారంభమై రాక్షసులు వానరులను, వానరులు రాక్షసులను వధించిరి కట్టువస్త్రములు, కవచములు, తలవెంట్రుకలు వీడి భగ్నమై కలతనొందియున్న రాక్షసులను వనచరులు చుట్టుముట్టిరి అప్పుడంగదుడు యుద్ధోత్సాహుడై వీరుడగు కంపను నెదుర్కొనెను ఆకంపనుడమితోద్రేకుడై రమ్మురమ్మని పిల్చిగదచే గొట్టెను ఆయంగదుడా దెబ్బచేత మూర్ఛిల్లి కొంతతడవునకు దేఱుకొని పర్వతంబు నొకదానిని బెకలించి కంపనుని శిరంబుపై గొట్టెను వెంటనే రాక్షసుడసువులను గోల్పోయెను శోణితాక్షుడిది జూచి కోపపరవశుండై

వాలిసుతుని మీదికి వచ్చి నిశిత శరపరంపరలచే నొప్పించెను శోణితాక్షుడు ప్రయోగించిన మంగళకత్తులవంటి బాణంబులను, ధనుస్సును, రథంబును నుగ్గునుగ్గుగా నొనరించెను రాక్షసుండది జూచి క్రోధావేశుడై వాలును, డాలును, గైకొని తారాపథంబున కెగిసెను అంగదుడమితోత్సాహముతో నాకాశంబునకుద్గమించి శోణితాక్షుని బట్టుకొని యాతని చేతనున్న మహాకరవాలంబును బెఱికికొని సింహనాదంబు గావించి భుజంబును ఖండించి యితర రాక్షసుల మీదికి బోయెను శోణితాక్షుడు గదాధరుండై గిఱగిఱం ద్రిప్పుచు వాలిసుతుని వెంబడించెను

యూపాక్షుడంతలో క్రుద్ధుడై ప్రజంఘుడు తోడ్పడ నంగదుని మీదికి రథంబును దోలించెను మైందుడు, ద్వివిదుడు, అంగదుని రక్షణార్థమై నిలువంబడిరి అంగద ద్వివిద మైందులు ప్రజంఘ యూపాక్షశోణితాక్షులతో సమరంబునకు గడంగిరి అప్పుడు రోమ హర్షణంబగు ఘోర యుద్ధము జరిగెను వానరులు రాక్షసులపై వృక్షంబులను బడవేయగా ప్రజంఘుడు, యూపాక్షుడు కరవాలంబులచేత ఖండించిరి ప్రజంఘుడమితోద్రేకుడై వాలి కుమారుని మీదికి బోయెను ఆ యంగదుడు కరవాలంబును గైకొని రాక్షసుని శిరంబు నేలంగూల్చెను మైందుడు యూపాక్షుని మట్టుబెట్టెను కుంభుడది జూచి కఱకు బాణంబులచే ద్వివిదుని గొట్టెను ఆ దెబ్బకాగజాలక ద్వివిదుడు విహ్వలాంగుడై నేలబడెను మైందుడు తన తమ్ముడు రణభంగుడగుటం జూచి పెనుశిలను గైకొని కుంభుని మీదికేగి యా శిలను వానిపైకి విసరెను రాత్రించరుడా శిలను వ్రయ్యలు జేసెను కుంభుడు సర్పతుల్యమగు బాణంబొండు సంధించి మైందుని వక్షస్థలమందు నాటంజేసెను ఆ దెబ్బచేత వానరోత్తముడు మూర్ఛిల్లెను మేనమామ లిరువురును నేలబడుటం జూచి వాలిసుతుండమితోద్రేకుండై కుంభుని మీదికి బోయెను అంగదుడు తనపైకి వచ్చుటం జూచి కఱకు బాణంబులచేతను, అయోమయంబులగు బాణంబులచేతను కుంభుడు బ్రహరించెను ఆ శరఘాతంబుల కిసుమంతేనియు జలింపక రాత్రించరునిపై వృక్షచరుడనేక శిలలను క్షితిజములను గురిపించెను కుంభకర్ణుని కుమారుడదిజూచి, రాళ్లను, వృక్షములను ఖండించి వైచి అంగదునిపై మర్మభేదనంబులగు

కఱకు బాణంబులు ప్రయోగించెను అంగదుడా బాణఘాతంబులచే బీడింపబడి గట్టిగా నఱచి మూర్ఛిల్లెను వానరులీవృత్తాంతమును రామునికి దెలిపిరి ఆ రఘువీరుడు తక్షణమే జాంబవంతాదులను బంపెను అవ్వానర వీరులు రాముసాజ్ఞ శిరంబునందాల్చి క్రోధావేశులై ధనుష్పాణియగు కుంభుని మీదికి బెనుశిలలను, వృక్షములను గైకొని బయలుదేరిపోయిరి తనమీదికి వచ్చుచున్న వానరులను ముందంజ వేయనీయక బాణవర్షమును గురిపించెను సుగ్రీవుడది జూచి మహాగజంబు మీదికి సింహంబు పరుగిడి పోవునట్లు కుంభునిమీదికి బోయి వృక్షములెన్నింటినో బెకలించి కుంభకర్ణ కుమారుని గొట్టెను ఆ వృక్షములన్నిటిని తీక్షణ బాణములచే నాతడు భేదించెను సుగ్రీవుడీసుమంతేనియు వ్యథనొందక నాతని సన్నిధికేగి ధనుస్సును బట్టి విఱిచి రథంబు మీదికుఱికి కొమ్మువిఱిగిన గజంబువాడ్కి నున్న కుంభుని జూచి కుంభుడా! నీ పరాక్రమమును బాణవేగంబును రావణుని పరాక్రమాదులను బోలియున్నది

## సుగ్రీవుడు కుంభుని బరిమార్చుట

ప్రహ్లాదుడు, బలిచక్రవర్తి, దేవేంద్రాదులను బోలియున్న నీ పరాక్రమమును జూడమిగుల నాశ్చర్యముగాను యున్న నీ పరాక్రమమును జూడ మిగుల నాశ్చర్యము గానున్నది తండ్రిని బోలి జన్మించి యున్నాడవు ఏది! నీ పరాక్రమంబును నాపై గనబఱపుము నీ పెద్దతండ్రియు, నీ తండ్రియు దేవాసురులను జయించియున్నారు గదా! ధనుర్విద్యయందు ఇంద్రజిత్తునను, బలపరాక్రమంబున రావణుని బోలియున్నావు రాక్షసశ్రేష్ఠుడవు సురేంద్రునకును, శంబరాసురునకుంబోలె నీకును, నాకును జరుగ బోవు మహాయుద్ధంబును సర్వభూతంబు లిపుడు చూడగలవు నీవు భయంకరమైన వానరవీరుల నెందఱినో బడగొట్టినావు పెక్కండ్రతో బోరాడి యలసియున్నాడవని నిన్ను వధింపక విడిచితిని కొంత యలసట దీర్చుకొనుము అలసియున్న వానిని సుగ్రీవుడు చంపెననియెడు యపవాదము నాకెందుకు? నీబడలిక దీరిన పిమ్మట నా బలంబు జూడుమనియెడు సుగ్రీవుని వాక్యము లాలకించి కుంభుడమితోద్రేకుడై

వానరేంద్రుని రెండు కరంబులను బట్టుకొనెను మత్తకరీంద్రముల మాడ్కి వారిరువురును బోరాడిరి వక్త్రంబుల నుండి ధూమముతో గూడియున్న యగ్నిజ్వాలలు బయలు వెడలుచుండెను సుగ్రీవకుంభుల పాదఘాతంబులచే భూమి లోతుగా నణిగిపోయెను సుగ్రీవుడా సమయంబున కుంభునెత్తి పారావారంబున బడవైచెను అప్పుడమ్మహా సముద్రముప్పొంగి యంతటను బ్రవహించెను కుంభుడాక్షణమే యెగిరి వచ్చి సుగ్రీవుని రొమ్ముపై బొడిచెను వానరాధీశుడు సరకుజేయుడయ్యెను వజ్రసమానమగు పిడికిలి నలవరించి కుంభుని వక్షస్థలంబున బొడిచెను ఆ ముష్టిఘాతంబుచే చల్లారిన నిప్పువోలె కుంభుడు విగతజీవుండై నేల గూలెను యుద్ధభూమి యందు కుంభకర్ణుని కుమారుని దేహము సూర్యుని బోలి ప్రకాశించెను సుగ్రీవునిచే వధింపబడిన రాక్షసుడు నేలగూలిన తోడనే భూమి గడగడ వడంకెను రాక్షసులు భయకంపితులైరి

## హనుమంతుడు నికుంభుని హతమార్చుట

తనయన్నయగు కుంభుడు సుగ్రీవునిచే హతుండగుట కెంతయు క్రుద్ధుడై నికుంభుడు వానరేశ్వరుని జూచి పరిఘంబును గైకొని గిఱగిఱం ద్రిప్పి సింహనాదంబు గావించెను ఆ పరిఘంబు పొగలేని యగ్ని హోత్రము భంగి బ్రజ్వరిల్లెను ఆ సమయంబున వానర రాక్షసులు భయకంపితులై కదలమెదలకుండిరి హనుమంతుడొకడు మాత్రమే తన రొమ్మును జూపుచు నికుంభు నెదుర్కొనెను సూర్యబింబము వోలె వెలుగొందుచున్న పరిఘంబునెత్తి హనుమంతుని వక్షస్థలంబుపై వైచెను వజ్రకఠినంబైన వాయుసుతుని రొమ్మునకు దగిలిన పరిఘంబు నూఱు వ్రయ్యలై నూఱుకొఱవులకైవడి వెలుగొందుచు నేలబడెను భూకంపము చేత పర్వతంబు చలించు మాడ్కి మారుతాత్మజుడు చలించెను వానరోత్తముడమిత క్రోధోద్దీపితుడై పిడికిలి నలవరించి నికుంభుని రొమ్ముపై బొడిచెను ఆ పిడికిలి దెబ్బకా రక్కసుని వక్షంబున రక్త మొలికి జ్వాలబుట్టినది నికుంభుడు మూర్ఛిల్లి కొంత తడవునకు దేఱుకొని పవన తనయుని బట్టుకొని పైకెత్తెను రాక్షసులమితానందమొందిరి

వాయుసుతుండు వజ్రసమానంబగు తన ముష్టి ఘాతంబుచే బొడిచెను రాక్షసుడు నేలకొఱిగెను వానరోత్తముండాకాశంబున కెగసి నికుంభుని బొమ్ముపైకి దుమికి కంఠంబు బట్టి త్రిప్పి విఱిచెను ఆ రాక్షసుడు భయంకరముగ నఱచుచు ప్రాణంబులు గోలుపోయెను వానరులు పరమ సంతుష్టి నొందిరి

## మకరాక్షుడు రామునిచే గూలుట

రావణుడు కుంభ నికుంభులు వధింపబడిరనుట కెంతయు వగచి క్రోధావేశుడై నిప్పువోలె మండిపడెను క్రోధశోకంబులు బెనంగొన ఖరుని కుమారుడైన మకరాక్షుని జూచి కుమారా! నా యాజ్ఞను శిరంబునందాల్చి సేనాసమేతుడవై పోయి రామలక్ష్మణులను వానరులను బరిమార్చిరమ్ము! పోయి రమ్మని యాజ్ఞాపించెను మకరాక్షుడందులకియ్యకొని రావణునకు ప్రదక్షిణ నమస్కారంబులొనరించి సమీపములోనున్న సేనాధిపతిని జూచి యిట్లులనియె సేనాధిపతీ త్వరితంబుగ రథంబును సైన్యమును సిద్ధపఱపుమని యాజ్ఞాపించెను సేనానాయకుడు మకరాక్షుని పలుకులాలకించి రథంబును, సైన్యమును గొనితెచ్చెను ఖరుని కుమారుడు రథంబునకు ప్రదక్షిణ మొనరించి రథారూఢుడై త్వరితంబుగ రథంబును దోలుమని సూతునకాజ్ఞ నొసంగెను రాక్షససేనలను జూచి రాక్షసులారా! మీరందఱు నాముందు నిలువంబడి చక్కగా సమరంబు గావింపుడు రామలక్ష్మణులను వధించి రమ్మని రాక్షసేంద్రుడు నాకనుజ్ఞ నొసంగి యున్నాడు ఆ రామలక్ష్మణులను, సుగ్రీవాది వానరులను ఇప్పుడే నా బాణాగ్నిచే యెండుకట్టెను నిప్పు దహించునట్లు దగ్ధము గావించెదను మీరెల్లరు జాగరూకులై బయలుదేరుడని మకరాక్షుడు రాక్షసులకు జెప్పెను రాక్షసులాతని యానతిమేరకు వివిధాయుధంబులు జేర్చి ధరించి గర్జించుచు యుద్ధమునకు బయలుదేరి భేరీ, శంఖాదులను నూదుచు సింహనాదంబులను, భుజస్ఫాలనంబులను గావించిరి

అప్పుడు మకరాక్షుని సారథి చేతిలోని మునికోలయు ధ్వజంబును దటాలున నేలబడెను రథాశ్వంబులు పాదంబులు దొట్రుపడ దీనంబులై

కన్నీరుం గార్చుచుం బోయెనని దుర్బుద్ధియగు రాక్షసుడు బయలుదేఱునప్పుడు వాయువు ధూళిచే గ్రమ్మబడి భయంకరముగ వీచెను రాక్షసులాదుర్నిమిత్తంబులను లెక్కింపక రామలక్ష్మణులను వధించెదమని గర్జించుచు బోయి యుద్ధమునకు సన్నద్ధులై నిలువంబడిరి వానర రాక్షసులకు దేవదానవులకుంబోలె ఘోర సంగ్రామము జరిగెను వృక్షశూలంబుల చేతను, శిలాపరిఘంబులచేతను, నొండొరులు మర్దించుకొనిరి రాక్షసులు ఈటెలచేతను, ఖడ్గములచేతను, పాశముద్గరాదులచేతను వానరులతో యుద్ధంబు గావించిరి మకరాక్షుని బాణఘాతంబుల కాగంజాలక వృక్షచరులు భయపడి పారిపోయిరి వానరులు పరుగెత్తుటంజూచి రాక్షసులు సంతోషాంబుధిని దేలుచు సింహనాదములొనరించుచు దఱుమంబూనిరి రాముడది గాంచి రాత్రించరులను బాణవర్షంబుచే వారించెను మకరాక్షుడది జూచి మండిపడి రామునితో నిట్లనియె

రామా! నిలునిలుము నీకిదే ద్వంద్వయుద్ధం బొసంగెదను నా కఱకుబాణంబులచే నీ ప్రాణంబులు బలిగొనియెద దండకారణ్యమందొకప్పుడు నీవు నా తండ్రిని బరిమార్చియున్నావు అందువలన నిన్ను జూచిన తోడనే నా క్రోధాగ్ని మఱింత రగుల్కొనుచున్నది దురాత్మా! ఆకాలమందు దండకార్యణములో నిన్ను జూడజాలక పోయితినే యని నాదేహము మఱింత మండిపోవుచున్నది నాభాగ్యవశంబు చేత నీవిచ్చట నాకంట బడితివి ఆకొన్న మృగంబు మఱొండు మృగంబు కొఱకు వేచియున్నట్లు నీ కొఱకిన్నాళ్లు గాచియుంటిని రామా! పెక్కు మాటలేల? నిన్నిదే యమసదనంబున కనిపెద సమస్త లోకంబులలోనుండు వారందఱు మనలను యుద్ధభూమియందు జూచెదరు గాక! దివ్యాస్త్రముల చేతగాని, గదలచేతగాని, బాహువులచేతగాని, యుద్ధంబు గావింపుము రమ్మని మకరాక్షుడు రామునితో జెప్పెను అధికముగా బ్రేలుచున్న యమ్మకరాక్షుని దశరథరాముడు జూచి నవ్వుచు రాక్షసుడా! వ్యర్థముగ బ్రేలెదవేల? బవరంబున పౌరుషంబు జూపుము నేనొక్కడనే దండకారణ్యమందు పదునాల్గువేల రాక్షసులను నీ తండ్రియగు ఖరుని, దూషణుని వధించితిని ఇప్పుడు నీ రక్తమాంసంబులు కాకులు, గ్రద్ధలు, నక్కలు తనివిదీర

భుజియింపగలవు రారమ్మని రాముడు మకరాక్షునితో జెప్పెను మకరాక్షుడు రాముని వాక్యములాలకించి క్రోధోద్దీపితుడై రామునిపై శరపరంపరలను బ్రయోగించెను రాముడా బాణజాలంబును దుత్తునియలుగా ఖండించి వైచెను ఇరువురును భయంకరమైన యుద్ధంబు గావించిరి దేవదానవులను, కిన్నర మహోరగులును, మిగులనాశ్చర్యమొందుచు వీరి యుద్ధంబుజూడ నువ్విళ్లూరుచు నాకాశంబునంజేరిరి రామ మకరాక్షులొండొరులపై బాణంబులను బ్రయోగించుకొనిరి దిక్కులు, విదిక్కులన్నియు బాణమయంబు లయ్యెను

ఆ సమయంబెఱింగి రాముడు క్రుద్ధుడై మకరాక్షుని ధనస్సును ఖండించి సారథిని, రథంబును, రథ్యములను నేల బడగొట్టెను ఖరుని కుమారుడప్పుడు చేయునది లేక విరథుడై నేలకుఱికి శూలంబునుధరించి గిఱ గిఱంద్రిప్పి రామునిపై వైచెను మండుచు తనపైకి వచ్చుచున్న శూలమును రాముడు మూడు బాణంబులచే ఛేదించెను అమ్మహా శూలంబు ముక్కలై మండుచున్న కొఱవికట్టె వోలె నేలబడెను మకరాక్షుడది జూచి ముష్టినెత్తి రామునిపైకి బోయెను పిడికిలి నలవరించుకొని తనపైకి వచ్చుచున్న మకరాక్షుని జూచి యాగ్నేయాస్త్రంబును సంధించి ప్రయోగించెను అమ్మహాస్త్రంబు రాక్షసుని వక్షస్థలంబునం జొచ్చి నేలబడి ప్రాణంబులు విడిచెను రాక్షసులిది జూచి లంకాపురంబునకు బాఱిపోయిరి దేవతలు దశరథ పుత్రుని కొనియాడుచు బర్వతము వోలె నేలబడియున్న మకరాక్షుని జూచి సంతోషాంబుధిని దేలియాడిరి

## ఇంద్రజిత్తు అదృశ్యుడై మాయాయుద్ధ మొనరించుట

మకరాక్షుని మరణవార్త నాలకించి రావణుడమిత క్రోధావేశుడై పటపటపండ్లు గొఱుకుచు దనపుత్రుడగు యింద్రజిత్తును బిల్చి యుద్ధంబునకు బొమ్మని యాజ్ఞాపించెను ఇంద్రజిత్తు తండ్రి యానతిని శిరంబునందాల్చి యాగకార్యములొనరించెడు ప్రదేశమునకేగి అగ్నిహోత్రమందు యథావిధిని హోమములు జేసెను నల్లమేక కంఠమును

ఛేదించి యాగంబొనరించి యంతర్ధానశక్తి నొందియున్న రథంబు నారోహించెను అట్లు రథారూఢుడై బ్రహ్మాస్త్రముచే సురక్షితుడై యన్యుల కలవిగాకుండెను మంత్రములచే నగ్నియందు హోమంబు గావించి యంతర్ధానమొంది లంకాపురంబు వెలువడి యిట్లులనియె కపటమునివేషధారులగు రామలక్ష్మణులను వధించి తెచ్చి నాతండ్రి కొసంగెదను వానరులందఱిని రూపుమాపి మాతండ్రికి బ్రీతి చేకూర్చెదనని చెప్పి యింద్రజిత్తు మాయమయ్యెను అప్పుడు వానరసేనా మధ్యమందున్న రామలక్ష్మణులను రాక్షస రాజేంద్రుని సుతుండుజూచి విల్లు మోపెట్టి ప్రావృట్కాలమందు పయోధరములెడ తెగక వర్షించు విధంబున వారిపై బాణవర్షంబును గురిపించెను అదృశ్యుడై తమపై బ్రయోగించుచున్న బాణములన్నిటిని రామలక్ష్మణులు ఖండించి సూర్య సమానంబులగు దివ్యాస్త్రము లెన్నింటిని బ్రయోగించినను ప్రయోజనంబుగనుపట్టదయ్యెను తుదకు యింద్రజిత్తును గుర్తింప జాలరైరి పురుషోత్తములగు రామ లక్ష్మణులు వర్షధారలచే గొట్టబడు పర్వతంబుల మాడ్కి జలింపకుండిరి ఇంద్రజిత్తు ప్రయోగించుచున్న బాణంబులను దశరథసుతులు ఖండించి వైచిరి మాయావరబలంబు చేత రథంబు నటునిటుద్రిప్పుచు రాక్షసోత్తముడు రణంబొనరించెను కాని యెవ్వరికిని గానుపింపదయ్యెను రావణుని కుమారునిచే గూల్చబడిన వానరులెందఱో తండోపతండములుగా బడిరి లక్ష్మణుడది జూచి కోపపరవశుండై నేనిప్పుడే బ్రహ్మాస్త్రమును బ్రయోగించి సమస్త రాక్షసులను వధించెదనని పలికెను రాముడా వాక్యములాలకించి సోదరా! ఒక్కని నిమిత్తమై భూమి యందలి సమస్త రాక్షసులను వధించెదనని పలికెను రాముడా వాక్యములాలకించి సోదరా! ఒక్కని నిమిత్తమై భూమి యందలి సమస్త రాక్షసులను వధించుట యుక్తముగాదు ఇంద్రజిత్తును వధించుటకే గాఢయత్నము గావింతము దివ్యాస్త్రములను బ్రయోగింతము మాయావియగు నీచుని జాడ దెలిసినచో వానరులు బట్టి వధించెదరు ఈ పాపాత్ముడెందుబోయినను నేల గూలునని రాముడు లక్ష్మణునితో జెప్పెను క్రూరకర్ముడగు యింద్రజిత్తును వధించుటకై యుపాయమన్వేషించు చుండిరి రాముని సంకల్పమెఱింగి రాక్షసోత్తముడు యుద్ధంబును వదలి లంకాపురంబు జొచ్చెను అంతలోనే కుంభకర్ణాదులు రామునిచే బడుటందలంచుకొని క్రోధారుణలోచనుడై

పురంబు వెలువడి రాక్షససేనా పరివృతుండై కదనరంగమునకు గదలివచ్చెను రామలక్ష్మణులు యుద్ధసన్నద్ధులై యుండుటంజూచి తన నికుంభిలాయాగము సేయుదనుక వానరులు యుద్ధ ప్రయత్నమును వదలి దు ఖపరవశులై యుండుటకై మాయచే సీతాదేవింజేసి రాక్షససేనా మధ్యమందు వధింపదలంచి రామాదులను వంచించుటకై వానరసేనాభిముఖుడై పోయెను

## ఇంద్రజిత్తు మాయా సీతను వధించుట

లంకాపురంబు వెలువడి వచ్చుచున్న ఇంద్రజిత్తును వానరవీరులు జూచి పరమక్రుద్ధులై యుద్ధోత్సాహమినుమడింప పెనుశిలలను కరంబులందాల్చి యెదుర్కొనిరి మారుతాత్మజుడు మహాపర్వత శిఖరంబును గ్రహించి యవ్వానర వీరుల యగ్రభాగంబున నడచెను అప్పుడింద్రజిత్తు రథంబుపైనేక వేణీధరయై కృశించి మలినవస్త్రమును దాల్చి దీనురాలై దు:ఖించుచున్న సీతను సమీరనందనుడు జూచి బాష్పకణంబులను రాల్చెను ఆనంద విహీనయై శోకాగ్నిలో గుములుచున్న సీతాదేవిని తన రథంబుపై నుంచుకొని యిచటకి దెచ్చుచున్న కారణమేమని కరువలిసుతుండు వానరులను బ్రశ్నించెను అంతలో సైపంజాలక వానరవీరులచే బరివేష్టితుడై హనుమంతుడు రావణాత్మజునిపైకి బోయెను వానరసైన్యము తన మీదికి వచ్చుటంజూచి కోపోద్రేకుడై యొరనుండి కరవాలంబును దీసి మాయా సీత శిరంబుపై దడవెను అప్పుడా మాయా సీత హా! రామా! రామా! యని విలపింప దొడంగెను వానరులందఱు జూచుచుండగనే సీతను యింద్రజిత్తు కొట్టెను రాక్షసుడు రాముని ధర్మపత్నిని తలవెంట్రుకలు బట్టి యుండుటను గాంచి పవన తనయుడు యశ్రుకణంబులు రాల్చెను సర్వాంగసుందరియును, రాముని ప్రియభార్యయునగు జనకాత్మజ రావణాత్మజునిచే జిక్కి కడగండ్లు పడుచుండుటను కరువలిసుతుండు గాంచి యింద్రజిత్తును జూచి పరుషోక్తులచే నిట్టులనియె దురాత్మా! నీవు బ్రహర్షికులోద్భవుండ వయ్యును రాక్షసయోనికి సంబంధించిన వాడవు అందువలన నీ దుర్బుద్ధి

మానవైతివి ఆత్మనాశంబుగలుగునని శంకింపక మహాపతివ్రతా శిరోమణి తలవెండ్రుకలను బట్టితివా? ఛీ దుర్మార్గుడా! నీవు దహింపబడుదువుగాక! నీ చాధమా! ఇట్టి నిందితమగు కార్యంబుజేయుటకు నీకు సిగ్గులేదా! దురాచారుడా! రాజ్యభ్రష్టుడైన రక్షకుండగు రాముని యెడబాసియున్న సీతాదేవిని వధింపగోరుచున్నావే! ఇమ్మహాసాధ్వి నీకేమి యపకారంబు జేసి యున్నది? సీతను వధించితివా? నీవు నా బారినుండి తప్పించుకొని జీవంబులతో బోవంజాలవు లోకనిందితమైన కార్యంబు జేసి లోకాపవాదమును భరించుకొనుచున్నావు స్త్రీ హత్య మహాదోషంబు చతుర్దశభువనంబుల యందును నీకు చోటు దొరకబోదు స్త్రీహత్య చేసిన కుత్సితులు బోయెడు దుర్గతికేగగలవు సీతను వధింపవలదనుచు పవనాత్మజుడు క్రుద్ధుడై సేనాసమేతముగా యింద్రజిత్తు మీదికేగెను

ఇంద్రజిత్తు తన మీదకి వచ్చుచున్న వానరసేననుజూచి వేయిబాణంబు లొక్కమారు ప్రయోగించి చీకాకుబరచి వానరోత్తముని జూచి మఱియు నిట్లు బదులు పలికెను ఓరీ! హనుమంతుడా! ఎవ్వతె నిమిత్తమై నీవు సుగ్రీవుడు రామలక్ష్మణులు లంకకు వచ్చియున్నారో! ఆమె నిప్పుడే చంపెదను తొలుత నీతొయ్యలిని దునుమాడి తదుపరి రామలక్ష్మణులను, నిన్ను, సుగ్రీవుని, దుర్మార్గుడగు విభీషణుని వధించెదను స్త్రీలను వధింపరాదని పలుకుచున్నావు శత్రువులకు బాధగలిగినప్పుడేదియైనను జేయవచ్చును సీతను వధించుటచే మాపీడ తొలగిపోవును ఇది మాకర్తవ్యమే చూడుమని మాయానిర్మితంబైన సీత రోదన మొనరించుచుండ తీక్షణకరవాలంబుచే నామె కంఠంబు నుత్తరించెను ఆ మాయా సీతను వధించి యింద్రజిత్తు హనుమంతుని జూచి యిట్లనియె వానరుడా! మీ రాముని ప్రియురాలగు సీతను వధించితిని ఇక మీ ప్రయాసమంతయు వ్యర్థమైనది పొమ్మని రథంబు నుండియే పకపక నవ్వుచు సింహనాదంబు గావించెను వానరులకు దిక్కుదోచక భయపడి దిక్కులకు బాఱిపోవనారంభించిరి అట్లు భయపడి దీనులై పాఱిపోవుచున్న వానరులను వాయుసుతుండు జూచి వనచరులారా! శోకవ్యాకుల చిత్తులై యుద్ధోత్సాహమును గోల్పోయి పాఱిపోయెదరేల? మీ శౌర్యమెందుబోయెను నేను ముందు నడచెదను మీరందఱు నన్ను

వెంబడించి రండు ఇంతవఱకు పెక్కు యుద్ధములందు జయంబు సంపాదించి పొగడ్తగన్న శూరులిట్లు పాఱిపోవుట యుక్తమా! ధైర్యమవలంబించి నిలువుడని హనుమంతుడు జెప్పెను అవ్వానరులు వాయుసుతుని వాక్యములాలకించి మైపులకలెగయ సంతోషంబునొంది పర్వత శిఖరంబులను, వృక్షములను జేకొని యుద్ధసన్నద్ధులై నిలువంబడిరి ప్రళయకాలమందు ప్రపంచమునంతయు నశింపజేయునట్టి కాలుడో యనం బరగిన యమ్మహా వానరవీరుండు వానరసేనాసమేతుడై రాత్రించరులతో ఘోరయుద్ధంబు గావించెను హనుమంతుడధిక దు ఖావేశముతో నా యింద్రజిత్తు రథంబుపై మహాశిలనొకదానింబడవైచెను భయంకరముగ మీదబదనున్న మహాశిలను జూచి సారథి రథంబును తప్పదోలుకొని పోయెను ఆ పెనుశిలభూమిని భేదించుకొని పాతాళంబున కేగెను పెక్కండ్రు రాక్షసులు నలిగిపోయిరి వానరవీరులు గర్జించుచు రాక్షసోత్తమునిపై పాదపంబులను, పర్వత శిఖరంబులను బ్రయోగించి భందన మొనరించిరి రాక్షసులా దెబ్బలకు నేలబడిపొరలాడిరి రక్కసులీ విధంబున వనచరులచే బీడింపబడుచుండుటంజూచి యింద్రజిత్తు ధనుర్ధరుడై వానరాభిముఖముగా నడచి బాణవర్షంబును గురిపించి పెక్కండ్రు వనచరోత్తములను దునుమాడెను రాక్షసులు శూలంబుల చేతను, ఎడుగులచేతను వానర వీరులను వధించిరి హనుమంతుడు పాదపశిలాయుధములను గొని రాక్షసులతో ఘోర సంగ్రామం మొనరించెను రాక్షస సైన్యమంతయు బారిపోయెను అవ్విధంబున శత్రుసైన్యములను బాఱదోలి సమీరనందనుడు వానరులంజూచి యిట్లనియె మనము సీతను సాదించుటకే వచ్చినాము రాక్షస సైన్యమును సాధించుటకు రాలేదు మీరందఱు మరలిరండు రాముని శ్రేయస్సు గోరియే సాధ్వీమణి కొఱకు ప్రాణంబులపై నాశనం వీడి యుద్ధంబుజేయుచున్నామో! అట్టి జనకమహారాజు కూతురు వధింపబడినది ఈ వృత్తాంతమును రామసుగ్రీవులకు దెలుపుదము వారు దానికేమి బదులు చెప్పుదురో మనము గూడ దానినే జేయుదమని హనుమంతుడు వెడలిపోయెను అంజనేయుడు వెడలిపోవుటనుజూచి యింద్రజిత్తు హోమము గావించుటకై చైత్యమునందున్న నికుంభిలయను

దేవతాయతనమునకుబోయి హోమముగావింపబూనెను యాగభూమి యందు రక్తమాంసంబులను అగ్నిహోత్రమందుంచి హోమము జేసెను అగ్నిహోత్రుడా మాంసశోణితమ్ముల నారగించి యెంతయు బ్రజ్వరిల్లెను ఇంద్రజిత్తు శాస్త్రోక్తముగా యెంతయు బ్రజ్వరిల్లెను ఇంద్రజిత్తు శాస్త్రోక్తముగా రాక్షసులకు జయము గలుగుటకై యధావిధిగా హవిస్సు నగ్నిహోత్రంబున హోమంబు గావించెను రాక్షస పండితులా హోమకర్మమున విదిలోపము గలుగకుండునట్లు చూచుచుండిరి

## ఇంద్రజిత్తు సీతను జంపెనని హనుమంతుడు రామునితో జెప్పి దుఃఖించుట

వానర రాక్షసుల యుద్ధమందుద్భవించిన ధ్వని నాలకించి శ్రీరాముడు జాంబవంతుని జూచి యిట్లులనియె జాంబవంతుడా! పవనతనయుండిప్పుడు భయంకరముగా భండనంబు గావించుచున్నట్లున్నది అటువైపు నుండియే చెవులు బ్రద్ధలగునట్లు భయంకరమైన మహాధ్వని వినబడుచున్నది వానరోత్తమా! సేనాసమేతంబుగా నీవు బోయి హనుమంతునకు దోడ్పడుమము పోయిరమ్మని రాముడు జెప్పెను భల్లూక రాజు రాముని యాజ్ఞ మేరకు తన సైన్యముతో గూడ పవనాత్మజుడున్న పశ్చిమ ద్వారంబునకేగెను హనుమంతుడు భల్లూక సైన్యమును జూచి వెనుకకు రావలసినదని చెప్పి శ్రీరాముని సన్నిధికేగి దుఃఖమును భరింపజాలక రామునితో నిట్లు జెప్పెను రామా! మేమందఱు యుద్ధము చేయుచుండగానే యింద్రజిత్తు సీతాదేవిని నఱికివైచెను నేనేమి జేయుటకు దోచక దుఃఖితుడనై మీచెంతకు వచ్చితినని రామునితో హనుమంతుడు జెప్పెను

ఆ పిడుగునుబోలిన వార్తను రాముడాలకించి పరమదుఃఖితుడై వేరు తెగినఱికిన వృక్షంబుకైవడి తటాలున నేలపై బడెను రాముడు భూమిపై బడుటంజూచి వానరోత్తములందఱు భయపడి పరుగెత్తుకొని వచ్చి సువాసనతో గూడియున్న జలంబులచేత దడిపిరి అట్లు శోకాగ్నిలో

గుచుములుచున్న రాముని లక్ష్మణుడు గ్రుచ్చి కౌగిలించుకొని యిట్లనియె ఆహా! అధర్మికుడగు రావణునకు సుఖంబు జేకూరినది ధర్మాత్ముడగు రామచంద్రునకు వ్యసనంబు జేకూరినది అన్నా! నీవు పితృవచనాది రూపములోనున్న ధర్మమార్గమందు ధీరచిత్తుడవై విహరించితివి హస్తగతమైన రాజ్యమును బోగొట్టిన కైకేయీ దశరథులయందు క్రౌర్యంబును బూనక జితేంద్రియుడవై ధర్మబద్ధుడవైతివి ఆ ధర్మము నీ దు ఖమును బోగొట్టజాలకున్నది కావున ధర్మమనునది నిష్ప్రయోజనము అసత్యమైన ధర్మమేడ? నిన్ను రక్షించుటేడ?

## ధర్మాధర్మములు లేవని లక్ష్మణుడు రామునితో జెప్పుట

ధర్మాధర్మములు కుందేటి కొమ్మునుబోలినవి ధర్మాధర్మము లున్నవని పలుకు వారలే ప్రమాణములచేత నిరూపింపగలరు? ప్రత్యక్షమా? అనుమానమా? ప్రత్యక్షమనునది కల్ల చరాచరములైన సర్వభూతంబుల మాడ్కి మనకన్నులకు ధర్మాధర్మములు గోచరింపవు గదా! కాబట్టి ధర్మాధర్మములు లేనేలేవని నా దృఢనిశ్చయము ధర్మమే యున్నచో నిన్ను బోలిన ధర్మాత్మునకాపద సంభవించియే యుండగూడదు అధర్మమే యుండుట సత్యమైతే రావణుడు నరకము నొందవలయును పరసతి నపహరించిన పాపాత్మునకు సుఖము, పితృవాక్య పరిపాలన మొనరించిన ధర్మశీలునకు కష్టముగలుగుటను బరిశీలించి చూడగా ధర్మాధర్మములు లేవని విశదమగుచున్నది ధర్మాభ్యుదయ ఫలమనియు నధర్మము అనిష్టఫలమనియు, శాస్త్రమందుజెప్పబడియున్నది ఆ శాస్త్రమిప్పుడు ధర్మవిరుద్ధమగుచున్నది శాస్త్రోక్త లక్షణములనుబట్టిచూడ నధర్మము నందు వర్తించెడు రావణునకేల యనిష్టఫలము చేకూరదయ్యెనో తెలియ కున్నది దీనిని బట్టిచూడగా ధర్మాధర్మములున్న వనుటకే నిదర్శనములును గానరావు ధర్మాధర్మములకు స్థిరమైన లక్షణ ప్రమాణములే యున్నచో ధర్మాత్మునకు ధర్మఫలమును, అధర్మపరునకు నధర్మఫలమే గలుగ వలయును గదా! ధర్మాధర్మములు కర్మస్వరూపములు గావు బ్రాహ్మణ వధయు మొదలుగాగల పాపకర్మములాచరించు వారలకు బాధగలుగ

కున్నది గదా! పరమ ధార్మికుడవగు నీకే మహావ్యసనంబు జేకూరినప్పుడు ధర్మాధర్మములు లేవని చెప్పుటలో నతిశయోక్తియేమున్నది? అన్నా! నీవు ప్రధానముగ నాశ్రయించియున్న ధర్మమును బరిత్యజింపుము ధర్మము దుర్బలమైనది దానికి స్వతంత్రములేదు నిష్ఫలమైన దానిని నమ్ముకొనుటలో లాభమేమి? సత్యమే ముఖ్యధర్మమని భావించియున్నావు గదా! దశరథుడు సమస్త సామంత ప్రకృతి సమక్షమందు నీకు బట్టంబుగట్టెదనని ప్రతిజ్ఞ చేసి మాటదప్పలేదా! నిర్దయుండై జ్యేష్ఠ పుత్రుని వనంబునకు దఱుమలేదా! సత్యమును దప్పిన దోషంబునకు దండ్రి నేలబంధింపవైతివి క్షత్రియ ధర్మమును విడనాడి రాజ్యమును వదలితివి ధర్మఫలము వలన నీవేమి సుఖమనుభవించితివి? నదులు పర్వతముల నుండి జన్మించుచున్నవి ధర్మాధర్మఫలములు యజ్ఞ ఫలముల వలన జన్మించుచున్నవి ఇవన్నియు ధనముచేతనే సాధ్యమగుచున్నవి ధనహీనులకు యేకర్మయు ననుష్ఠింపశక్యముగాదు నిదాఘకాలమందు సన్నపు వాహినులింకిపోవు చందంబున ధనహీనుడైన వానిని కర్మములు వరింపక విచ్ఛిన్నములగుచుండును

లోకమందు ధనవంతునకే బొక్కండ్రు స్నేహితులగుదురు దరిద్రుని దరికెవ్వరునుజేరరు ధనవంతుని చెంతకే బంధువులు చేరుదురు ధనహీనుని జూచినచో బంధువులు గూడ దూరముగా బోవుదురు ధనముగలవాడే పండితుడు, బుద్ధిశాలి, శౌర్యవంతుడు, బీదవాడు పండితుడైనను మూర్ఖునిగను, పిఱికివానిగను, దలపోయుదురు ఎంతటి బుద్ధిమంతుడైనను దరిద్రుని బుద్ధిహీను డందురు అర్థమును వదలిన వానికీ దోషంబుగలుగును నీవిపుడు రాజ్యమును త్యజించి యిట్టి సంకటములకు గురియైతివి శ్రేయస్సును బొందగోరి దరిద్రుడేమి జేసినను ఫలించదు రామా! సంతోషము, కామము, గర్వము, ధనము, కోపము, శాంతి, దాంతియు మొదలగునవన్నియు ధార్మికునియందే వెలుగొందుచుండును సూర్యాది గ్రహములు దుర్దినమందు గోచరింపని చందంబున నైహిక సుఖములన్నిటికీ సాధనమైన విత్తంబులు నీయందుగోచరింపకున్నవి ఇట్టి నీకు సుఖమెట్లు గలుగును

తండ్రియానతిని శిరంబునందాల్చి రాజ్యమును త్యజించి వనవాస మొనరించుచున్న నీయట్టి ధర్మనిష్ఠునకర్థము దూరముగుటంజేసి ప్రాణంబుల కంటే నధికప్రియమైన భార్యను రావణుండపహరించెను అన్నా! రాజ్యమును త్యజించుట వలననే సీతదేవి వధయునింద్రజిత్తుచే గావింపబడెను జనకాత్మజ మరణముచే నీకు గలిగిన యీ దుఃఖమును నా శౌర్యాగ్నిచే దగ్ధము గావించెదను లెమ్ము పురుషోత్తమా! ముజ్జగంబులను ముప్పుతిప్పలు బెట్టగల ప్రభావ సంపన్నుడవనియు బరమాత్మవనియు నీకు దెలియదా! పాపరహితుడా! జనకాత్మజ మరణంబువలన చేకూరిన దుఃఖముచే క్రోధావేశుడనై ధర్మాధర్మములు అప్రామాణికములని చెప్పితిని వేఱొండేమియుగాదు రావణునితో గూడ లంకాపట్టణంబును నాబాణాగ్నిచే దగ్ధముగావించెదను లెమ్మని లక్ష్మణుడు వాత్సల్యమినుమడింప తన సోదరునాశ్వాసించుచుండగా విభీషణుడు సేనాభాగములన్నిటిని భద్రపరచి మంత్రులతో గూడ రామలక్ష్మణులుండు చోటునకు వచ్చి, దుఃఖాబ్ధి నిమగ్నుడై లక్ష్మణుని తొడపై రాముడు బరుండియుండుటయు వానరులందఱు దీనులై బాష్పకణంబు లొలుక బోయుచుండుటయు, జూచి యిట్లనియె వానరులారా! ఇక్ష్వాకు కుల తిలకుండు దుఃఖాంబుధిలో మునిగియుండుటకును, మీరందఱు దుఃఖ జలధినీదుచుండుటకును కారణమేమి తెలియంబల్కుడనిన లక్ష్మణుడు విభీషణునిజూచి రాక్షసోత్తమా! ఇంద్రజిత్తుచే సీత వధింపబడెనని హనుమంతుడు జెప్పగా విని రాముడు దుఃఖాగ్నిలో గుములుచున్నాడని చెప్పెను ఆమాటలు విని విభీషణుడు రాముని జూచి యిట్లులనియె మనుజేంద్రా! సముద్రము నింకించుటంత దుర్లభమో సీతను వధించుట గూడ నంతదుర్లభము నీధర్మపత్నియేడ? ఇంద్రజిత్తు వధించుటేడ? మునుపు హనుమంతుడేకొంతసేపో సీతాదేవిని జూచి వచ్చియుండుటచే భ్రమపడియున్నాడు సీత వధింపబడలేదు రామా! నా మాట నమ్ముము

## ఇంద్రజిత్తు సీతనువధింపలేదని విభీషణుడు రామునితో జెప్పుట

నేనెంతయో హితముగోరి సీతను రామున కొసంగుమని బోధించితిని రావణుడాలకింపక సీతనొసంగుట కేమాత్రము సమ్మతింపడయ్యె అతడిప్పుడెట్లు వధించుటకు సమ్మతింపగలడు? సామదానభేద దండోపాయములచేత గాని జనకాత్మజను చూచుట కెవరితరమగును రాక్షసుల మాయోపాయములాసాధ్వీసన్నిధిలో కొనసాగవు ఇంద్రజిత్తు సీతనెట్లు వధింపగలడు? రావణునకు వాడొక్కడే మిగిలియున్నాడు ఇంద్రజిత్తు దక్క రాక్షసేంద్రునకు దోడ్పడగల వీరుడెవ్వడును లేడు ఆ మాయావి వానరులందఱిని మోసగించి నికుంభిల దేవాలయమునకేగి హోమము గావించుచున్నాడు వానరులా హోమమునకు విఘ్నము గలిగింతురని తలంచి హోమము ముగియు వఱకు మిమ్మెల్లరిని దుఃఖాబ్ధిలో ముంచివేయుటకై మాయా సీతనిందు దెచ్చి వధించి పోయెను ఇది నిశ్చయము సీతాదేవి యశోకవనమందు సుఖముగానున్నది దుఃఖమును వీడుము రావణపుత్రుడొనరించుచున్న నికుంభిలహోమము నిర్విఘ్నముగా కొనసాగినచో దేవదానవులొకటియై వచ్చినను వానిమ్రోలనిలువంజాలరు హోమము సంపూర్ణముగా నెరవేఱుటకు మునుపె సైన్య సమేతముగా బోయి విఘ్నమొనరింప వలయును రామా! పరితాపమును వీడి నిశ్చలమానసుడవై యుండుము నిన్ను జూచి వానర సైన్యమంతయు దుఃఖమునొందియున్నది మాతోడను, వానరసేనా నాయకుల తోడను లక్ష్మణుని బంపుము రాక్షసుని కఱకుబాణ ప్రయోగము వలన రావణనందనుడు హోమమును వీడి యుద్ధమునకు వచ్చును అప్పుడు బ్రహ్మదేవుడొసంగిన వరప్రకారము వధ్యుండగును శుభలక్షణ సంపన్నుడగు లక్ష్మణుడే యింద్రజిత్తును బరిమార్చుట కర్హుడు సుమిత్రాసూనుని కఱకుటమ్ములే వాని రక్తమును గ్రోలి చవిజూడగలవు రామా! తారకాసురుని వధించుటకై దేవేంద్రుడు కుమారస్వామిని బంపినట్లు ఇంద్రజిత్తును బరిమార్చుటకై లక్ష్మణునకాజ్ఞ నొసంగుము ఇంద్రజిత్తు హోమకార్యము సమాప్తి బొంది యుద్ధమునకు

వచ్చెనా సురాసురులాతని నెదిరింపజాలరని విభీషణుడు జెప్పెను

రాముడు దుఃఖాబ్ధి నిమగ్నుడైయుండు కతంబున విభీషణుని
వాక్యములర్థము గాలేదు ఐనను కొంతసేపటికి ధైర్యమవలంబించి రాముడు
విభీషణునిజూచి యిట్లులనియె విభీషణా! నీవింతదనుక జెప్పిన మాటలు
నా కర్థముగాలేదు మరల వినగోరెదను ఏదీ చెప్పుమనిన వాక్యవిశార
దుండగు విభీషణుడిట్లనియె రామచంద్రా! ఇంద్రజిత్తు మాయచే సీతను
నిర్మించి వధించెనే గాని నిజముగ సీతాదేవిని వధింపలేదు ఇది నిక్కువము
నమ్ముము నిష్కారణముగ నీవిట్లు దుఃఖించెదవేల? పరితాపమును
వీడుము శత్రువులకు సంతోషము గలిగింపవలదు నా
హితవచనంబాలకింపుము సైన్య సమేతుడై నికుంభిలహోమము
జేయుచున్న యింద్రజిత్తు మీదికి లక్ష్మణుని సైన్యసమేతముగ బంపుము
లక్ష్మణుడా యింద్రజిత్తును వధించితీరును బ్రహ్మదేవుడా
యింద్రజిత్తునకు బ్రహ్మాస్త్రమును, కామగమనంబులగు రథ్యాశ్వముల
నొసంగి యున్నాడు నీ నికుంభిల హోమంబు పరిసమాప్తిగాక మునుపె
యెవ్వడు నీతో యుద్ధపాణియై పోరు సలుపునో యాతడే నిన్ను
వధించును ఇతరెవడు నిన్ను వధింపజాలడని సురజ్యేష్ఠుండు
వరంబొసంగియున్నాడు రామా! ఆ నికుంభిల హోమమునకు విఘ్నము
జేకూర్చి బరిమార్పగల వీరుడు లక్ష్మణుడే ఇంద్రజిత్తు నేలగూలెనా!
రావణుడు తన మిత్రులతో గూడ నేలగూలునని తలంచుమనియెను
విభీషణుని వాక్యము లాలకించి రాముడిట్లనియె విభీషణా! ఇంద్రజిత్తు
మహామాయావి, బలశాలి, విద్వాంసుడు, బ్రహ్మాస్త్ర మర్మమెఱింగినవాడు
వరుణ సహితులగు దేవతలను గూడ మూర్ఛిల్లజేయువాడు రథారూఢుడై
తారాపథంబున విహరించుచుండగా నాతని గనుంగొనుట నశక్యముగా
నుండును మాయాబలంబు గలవాడని పలుకుచు లక్ష్మణుని జూచి సోదరా!
నీవు వానరేంద్రుడగు సుగ్రీవుని సమస్త సైన్యముతోడను,
హనుమంతుడాదిగాగల సేనానాయకుల తోడను, భల్లూకనాథుడగు
జాంబవంతుని తోడను, యుద్ధసన్నద్ధుడవై పోయి, ఆ మాయావియగు
రాక్షసపుత్రుని దునుమాడి రమ్ము మాయా తంత్రములును, నికుంభిలా

ప్రదేశమునెఱింగిన వాడునగు మహాత్ముడు విభీషణుడు నీవెంట రాగలడు పోయి రమ్మని రాముడు లక్ష్మణునితో జెప్పెను

## లక్ష్మణుడు నికుంభిల హోమంబును జెఱచి ఇంద్రజిత్తును వధించుట

రాముని యాజ్ఞను శిరంబునందాల్చి లక్ష్మణ విభీషణులుత్తమ ధనుస్సులను ధరించిరి లక్ష్మణుడు మైమఱవును దాల్చి కరవాలంబును కార్ముకంబును గైకొని యుద్ధసన్నద్ధుడై రాముని పాద సరోజములపై వ్రాలి యిట్లనియె అన్నా! నా శరంబులు రాక్షసోత్తముని దేహంబును భేదించి తామరకొలను నందు హంసలు వ్రాలునట్లు లంకాపురంబున బడగలవు చూడుమని యగ్రజునకు ప్రదక్షిణమొనరించి నమస్కరించి రామునిచే మంగళాశీర్వదములు వడసి నికుంభిలయను చైత్యవృక్షము యొద్దకు బోయెను మంత్రి సహితుడై విభీషణుడును, అనేక వానర సహస్ర పరివృతుడై హనుమంతుడును లక్ష్మణుని వెంబడించి నడచిరి భల్లూక సైన్యము గూడ రాచకొమరుని వెంబడించెను దూరముగా వ్యూహంబు బన్నియున్న రాక్షససైన్యమును లక్ష్మణుడు జూచుచు నికుంభిలాప్రదేశమున కేగి మాయావియగు యింద్రజిత్తును జంప సన్నద్ధుడై నిలువంబడెను విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు, లక్ష్మణుని బరివేష్టించిరి రథగజతురగపదాతులచే నిండియున్న భయంకరమైన రాక్షస సైన్యమందు సుమిత్రాసుతుండు జొరబడెను అప్పుడు విభీషణుడిట్లనియె

ఇదిగో! మేఘమువోలె నల్లనైన రాక్షస సైన్యము గానుపించుచున్నది ఇంద్రజిత్తు యాగము సంపూర్ణముగాక మునుపే, వానరులు వృక్షములను, శిలలను, గైకొని రాక్షస సైన్యమును జావమోదుడు లక్ష్మణా! నీవీ సైన్యమును భేదింపుము దీనిని భేదించినచో రాక్షస సుతుండు మనకు నగబడును నీవిపుడు యింద్రజిద్వధార్థమై యిచ్చోటనకు వచ్చితివి వాడొనరించుచున్న కర్మము బరిసమాప్తము నొందక మునుపే నిశిత శరపరంపర లాతనిపై వర్షింపుము వాడు మహామాయావి

అధర్మవర్తనుడు, సర్వలోకంబులకును భయంకరుడు త్వరితముగ బాణవర్షమును గురిపింపు మనియెడు విభీషణుని వాక్యము లాలకించి లక్ష్మణుడు కఱకు బాణంబులను బ్రయోగించెను పాదపశిలా యుధంబులను గైకొని వానర భల్లూకములు రాక్షస సేనపై గవిసిరి రాక్షసులు నిశిత బాణంబులను కరవాలంబులను శక్తులను ధరించి యుద్ధమునకు సన్నద్ధులైరి వానర రాక్షసులకు దుముల యుద్ధము జరిగెను ఆ యుద్ధము జరుగునప్పుడుదుద్భవిల్లిన మహాధ్వని లంకాపట్టణమందంతటను వ్యాపించెను వానరులు వృక్షములతొ రాక్షసులను గొట్టి బరిమార్చిరి రాక్షస సేన సహింపజాలక భయంబు నొందియుండెను

ఇంద్రజిత్తు తన సైన్యమంతయు శత్రువులచే నిహతమై భీతిల్లియుండుటెఱింగి హోమకార్యము సమాప్తము గాకమునుపే నియమము నుండి లేచి కుపితుడై రథంబు నారోహించెను ఆ రాక్షసోత్తముడు రథగతుండగుట తోడనే రాక్షస సైన్యమంతయు నాతని బరివేష్టించెను రాక్షస సుతుండు క్రోధారుణలోచనుండై లోకంబును నాశంబుజేయు మృత్యువు కరణి చూపరులకు భయంకరాకారుడై చూపట్టుచుండెను ఆ సమయంబెఱింగి సమీరనందనుడు మహాభూజంబు నొక్కదానిని గైకొని రాక్షస సైన్యమును జెదరగొట్టి మూర్ఛిల్లజేసెను రాక్షసులది జూచి వేనకు వేలాతనిని జుట్టుముట్టి నానావిధాయుధంబులచే బ్రహరించిరి పవనాత్మజుండమిత క్రోధావేశుడై రాక్షసులందఱకును నన్ని రూపులై ఘోర సంగ్రామమొనరించెను పర్వతాకారుడై రాక్షసులను రూపుమాపుచుండుటను రావణుని పుత్రుండుజూచి నేనిపుడుపేక్షించినచో హనుమంతుడు నిశాచరులందఱిని బరిమార్పగలడని తలంచి రథంబాతని మీదికి దోలుమని సారథి కనుమతి నొసంగెను సారథి వెంటనే రథంబును సమీరనందనుని పైకి దోలెను వెంటనే యింద్రజిత్తు హనుమంతుని శిరంబుపై బాణ వర్షంబు గురిపించెను వాయుసుతుండు బాణము లన్నిటికిని సహించి పరమక్రుద్ధుడై యింద్రజిత్తును జూచి యిట్లనియె

దుష్టాత్మా! నీవు పిఱికిపందవు గాక శూరాగ్రేసరుండవైతే నాతో సమరంబు గావింపుము వాయుసుతుండనగు నాబారింబడిన నీవింక జీవించి పోవంజాలవు సుమా! ఆయుధంబులను విసర్జించి బాహు యుద్ధంబున నన్ను జయించి నా వేగంబునకు సహించితివా! నీవు రాక్షసోత్తముడవే! యని హనుమంతుడు ఇంద్రజిత్తుతో జెప్పెను అప్పుడు విభీషణుడు లక్ష్మణుని జూచి యింద్రజిత్తు ధనుర్ధరుడై పవనాత్మజుని బరిమార్పనున్నాడు అల్లదే రథగతుండై వెడలుచున్నాడు లక్ష్మణా! నీవిపుడుపేక్షింప జనదు. జీవితనాశమొనరించెడు క్రూరబాణంబులను బ్రయోగించి రావణనందనుని రూపుమాపుము త్వరపడుమనియెడు విభీషణుని పలుకులాలకించి లక్ష్మణుడు భయంకరమగు పర్వతాకారుడై గర్జించుచున్న రాక్షసోత్తముని గాంచెను రావణానుజుడు ధనుర్ధరుడై సుమిత్రానందనుని వెంట నిడుకొని వేగంబునంబోయి న్యగ్రోధవృక్షంబు చెంత రావణపుత్రుడు హోమంబుజేయు స్థలంబును జూపి లక్ష్మణా! యీ స్థలంబుననే భూతములను బలినొసంగి యుద్ధమునకు వచ్చి సర్వభూతములకును అదృశ్యుడై శత్రువులను వధించి తీక్ష్ణ బాణంబులచే బంధించును ఈన్య గ్రోధవృక్షంబు బ్రవేశించెనా వాడు రథాశ్వసారథి సహితంబుగా నదృశ్యుడై పోవును కావున ముందుగానే రథాశ్వసారథి సహితంబుగా సంహరింపుము అలసింపవలదని విభీషణుడు జెప్పిన తోడనే లక్ష్మణుడు వల్లెయని పల్కి న్యగ్రోధమూలంబున నిలువంబడి ధనువును సారింపుచు యుద్ధ సన్నద్ధుడై నిల్చియుండెను ఇంద్రజిత్తు తనుత్రాణంబు దొడగి ధనుర్ధరుండై యగ్నిహోత్రమువోలె వెలుగొందుచు రథంబుపై నుండి లక్ష్మణునకు గనబడెను దశరథసుతుండాతనిని జూచి పరాజయమెఱుంగని పులస్త్య వంశోద్భవా! రారమ్ము నినుయుద్ధంబున కాహ్వానించుచున్నాను నాకు మంచి యుద్ధంబొసంగి సంతృప్తి గావించుమని పలికెను లక్ష్మణుడాడుచున్న కఠినోక్తుల నాలకించి యింద్రజిత్తు మ్రోలనిల్చియున్న పిన్నతండ్రియగు విభీషణుని గాంచి పరుషోక్తులతో నిట్టులనియె

విభీషణా! నీవెచ్చట బుట్టి పెరిగితివి? రాక్షసుడువుగావా? కులాభిమానంబేనియు బాటింపని క్రూరాత్ముడవైతివే! ఎంత ద్రోహివైతివి?

నా తండ్రికి తమ్ముడవు నాకు చిన్నతండ్రివి ఎంతటి పుత్రఘాతకుండ వైతివి? దుర్మార్గుడా! స్వజనాభిమానమును బోగొట్టుకొని దూరుడవై శత్రువులకు భృత్యుడవైతివి బంధుజనంబులకు శోచనీయుడవైతివి సత్పురుషులకు నింద్యుడవైతివి బంధుత్వమును గాని, స్నేహమును గాని, తోబుట్టు తనమునుగాని పాటింపవైతివి కలుషాత్మా! యెంతటి పాపంబునకొడిగట్టుకొంటివి శత్రువులనాశ్రయించుట నీచమని దలంపవైతివిగాబోలు! స్వజనులతో గలసిమెలసి యుండెడు భాగ్యమునకు నోచుకోజాలవైతివి నీ బుద్ధి పెడత్రోవలు బట్టినది అన్యులు సుగుణవంతులైె తమవారు గుణహీనులైనను వారినే యాశ్రయింపవలెను ఎప్పటికిని పరాయివాడు పరాయివాడేగాని తనవాడుగానేరడు శత్రువులనాశ్రయించిన వాడెప్పటికిని తన వారందఱు నశించిన పిమ్మట నా శత్రువులచేతనే వధింపబడును నీవు రాక్షసజాతికి జెందినవాడవు రావణుని తమ్ముడవు నా హోమమునకు విఘ్నముగావింపదలంచి లక్ష్మణుని న్యగ్రోధమూలమునకు గొనితెచ్చినాడవే! అయ్యో! ఎంతకరినాత్ముడవు బంధుడవు పిన్నతండ్రివి ఇంతటి నిర్దయుండవై నాకపకారమును దలపెట్టితివి ఇట్టియవినీతికెవ్వడును బాల్పడడు గదా! ద్రోహీ! యెంతపనిజేసితివనియెడు తన యగ్రజుని సుతుండగు యింద్రజిత్తు పలుకులను విభీషణుడాలకించి యిట్లు బదులు పలికెను

దుష్టుడా! రాక్షస రాజనందనా! నీకు నా స్వభావంబు దెలియనిది గాదు తెలిసిదెలిసియు నెందుకిట్లు బలుకుచున్నావు నీ పినతండ్రినైన నేనిట్లు జేసితినని పరుషోక్తులాడవలదు నేను రాక్షసుల యింటబుట్టిన క్రూరుడనుగాను నా స్వభావము సాత్విక స్వభావమేగాని రాక్షస స్వభావముగాదు అధర్మమున్నను, క్రూరకార్యమన్నను నేను సహించు వాడనుగాను ఒకవేళ స్వభావము భిన్నముగావచ్చును స్వభావము భిన్నమైన తోడనే నా యగ్రజుని నేనెట్లు వదలగలను? ధర్మమునకు దూరుడై పాపకార్యములొనరించెడు పురుషుని సహవాసము జేయువారలకు గూడ పాపము గలుగును చేతికి జుట్టుకొన్న సర్పమును త్యజించిన యోగ్యుని మాడ్కి దుర్మార్గుని బరిత్యజించి సుఖపడవలయును హింస జేయువానిని, పరధనమపహరించు వానిని, పరస్త్రీ గమనాది దురాచారములు గలవానిని,

దగ్ధమగుచున్న గృహంబును వదలునట్లు తక్షణమే వదలవలయునని పెద్దలు చెప్పుదురు పరుల విత్తంబున పహరించుటయు పరస్త్రీలను గవటయు, హితంబుపదేశించెడు మిత్రులను నమ్మకుండుటయు నీ మూడు దోషంబులు పురుషుని నశింపజేయును మహర్షులను క్రూరముగ వధించుటయు సమస్త దేవతలతో సమరంబుగావించుటయు, గర్వము దీర్ఘకోపము బద్ధవైరము గలిగి యుండుటయు, పరశ్రేయస్సును ద్వేషించుటయు నైశ్వర్యంబును నశింపజేసి జీవితమును నాశమొనరించును జలదరంబులు పర్వతంబుల నావరించు చందంబున నా యి గ్రజుని సుగుణజాలంబులన్నింటిని పై దోషంబులావరించి యున్నవి అందువలన నీతండ్రిని విడనాడితిని రాక్షసరాజనందనా! శీఘ్రకాలములోనే దుష్టుడవగు నీవును, నీ తండ్రియును నశింపబోయెదరు నీవిపుడు మృత్యుపాశంబునందగుల్కొంటివి నీ కంత్యకాలము దాపురించినది ఇప్పుడు నన్ను నిందించియు లాభమేమున్నది? కానిమ్ము నన్నెంత నిందింపగోరెదవో వెనుదీయువలదు నీ యిష్టము రాక్షసాధమా! ఇంక మఱ్ఱివృక్షంబు బ్రవేశించుటకు నీ చేతగాదు సుమా! మాయాసీతను వధించి రామలక్ష్మణుల నవమానించినావు ఇంక నీవు జీవింపజాలవు మనుజేంద్ర సుతుండగు లక్ష్మణునితో సమరంబు గావింపుము నీ బలపరాక్రమంబులను బయుట బెట్టుము నీయాయుధబలంబు ప్రయోగింపుము లక్ష్మణుని బారి నుండి తప్పించుకొనుము నీవు నీ సైన్యము జీవంబులతో బోవంజాలరు చూడుమని విభీషణుడు ఇంద్రజిత్తుతో జెప్పెను రావణపుత్రుండా వాక్యములాలకించి క్రోధావేశంబున ఖడ్గాయుధధారుడై యలంకరింపబడిన రథంబుపై బ్రళయకాలమందలి యమధర్మరాజు వోలె భయంకరాకారుడై వెలుగొందెను అవ్విధంబున రాక్షస సుతుండు రథారూఢుడై, హనుమంతుని వీపునంగూర్చుండి సహజకాంతులీనుచు నుదయ పర్వతంబుపై భాస్కరుడు వెలుగొందుచందంబున వెలుగొందెడు లక్ష్మణుని జూచి యిట్లనియె ఓహో! లక్ష్మణా! విభీషణా! వానరులారా! ఇదే నా పరాక్రమంబును జూడుడు నా ధనుర్ముక్త భాణవర్షంబునెట్లు వారింపగలరో చూచెదనుగాక! ఇమ్మహా ధనుస్సునుండి వెడలెడు బాణంబులుదూది

నగ్నిహోత్రము దహించునట్లు మిమ్మందఱిని దహింపగలవు ఇంతకు మున్నే రాత్రి యుద్ధము జరిగినప్పుడు మిమ్మెల్లరిని మూర్ఛిల్లజేసి యుంటిని లక్ష్మణా! ఆ రాత్రి యుద్ధంబును మఱచి మరల నాపైకి వచ్చుటం జూడ నీకు మరణమాసన్నమైనట్లున్నది రారమ్మనియెడు ఇంద్రజిత్తు వాక్యము లాలకించి మహోద్రేకుడై రాక్షసుడా! వ్యర్థ ప్రలాపములాడెదవేల? మమ్మెల్లరిని యమసదనంబునకు బంపెదనని సులభముగ మాట్లాడితివి కాని కార్యశూరత్వమావంతేనియు గోచరింపదయ్యె బీరంబులు పలుకక గార్యసిద్ధినిబొందువాడే బుద్ధిమంతుడు నిన్ను బోలిన కొఱగాని వాడెందును కార్యమును సాధించుకోజాలడు దురాత్మా! రాత్రి యుద్ధమందు మా కన్నులకగుపడకుండ నంతర్హితుండవై యుద్ధంబు గావించితివి అది తస్కరులు జేయు కార్యమేగాని వీరులు జేయదగినది గాదు నిన్ను నీవే పొగడు కొనదవేల? నేనిదే నీ బాణంబులకు లక్ష్యమునై నిల్చియున్నానుగదా! నీ పరాక్రమము నిప్పుడు వెల్లడిచేయుము వ్యర్థంబుగ బీరంబులు బలుకనేల? ననియెడు సుమిత్రాసూనుని కర్ణకఠోరమైన వాక్యములను రాక్షస సుతుండాలకించి భయంకరమైన ధనుస్సును సారించి నిశిత విశిఖంబులను బ్రయోగించెను క్రుద్ధ సర్పమును బోలి రాక్షసుని బాణంబులు లక్ష్మణుని దేహంబున నాటుకొన్నవి బాణంబులచే గ్రుచ్చబడిన లక్ష్మణుని దేహమంతయు రక్తసిక్తమై పొగలేని యగ్నికైవడిం బ్రకాశించెను అప్పుడు లక్ష్మణుడు నొచ్చుకొనుటను జూచి యింద్రజిత్తు సింహనాదంబు గావించి లక్ష్మణా! ఇదే చూడుము నా ధనుర్ముక్తంబులగు బాణంబులు నీ ప్రాణంబులను జవిచూడగలవు నాచే బరిమార్పబడిన నీ దేహము గోమాయువులకును, డేగలకును, గద్దలకును, ఆహారమగుగాక! దుష్టుడగు రాముని సోదరుడవు క్షత్రియాధముడవు రామభక్తుడవు ఇప్పుడు నాచే ఖండింపబోవు నీ శిరంబును గొనిపోయెదను కవచ భిన్నమైన నీ మొండెమును, ధనుస్సును, రాముడు చూడగలడు నిలునిలు మనియెడు యింద్రజిత్తు మాటలు విని లక్ష్మణుడిట్లనియె

పురుషాధమా! నిన్ను నీవే పొగడుకొనియెదవేల? నీ బాహుబలంబును ప్రయోగించి కార్యంబు నెరవేర్చి చూపుము నిన్నిప్పుడే

రూపుమాపెదను చూడుమని యైదు బాణంబులనాతని వక్షస్థలంబున నాటంజేసెను ఇంద్రజిత్తు లక్ష్మణుని బాణఘాతంబులకు పరమక్రుద్ధుడై మూడు బాణంబులచే లక్ష్యంబు దప్పక సుమిత్రాసుతునిపై బ్రయోగించెను సాటిలేని బలపరాక్రమ సంపన్నులగు ఇంద్రజిల్లక్ష్మణులిద్దఱును సమస్త దివ్యాస్త్ర మర్మంబులెఱింగిన వారగుటం జేసి యొకరికొకరు సమముగా బోరుసల్పిరి సింహములు పోరుసల్పిన విధముగా బాణసమూహంబుల నొండొరులపై బ్రయోగించుకొనుచు ఘోరసంగ్రామమొనరించిరి లక్ష్మణుడొక దివ్యబాణంబును వింటంగూర్చి యింద్రజిత్తునిపై బ్రయోగించెను అల్లెత్రాటి ధ్వని నాలకించి రావణనందనుడు భయపడెను మోము తెల్లవోయెను విభీషణుండిది గమనించి లక్ష్మణా! ఇంద్రజిత్తు యిప్పుడు భంగమొందెను ఇదే మంచి తరుణము త్వరితంబుగ వీనిని బరిమార్చుమనియెను రావణానుజుని వాక్యము లాలకించి సుమిత్రాసుతుండు తీక్ష్ణ బాణంబులను బ్రయోగించెను ఆ బాణఘాతంబులచే సర్వేంద్రియంబుల జ్ఞానంబు మఱుగుపడి మూర్ఛిల్లెను ముహూర్తమాత్రంబున మూర్ఛదేరి యింద్రజిత్తు దశరథసుతుని జూచి క్రోధారుణలోచనుండై పరుషోక్తులచే నిట్టులనియె ఓరీ! లక్ష్మణా! మీ పరివారంబును మీయన్నదమ్ములిరువురును, నాబాణంబులచే బద్ధులై నేలంబడి పొరలాడిన విషయంబులను మఱచితివా? మొదటి యుద్ధమందే నా బలంబును మీకెఱుకపరచి యుంటినిగదా! అట్టి నా పరాక్రమంబెఱింగియు మరల నాపై యుద్ధమునకు వచ్చితివా! నీ కవసానకాలమాసన్నమైనది ఎవ్వరేమి చేయగలరు నన్నెదిరించి పాఱిపోవక నిల్చి యుద్ధంబు జేయుము ఇదే చూడుమని లక్ష్మణునేడు బాణంబుల చేతను, హనుమంతుని పది బాణంబులచేతను, విభీషణుని నూఱు బాణంబులచేతను నొప్పించెను ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణంబులను లక్ష్మణుడు సరకుసేయక పకపకనవ్వుచు కఱకు బాణంబులనాతనిపై బ్రయోగించుచు రాక్షసాధమా! నీ శరంబులు నిస్సారమైనందున నన్నేమియు జేయంజాలకున్నవి ఇదే చూడుమని లక్ష్మణుడు బాణవర్షంబును గురిపించెను ఇంద్రజిత్తు సువర్ణాలంకృతమగు మైముఱువు తునకలుగా ఖండింపబడి తారాపథంబు

నుండి నక్షత్రములు నేలరాలునట్లు రథంబుపై రాలెను అప్పుడు రాక్షసుండు పర్వతంబుమాద్కి కొంత తడవు నిశ్చలుడై యుండెను మరల పరమక్రుద్ధుడై వేయిబాణంబులచే లక్ష్మణుని నొవ్వజేసెను ఆ బాణఘాతంబులచే సుమిత్రాసుతుని శ్రేష్ఠమైన తనుత్రాణంబు భగ్నమాయెను ఇవ్విధంబున నింద్రజిల్లక్ష్మణులొకరుజేసిన దానికి మఱొక్కరు ప్రతీకారమొనరించుచు ఘోరయుద్ధంబు గావించిరి ఎన్నియో దివ్యాస్త్రంబులు ఒకరిపై నొకరు బ్రయోగించుకొనుచు బోరాడిరి వారిరువురకును విసుగు గాని, శ్రమ గాని కించిత్తైనను గానబడదయ్యెను రాక్షసవీరుండును, రఘువీరుండును, గావించెడు జ్యావల్లీ ధ్వని యుభయ సైన్యముల యందును భయంబు గలుగజేయుచుండెను ఇంద్రజిల్లక్ష్మణుల దేహంబుల నుండి సెలయేఱులవోలె రక్తము బ్రవహించుచుండెను రాక్షస రఘువీరుల రక్తమంతయు భూమిపై బ్రవహించెను వీరి యుద్ధము చూపరులకు భయము గలిగించుచుండెను శరంబులచే గ్రుచ్చబడిన వారి శరీరములు వృక్షములు మొలచిన పర్వతంబుకరణి బొప్పారినవి ఎంత బోరాడినను శ్రమనొందరైరి

విభీషణుండంతదిగాంచి లక్ష్మణునకు హితంబుజేయుగోరి యుద్ధాయాసముదీరుటకై కదనరంగమునకు ముందట వచ్చి నిలువంబడి యా లక్ష్మణేంద్రజిత్తులు మదపుటేనుగులంబోలె బోరాడుచుండుటను గాంచి గొప్ప ధనుస్సును గైకొని మహాధ్వని గదురనారిసారించి నిశిత శరపరంపరలచే నిశాచరుల నొప్పించెను ఆ బాణాగ్నిచే రాక్షసులందఱు దగ్ధము గావించబడిరి విభీషణుని మంత్రులు గూడ రాక్షసులను మట్టుబెట్టిరి ఏకాలంబునకేది చేయవలయునో చక్కగా దెలిసిన వాడగు రావణానుజుడు వానరులను జూచి పోత్సహింపుచు నిట్లనియె వానరులారా! రాక్షసవీరులలో నీత డొక్కడే మిగిలియున్నాడు వీడే రావణునకు గతి ఈ దురాత్ముడగు యింద్రజిత్తు నేలగూలినచో రావణుడును, అతని బలమంతయు నేలగూలినట్లేయని తలంపుడు ప్రహస్తుడాదిగాగల రాక్షస ప్రధానులందఱిని బరిమార్చివైచితిరి దేవాంతక నరాంతకులను గూడ వధించితిరి పెక్కండ్ర రాక్షస వీరులనెందఱినో

మట్టుబెట్టితిరి సముద్రమును భుజబలముచే నీది దాటితిరి ఇట్టి వీరశిఖామణులకు గోష్పదమంతటి యీ యింద్రజిద్వధము గొప్పది గానేరదు ఉపేక్షింపకుడు రామకార్యార్థమై యింద్రజిత్తును నేనే వధించి యుండెడివాడను కుమారుని వదించుట యుక్తముగాదు ఇంద్రజిత్తును బరిమార్పదలంచి నంతనే నాకేలకో కన్నుల నుండి బాష్పకణంబులు రాలుచున్నవి లక్ష్మణుడే వానిని వధించుట కర్హుడు వానరోత్తములారా! ఇంద్రజిత్తుని రక్షణార్థమై వచ్చియున్న సైన్యమును మీరందఱు రూపుమాపుడు యుద్ధోత్సాహులై ముందు నడువుడనియెడు విభీషణుని వాక్యము లాలకించి వానరులు వాలంబుల నాడించుచు జలధరంబులను జూచిన మయూరంబుల మాడ్కి గంతులు వేయుచు సింహనాదంబులు గావించిరి జాంబవంతుడు వానరసైన్యమును భల్లూక సేనలను గూడి శిలల చేతను, నఖములచేతను, దంతముల చేతను రాక్షసుల నొప్పించిరి అవ్విధంబున రజనీచరులను బరిమార్చుచున్న భల్లూకనాథునిపై బాణంబులను, గొడ్డళ్లను, దోమరంబులను బ్రయోగించిరి భల్లూకనాథుని జుట్టుముట్టియున్న రాక్షసులతో హనుమంతుడు సాలవృక్షంబొక దానిని బెకలించి ఘోరయుద్ధంబు గావించెను వర్షర్తువునందు చంద్రసూర్యులు జలధరంబులచే మఱుగుపడు చందంబున మహాబలశాలురగు నా యింద్రజిల్లక్ష్మణులు తాము బ్రయోగించుచున్న బాణవర్షంబుచే నంతర్థానమగుచుండిరి లక్ష్మణుడే రావణాత్మజుని గొట్టునో! దశరథాత్మజుని రాక్షససుతుండే గొట్టునో! తెలియబడదయ్యెను వారి బాణ సమూహంబులచే గప్పబడిన యాకసమంతయు చీకటిమయమ్మైయుండెను దిక్కులు విదిక్కులు బాణపూర్ణములై యొప్పుచుండెను సమస్తము తమస్సుతో గప్పబడి భయంకరముగ రుధిరవాహినులు బ్రవహించు చుండెను క్రూరజంతువులు భయంకరముగ నఱచుచుండెను గాలివీచుట మానెను అగ్నిజ్వలింపలేదు మహర్షులు భీతిల్లి శుభమగుగాక! ఈ యుద్ధంబుచేత లోకంబులు నశింపక మంగళంబొందుగాక! యని పలికిరి యుద్ధంబును జూడ వచ్చిన చారణులు గంధర్వులు భయపడి వెడలి పోయిరి మనుజేంద్రసుతుండు రాక్షససింహుని నాల్గు గుఱ్ఱములను నాల్గు

బాణంబులచే నొప్పించెను ఇంద్రజిత్తుని రధంబును విచిత్రగతులం ద్రిప్పుచున్న సారథిని వజ్రాయుధమునుబోలిన నిశతశరంబుచేత శిరంబును దొల్లవేసెను సారథిహతుండగుట నెఱింగి మండోదరి సుతుండు తానే సారథ్య మొనరించుచు సమరంబు గావించెను ఆ సమయంబెఱింగి లక్ష్మణుడు తన లాఘవంబుచే రాక్షసునిపై బాణవృష్టిని గురిపించి మిక్కిలి నొవ్వంజేసెను తన సారథి నేలగూలుటయు, దాను సారథ్యంబుజేయు రధమును గనిపెట్టి లక్ష్మణుడు బాధించుటయుంగాంచి యుద్ధ గర్వంబును గోల్పోయి శోకాగ్నిలో గుములజొచ్చెను దుఃఖాగ్నిలో మునిగియున్న రాక్షస సుతుని వానరులు జూచి సంతసాబ్ధి నీదుచు సుమిత్రాసుతుని గొనియాడిరి అంతలోనే ప్రమాధియు, శరభుడు, రభసుడు, గంధమాదనుడు ననియెడు నల్వురు వానరవీరులు యింద్రజిత్తుని రధంబునకు బూన్చియున్న గుఱ్ఱంబులపైకి దుమికి నుగ్గు గావించి దివ్యరధంబును గూడ విఱిచి త్వరితంబుగ వచ్చి లక్ష్మణుని పార్శ్వంబున నిల్చిరి రధాశ్వంబులును, సారథియు వధింపబడుటంజూచి నేలకు డిగ్గి బాణవృష్టిని గురిపించుచు లక్ష్మణునిపైకి బోయెను లక్ష్మణుండదిగాంచి నిశతశరపరంపరలు నిశాచరునిపై బ్రయోగించెను

ప్రాణంబులపై నాశవీడి పోరాడుచున్న రాక్షసులను జూచి విరధుండగు రావణనందనుండిట్లనియె రాక్షసవీరులారా! సర్వదిశలను చీకటులావరించి యున్నవి తనవాడెవ్వడో శత్రువెవ్వడో, భేదము దెలియకున్నది నేనిదేపోయి రధంబారోహించి వచ్చెదను నేను బోయిన సంగతి వానరులకు దెలియకుండు చందంబున చక్కగా సమరంబు గావింపుచుండుడు దురాత్ములగు వానరులు నాకడ్డురాకుండ మోసపుచ్చుచుండడని యింద్రజిత్తు రాక్షసులతో జెప్పి వానరులను వంచించి రథంబుదెచ్చుటకై లంకాపురంబునకు బోయెను అట్లు బోయి మండోదరి పుత్రుండు మృత్యువశుండై యుత్తమ రథంబు నారోహించి పట్టణమునుండియు మరల వెలువడివచ్చెను లక్ష్మణ విభీషణులును, వానరులును నగరంబునకేగి రథగతుండై చనుదెంచిన యింద్రజిత్తును గాంచి వాని లాఘవంబున కమితాశ్చర్యమునొందిరి రావణపుత్రుండధిక

క్రోధోద్దీపితుడై బాణాగ్నిచే లెక్కకు మిక్కుటంబుగ వానరులను నేలగూల్చెను వానరులు సహింపజాలక భయపడి తమ నాథుండగు లక్ష్మణుని శరణుజొచ్చిరి లక్ష్మణుండమిత క్రోధావేశుడై ఎండిపడి హస్తలాఘవంబు జూపుచు యింద్రజిత్తుని చేతిలోనున్న ధనుస్సును ఖండించెను ఇంద్రజిత్తుగూడ తన హస్తలాఘవంబును వెల్లడిజేయుచు వింటినారెక్కుబెట్టెను దశరథసూనుండది గాంచి మూడు బాణంబులచే దానిని ఛేదించి ప్రాణాంతకమగునైదు బాణంబులను ఆతని వక్షస్థలంబున నాటంజేసెను ఆ శరంబులు రాక్షసుని దేహంబునందూరి కవచంబును ఛిన్నంబు గావించి రక్తసిక్తమై యెఱ్ఱని సర్పంబుల మాడ్కి నేలంబడినవి రావణపుత్రుండు రక్తంబు గ్రక్కుచు హస్తలాఘవంబుచే లక్ష్మణునిపై బాణవర్షంబును గురిపించెను లక్ష్మణుడా బాణవర్షంబునకు జడియక తన బాణంబులచే నివారించి రాక్షసులనందఱిని మూడేసి బాణంబులచే ప్రహరించి యింద్రజిత్తును నిశిత విశిఖంబులచే నొప్పించెను రాక్షసుండది జూచి దశరథసుతునిపై సందులేకుండునట్లు కఱకు బాణంబులను ప్రయోగించెను రథికోత్తముండగు రాజనందనుండు కత్తివాతి బాణంబున సారధి శిరంబుదొల్లనేసి గుఱ్ఱములను గూడ నొవ్వంజేసెను సారథి లేకున్నను తప్పుదారి నడువక చూపరులాశ్చర్యమొందునట్లు మండలాకారముగ దిరుగుచున్న గుఱ్ఱములు నేల గూలినందులకు రాక్షస సుతుండమిత క్రోధావేశుడై పదిబాణంబులను లక్ష్మణునిపై ప్రయోగించెను ఆ యింద్రజిత్తు బాణఘాతంబులకు కాంచన ప్రభలీనెడు లక్ష్మణుని యభేద్యమైన కవచంబు భగ్నమాయెను రావణాత్మజుండాయదను నెఱింగి మూడు బాణంబులచే దశరథాత్మజుని లలాటంబున నాటంజేసెను లక్ష్మణుడపుడు మూడు శిరంబులుగల పర్వతంబు భంగి నొప్పారు చుండెను పురుషోత్తముడును, రాక్షస సింహుడును, రక్తసిక్తంబులైన దేహంబులతో బుష్పించిన ఫలాశవృక్షంబుల మాడ్కి ప్రకాశించిరి ఆ సమయంబున రావణకుమారుడమితోద్రేకుడై రాక్షసేంద్రుడగు విభీషణుని, వానరులను, మూడు బాణంబులచే బాధించెను రావణానుజుడు క్రోధారుణలోచనుడై యింద్రజిత్తుని గుఱ్ఱములను గదచే నలియగొట్టి

చంపెను రావణాత్మజుండది జూచి రోషావేశుడై శక్తిని పినతండ్రిపై బ్రయోగించెను సుమిత్రాదేవి కూర్మి పట్టి నడుమనే విభీషణుని మీదికి వచ్చుచున్న శక్తిని నిశితశరంబులచే ఛేదించెను అది పఱియలై నేలబడెను విరథుడై యున్న రావణ కుమారుని వక్షంబుపై విభీషణుండు వజ్రసారంబులగు పంచబాణంబులను బ్రయోగించెను అప్పుడ య్యింద్రజిత్తు క్రుద్ధుడై యమునుదొసంగిన బాణంబును విభీషణునిపై బ్రయోగించుటకు దీసెను లక్ష్మణుడాతని పూనికనెఱింగి తనకు స్వప్నమందు కుబేరుడొసంగిన దివ్యబాణంబు గ్రహించెను ఆ లక్ష్మణేంద్రజిత్తులచే ధనుర్విముక్తములైన దివ్యబాణంబులు రెండును తారాపథంబునంతయు బ్రకాశింపజేయుచు ముఖము ముఖము దాకి యొండొంటితో నొరసికొన్నవి అమ్మహాబాణంబు లొండొంటి నొరసి కొన్నప్పుడగ్ని కణంబులు రాలుచు భయంకరముగా నుండెను కొంత తడవునకాబాణంబులు శాంతిని బొంది నేలబడినవి తమ దివ్యబాణంబు లవ్విధంబున ప్రతిహతములగుట కెంతయు నా వీరులు సిగ్గును కోపంబునుబొందిరి లక్ష్మణుడపుడు త్వరపడి వారుణాస్త్రంబును బ్రయోగించెను రౌద్రాస్త్రంబుచే దానిని రావణాత్మజుడు ప్రతిహతంబు గావించెను ఇంద్రజిత్తుకు పితుడై యాగ్నేయాస్త్రమును వదలెను లక్ష్మణుడద్దానిని సౌరాస్త్రముచేత నివారించెను వెంటనే రాక్షసోత్తముడు భయంకరంబగు నాసురాస్త్రంబును బ్రయోగించెను ఆ యాసురాస్త్ర ప్రభావంబునంజేసి ధనుస్సునుండి దేదీప్యమానంబులగు బాణంబులు ముద్గరంబులు, శూలంబులు, ముసలంబులు గదలు, ఖడ్గములు, నసంఖ్యాకములై వెలువడెను దశరథసుతుండు సర్వభూతములకును వారింపరాని యాసురాస్త్రంబును మహేశ్వరాస్త్రంబుచే నివారించెను భూతంబులన్నియు లక్ష్మణుని బరివేష్టించి నిల్చినవి మహర్షులు, పితరులు, దేవగంధర్వగరుడోరగాదులు దేవేంద్ర సహితులై యుద్ధమందు రాజకుమారుని రక్షించుచుండిరి

అప్పుడు లక్ష్మీ సంపన్నుడగు లక్ష్మణుడు ఐంద్రాస్త్రంబు నభిమంత్రించి వింటందొడగి దివ్యధనస్సును వంచి యాకర్ణాంతము

నాకర్షింపుచు బాణవరా! రాముడు ధర్మంబు దప్పని వాడును, సత్యసంధుడును, పౌరుషంబున నెదురులేని వాడును నగునేని నీవీ యింద్రజిత్తును వధింపుమని పలికి యైంద్రాస్త్రంబును బ్రయోగించెను అమ్మహాస్త్రము రావణాత్మజుని శిరంబును ఖండించి దేహమునుండి నేలబడద్రోసెను ఇంద్రజిత్తుని దేహము, ధనుస్సు, తనుత్రాణము, భూమిపైకి వ్రాలెను విభీషణాది వానరులందఱు మిగుల సంతోపించి సింహనాదంబులు గావించిరి ఆకసము నుండియు దేవతలు ఋషులు, గంధర్వులు, అప్సరసలు, మహాధ్వని గావించిరి రాక్షసులు రావణ కుమారుడు నేలబడినతోడనే సహింపజాలక దిక్కులకుంబఱచిరి కొందఱు లంకాభిముఖులై పరుగిడిరి కొందఱు మున్నీటంబడిరి మఱి కొందఱు పర్వతములందు దాగిరి సూర్యుడస్తమించిన పిదప కిరణంబులు నశించి పోవునట్లు యింద్రజిత్తు నేలబడిన తోడనే రాక్షసులు దిక్కుదెలియక దిక్కులకు బాఱిపోయిరి కొంతసేపు అవయవములను విదలించుచుండి జీవంబులు దేహమును వీడిన తోడనే రావణపుత్రుని కళేబరంబు కిరణ వారంబులులేని దినకరుని భంగి జూపట్టెను ఇంద్రజిత్తు మృతుండు కాగానే సమస్తారిష్టంబులు దొలగిపోవుటంజూచి లోకబాంధవుడు చక్కగా బ్రకాశించెను అమరగణంబులతోబాటు దేవేంద్రుడమితానందమొందెను దేవతలు దుందుభిని మ్రోగించిరి గంధర్వులు, అప్సరసలు నృత్యమాడిరి ఆ నృత్యమాడుచున్న ధ్వని శ్రవణపేయముగా వినబడెను లక్ష్మణు నెంతయు బ్రశంసించిరి జలంబులు దిశలు నిర్మలములయ్యెను దైత్యదానవులు సంతసించిరి బ్రాహ్మణులే బాధయులేక సుఖముగా విహరించెదరు గాక! యని దేవగంధర్వులు వచించిరి వానర ప్రముఖులందఱు పరమసంతుష్టులై శిలలు మొదలగు వానిని వాలంబులచే బగులగొట్టుచు ''**లక్ష్మణోజయంతి**''(లక్ష్మణుడు సర్వోత్కర్షంబున నున్నవాడు) అని చాటించిరి అమ్మహా బలుని వధించి లక్ష్మణుడమితానంద సాగరమునదేలియాడెను

## ఇంద్రజిత్తును వధించి వచ్చిన లక్ష్మణుని రాముడు శ్లాఘించుట

జాంబవంతుని, హనుమంతుని మొదలగు వానరులనందఱిని సుమిత్రాసుతుండు వెంటనిడుకొని యుద్ధభూమినుండి రామసుగ్రీవుల సన్నిధిక త్వరితముగ బోయి రామునకు బ్రదక్షిణ నమస్కారములుజేసి సంతోషాతిశయంబున నింద్రజిత్తు హతుండయ్యెనని చెప్పెను విభీషణుడమితానందాబ్ధినీదుచు రావణాత్మజుడు హతుండయ్యెను మహాత్ముడగు లక్ష్మణుడాతని మస్తకమును ఖండించెనని తన్మయుడై పలికెను రామచంద్రుడమితానందడోల నూగుచు లక్ష్మణా! నీవెంతయో ఘనకార్యంబుజేసినావు నిన్నెంతని కొనియాడగలను? ఇంద్రజిత్తు గూలుటంజేసి రావణుడు హతుండైనట్లే దలంపవలయును రమ్మని రాముడు తమ్ముని శిరంబును మూర్కొని సిగ్గుజెందియున్న లక్ష్మణుని మిగుల వాత్సల్యముతోనుత్సంగమున గూర్చుండబెట్టుకొని గాఢోపగూహనలోనుంచి మాటిమాటికి జూచి బాణంబులచే గాయంబులు పడియున్న దేహంబును దడవుచు మృదుమధుర వాక్యంబుల నాశ్వాసించి యిట్లనియె

తమ్ముడా! ఇంద్రజిత్తును బరిమార్చి నాకు శుభంబు జేకూర్చితివి కుమారుడు హతుండయ్యె ఇంక రావణుడు గూడ హతుండగుటలో నబ్బురమేమియులేదు నాకు విజయంబు సిద్ధము రావణుని కుడి భుజంబును ఖండించితివి విభీషణుడు, హనుమంతుడు, మూడహోరాత్రంబగలు శ్రమల కోర్చి యుద్ధంబుగావించి యింద్రజిత్తును వధించిరి రావణుడు కుమారుని మరణవార్త నాలకించి రణంబునకు రాకమానడు ఆ సమయంబు గుర్తెఱింగి వానరబలంబుతో బోడివి యారాక్షసేంద్రుని వధించెదను తదుపరి సీతను సులభముగా జేపట్టెదను చూడుమని రాముడు తమ్ముని కౌగిలించుకొని సంతుష్టాంతరంగుడై సుషేణుని బిల్చి యిట్లనియె సుషేణుడా! నీవు వైద్యశాస్త్రమందు పండితుడవు గదా! ఈ లక్ష్మణుని దేహమంతయు బాణంబులచే గ్రుచ్చబడియున్నది ఈ బాణంబుల బారినుండి తప్పించి సుఖపడునట్లు

చికిత్సజేయుము విభీషణుడు హనుమంతుడు, జాంబవంతుడాదిగాగల వారందఱి గాయములను మాన్పుమనెను వానరోత్తముడగు సుషేణుడు రాముని యాజ్ఞవేరకు దివ్యౌషధిని వాసన జూపెను అయ్యౌషధి నాఘ్రాణించిన తోడనే గ్రుచ్చుకొన్న బాణంబులూడిపోయి వేదనలుడిగి గాయంబులు మాని అందఱును సుఖంబు నొందిరి సుషేణుని చక్కని చికిత్సవలన నెప్పటియట్ల సంతోషాంబుధి నీదిరి రామలక్ష్మణులును, విభీషణుడును, సుగ్రీవాది వానరులందఱు నింద్రజిత్తును వధించిన సుమిత్రాసూనుని కొనియాడిరి

## ఇంద్రజిత్తు మరణవార్త నాలకించి రావణుడు దుఃఖించుట

రావణ సచివులు దు ఖించుచు బోయి రావణరాజా! విభీషణుని సహాయముతో మేమందఱు జూచుచుండగానే లక్ష్మణుడింద్రజిత్తును బరిమార్చెను పరాజయంబెఱుంగని మహాశూరుడు నేటితో దీరిపోయెనని వచించిరి దశగ్రీవుండు తన సుతుండు హతుండయ్యెనన్న దుస్సహంబైన వార్తనువిన్నతోడనే మూర్ఛనొందెను రాక్షసోత్తముడా భయంకరమైన పుత్రంమరణంబును మనంబునందలపోయుచు దీర్ఘకాలంబునకు దెలివొంది పుత్రశోకపీడితుడై దీనుడై విహ్వలంబైన యింద్రియములతో నిట్లు విలపించెను

అయ్యో! పుత్రరత్న! నా చిన్ని యనుంగుకొమరుడా! రాక్షససేన కంతయు ప్రముఖుడవై యుంటివే! పదునొకండువేలమంది విలుకాండ్రతో నందఱకునన్ని రూపులై పోరు సల్పుచుంటివే! అమరేంద్రుని జయించిన నీవేడ? లక్ష్మణుడేడ? నాయనా! లక్ష్మణునిచే నీవెట్లు మృతిజెందితివి? నీవుకినుక వహించినచో యముని సరకుగొనకుంటివి గదా! తీకణ బాణపరంపరలచే మందరశిఖరంబునైనను భేదింపగల నీకు మనుజ మాత్రుడెంత? యుద్ధమందు మృతిబొంది వీరస్వర్గమలంకరించుట సమస్త శూరులకును ముఖ్యముగా నపేక్షణీయమే నిన్నుగురించి దు ఖించుటంత

బావ్యముగాదు స్వామి కార్యార్థమై హతుండవై వీరస్వర్గమలంకరించితివి నీవు శోచ్యుడవుకావు సమస్త దేవతలును, దిక్పాలురును, మహర్షులును, ఇంద్రజిత్తు మరణవార్త నాలకించి నిర్భయులై హాయిగా నిదురింపగలరు ఇప్పుడు ముజ్జగంబులును, సమస్త భూమండలమును, ఇంద్రజిత్తులేని కారణంబున నాకు శూన్యములై తోచుచున్నవి పర్వత గుహలయందు యూథపతి మరణవార్త నాలకించిన యాడేనుగులుంబోలె నిద్రంజిద్వ్యథ నాలకించిన తోడనేయంత పురాంగనలు సేయురోదన ధ్వని నింతలోనే వినగలను హా! నేనేమి జేయుదును ఎందుబోదును కుమారా! యువరాజ్యలక్ష్మిని, లంకాపురంబును, రాక్షసులను, తల్లిదండ్రులను నీ యర్థాంగిని విడనాడి యెందుబోయితివి తండ్రీ! వీరశిఖామణీ! నీవునాకు ప్రేతకార్యంబులు సేయుదువని నమ్మియుంటినే! ఔరా! ఏమికాల వైపరీత్యము నేనే నీకు ప్రేతకార్యములు జేయునట్లు గావించి నీదారిని నీవేగితివా? నాయాపదలన్నియు దీర్చగలవని గంపెడాసతో నుంటిని రామలక్ష్మణులను, సుగ్రీవాది వానరులందఱిన వధింపకెందుబోయితివి వారందఱిని జీవంబులతో వదలి, నాయాపదను బోగొట్టకయే నన్నొద బాసిపోవుట తగునా? యని రాక్షసేంద్రుడు విలపించి పుత్రశోకంబుచే మితిలేని కోపంబునొందెను ఆతని పదిముఖంబులపై బడిన బొమముళ్లు ప్రళయకాలములో జలరాశి యందు మకరంబులతో గూడిన గొప్ప కరుళ్లవోలె నొప్పారినవి రావణుడావులించగా ముఖమునుండి ధూమ సహితమైన యగ్ని బయల్వెడలెను పుత్రశోకంబుచే బరితపించుచు క్రోధవశగతుండై కర్తవ్యంబు నాలోచింపక సీతాదేవిని వధింతెదనని బయలుదేరెను అప్పుడు రావణుడు భయంకరంబైన రుద్రుని మాద్కి గానబడుచుండెను రాక్షసులందఱు వెఱగంది మాటునకుబోయిరి రాక్షసేంద్రుడది జూచి పటపట పండ్లు గొఱుకుచు రాక్షసులారా! నేను పెక్కువేల సంవత్సరములు బ్రహ్మదేవుని గూర్చి ఘోర తపంబొనరించి వరంబులను బడసియున్నాడను బ్రహ్మదేవుని సంతోషపఱచినాను అమ్మహాత్ముడొసంగిన కవచంబును దాల్చి యుద్ధంబునకు బోయి రామలక్ష్మణులను దునుమాడి వచ్చెదను దేవేంద్రుడు గూడ నా

ప్రోలనిలువంజాలడు బ్రహ్మదేవుడనుగ్రహించి బాణసహితంబుగా నా కొసంగిన ధనువునిటు గొనితెండు ఇంద్రజిత్తు మాయాసీతను వానరుల యెదుట వధించినాడు నేనిపుడు నిజమైన సీతను వధించెదను చూడుడని సచివులతోజెప్పి కరవాలంబును గైకొని త్వరితంబుగ సీతాదేవిని వధింపబోయెను అప్పుడు రాక్షసులు సింహనాదంబు లొనరించుచు నీభయంకరాకారుండగు రావణుని జూచిన తోడనే రామలక్ష్మణులు భయపడి పాఱిపోగలరని యొకరినొకరు కౌగలించుకొనిరి రావణుడమిత క్రోధావేశుడై కుపితుడగు నంగారకుడు రోహిణి మీదికి బోవునట్లు సీత మీదికి బోయెను

## తనను వధియింపవచ్చుచున్న రావణుని జూచి సీత దుఃఖించుట

భయంకరముగా కరవాలమును ధరించి స్నేహితులు వారించినను వినక తన మీదికి వచ్చుచున్న రావణుని సీతాదేవి జూచి దిగులుపడి శోక వ్యాకులచిత్తయై యిట్లు విలపించెను అయ్యో! దురాత్ముడు నన్నాథనువోలె దలంచి చంపవచ్చుచున్నాడు నాధుడున్నాడని దలంపడయ్యె పతియే దైవమని భావించియున్న నాశీలమెఱుంగక నాకు భార్యవై నాతో రమింపుమని పాపాత్ముడు కోరి నానావిధములుగా బ్రేరేపించెను నేను తృణప్రాయముగా దిరస్కరించితిని నేనంగీకరింపకుండుటచే నైరాశ్యహృదయుడై కోపోద్రేకుడై నన్ను వధింపవచ్చినాడు నా నిమిత్తమై దురాత్ముడు రామలక్ష్మణులను వధించినాడేమో! అయ్యో! నేనెంత పాపాత్మురాలను నా నిమిత్తమై రామలక్ష్మణులకు వినాశము వాటిల్లినదే! పుత్రశోకముచే బీడింపబడుచు రామలక్ష్మణుల నెదిరింపజాలక నన్ను వధింపవచ్చినాడేమో! హనుమంతుడు జెప్పిన మాటలు విననొల్లనైతిని నేనెంత మొఱకురాలనో గదా! అనాడే హనుమంతుని వీపుపై గూర్చుండి పోయియున్నచో ప్రియుని యంకంబుపై జేరి సుఖముగా నుండెడి దానను ఈ దుఃఖమే నన్ను దరిజేరి యుండెడిది గాదు ఏకైక పుత్రుండు హతుండగుట నాలకించినచో కౌసల్యాదేవి యెంత

దు ఖించునో! పుత్రశోకమును భరింపజాలక నామె ప్రపంచమందానను వీడి యగ్నిలోగాని, జలములోగాని పడి ప్రాణంబులు గోల్పోవునేమో! ఇది నిశ్చయము దుష్టురాలగు మంథర నిమిత్తమువనె గదా! కౌసల్య కిట్లు దు ఖంబు సంభవించినది ఆ కుబ్జయగుమంథర దహింపబడుగాక! యని రాముని ధర్మపత్ని విలపించెను

రామచంద్రునెడబాసి యంగారక వశంగతయగు రోహిణివోలెనున్న సీతనుజూచి పార్శ్వుడను మంత్రిరావణునితో నిట్లులనియె రాక్షసేంద్రా! మంత్రులెంత వారించినను వినక సీతను వధింపబోవుచున్నావు నీవు కుబేరుని తమ్ముడవు మహాకులప్రసూతుడవు అట్టి నీవు ధర్మమునకు దూరుడవై క్రోధమునకు లొంగి రాముని భార్యనెట్లు వధింపగోరెదవు శూరుడవు సమస్త రాక్షసేశ్వరుండవు పండితోత్తముడవు సదా విహితకర్మంబు లాచరించుచుండెడి రాక్షసోత్తముడవు నీవిట్లు స్త్రీహత్య కొడంబడుట న్యాయమా! రూపసౌందర్యనిధియగు సీత నీ స్వాధీనమగు తెఱంగెయ్యదియో చక్కగా నాలోచింపుము రాముని ఎదిరించి నీ కోపాగ్ని చల్లార్చుకొనుము నేడే కృష్ణపక్ష చతుర్దశి యుద్ధమునకు బ్రయాణము గమ్ము, రేపు అమావాస్యయందు సమస్త సైన్య పరివృతుండవై రామ లక్ష్మణులను జయింపబోవుము శూరుడవు ధీమంతుడవు మహా రథుండవు, ఖడ్గాది సాధన సంపత్తిగల వాడవు ఉత్తమరథారూఢుండవై దశరథసుతుని బరిమార్చి సీతను బొందగలవు సందేహమావంతయులేదని సుపార్శ్వుడు రావణునకు జెప్పెను సుపార్శ్వుని వాక్యములాలకించి రాక్షసేంద్రుడు గృహంబునకేగి సుహృత్పరివేష్టితుడై మరల సభామండపమునకు విచ్చేసెను

## మూలబలమును రాముడు వధించుట

రావణుడు సభామండపమునకు వచ్చి దీనుడై శోకాగ్నిలో గుములుచు క్రుద్ధంబగు సింహంబు కరణి గాఢనిట్టూర్పులను బుచ్చుచు

సింహాసనాసీనుడై సేనాధ్యక్షులకు జేమోడ్పు గీలించి సేనాధిపతులారా! మీరందఱు యుద్ధమునకు బయలుదేరుడు సమరభూమియందు మీరందఱు రామునొక్కనినే జుట్టుముట్టి బాణవర్షంబు గురిపించి బరిమార్పుడు మీచేత రాముడు హతుండుగానిచో సమస్తలోకంబులు జూచుచుండ రేపు రాముని సులభముగా రూపుమాపెదను పొయిరందనిన సేనాధ్యక్షులు రాజాజ్ఞ మేరకు రథంబుల నారోహించి సైన్యసమేతులై వెడలి పరిఘంబులను, కరవాలంబులను, నానావిధాయుధంబులను వనచరులపై బ్రయోగించిరి వానరులు పాదపశిలాయుధంబులతో రాక్షసులను మోదిరి అవ్విధంబున భయంకరమైన తుములయుద్ధము సూర్యోదయ సమయంబున బ్రారంభమయ్యెను వానర రాక్షసులకు ఘోరయుద్ధము జరిగెను రుధిరవాహినులు బ్రవహించెను ఆ రక్తప్రవాహ నదులయందు రథంబులు తీరంబులుగాను, అశ్వంబులు మత్స్యంబులుగను, ధ్వజంబులు వృక్షంబులుగను, కళేబరంబులు తెప్పలుగను గోచరించుచుండెను వానరులు రక్త ప్రవాహమునందే జొరబడి రాక్షసులధ్వజములను, కవచములను రథాశ్వములను విఱిచివేసిరి

ఫలములతో దులతూగెడు వృక్షమును నానావిధములైన పక్షులు చుట్టుకొన్నట్లు యుద్ధమందొక్కొక్క రాక్షసునకు నూర్గురు వానరులు చుట్టుకొని ముట్టుబెట్టిరి పర్వతాకారులగు వృక్షచరులను నిశాచరులు గదలచే మోదుచు నీటెలచే బొడుచుచు కత్తులచే నఱుకుచు చేజిక్కినట్లెల్లను నొప్పించిరి అట్లు రాక్షసులచే వధింపబడుచు వనచరులు విషణ్ణులై సర్వలోక శరణ్యుడగు దశరథరాముని శరణు జొచ్చిరి రాముడది గాంచి క్రోధారుణలోచనుడై రాక్షస సైన్యములో జొరబడి బాణవర్షమును గురిపించెను గ్రీష్మర్తువు నందు మేఘంబులు దినకరుని సమీపింపజాలని చందంబున రాక్షసులు రాముని ప్రోలం నిలువంజాలరైరి కఱకు బాణంబులచే రాత్రించరులను మనుజేంద్రుడు ముట్టుబెట్టెను రాక్షసులు నేల గూలుచున్న రాక్షసులను, రథాశ్వములను, జూచుచుండిరే గాని సేనలో జొరబడియున్న రాముని జూడజాలరైరి సర్వవ్యాపకుండగు పరమాత్మను దెలియంజాలని భంగి రాక్షసులు రాముని బాణఘాతంబులకు గురియై

బాధననుభవించిరే గాని మెఱపు వోలె మెఱయు రాముని కనుగొనంజాలక వీడుగో రాముడు పట్టుడు, పొడువుడని భ్రమనొందుచు క్రుద్ధులై యొకరినొకరు వధించుకొనిరి ఆ రాక్షసులకు రాముడొక్కడుగను, సహస్రరాములుగను గానంబడుచుండెను నిశాచరులు మండలాకారముగ మెఱుమిట్లు గొల్పుచు ద్రిప్పబడుచున్న ధనుస్సు యొక్క కాంచనమయమై నయగ్రమును జూచిరేగాని దశరథసుతుని గానరైరి వాయువేగంబున సంచరించెడు యేడుకోట్ల రథములు, ఇరువది తొమ్మిదిలక్షలు మత్తకరీంద్రములు, పదుమూడు కోట్ల పండ్రెండు లక్షల యిరువది వేలు రౌతులతో గూడిన యశ్వంబులు, పదికోట్ల యిరువది లక్షల యఱువదివేలు పదాతులు, నూటనలుబదియైదు కోట్ల యెనుబది లక్షలు కామరూపులగు రాక్షసులు, చతురంగ బలంబులు, మూడు ముక్కాలు గడియలలోపల రాముని బాణాగ్నిచే దగ్ధమై పోయినవి హతశేషులగు రాక్షసులు భగ్నోత్సాహులై లంకాపురంబునకు వోయిరి

రాముడట్టిమహాకార్యంబు నొనరించినందులకు దేవ గంధర్వ సిద్ధాదులు ప్రశంసించిరి అప్పుడు రాముడు సుగ్రీవ విభీషణాది వానరోత్తములను గాంచి యిట్లనియె ఈ యస్త్రబలంబు నాకును, పరమేశ్వరునకును, మాత్రమే గలదు ఇట్టి బాణములు ప్రయోగించుట కన్యులకలవిగాదనెను ఆ మాటలు విని వారందఱు సంతోషించిరి దేవతలు సంతుష్టులై రాముని బ్రస్తుతించిరి

## మూల బలంబు నశించినందులకు రాక్షస స్త్రీలు దుఃఖించుట

హతశేషులగు రాక్షసులు రణరంగమునుండి వెనుకకు బారివచ్చి మూలబలంబు రామునిచే హతంబు జేయబడెనని తెలియజేసిరి ఈ వార్తనాలకించి రాక్షసస్త్రీలు దీనులై దుఃఖాబ్ధినీదిరి భర్తలను, పుత్రులను, బంధుజనంబులను యుద్ధమందు బోగొట్టుకొన్న స్త్రీలందఱు గుంపులు గుంపులుగా జేరి రోదనమొనరింప దొడంగిరి అయ్యో! శూర్పణఖ

యెంతకీడు దెచ్చిపెట్టెను వికృత రూపిణియై రాముని మోహింపనేల? అమ్మహాత్ముని యీ గుణహీనురాలెందుకు వరించెను ఈ రాక్షసిని యా పురుషోత్తముడెట్లు మోహించును? ఈ ముసలిదెంతకీడు గలిగించెను దీని నిమిత్తమువనే రావణుడు రామునితో వైరంబు బెంచుకొని, గొప్ప ముప్పుదెచ్చుకొనెను సీత యితనికెట్లు లభించెను మున్ను కబంధవిరాధులను, పదునాల్గువేల రాక్షసులను సంహరించిన రామునకే తప్పక జయంబు జేకూరగలదు దేవేంద్ర సుతుండగు వాలిని బరిమార్చి సుగ్రీవుని వానర రాజ్యాభిషిక్తుని గావించెను రావణుడు విభీషణుని హితవాక్యములాలకింపడయ్యెను కుంభకర్ణాదులను రాముడు వధించినను యమ్మహాత్ముని ప్రభావమును రాక్షసేంద్రుడెఱుంగజాలకున్నాడు లంకాపురంబున రాక్షస జనులింటింటను దుఃఖించుచున్నారు రాముడు లక్షలు లక్షలుగా రథంబులను, అశ్వమ్ములను, మదగజమ్ములను కదనరంగమందు దునుమాడియున్నాడు ఇమ్మహాత్ముడు మనుష్యమాత్రుడు కాడు మేమనాథులమైతిమి మాకిక జీవితాశలు లేవు రాముని బారింబడిన వారిని రక్షించు వారెవ్వరును లేరు రావణుడు రామునిచే వధింపబడుట తథ్యము రాక్షసవల్లభుండు బ్రహ్మచేత వరంబులను బడయునపుడు మనుష్యుల వలన భయంబు గలుగునని దలంపడయ్యెను దేవదానవుల వలనగాని రాక్షసుల వలనగాని నీకు భయంబు గలుగదని యాతని తపంబునకు మెచ్చి సురజ్యేష్ఠుడు వరంబొసంగియున్నాడు ఇప్పుడు మనుష్యుని వలన కీడు మూడనున్నది

బ్రహ్మదేవుని వరప్రభావంబున రావణుడు దేవతలను బాధింపదొడంగెను దేవతలు సహింపనోపక బ్రహ్మదేవుని గూర్చి తపంబొనరించిరి ఫలితము లభింపదయ్యె అమరేంద్రుడాదిగా గల దేవతలందఱు నొక్కటిగాజేరి శివుని గురించి తపస్సుజేసిరి అప్పుడు వృషభధ్వజుండు ప్రత్యక్షమై దేవతలను జూచి యిట్లనియె రాత్రించరులకు వినాశంబు గలిగించు స్త్రీ యొకర్తుక జన్మింపగలదు ఆబిడ్డ వలన రావణునితో గూడ రాక్షస జాతి నిర్మూలమై పోగలదని యమ్మహాదేవుడు దేవతలతో జెప్పి యుండెను దుర్వినీతుడగు రావణునిచే రాక్షసులందఱు

నశింపవలసి వచ్చెను అమ్మహాసాధ్వియే సీతాదేవి గాబోలును! మమ్ముల నీ యాపదనుండి గట్టెక్కించు వారలెవ్వరు? రక్షించునాధులెవ్వరు? విభీషణుడు రాముని శరణుజొచ్చి ధన్యుడయ్యెనని రాక్షసస్త్రీలందఱు నొకరి నొకరు కౌగిలించుకొనుచు దీనులై భయంకరముగ రోదన మొనరించిరి ప్రతి గృహమందును రాక్షసాంగనలు చేయురోదన ధ్వనిని రావణుడాలకించి గాఢ నిట్టూర్పులు బుచ్చి పరమోద్రేకముతో భయంకరాకారుడై దగ్గఱలో నున్న మహోదర మహాపార్శ్వ, విరూపాక్షడాదిగాగల వారలంజూచి చూపులతో దహించునేమో యన్నట్లు నాయాజ్ఞ మేరకు రాక్షస సైన్యమును యుద్ధమునకు వెడలింపుడనియె రాక్షసులు రావణుని మంగళశాసనంబ తిక్రమింపజాలక నమస్కరించి యుద్ధాభిముఖులై బయలుదేరి పోయిరి

## రావణుడు యుద్ధమునకు బయలుదేరుట

రావణుడు మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులను జూచి పకపక నవ్వి యిట్లనియె రాక్షస నాయకులారా! కుంభకర్ణుడు, ప్రహస్తుడు, ఇంద్రజిత్తుడాదిగాగల వారలను వధించినందులకు రామలక్ష్మణులను వధించి ప్రతీకారంబు గావించి తీరెదను నాధనుర్విముక్తంబులైన బాణ సమూహంబులచేత వానరసైన్యమును తండోపతండములుగ రూపుమాపెదను భర్తలను, కుమారులను, బంధువులను బోగొట్టుకొన్న రాక్షస స్త్రీలందఱు సంతోషాబ్ధినీదుచందంబున రామలక్ష్మణులను వధించెదను వానర కళేబరంబులచే భూమినంతయు గప్పివేసి గోమాయువులకును, గృధ్రములకును, సమస్త జంతుజాలంబులకును, మాంసాహారముల నొసంగి తృప్తి గావించెదను నా రథంబాయత్తంబు జేసి నాధనువు నిటుగొనితెండు పొండని యాజ్ఞాపించెను మహాపార్శ్వుడు సేనాధ్యక్షులకు సైన్యములు గొనితెమ్మని యాజ్ఞాపించెను సేనాదిపతులతి త్వరితంబుగా సైన్యములను సమకూర్చుకొని వచ్చిరి రాక్షసులు భయంకరమైన వివిధాయుధములను ధరించి బయలు వెడలిరి సారథి సహితంబుగా సేనాధ్యక్షుడెనిమిది గుఱ్ఱములను బూన్చిన రథంబును

గొనితెచ్చెను రావణుడాదేదీప్యమానంబగు రథంబు నారోహించెను మహాపార్శ్వుడును, మహోదరుడును, విరూపాక్షుడును రాజాజ్ఞ మేరకు రథంబుల నారోహించిరి రాక్షసులందఱు భయంకరముగ గర్జించుచు సింహనాదంబులు గావించి బయలుదేరిరి రాక్షస వల్లభుడు సేనాపరివృతుండై యమునివోలె యుద్ధంబునకు బయలు వెడలెను అమ్మహారథుండు రథంబారోహించి రామలక్ష్మణులున్న యుత్తర ద్వారంబున నిర్గమించెను ఆ సమయంబున సూర్యదేవుడు కాంతివిహీనుడయ్యెను కకుభంబుల యందు కాఱుచీకటు లలముకొనియె విహంగములు భయంకరముగ నఱచినవి భూమి కంపించినది వారివాహినులు నెత్తురు వర్షము గురిసెను అశ్వంబు లలసిపోయినవి ధ్వజాగ్రములందు గృధ్రంబులు వ్రాలినవి జంబుకములు భయంకరముగ గూసినవి రాక్షసనాథుని వామనేత్రమదిరినది ఎడమ భుజము చలించినది ముఖము తెల్లబారెను కంఠస్వరము తగ్గిపోయినది రావణునకు మరణంబుగలుగుననియెడు దుర్నిమిత్తంబులు గోచరించినవి అమంగళముగ కాకులు, గ్రద్దలు గుమికూడి కూసినవి మహాధ్వనిగదుర తారాపథము నుండి ధూమరహితమైన నిప్పుపడినది మృత్యు ప్రేరితుండగు రావణుడీదుర్నిమిత్తంబులను సరకుగొనక ముందునకు సాగిపోయెను

రాత్రించరులరథధ్వని నాలకించి వానరసైన్యము యుద్ధమునకు సిద్ధమై యెదురుగా నిలువంబడెను ఒకరికొకరు విజయంబు నపేక్షించుచు వానర రాక్షసులు తుముల యుద్ధంబు గావించిరి అప్పుడు దశగ్రీవుడు వానరసేనలంజొరబడి బాణాగ్నిని గురిపించెను ఆ బాణాగ్నిచే వనచరులు గుండెలు, తలలు, చెవులుదెగి నేలబడినవి మఱికొందఱికి కన్నులు బోయినవి రావణాసురుని బాణవేగంబునకు వృక్షచరులు సహింపజాలరైరి రణరంగమంతయు వనచరుల కళేబరంబులచే నిండిపోయెను వాయువు వారివాహినులను బారదోలు చందంబున రాక్షస నాథుండు వానరసేనలను బాఱదోలుచు రాముని మీదికి బోయెను వానరులు పరాజయమొందు పరుగిడుటంజూచి సుగ్రీవుడు సేనా సంరక్షణమునకు సుషేణుని నియమించి యుద్ధంబు జేయబూని

వృక్షంబునొకదానిని బెల్లగించుకొని శత్రుసంహారార్థము బోయెను వానరులు పాదప పర్వతంబులనం గైకొని వానరనాథుని వెంబడించిరి మహాకాయుండగు సుగ్రీవుడు గర్జించుచు రాక్షసులను వధింపుచు వేట రాక్షసులమీదికి బోయెను ప్రళయకాలంబున జంఝామారుతము వృక్షములను నేలబడవైచు భంగి రాక్షస వీరులను బడద్రోసెను

## సుగ్రీవుడు విరూపాక్ష మహోదరులను జంపుట

విహగ సముదాయములపై సరణ్యమందు మేఘము శిలావర్షంబు గురియుచందంబున సుగ్రీవుడు రాక్షససేనలపై పర్వతంబులను గురిపించెను ఆ పర్వత వృష్టిచే రాక్షసులు చిత్తునియలై పర్వతంబుల మాడ్కి నేలంగూలిరి విరూపాక్షుడది గాంచి ధనుర్ధరుడై రథంబు నుండి యేనుగుపై కెగిరి సింహనాదంబు గావించుచు తన నామంబును జాటించుకొనుచు వానరులపై కదరెను పారిపోవుచున్న రాక్షసులకు ధైర్యంబును బురికొల్పి సుగ్రీవునిపై బాణంబులను బ్రయోగించెను సుగ్రీవుడు బాణపీడితుండై రౌద్రాకారుడై మహీరుహంబు నొక్కదానిని బెల్లగించి విరూపాక్షుని యేనుగు ముఖంబుపై గొట్టెను అమ్మదగజంబు ఘీంకారమొనరించుచు నేలబడి మృతి నొందెను విరూపాక్షుడేనుగుపై నుండి త్వరితంబుగ డిగ్గి సుగ్రీవుని మీదికి బోయెను వానరోత్తముడు తనమీదికి వచ్చుచున్న రాక్షసునిపై బెనుశిల నొక్కదానిని విసరెను విరూపాక్షుడమ్మహా శిలబారినుండి తప్పించుకొని సుగ్రీవుని కరవాలంబుచే బ్రహరించెను వానరవీరుండాదెబ్బకు గొంత తడవు మూర్ఛిల్లి విహ్వలుడై వెంటనే లేచి పిడికిలి నలవరించి విరూపాక్షుని వక్షస్థలంబునం బొడిచెను ఆ ముష్టిఘాతంబునకు రాక్షసుడమిత కోప పరవశుండై ఖడ్గంబుచేత సుగ్రీవుని కవచంబును ముక్కలు జేసెను ఆ దెబ్బకు సుగ్రీవుడు కాళ్లు జాచి నేలంబడి మగుడిలేచి వజ్రాయుధంబునకు సాటివచ్చు తన యఱచేలితో విరూపాక్షుని గొట్టబోయెను రాక్షసుండది జూచి తప్పించుకొని వానరేంద్రుని రొమ్ముపై దన పిడికిటం బొడిచి యేమఱియుండెను సుగ్రీవుడాతరుణంబు గనిపెట్టి

రాత్రించరుని నొసట నఱచేతందట్టెను ఆ దెబ్బచేత విరూపాక్షుడు పర్వతంబు నిర్ఝరుల నుండి జలంబును వదలినట్లు నవరంధ్రములనుండి నెత్తురు గ్రక్కుచు రక్తసిక్తాంగుడై నేలగూలెను ఆ వికృత స్వరూపుండగు విరూపాక్షుని వానరరాక్షసులందఱును జూచిరి వేదనచే యెగిరెగిరి పడుచు బొరలాడుచున్న విరూపాక్షుని వానరులు జూచిరి వానరరాక్షసులు క్రోధ దుఃఖంబులనియెడు గంగాప్రవాహంబువోలె నుప్పొంగి ఘోరయుద్ధంబు గావించిరి అమ్మహా ఘోరసంగ్రామ మందుభయసైన్యములును నిదాఘకాలమందు కాసారములలో జలంబు క్షీణించుకరణి క్షీణించిపోయినవి

విరూపాక్షుడని మొనంగూలుటకెంతయు రాక్షస వల్లభుండు క్రుద్ధుడై వ్యథజెంది చెంతనున్న మహోదరుని జూచి రాక్షస వీరశిఖామణీ! ఈ కష్టకాలమందు నీ వలననే నాకు జయంబు గలుగవలయును నీవు స్వామిభక్తి పరాయణుండవు నాయుప్పుదిని వృద్ధి జెందితివి నాకు బ్రత్యుపకారంబుసేయు సమయమిదే! రణకోవిదుండవు తప్పక జయంబు బొందిరమ్ము పోయిరమ్మనిన తోడనే మహోదరుడుప్పొంగి శలభమగ్నిని జొచ్చువిధంబున శత్రుసైన్యములో జొరబడెను వానరోత్తములందఱు గుమిగూడి పెనుశిలలను గైకొని రాక్షస సేనంజొచ్చి రక్కసులను రూపుమాపిరి మహోదరుండదిగాంచి క్రోధావేశుడై నిశితశరంబులను బ్రయోగించి వానరుల పాదములను, హస్తములను, తొడలను ఖండించెను రాత్రించరుని బాధకోర్వజాలక వృక్షచరులు దశదిశలకు బాఱిపోయిరి కొందఱు సుగ్రీవుని మఱుగుజేరిరి వానర రాజేంద్రుడది జూచి మహోదరుని మట్టుబెట్టుటకు బోయెను రాక్షసుని సమీపించి వానరోత్తముడొక పెనుశిలను గైకొని రాక్షససేనంజొచ్చి యాతనిపైకి విసరెను మహోదరుండు తనపైకి వచ్చుచున్న మహాశిలను బాణంబులచే ఖండించెను అమ్మహాశిల వేయిపఱియలై నేలబడెను సుగ్రీవుడావిచిత్రమును గాంచి భూజంబు నొక్కదానిని గైకొని మహోదరుని గొట్టెను రాత్రించరుడా వృక్షమును ఛేదించెను ఆ వృక్షముగూడ వ్యర్థమై పోయినందులకు వృక్షచరుండు క్రుద్ధుడై నేలబడియున్న పరిఘంబునొకదానిని దీసికొని గిరగిరంద్రిప్పుచు

గుల్మంబులను నేలబడగూల్చెను మహోదరుండ రథంబు డిగ్గి గదను వేతబూని సుగ్రీవునిపై వేసెను వానరేశ్వరుండది గాంచి పరిఘంబుచే దనపైకి వచ్చుచున్న గదను గొట్టెను గదాపరిఘంబులు రెండును ఒండొంటిందాకి భిన్నములై నేలబడినవి అంతలో సుగ్రీవుడొక ముసలంబును గైకొని మహోదరునిపై వైచెను అతడు తన గదచేత ముసలంబును గొట్టెను రెండును ముక్కలై నేలంబడినవి ఉభయులకు నాయుధములు భగ్నములై పోయెను ఇక చేయునదిలేక ముష్టియుద్ధమునకు గడంగిరి అమ్మహావీరులు బాహుయుద్ధంబుజేసి చేసి యలసట నొందిరి

కొంతతడవునకు మహోదరుండు నేలబడియున్న ఖడ్గమును పలుకను దీసికొనెను వానరోత్తముడది గ్రహించి నేలబడియున్న మహాఖడ్గమును, డాలును గ్రహించెను శస్త్ర విశారదులగు మహోదర సుగ్రీవులు రోషంబినుమడింప గర్జించుచు సింహనాదంబులు గావించిరి ఒకరినొకరు జయించు తమకంబున నానావిధములుగా బోరాడిరి మహోదరుడు గర్వించి ఖడ్గమును గుఱిదప్పి సుగ్రీవుని చేతిడాలు మీదవేసెను అది పలుకయందు గ్రుచ్చుకొనెను రాత్రించరుండు దానిని లాగుచున్న సమయంబెఱింగి సుగ్రీవుడాతని శిరంబునెగురగొట్టెను అవ్విధంబున మహోదరుని శిరంబు నేలబడుటంజూచి రాక్షసులు పరుగెత్తి పోయిరి సుగ్రీవుడమితానంద సాగరంబున దేలియాడుచు వానరులతో గూడ సింహనాదంబులు గావించెను జయలక్ష్మిని చేపట్టి వెలుగొందుచున్న వానరేశ్వరుని దేవతలు, యక్షులు, సిద్ధులు భూమియందలి ప్రాణివర్గంబులును పరమామోదంబున బ్రస్తుతించిరి

## అంగదుడు మహాపార్శ్వుని సంహరించుట

మహోదరుడు నేలబడుటను మహాపార్శ్వుండు జూచి క్రోధారుణ లోచనుడై భయంకరమైన యంగదుని సైన్యంబు జొచ్చి తీవ్రనారాచమ్ములచే నొవ్వంజేసెను మఱియు వాయుదేవుడు ఫలంబులను వృంతములనుండి

పడద్రోయుభంగి మేటి వానరవీరుల మస్తకంబులను బాణంబులచే నేలబడద్రోసెను కొందఱు రాక్షసుని బాణఘాతంబులచే మూర్ఛిల్లిరి అంగదుడది జూచి ప్రళయకాలమందు పయోరాశి యుప్పొంగునట్లు మహావేగంబున నినుపగుదియను గైకొని మహాపార్శ్వునిపై బడవైచెను ఆ దెబ్బచేత రాక్షసుడు సారథి సహితంబుగా మూర్ఛిల్లి రథంబునుండి నేలబడెను కాటుక రాశివంటి మేనుగల జాంబవంతుడు భల్లూక సైన్య సమేతుడై పర్వత శిఖరంబులచే మహాపార్శ్వుని గుఱ్ఱములను జంపి రథంబు నుగ్గుగావించెను అంతలో నిశాచరుండు మూర్ఛదేఱి యంగదునిపై బెక్కు బాణంబులు ప్రయోగించి నొప్పించెను జాంబవంతుని, గవాక్షుని, నిశితశరంబులచే బాదించెను అంగదుడదిగాంచి క్రుద్ధుడై భయంకరమైన యినుపగుదియను గైకొని గిరగిరంద్రిప్పి మహాపార్శ్వునిపై బడవేసెను ఆ దెబ్బచేత బాణసహితమైన ధనుస్సును తలపైనున్న బొమిడికమును నేలబడెను అతి త్వరితంబుగ వాలిసుతుండాతని సమీపించి కుండలాకృతంబగు నతని కర్ణమూలంబున నఱచేతండట్టెను అమ్మహాపార్శ్వుడమిత క్రోధావేశుడై గండ్రగొడ్డలిని కరంబునంబూని వానరోత్తమునిపై వేసెను అంగదుడాపరశ్వధంబుబారి నుండి లాఘవంబున దప్పించుకొని వజ్రసమానమైన పిడికిలిని యులవరించి వక్షస్థలంబుపై గొట్టెను ఆ ముష్టిఘాతంబుచే మహాపార్శ్వుని గుండెపగిలి ప్రాణంబులను గోల్పోయి నేలంగూలెను రాక్షససేనలు భయమంది పరుగులిడెను వానరులు సంతోషించి సింహనాదంబులు గావించిరి రావణుడమిత క్రోధారుణలోచనుడై మరల యుద్ధమున కభిముఖుడై నిల్చెను

## రావణుడు యుద్ధమునకు వెడలుట

మహాబలశాలురగు విరూపాక్షుండు, మహోదరుండు, మహాపార్శ్వుడు, నేలబడుటంజూచి రావణుడు కుపితుడై నేనిదే పోయి రామలక్ష్మణులను వధించి రాక్షసలోకంబున కమితానందమొన గూర్చెదను రథంబును దోలుమని సారథి కనుమతి నొసంగెను వానరోత్తములు

శాఖలుగను, సీత పుష్పములుగను, కళలొలికెడు రామవృక్షమును తుత్తునియలు గావించెదననుచు రథధ్వని నలుదెసలకు వ్యాపింప త్వరితంబుగ రాముని మీదికి బోయెను అప్పుడు వసుధాతలంబు కంపించెను లోకనాశనకరంబగు తామసాస్త్రమును రావణుడు వానరులపై బ్రయోగించి దగ్ధముగావించెను విరించి నిర్మించిన తామసాస్త్రమున కెదురొడ్డి నిలువంజాలక వనచరులు పరుగెత్తిరి ఇవ్విధంబున వానరసేనలు భంగమొందుటను రాముడెఱింగి యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను

అప్పుడుపద్మపత్ర విశాలాక్షుని, దీర్ఘబాహువులు గలవానిని, అత్యున్నతంబగు ధనువును దాల్చియున్నవానిని, రావణుడు జూచెను రాముడు లక్ష్మణ సహితుడై తనమీదికి వచ్చుచున్న రావణుని గాంచి ధనువునారి సారించెను ధనుర్విష్ఫారణంబు వలన బుట్టిన మహాధ్వనికి వానర రాక్షసులు తండోపతండములుగ భయపడినేలబడిరి రామ లక్ష్మణుల యెదుట నిల్చిన రావణుడమావాస్యయందు చంద్రసూర్యుల సన్నిధిలో రాహువువోలె బ్రకాశించెను లక్ష్మణుడు రావణునితో బోరనిచ్ఛ గలవాడై యగ్నిజ్వాలనుబోలిన కఱకు టమ్ములను బ్రయోగించెను మహాపరాక్రమశాలియగు రాక్షసనాథుండా బాణంబులన్నిటిని తారాపథ మందే తనబాణంబులతో దనలాఘవంబును వెల్లడించుచు వారించి, లక్ష్మణునతిక్రమించి పర్వతమువోలె నిశ్చలుడైయున్న రాముని మీదికి బోయి మహాక్రుద్ధుడై బాణవర్షంబు గురిపించెను జలధారల వోలె నిరంతరముగా రావణుడు ప్రయోగించిన బాణంబులను రాముడు కత్తివాతి బాణంబులందీసి ఖండించివైచెను

రామరావణులు చిత్రవిచిత్రముగా సవ్యాపసవ్య మండలంబులు దిరుగుచు ఘోరసంగ్రామ మొనరించిరి వీరియుద్ధంబు ప్రళయంబు గలిగించునేమోనని సర్వభూతనికరంబులును భయంబు నొందినవి రామరావణులు ప్రయోగించిన శరంబులచే గప్పబడి కదనరంగమంతయు గాఢాంధకార బంధురమైయుండెను వారిరువురును గొప్ప విలుకాండ్రు సమస్తాయుధములనెఱింగిన సమర్థులు, దివ్యాస్త్రముల మర్మ

మెఱింగినవారు అందువలన సరిసమానముగా సమరంబున విహరించిరి రావణుడు తన లాఘవంబునెఱుక బరచుచు రాముని లలాటభాగమందు శరపరంపరలను జొప్పించెను తన శిరంబున నాటిన బాణంబులను రాముడు సరకుజేయక క్రోధావేశుడై రౌద్రాస్త్రమంత్రంబుల జపించుచు పెక్కుబాణమ్ములను రావణునిపై బ్రయోగించెను దశరథసుతుండు ప్రయోగించిన విశిఖంబుల నన్నిటిని రాక్షసనాథుండు ఖండించి మహాభయంకరమైన యాసురాస్త్రంబును బ్రయోగించెను అయ్యాసురాస్త్రంబు నుండి సింహముఖంబులును, వ్యాఘ్రముఖంబులును, గంకాస్యంబులును, కాకవక్త్రంబులును, గృధ్రశ్యేనవదనంబులును, జంబుక, వృకమొగంబులు గలవియును వక్త్రంబులను దెఱచుకొని బాణంబులెన్నియో బయలువెడలినవి ఆ నిశితశరంబులన్నిటిని మాయామయంబగు రావణుడు రామునిపై బ్రయోగించెను రాముడధికోత్సాహుడై యాగ్నేయాస్త్రంబును బ్రయోగించి యయ్యాసురాస్త్రంబులను ఖండించెను రావణుని బాణంబులన్నియు నాకసంబుననే వేయి పఱియలుగా భగ్నంబులైనవి అదిజూచి కామరూపులగు సుగ్రీవాది వానరులందఱు రాముని బరివేష్టించి పరమామోదమందుచు సింహనాదంబు గావించిరి దశకంఠుడది జూచి కుపితుడై మయుడు సంపాదించిన రౌద్రాస్త్రమును రామునిపై బ్రయోగించెను రాముడది యెఱింగి గాంధర్వాస్త్రముచే రావణుని రౌద్రాస్త్రమును ప్రతిహతంబుగావించెను రాక్షసేశ్వరుండు మఱింత కోపోద్రేకుడై సౌరాస్త్రమును బ్రయోగించెను ఆ సౌరాస్త్రంబును గూడ రాముడు భగ్నంబు గావించెను రావణుడు క్రోధారుణలోచనుడై పదిబాణంబులచే మనుజేంద్రుని బాధించెను రాముడధిక క్రోధావేశుడై రావణుని సమస్తావయవములందును బాణంబులను జొప్పించెను ఆ శరఘాతంబులచే రావణుడు మిగుల బాధజెందెను

## లక్ష్మణుడు మూర్ఛిల్లుట

అంతలో లక్ష్మణుడు యేడు బాణంబులను దీసి రావణుని ధ్వజంబును దుత్తునియలుగా ఖండించి, మఱొక్క బాణంబుచే రావణుని సారథి శిరంబును దెగవ్రేసెను అంతటితో దనివిజెందక లక్ష్మణుడైదు బాణంబులచే రావణుని ధనుస్సును ఖండించెను విభీషణుడాతరుణంబు గనిపెట్టి రావణుని యుత్తమాశ్వంబులను గదచే వధించెను విభీషణుడు తనకు గావించిన యపకారమును దలపోసి మహాక్రోధంబు వహించి దేదీప్యమానంబగు శక్తినాతనిపై బడవైచెను ఆ శక్తి విభీషణుని దాకకమునుపే లక్ష్మణుడు బాణత్రయంబుచే ఖండించెను ఆ ఖండింపబడిన శక్తి మూడు తునియలై యాకసంబునుండి పెద్దకొఱవి వోలె నేలబడెను రావణుడది జూచి క్రుద్ధుడై జ్వలింపుచున్న మహాశక్తిని దీసి గిరగిరంద్రిప్పి విభీషణునిపై వేయుటకు సంసిద్ధుడాయెను సుమిత్రాసుతుండు రావణానుజునకు బ్రాణాపాయంబు సంభవించుటంజూచి రక్షంపదలంచి త్వరితంబుగ బోయి యతని కడ్డముగా నిలువంబడి రాక్షసేంద్రునిపై బాణవర్షంబు గురిపించెను ఆ బాణవర్షంబు గురియుచుండుటంజేసి విభీషణునిపై రావణుడు శక్తిని బ్రయోగింప జాలక మహోద్రేకుడై లక్ష్మణుని జూచి యిట్లనియె

ఓరీ! లక్ష్మణా! నీవు ముందునకు వచ్చితివి విభీషణునిశక్తి బారింబడక రక్షించితివి ఇదే చూడుము ఈ శక్తిని నీపై బడవైచెదను శూరుండవైతే తప్పించుకొమ్మని పలికి శక్తిని లక్ష్మణునిపై బ్రయోగించెను మాయాబలంబుచే నిర్మింపబడి శత్రువులపై బ్రయోగించినపుడు వ్యర్థముగాని యమ్మహాశక్తి లక్ష్మణునిమీది కడరెను రాముడద్దానిని జూచి సుమిత్రాసుతునకు శుభమువేకూరుగాక! శక్తి వ్యర్థమగుగాక! యని పలికెను అంతలోనే శక్తి వచ్చి నిశ్చలుడై నిల్చియున్న లక్ష్మణుని వక్షంబును భేదించెను వెంటనే యాతడు నేలబడెను సమీపముందేయున్న రాముడది జూచి దుఃఖించెను కన్నీరు కాల్వలై ప్రవహింపదొడంగెను ఏమియు దోచదాయెను అట్లు కొంతతడవు చింతా సాగరంబున నీదుచుండు ఖముసకిది సమయము గాదు రావణుని వధింప నిశ్చయించితినని

బలికెను అప్పుడు వానరులాశక్తిని విఱువంబూనిరి కాని యెంత ప్రయత్నించినను విఫలమనోరథులైరి లక్ష్మణుని భేదించి నేలబడియున్న శక్తిని రాముడు జూచి రెండుచేతలంబట్టి విఱిచివైచెను ఆశక్తిని వంచుచున్న సమయంబెఱింగి రావణుడు కఱకు బాణంబులను రామునిపై బ్రయోగించెను దశరథరాముడాబాణజాలంబును సరకుసేయక సుమిత్రా సూనుని కౌగిలించుకొని, హనుమంతుని, సుగ్రీవాది వానరోత్తములను జూచి మీరందఱు నాతమ్ముని బరివేష్టించి రక్షింపుచుండుడు బహుకాలంబు నుండియు గాంక్షలూరుచున్న చాతక పక్షి వర్షాకాలమందలి మేఘంబు గానంబడిన చందంబున పాపాత్ముడిప్పుడు నాకంటబడినాడు ఈ రావణు నిప్పుడు తప్పక వధింపవలయును వానరులారా! నా ప్రతిజ్ఞను వినుడు మీయెదుటనే రావణుడో రాముడో హతుండగుటను జూడగలరు

## రావణుడు యుద్ధభూమి నుండి పాఱిపోవుట

రాజ్యభ్రష్టుడనై దండకారణ్యంబున విహరించుచు భార్యను గోల్పోయిన క్లేశంబును, లక్ష్మణుడు మూర్ఛిల్లుటవలన గలిగిన నరక సమానంబగు క్లేశంబును - రావణుని యుద్ధమందు రూపుమాపి పోగొట్టుకొనెదను ఎవ్వని కొఱకు వాలిని వధించి సుగ్రీవునకు వానర రాజ్యాభిషేకంబు గావించితినో! ఎవ్వని వధించుటకై సముద్రమునకు సేతువునునిర్మించి వానరసేనలతో నిచటికి వచ్చితినో! వాడే నేడు నాకంట బడినాడు ఈ పాపాత్ముడు విషసర్పంబు బారికెంబడిన వాడు జీవింపని మాడ్కి నా దృష్టి పథంబునంబడిన రాక్షసుడిక జీవింపజాలడు వానరోత్తములారా! మీరందఱు పర్వతాగ్రములపై గూర్చుండి రామ రావణుల యుద్ధమును జూచుచుండుడు గంధర్వచారణులును, ముజ్జగంబుల యందున్న వారలును, నా రణకౌశలంబును జూచి నేనే రాముడని గ్రహించెదరు చూడుమని నిశితశర పరంపరలచే రావణుని నొవ్వంజేసెను రావణుడది జూచి దేదీప్యమానంబులగు కఱకుటమ్ములను, ముసలంబులను జలధర జలధారలు గురియు చందంబున రామునిపై

రావణుడు గురిపించెను అవ్విధంబున రామరావణులొండొరులపై ప్రయోగించుకొనియెడు బాణంబుల ధ్వని సర్వభూతములకును భయము గలిగించి తారాపథమునందుకొని చెలరేగినది మహాధనుర్ధరుండగు రాముని బాణవర్షంబున కాగజాలక నొచ్చి పరమపీడితుండై వాయుదేవునిచే దఱుమబడిన వారి వాహినికైవడి రావణుడు పరుగిడిపోయెను

## మూర్ఛలో మునింగియున్న తమ్ముని జూచి రాముడు దుఃఖించుట

రక్తసిక్తాంగుడై నేలబడియున్న తమ్ముని గనుంగొని నయనాశ్రువులను రాల్చుచు సుషేణుని జూచి రాముడిట్లు పలికెను సుషేణా! వీరశిఖామణియగు లక్ష్మణుడు రావణునిచే గొట్టబడి మహీతలంబునంబడి సర్పంబువోలె బొరలుచున్నాడు నా ప్రాణంబుల కన్నను మిన్నయగు తమ్ముడిట్లు బడియుండుటచే నా హృదయము బ్రద్దలగుచున్నది విహ్వలమానసుడనై నేనెట్లు యుద్ధంబు గావింతును శుభలక్షణ సంపన్నుడును, సద్గుణనిధియునగు లక్ష్మణుండొకవేళ మృతుండయ్యేనేని నాకీప్రాణంబులేల? సుఖమెందుకు? నా యెదుటనే నా తమ్ముడిట్లు హతుండయ్యేనేని నాకెంత సిగ్గు ధనుస్సుచేతి నుండి జాఱిపోవు చున్నది బాణంబులు బలహీనములైనవి కన్నీటిధారలడ్డు తగులుటచేత నేమియు గానబడకున్నది నాకిక ప్రాణంబులపై నాశలేకున్నది గాథనిట్టూర్పులు బుచ్చుచు పరమపీడితుడైయున్న లక్ష్మణుని జూడుమని సుషేణునితో జెప్పి యింద్రియముల స్వాధీనత దప్పి రాముడిట్లు విలపింప దొడంగెను

ఆహా! నా తమ్ముడు యుద్ధమందు హతుండై ధూళిలో బొరలుచున్నాడే! ఇంక నాకీ యుద్ధమేల? ప్రాణంబులెందుకు? సీతతో నాకేమి ప్రయోజనమున్నది? నాకురాజ్యమేల? ప్రతిదేశమందును భార్యలు మిత్రులు దొఱకుదురు తోబుట్టినవాడు దొఱకుదేశమేదియు లేదు గదా!

నా తమ్ముని నేనెట్లుబడయుదునని యింద్రియముల స్వాధీనత దప్పి విలపించుచున్న రాముని సుషేణుడుచిత వాక్యములచే నాశ్వాసింపుచు నిట్లు పలికెను రామా! లక్ష్మీవర్ధనుడగు లక్ష్మణుడు మృతుండుకాడు ఎందుకనగా నీతని ముఖము వివర్ణమై దోపక ప్రసన్నముగా నున్నది అఱచేతులను జూడుము కెందామరలవోలె నెఱ్ఱగా నున్నవి నేత్రములు కలకల లాడుచున్నవి విగతజీవులైన వారలకిట్టి రూపముండదు సుమిత్రాసుతుండు దీర్ఘాయువుగలధీశాలి నీ తమ్ముడు సజీవుడై యున్నాడు నీవు దుఃఖింపవలదు ఊరడిల్లుమని రామునితో సుషేణుడుచెప్పి, హనుమంతుని జూచి యిట్లనియె

## లక్ష్మణుడు మూర్ఛదేఱి లేచుట

మారుతీ! మునుపు నీకు జాంబవంతుడెఱింగించిన మంగళ కరంబగు నోషది పర్వతంబునకేగి విశల్యకరణి, సువర్ణకరణి, సంజీవకరణి, సంధానకరణియనను మూలికలను గొనిరమ్ము త్వరితంబుగపోయి రమ్మనిన తోడనే హనుమంతుడతి త్వరితంబుగ నయ్యోషధి పర్వతంబునకేగి యమ్మహౌషధిస్వరూపము దెలియనందున గొంతతడవు చింతించి దీర్ఘముగా నాలోచించి యమ్మహాశిఖరంబునే గొనిపోయెదను విశల్యకరణి దొరకలేదని సుషేణునితోజెప్పి మగుడివచ్చుట నాలస్యమగును లక్ష్మణునకు గీడు మూడునని పవన తనయుండు దలపోసి పర్వత శిఖరంబును బెకలించి యెత్తుకొని యాకాశమార్గంబున వచ్చెను అట్లు వచ్చి రామాదులను, సుషేణుని జూచి పర్వతంబునచట దించి యిట్లనియె సుషేణా! నీవు జెప్పిన మూలికలను గుర్తింపజాలక నోషధిపర్వత శిఖరంబునే గొనితెచ్చితిని చూడుమనెను అప్పుడు సుషేణుడమితానంద కందళితహృదయుడై మారుతాత్మజుని శ్లాఘించి యమ్మహౌషదిని బెల్లగించి యెత్తెను వానం రాక్షసులిదిజూచి యాశ్చర్య నిమగ్నులైరి సుషేణుడమ్మహౌషధిని నలిపి మహాత్ముడగు లక్ష్మణుని ముక్కులో బిండెను సుమిత్రాసూనుండా

మూలికనాఘ్రాణించిన తోడనే యలుగు ఏది బాధలేనివాడై త్వరితముగ భూమిపై నుండి లేచెను మృతుండై మరల సజీవుండైన లక్ష్మణుని జూచి వానరులు సుషేణుని బ్రశంసించిరి రాముడమితానంద సాగరంబున దేలియాడుచు తమ్ముని రారమ్మని బిగికౌగిట జేర్చుకొని యిట్లనియె తమ్ముడా! నీవు మృతుండవయ్యును నాభాగ్యవశంబున మరల జీవించితివి నా కన్నులార నిన్నుగాంచితిని నీవే మరణించియున్నచో నాకు రాజ్యముతోను, ప్రాణంబులతోను, సీతతోను, విజయంబుతోను పనియే యుండియుండదని రాముడు జెప్పగా లక్ష్మణుండిట్లనియె అన్నా! ఎల్లవేళల యందును నీ పరాక్రమము వ్యర్థముగాదు గదా! రావణుని వధించి లంకాధిపత్యం బొసంగెదనని విభీషణునితో ప్రతిజ్ఞ పలికి యుంటివి ఇప్పుడు బలహీనుని వోలె నిట్లుపలుక జెల్లునా? సత్పురుషులు తాము గావించిన ప్రతిజ్ఞను వ్యర్థము గావించుకొందురా! ఇప్పుడే రావణుని బరిమార్చి ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుము సింహము కంటబడిన మదగజంబు జీవింపజాలని చందంబున నీ బారింబడిన రావణుడు జీవింపజాలడు విభీషణుని ప్రతిజ్ఞ నెరవేర్చి సీతాదేవిని చేబట్ట దలంతువేని రావణుని త్వరితంబుగ వధింపుము లెమ్మని లక్ష్మణుడు జెప్పెను

రాముడు తమ్ముని వాక్యము లాలకించి ధనువు నెత్తి సంధించి రావణునిపైనను, సేనాముఖంబు పైనను బాణంబులను బ్రయోగించెను రాక్షసేశ్వరుండది గాంచి రథంబారోహించి రాహువు సూర్యుని మీదికి బోవుకరణి రాముని మీదికి బోయి బాణవర్షంబుచే నొవ్వంజేసెను రాముడు గూడ బాణాగ్నిని వెదజల్లి రావణుని బాధించెను రాముడు వసుధాతలంబు నుండియు, రావణుడు రథంబునుండియు రణంబొనరించుట భావ్యంబుగాదని దేవదానవులును, గంధర్వులును వచించిరి దేవేంద్రుని సారథియగు మాతలి సురేంద్రుని రథంబారోహించి స్వర్గమునుండి డిగ్గి రాముని జేరంవచ్చి నమస్కరించి రామా! నీకు విజయంబు జేకూరుటకై సురేంద్రుడీ రథంబును నీ కొసంగి రమ్మనెను మఱియు నీ యైంద్ర ధనుస్సును, తనుత్రాణంబును, బాణంబులను, శక్తిని గూడ నమ్మహాత్ముడు నీ కొసంగెను నేనిదే నీకు సారథి నయ్యెదను నీవీ

రథంబారోహించి రావణుని బరివహార్పువుము రారమ్మనిన తోడనే రాముడమ్మహా రథంబునకుబ్రదక్షిణము గావించి రథంబు నారోహించెను

## రామరావణుల యుద్ధము

రామరావణులిరువురకును ఘోర సంగ్రామ మేర్పడెను దివ్యాస్త్రకోవిదుండగు రాముడు రావణునిచే బ్రయోగింప బడిన గాంధర్వాస్త్రమును గాంధర్వాస్త్రముచేతను, దైవాస్త్రమును దైవాస్త్రము చేతను నివారించెను రాక్షసేంద్రుడది జూచి క్రోధావేశుడై మరల దారుణమైన రాక్షసాస్త్రమును బ్రయోగించెను రావణుని శరాసనమునుండి వెలువడిన శరంబులు మహోరగంబులై వక్త్రంబులను దెఱచుకొని రాముని మీదికి వచ్చెను తన మీదికి వచ్చుచున్న మహాభుజంగములను గాంచి రాముడు గారుడాస్త్రమును బ్రయోగించెను ఆ రామబాణంబులు ధనుర్ముక్తంబులై కాంచన వర్ణంబులగు గరుడపక్షులై స్వైరవిహారమును సల్పి రాక్షస వల్లభుని బాణంబులన్నింటిని సంహరించెను తన యస్త్రంబులు ప్రతిహతమగుటంజూచి రావణుడు క్రుద్ధుడై భయంకరమైన బాణవృష్టిని రామునిపై గురిపించెను అంతటితో దనివిజెందక వేయి బాణంబులచే దశరథసుతుని నొప్పించి, పెక్కు బాణంబులచే మాతలిని బ్రహరించి ఇంద్రుని రథధ్వజంబులను నేలగూల్చి గుఱ్ఱములను నొప్పించెను దేవదానవులును, గంధర్వచారణులును, దురాత్ముడగు దశగ్రీవుడొనరించిన గొప్ప కార్యంబును దిలకించి విషణ్ణులైరి సిద్ధులును, మహర్షులును, విభీషణ సహితంబుగ వానరవీరులును, రాముడార్తుడగుట కెంతయు దుఃఖంబు నొందిరి లోకబాంధవుడు కాంతివిహీనుడై ధూమకేతువును గూడి క్రూరుడై గానుపించెను రావణుడు భయంకరాకారుడై జూపట్టెను ఇక్ష్వాకువంశోద్భవుల నక్షత్రమైన ఇంద్రాగ్ని దైవత్యంబగు విశాఖా నక్షత్రంబును అంగారకుడాక్రమించెను రావణుడత్యుగ్రుడై పది శిరంబులతోను, ఇరువది కరంబులతోను ధనుర్ధరుడై మైనాకపర్వతమువోలె జూపట్టుచు రామునిపై బాణంబులు బ్రయోగించెను ఆ యిరువది

కరంబులచే బ్రయోగింపబడుచున్న బాణజాలంబుచే రామునకు వింటబాణంబులు సందించుటకైనను చేతులాడవయ్యెను రాముడమిత క్రోధావేశుడై ప్రపంచమును దగ్ధముచేయునేమో యున్నట్లుండెను సర్వభూతంబులు భయపడినవి వసుధాతలంబు కంపించినది నీరాకరము క్షోభనొందినది రాముడట్లు క్రుద్ధుడైన తోడనే రావణుడు భయపడెను రామరావణుల యుద్ధమును దేవదానవులును, గంధర్వులును, మహోరగులును, మహర్షులును, విమానగతులై తారాపథమునుండి చూచుచు దశరథసుతునకు జయంబు గలుగు గాక! యని నుడివిరి

రావణుడు రోషావేశంబున మండిపడుచు మహాశూలంబును కరంబునంబూని, సింహనాదంబు గావించి రాక్షస సైన్యమంతయు సంతసమందునట్లుగా రాముని జూచి పరుషోక్తులచే నిట్లు బలికెను రామా! ఈ వజ్రసారంబగు శూలంబు నిన్ను, నీ తమ్మునిగూడ బరిమార్పగలదు శీఘ్రకాలములో మా రాక్షస సేనయందు హతులైన వీరుల చెంతకు నిన్ను బంపెదను శూరుడవైతే కొంచెము నిలువుము ఇదే చూడుమని నిశాచరేంద్రుడు శూలంబును మానవేంద్రునిపై బ్రయోగించెను ఆ శక్తి తారాపథమంతయు వెలుగొందెను రాముడు తనపైకి వచ్చుచున్న శక్తిని, ధనుస్సునాకర్ణించి బాణంబులను బ్రయోగించి నివారించెను అంతలోనే దేవేంద్రు డొసంగిన శక్తిని రాముడు గిరగిరంద్రిప్పి విసరెను ఆ శక్తి రావణుని శక్తిని ధాకి నేలగూల్చెను మరల దశరథసుతుండు వెంటనే కఱకుటమ్ములతో దశగ్రీవుని గుఱ్ఱములను నొప్పించెను దేహమంతయు రక్తసిక్తమైనందుకు దశముఖుడు కొంతతడవు ఖిన్నుడై మరల క్రోధోద్దీపితుడై ధనుస్సు నాకర్షించి రామునిపై బాణవర్షంబు గురిపించెను ఆ బాణఘాతంబులచే రాముడిసుమంతేనియు జలింపడాయెను రాముడు రక్తసిక్తాంగుడై యరణ్యమందు వికసించిన గొప్ప ఫలాశవృక్షము వోలె నొప్పారెను రామరావణ బాణజాలంబుచే గప్పబడి లోకబాంధవుని యురుణకిరణ జాలంబు వ్యాపింపజాలక చీకటి మయమై యుండెను

అప్పుడు దశరథసుతుండు రావణునిజూచి నవ్వి పరుషోక్తులచే నిట్లు బలికెను రాక్షసాధమా! దశగ్రీవా! జనస్థానంబున నేను చెంతలేనపుడు వివశురాలగు నా భార్యనపహరించితివి నీవేలాటి పరాక్రమవంతుడవో యాలోచించుకొనుము మహారణ్యమందు నన్నెడబాసి దీనురాలై యున్న యబలను బలాత్కారంబున నపహరించి శూరుండనని గర్వముతో దలెత్తి తిరుగుచున్నావు నీవెంతయు బిఱికివాడవు పరస్త్రీలనపహరించు పాపాత్ముడవు దుర్మార్గుడవు నీచులు జేయదగిన కార్యంబొనరించి యున్నావు శాస్త్రమర్యాదనతిక్రమించితివి సిగ్గువిడిచితివి సదాచారములను వీడితివి గర్వాంధుడవై మృత్యుదేవతను వరించితివి నేను శూరుడనని గర్వమును వదలకున్నావు కుబేరుని తమ్ముడవు తపోబలసంపన్నుడవు ఐతే ప్రయోజనమేమున్నది? సీతాపహరనంబు గావించుటచే నింద నీయుడవైతివి సత్పురుషులు నిన్నెంతయో శ్లాఘించుచున్నారు సద్యశంబొనగూర్చెడు గొప్పకార్యం బొనరించియున్నావు గర్వాతిరేకంబున నీవు గావించిన నిందిత కార్యమునకిప్పుడు ఫలమనుభవింపగలవు నా యెదుట నీవు సీతాదేవి నపహరించియున్నచో నీ తమ్ముడు ఖరుని వెంటనే బంపి యుండెడివాడను నాబాగ్యవశంబున నీవిపుడు నా కంట బడితివి నిన్నిప్పుడే యమసదనంబునకు బంపుచున్నాను నా బాణంబులచే ఖండింపబడి ధూళిలో దొరలెడు దీప్తకుండలసహితమగు నీ మస్తకంబును నక్కలు మొదలగు జంతువులీడ్చుకొని పోవుగాక! బాణఘాతంబుల నుండి స్రవించెడు నీ రక్తమును గ్రద్ధలు ఱొమ్ముపై గూర్చుండి దప్పిదీఱ ద్రావగలవు చూడుమని నిశాచరేంద్రునిపై మానవేంద్రుడు శరజాలంబును గురిపించెను దశరథసుతునకు బలంబినుమడించెను సమస్తమైన దివ్యాస్త్రంబులు ప్రాదుర్భవించి ప్రత్యక్షమై వెలుగొందెను రామచంద్రునకుత్సాహ మినుమడించెను అమ్మహాత్ముడు మరింత తీవ్రముగా రావణునిపై బాణవృష్టిని గురిపించెను వానరులు శిలావృక్షములను గురిపించిరి ఇవ్విధంబున నొప్పింపబడిన రావణుడు దిక్కుదోచక భ్రాంతచిత్తుడై దిక్కులు జూడ దొడంగెను మనస్సు స్వాధీనత దప్పి ఆయుధంబులు ప్రయోగింపక ధనుస్సు నాకర్షింపక రాముని

బాణంబులచే నొవ్వబడుచున్న రాక్షసేంద్రుని సారథి జూచి ప్రాణాపాయము వాటిల్లునని తలంచి యుద్ధభూమి నుండి రథంబును మరలించుకొని పోయెను

## రావణుడు సారథిని దూరుట

రావణుడంతలో మృత్యుప్రేరితుండై క్రోధారుణలోచనముల నుండి నిప్పులురాల సారథిని జూచి యిట్లు నుడివెను ఓరీ! దుర్బుద్ధీ! నన్ను లక్ష్యంబుసేయక నీకు దోచినట్లాడుచున్నావా! నన్ను పౌరుషహీనునిగను, పిఱికివానిగను, ధైర్యములేని వానిగను, మాయలెఱుంగని మౌఢ్యునిగను, దివ్యాస్త్రముల మర్మమెఱుంగని వానిగను, దలంచితివి గాబోలు! నా శత్రువు సమక్షమున నా రథంబు నిట్లు తొలగదోలుకొని వచ్చితివి? నేనెంతయో శ్రమనొంది సంపాదించిన యశంబును, బలపరాక్రమంబులను, యుద్ధమందు వెనుదీయడను నమ్మకమును, నీవిప్పుడు పోగొట్టితివి జనులకు నాపైగల నమ్మకమును దూరముజేసితివి యుద్ధప్రియుండనగు నన్ను పిఱికిపందను గావించితివి శత్రువునకెదురుగా రథంబు దోలవైతివి దీనిని పరిశీలింపగా శత్రువులు నీకేమో లంచమిచ్చి లోబఱచుకొన్నట్లు నాకు దోచుచున్నది నా యూహ సత్యమైనదే! ఇదివేలుగోరు మిత్రుడు చేయదగిన కార్యమా! నీవెంతకాలమునుండియో నాచెంతనున్నావు నా యుపకారమును మఱవగూడదను తలంపే నీకున్నచో శత్రువు నన్ను వెదకి కొని రాకమునుపే త్వరితంబుగ రథంబును మఱలించి శత్రువున కభిముఖముగా దోలుము త్వరపడుమని రావణుడు సారథితో జెప్పెను

రావణుని హితంబపేక్షించెడు సారథి పరుషోక్తుల నాలకించి రాక్షసేంద్రుని జూచి యిట్లనియె రాక్షసవల్లభా! నేను భయపడలేదు వెఱకుడనుగాను శత్రువులచే లంచము దీసికొని యెఱుంగను ఏమఱుపాటు నొందలేదు నీయందు మైత్రీభావములేని వాడను గాను నీ

సత్కారములను మఱచిన వాడనుగాను నీహితంబపేక్షించి నీ యశంబును సురక్షితముగా నుండుటకై పరిశుద్ధహృదయముతో నీకు ప్రియంబు గావించితిని అది నీకప్రియమై నందులకు విచారించుచున్నాను నేను నిర్దోషిని కదనరంగమునుండియు రథంబును మరలించుటకు గారణ మెఱిగించెద నాలకింపుడు నీవు రామునితో చాలసేపు సమరంబు గావించి యలసట నొందితివి నీయందు సౌఖ్యముగాని, యుత్సాహముగాని గోచరింపదాయెను ఈ రథాశ్వంబులు గూడ చాలయలసి యుండెను మనకన్నియు ప్రతికూలములే గలుగుచుండెను సారథియగువాడు దేశకాలంబులును, శుభాశుభ నిమిత్తంబులును మొదలుగాగల రహస్యములన్నింటిని గుర్తించి చక్కగా రథంబు నడుపవలయును రాజా! నీకును, గుఱ్ఱములకును, ప్రమాదము జేకూరనుండు టెఱింగి విశ్రాంతిని గలిగించుటకిట్లు రథంబు దొలగదోలుకొని వచ్చితిని కారణమెఱుంగకయే నేనిటు స్వేచ్ఛగా జేయలేదు స్వామిభక్తిచే నిట్లొనరించితినే గాని యన్యమేదియుగాదు ప్రభూ! యిప్పుడే యాజ్ఞాపింపుడు జవదాటక నీ యాజ్ఞను పాలించి నీ ఋణంబు దీర్చుకొనియెదనని సారథి రావణునితో జెప్పెను ఆ మాటలు విని రావణుడు సంతుష్టుడై రామునకభిముఖముగా రథంబును దోలుమనెను సారథి స్వామిభక్తి కలరిరాక్షసనాథుండొక సుందరమైన హస్తాభరణంబు నొసంగెను సారథి సంతోషాబ్ధి నీదుచు రామున కభిముఖముగా రథంబు దోలి నిలిపెను

## ఆదిత్య హృదయస్తోత్రమును జపింపుమని అగస్త్యుడు రామునకుపదేశించుట

రామరావణుల యుద్ధమును జూచుటకు దేవతలతో గూడి వచ్చియున్న త్రికాలజ్ఞుడగు నగస్త్యమహర్షి రాముని సమీపించి యిట్లు పలికెను రామా! యుద్ధమందలసట జెంది విశ్రాంతి దీసికొని రావణుడు మరల యుద్ధమునకు వచ్చియున్నాడు సమస్త శత్రువులను సమయింపజేయు పరమరహస్యంబైన ఆదిత్యహృదయంబను స్తోత్రమును

నీకుపదేశించెద నాలకింపుము సర్వస్తోత్రములలోకెల్ల నుత్తమమైనది సర్వశుభములును, సర్వపాపనాశంబును, ఆధివ్యాధిహరంబును, ఆయుర్వృద్ధికరంబును జేకూర్చును సమస్తలోక నియామకుండగు పరమాత్మనిట్లు స్తుతింపుము

ఆదిత్యమండలాంతర్వర్తియగు సూర్యభగవానుడు సర్వదేవతలకు నాత్మీయాతుండు సమస్త తేజస్సులను దిరస్కరించువాడు భక్తులకు మోక్షమొసంగువాడు ఇమ్మహాత్ముడే తన కిరణవారంబుచే వర్షాదులు గలిగించి సర్వలోకంబులను రక్షించును సమస్త దేవతలకీతడే శరీరము బ్రహ్మవిష్ణువు ఈశ్వరుడీతడే నవప్రజాపతులునితడే దేవేంద్రుడును, కుబేరుండును, మృత్యువును, యముడును, చంద్రుడును, వరుణుండును యిమ్మహాత్ముడే పితృదేవతలును, అష్టవసువులును, అశ్వనీదేవతలును, మరుత్తులును, మనువు మారుతుడును, నితడే, ఇతడే యగ్ని, ప్రాణము వసంతాది ఋతువులు నీతడే

ఓ సూర్యదేవా! నీవు ఆదితిపుత్రుడవు జగత్తును సృజించి పోషించువాడవు ఆకాశమార్గమునందు విహరించువాడవు ప్రశస్తములైన కిరణవారంబును, మంచి రెక్కలును గలవాడవు సువర్ణకాంతులొలుక బోసెడువాడవు పగటిని నిర్మించువాడవు వేయికిరణంబులును, ఆకుపచ్చని గుఱ్ఱములునుగల వాడవు ప్రళయకాలమందు నిర్వ్యాపారముగా శాంతిని బొందువాడవు తుషారమును బోగొట్టువాడవు తారాపథంబునకు ప్రభుండవు రాహువును భేదించువాడవు చతుర్వేదముల కధిపతివి సలిలంబులకు సఖుండవు గోళాకారముచే నొప్పారెడు వాడవు తీక్షణమైన యెండగలవాడవు వ్యాకరణాది శాస్త్రములలో బండితుడవు భక్తులయందనురాగముగలవాడవు సర్వకాలములకు కారణభూతుడవు అశ్విన్యాది నక్షత్రములకును, గ్రహములకును, తారామండలమునకును నాధుడవు పండ్రెండు మూర్తులను ధరించియున్న లోకబాంధవా! నీకు నమస్కారము రామా! ఇదియే ఆదిత్య హృదయంబను స్తోత్రము ఇతడే సర్వము,

హృదయస్తోత్రమును మూడు మార్లు జపించితివేని యుద్ధమందు జయలక్ష్మి నిన్ను వరించును నేబోయివచ్చెదనని యగస్త్యమహర్షి వెడలిపోయెను అప్పుడు పరిశుద్ధహృదయుడై ఆదిత్య హృదయస్తోత్రమును జపించి దేవదేవుని ధ్యానించెను అమ్మహాపురుషుండు పులకితగాత్రుడై రామచంద్రునకు బొడసూపి రామా! రావణుడింతటితో నాశంబు నొందగలడు సందేహమునువీడి త్వరపడుమని పలికెను రాముని బలంబినుమడింప సంతుష్టుడై రావణుని వధింప నిశ్చయించి యుద్ధంబు జేయుటకై సమీపించెను

## రామునిచే రావణుడు హతుండగుట

రావణుని సారథిపరమ సంతుష్టుడై మహారథంబును త్వరితంబుగా రాముని మీదికి దోలెను రాక్షసేంద్రుని రథంబు తనపైకి వచ్చుచుండుటను నరేంద్రుడు జూచి దేవేంద్రుని సారథియగు మాతలితో నిట్లు బలికెను మాతలీ! రావణుని రథంబు వేగముగ వచ్చుచున్నది అదిగో! చూడుము ఏమఱుపాటునొందక రావణుని రథంబున కభిముఖముగా మనయురదంబును దోలుము తారాపథంబున గ్రమ్మియున్న జలధరంబును వాయువు బాఱదోలునట్లు నేనిదే రాక్షసుని బరిమార్చెదను నీవు భయంబు నొందవలదు మానసమందుగాని, దృష్టియందుగాని, కలతనొందక పగ్గంబులను క్రమము దప్పక లాగుచు త్వరితంబుగా రథంబు నడపుము నీవు సురేంద్రుని రథసారథివి నీకంతగా జెప్పవలసినదిలేదు ఐనను నాకిది యుద్ధసమయంబుగాన జాగరూకుండనై నీకు జ్ఞాపకము చేయుచున్నాడను అంతియే ఇది నా యుపదేశముగాదని రాముడు మాతలితో జెప్పెను

దేవసారథి శ్రేష్ఠుండగు మాతలి రాముని వాక్యములాలకించి సంతోషించి రథంబును దోలెను రావణుండది గాంచి క్రోధారుణలోచనుడై యుఱిమి చూచుచు తన రథంబునకభిముఖుండై నిల్చియున్న రామునిపై

నిశితశరంబులను బ్రయోగించెను రోషావేశంబున ధైర్యంబినుమడింప రాముడు మాతలి దెచ్చియున్న నైంద్రధనస్సును తీక్ష్ణ బాణంబులను గైకొనెను పరస్పరాభిముఖులై చెలరేగిన సింహంబులకైవడి రామరావణులు యుద్ధమునకు గడంగిరి దేవగంధర్వులును, సిద్ధులును మహర్షులును, రామరావణుల యుద్ధంబు జూడవచ్చిరి అంతలో రావణుని వినాశంబును, రాముని జయంబును సూచించునట్టి మహోత్పాతంబులెన్నియో చూపట్టినవి రాక్షసనాథుని రథంబుపై మేఘము రక్తమును వర్షించెను సుడిగాలులు అప్రదక్షిణముగాజుట్టి భయమును గలించినవి గృధ్రంబులు రావణుని రథంబుపై దండోపతండములుగ విహరించెను పిడుగులును, పెద్దకొఱవులును, మహాధ్వనులతో బడినవి అవి రాక్షస వల్లభునకు వినాశంబు సూచించుటంజేసి నిశాచరులు దిగులొందిరి రావణుడున్న ప్రదేశములో భూమి చలించినది రాత్రించరులకు యుద్ధమాడ జేతులాడలేదు సూర్యుని కిరణంబులు తెల్లగను, నల్లగను, ఎఱ్ఱగను, పసుపు వర్ణముగను రాక్షసేంద్రుని దేహంబుపై బ్రసరించినవి నక్కలు గ్రద్దలతో జేరి నోళ్లయందు నిప్పులను గ్రక్కుచు రావణుని జూచి భయంకరముగా నఱచినవి ఆ యఱపుల మంగళమును సూచించినవి పెనుగాలి ధూళిచే జెలరేగి ప్రతికూలంబుగా వీచినది మేఘము లావరింపకయే రాక్షససైన్యమందు మహాధ్వనిగదుర కొఱవులును, పిడిగులును బడినవి దిశలును, విదిశలును, కాఱుచీకటులలముకొన్నవి రావణుని గుఱ్ఱంబులు జఘనంబుల నుండి అగ్నికణములను, నేత్రములనుండి కన్నీటిధారలను నొలుకబోసినవి రాక్షసేంద్రునకి వ్విధంబున వినాశసూచకంబులును, రామునకు విజయ సూచకంబులును గోచరించినవి తనకెన్నియో శుభనిమిత్తంబులు దోచుకతంబునంజేసి దశరథసుతుండమితానందమొంది రావణుడు నేటితో గూలుననియు, సీతలభించెననియు దలపోసెను

అంతలో రామరావణులకు సర్వలోకంబులు భీతిల్లు చందంబున ఘోర ద్వంద్వయుద్ధంబు సంభవిల్లెను రామరావణుల యుద్ధమును జూచుచు వానర రాక్షసులు చిత్రముల మాడ్కి నొప్పారు చుండిరి అప్పుడు

రావణుడు వింటంబాణంబులనా సంధించి రాముని రథంబుపై రంజిలుచున్న ధ్వజంబును గొట్టిన అది దేవేంద్రుని యరదంపుగుటం జేసి రాక్షసుని బాణంబులు వ్యర్థములయ్యెను రాముడది జూచి దివ్యాస్త్రంబు నొకదానిని రాక్షసేశ్వరుని ధ్వజంబుపై బ్రయోగించెను ఆ ధ్వజంబు ఖండితమై నేలగూలెను రావణుడప్పుడు మండిపడి రాముని మీదను, గుఱ్ఱముల మీదను బాణాగ్నిని గురిపించెను గుఱ్ఱంబులు చలింపవాయెను మరల రాక్షసేంద్రునకు బాణవర్షంబును గురిపించెను అంతటితో దనివిజెందక నిసుపగుదియలను గదలను, చక్రములను, ముసలంబులను, పర్వత శిఖరంబులను, వృక్షములను, గండ్రగొడ్డళ్లను రావణుడు రాముని రథంబుపై బ్రయోగించెను బహువిధ శస్త్రమయమైన యమ్మహావర్షంబును రాముడు నివారించెను మానవనాథుడు లక్షలకొలది బాణవర్షంబును గురిపించుటయు, రాక్షసనాథుండది గాంచి ఆకాశమంతయు బాణమయంబు గావించెను రామరావణులు ప్రయోగించిన దేదీప్యమానంబులగు బాణంబులచే గగనవీధియంతయు గప్పబడియుండెను సర్వభూతంబులు వెఱగందిచూచుచుండెను జలధారలను గురియుచున్న జలధరంబుల మాడ్కి బాణపరంపరలు రామరావణులు వెదజల్లుచు యుద్ధభూమి యందు భయంకరముగా విహరించిరి వారిరువురి రథంబులును పరస్పరము నొగనొగ తోడను, ధ్వజంబులు ధ్వజంబులతోడను, గుఱ్ఱములు గుఱ్ఱములతోడను, గదిసి నిలువంబడియుండెను రాముడది జూచి ధనువునాకర్షించి దేదీప్యమానంబులగు నాల్గు నిశిత శరంబులచే రావణుని గుఱ్ఱములను తొలగదోలెను రాక్షస నాథుండది జూచి మానవేంద్రునిపై కఱకుటమ్ములను బ్రయోగించెను రామచంద్రుడు రవంతేనియు చలింపడాయెను మాతలిపై పిడిగువంటి బాణంబులను బ్రయోగించెను మాతలి గూడ సరకుజేయడయ్యెను అప్పుడా రాముడు మహాక్రుద్ధుడై ఇరువది యమ్ములను ముప్పదిబాణంబులను, అరవది తూపులను, నూఱునూఱు శరంబులను, వేయివేయి సాయకంబులను, రాక్షసేంద్రుని రథంబుపై బ్రయోగించెను రాక్షస రాజేంద్రుడది గాంచి గదలను, ముసలంబులను,

మనుజేంద్రునిపై బడవైచెను ఆ యుద్ధము తుములంబై యూపంబుల గుండెలదర జేయుచుండెను రామరావణులు ప్రయోగించెడు యాయుధముల ధ్వనికి సప్త సముద్రములు ఘూర్ణిల్లెను పాతాళవాసులగు నాగంబులును, దానవులును దిగులొందిరి మహీమండలము చలనంబు నొందెను దినకరుడు కాంతి హీనుడయ్యెను వాయుదేవుడు ఏవదాయెను గోబ్రాహ్మణులకు శుభంబు జెకుడుగాక! లోకంబులన్నియు శాశ్వతముగా వర్ధిల్లును గాక! రాముడు రావణుని జయించుగాక! యనుచు సురులు, మహర్షులు జపంబు గావించిరి అప్సరసలు రామరావణుల యుద్ధమును జూచి మిగుల నాశ్చర్యమొందిరి

అప్పుడు రఘుకుల తిలకుడు క్రుద్ధుడై సర్పమును బోలిన నిశితశరంబులను వింట సంధించి కర్ణకుండలములచే గ్రాలుచున్న రావణుని శిరంబును ద్రుంచెను వసుధాతలంబునం బడిన యామస్తకంబును ముజ్జగంబులును దిలకించినవి వెనువెంటనే యాశిరంబును బోలిన శిరంబు రావణునకు మొలిచెను ఆ శిరంబును గూడ రాముడు నిశిత బాణంబులచే ఛేదించెను ఆ మస్తకంబు నేలబడిన తోడనే మరొక్క మస్తకంబు గానబడినది ఆ శిరస్సును గూడ వజ్రసమానంబులగు బాణంబులచే రాముడు నేలగూల్చెను ఇవ్విధంబున నూటొక్కమారు రావణుని శిరంబులను రాముడు ఖండించెను కాని రాక్షసేంద్రుడు మరణంబు నొందడాయెను

సర్వాస్త్రకోవిదుండగు కౌసల్యానందనుండు తన మనంబున నిట్లు చింతించెను ఔరా! మారీచ ఖరదూషణాదులను, విరాధకబంధులను వధించిన బాణంబులు నేడేలకో వ్యర్థములైనవి ఇట్టి విశ్వసనీయంబులగు బాణంబులు రావణుని యెడ వ్యర్థమై పోవుటకు హేతువేమై యుండును? కానిమ్ము ఇప్పుడు నేనెంత మాత్రము యేమరక రావణుని వధించెదనని బాణవర్షంబు గురిపించెను రథగతుండై యున్న రాక్షసేంద్రుడు క్రుద్ధుడై గదలను ముసలంబులను రామునిపై గురిపించి నొప్పించెను ఇవ్విధంబున నేడహోరాత్రంబులు విదివిరామము లేక రామరావణులు రణంబు గావించిరి అప్పుడు ధీశాలియగు మాతలి రాముని జూచి యిట్లు బలికెను

రామచంద్రా! మందునివాడ్కి రాక్షసుని దెగజూడకేల యుపేక్షించెదవు దేవతలు చెప్పినట్లు రావణుడు నశించెడు కాలమాసన్న మైనది నీవిప్పుడాలసింపక బ్రహ్మాస్త్రమును బ్రయోగించి రాక్షసనాధుని బరిమార్చి లోకహితకారివి గమ్ము త్వరపడుమని మాతలి చెప్పిన తోడనే ముల్లోకంబులను జయింపగోరెడు దివ్యాస్త్రంబును గ్రహించి వేదవిధానంబువేంర కభిమంత్రించి ధనువున సంధించెను కౌసల్యాతనయుండా మహాబాణంబు సందింపగానే సమస్త భూతంబులును దిగులొందెను భూమి గడగడ వడంకెను రామచంద్రుడమితక్రోధావేశుడై సత్తుఎ కొలది ధనుస్సును వెవివఅకు నాకర్షించి బ్రహ్మాస్త్రమును రావణునిపై బ్రయోగించెను అమ్మహాశరంబు దుర్ధర్షంబై రాక్షసనాధుని వక్షంబుజొచ్చి వీపున గుచ్చి పోయెను రావణుని ప్రాణంబులను బలిగొని రక్తసిక్తమై వెలువడి భూమిపైబడి వెంటనే తూణీరంబు జొచ్చెను విగతజీవుడై రాక్షసేంద్రునిచేతనున్న ధనుస్సు ఎట్టు వదలి బాణసహితంబుగా నేలంబడెను మహాతేజుండగు రావణుడు రధంబునుండి నేలకొఱగెను తమ నాధుడు భూమిపై బడుటను హతశేషులగు రాక్షసులు జూచి దిక్కులకు బారిపోయిరి వృక్షచరులు వృక్షహస్తులై సింహనాదంబులు గావించుచు రాక్షసులందఱిమి కొట్టిరి అనాధులగు రజనీచరులు కన్నీటి కాల్వలో నీదుకొనుచు లంకాభిముఖులై పరుగిడిరి

అంతలో నంతరిక్షము నుండి మంగళ సూచకంబగు దేవదుందుభిమ్రోగెను దివ్యగంధము గుబాళింప గంధవహుడు సుఖముగా వీచెను కౌసల్యాసుతుని రధంబుపై పుష్పవర్షమద్భుతముగా గురిసెను భూమియందు వానరులును, ఆకాశమందు దేవతలును, రాముని సాధువాక్యములతో బ్రశంసించిరి దేవతల కష్టంబులు తొలగిపోయెను దిశలు ప్రసన్నములయ్యెను తారాపధంబు నిర్మలంబాయెను భూకంపమాగిపోయెను వాయువు చల్లగా వీవదొడంగెను భాస్కరుడు దివ్యప్రభలతో భాసిల్లెను విభీషణుడు లక్ష్మణుడు సుగ్రీవాది వానరులందఱు ప్రియదర్శనుండగు రాముని జేరి ప్రశంసించిరి రాముడు రావణుని జయించి మిత్రులతోడను, వానరసేనలతోడను, బరివేష్టింపబడి దేవేంద్రుని పగిది తేజరిల్లెను

## యుద్ధభూమియందు బడియున్న అన్నను జూచి విభీషణుడు విలపించుట

రామునిచే నిహతుండై కదనభూమియందు బడియున్న యన్నను దిలకించి విభీషణుడు శోకసాగరంబున నీదుచు నిట్లు విలపించెను హా! అన్నా! పోయితివా? నీ శూరత్వము నేటితో మంటగలసిపోయెనా? బలపరాక్రమములందు వినుతికెక్కినవాడవు సర్వశాస్త్ర కోవిదుడవు రాజనీతిధురంధరుండవు లోకోత్తరంబగు మృదుశయ్యపై బవళింపుచున్న నీవు కిరీటధారుండవై భూమిపై బడియున్నావే! అయ్యో! నీకెంతటి గతిపట్టినది నేనీ దురవస్థను కన్నులారా జూడవలసి వచ్చెను గదా! ఇవ్విధంబుగా బరిణమించునని నేను మున్నె నీకెఱుగ దెల్పితిని కామమోహితుడవై నా హితవచనంబు లాలకింపవైతివి ఆ ఫలమిప్పుడను భవించితివి నేనేమి జేయుదును సీతాపహరణంబు మహాపాపకార్యంబని నీవు గాని, ప్రహస్తుడుగాని ఇంద్రజిత్తుగాని, కుంభకర్ణుడుగాని, యతికాయుడు గాని, నరాంతకుడు గాని గర్వాంధులై సరకుసేయరైతిరి ఆ ఫలమిప్పుడు ప్రాప్తమైనది సమస్త లోకములందును పండితుడు, బలవంతుడనబడెడు వాడునేడు గతించెను ఉత్తమ వీరుడును, శ్లాఘింప దగినవాడును నేలబడుట వలన దిననాథుడే నేలబడినట్లయ్యెను సుధాకిరణుడే యంధకారమున మునిగినట్లయ్యె అగ్నిదేవుడు చల్లారిన చందమయ్యెను సమస్తము శూన్యమై గోచరించుచున్నది ధైర్యమే చిగురుజొంపము వోలెను సహనమే కుసుమ గుచ్ఛమువోలెను, తపంబే దార్ఢ్యముగను, శౌర్యమే దృఢమైన వేరుగను గల రావణుడనియెడు మహాభూజంబును, రాముడనియెడు పెనుగాలి విఱిచివైచెను రాక్షసేంద్రుడనియెడు మత్తకరీంద్రమును మనుజేంద్రుడను సింహము మట్టుబెట్టెను రాక్షసనాథుండను అగ్నిని రాముండను మేఘము చల్లార్చెను రాక్షసులే, వాలము, మూపురము, కొమ్ములుగను, విషయ చాపల్యమే కర్ణములుగను, కొమ్ములుగను గలదియునగు రావణుండను నాబోతును రాముడను వ్యాఘ్రము వధించెను నా హిత వచనంబు

లాలకించి యున్నచో నీకింతటి గతిపట్టి యుండదని విభీషణుడు వివిధ రీతులుగ విలపించెను

## రాముడు విభీషణునోదార్చుట

పరమదు ఖితుడైయున్న విభీషణునాశ్వాసించుచు రాముడిట్లు పలికెను విభీషణా! పరలోక సుఖంబపేక్షించి శూరధర్మమునవలంబించి సమరంబున నిర్భయులై నిహతులైన మహాపురుషులను గూర్చి దు ఖింపరాదు రావణుడు పరాక్రమవంతుడు పిఱికిపందవోలె నశింపడాయెను భయంకరంబైన భండనంబున మహోత్సాహంబుతో బోరాడి నిర్భయుడై ప్రాణంబులను గోల్పోయి యున్నాడు ముల్లోకంబులను ముప్పతిప్పలు బెట్టి దేవేంద్రాదుల నోడించిన యశస్సంపన్నుడగు రావణుడు కాలధర్మము నొందినాడు అట్టి వీరుని గూర్చి నీవిట్లు దు ఖింపజనదు శూరునకు జయాపజయంబులు రెండును సమానములే బవరంబున ప్రాణంబులు గోల్పోయిన వారికి వీరస్వర్గము లభించునని ప్రాచీనులమతము మీయన్న వీరస్వర్గమలంకరించి యుండును వీరస్వర్గము నొందిన వానిని దలంచి దు ఖింపరాదని శాస్త్రనియమము వగచినచో లాభమేమి? పరమార్థముందలంచి చేయువలసిన కర్తవ్యమాలోచింపుము లెమ్మని రాముడు విభీషణు నూరడించెను

అప్పుడు విభీషణుడు తనయన్నకు జేయువలసిన హితంబు నొనరింపగోరి రాజసుతునితో నిట్టులనియె రామా! దేవేంద్ర సహితంబుగా దేవతలందఱు గుమిగూడి వచ్చినను యుద్ధములందు పరాజయ మెఱుంగని రావణుడు నేడునిన్ను దాకి హతుండయ్యె ఇమ్మహాత్ముడు దానములెన్నింటినో గావించియున్నాడు గురుదేవతాదులను జక్కగా నర్చించినాడు సమస్త భోగభాగ్యములతో దులతూగినాడు భృత్యవర్గము నెంతయో ప్రీతితో బోషించినాడు మిత్రులను గౌరవించి శత్రువుల గర్వంబడంచినాడు గొప్ప తపస్సంపన్నుడు సర్వవేదములను

అధ్యయనము గావించినవాడు ఇట్టి గర్మరుడు ప్రేతత్వంబు నొందియున్నాడు ఇతని ప్రేతత్వ విముక్తికై చేయవలసిన యౌర్ధ్వదైహికమును నీయనుగ్రహంబు నొంది చేయగోరుచున్నానని రాము డందులకియ్యకొని రావణునకు స్వర్గప్రదంబగు నిత్యకర్మంబు గావింపుమని విభీషణునకాజ్ఞాపించి మఱియు నిట్లనియె రాక్షసోత్తమా! ఎవ్వరికైనను మరణించు వఱకే వైరంబు ప్రవర్తించును అటుపిమ్మట వైరంబుతో బ్రయోజనమేమున్నది? మనకాంక్షయు నీడేరినది ఇక నీతనికి జేయవలసిన సంస్కారంబు గావింపుము ఇతడు నీకెట్లు బంధువో నాకును బంధువేగాని యన్యుడుగాడని నీ మనంబున దలంపుము విషాదమును మానుమని రాముడు విభీషణునితో జెప్పెను

## రావణుని భార్యలు దుఃఖించుట

రామునిచే రావణుడు హతుండయ్యెనని యాతని భార్య లాలకించి పరమదుఃఖితలై యెంతవారించినను వినక ధరణిపైబడి పొరలుచు తలవెండ్రుకలను విఱియబోసికొని వత్సములంబాసిన గోవుల కరణి దుఃఖాగ్నిలో గుములుచు నంత పురము నుండి వెడలివచ్చి భయంకరమైన యుద్ధభూమింబ్రవేశించి ప్రాణనాథునన్వేషించుచు నల్లని కాటుక రాశివోలె నొప్పారెడు మహాకాయుండగు రావణుని జూచిరి అట్లు యుద్ధభూమి యందు ధూళిలోబడియున్న పెనిమిటిని జూచి యూథపతింబాసిన యాడేనుగుల పగిది నఱచుచు రోదన మొనరించిరి ఖండింపబడిన వనలతలమాడ్కి భర్తపై బడిరి ఒకర్తుక జీవితేశుని కౌగిట జేర్చి రోదన మొనరించెను మఱొక్కవనిత పాదములపైబడి కౌగిలించుకొని పనవి పనవి యేడ్చెను మఱియొకర్తుక కంఠమును గట్టిగా కౌగిలించుకొని విలపించెను ఒకకాంత ప్రాణేశుని భుజములనెత్తుకొని భూమిపైబడి పొరలాడెను మఱియొక మానిని నిజవల్లభుని మోముగాంచి మూర్ఛిల్లెను ఒక యువతీమణి తన ప్రియుని శిరంబును అంకంబునంజేర్చి వదనారవిందమును దిలకించుచు నయనాశ్రువులచే నాతని ముఖంబు

దడుపుచు రోదనము గావించెను ఆ రాక్షసాంగనలకంతకంతకు శోకంబగ్గలంబగుడు బరవశలై యాక్రందన మొనరించుచు నిట్లు విలపించిరి

హా! జీవితనాథా! అమరేంద్రుని, యమధర్మరాజును కుబేరుని, గంధర్వులను, దేవతలను, జయించిన నీ శౌర్యంబు నేడెందుబోయె అసురులు, సురులు, ఉరగులవలన భయంబెంత మాత్రమెఱుంగని నీవు మనుష్యుని వలన భయంబునొంది నేల పాలైతివా? వీరాధివీరుండవని వాసికెక్కి కడపటికి బలహీనుడగు మనుష్యమాత్రునిచే హతుండవైతివే! మాగతి యేమి? ఎందుబోదుము? ఎవ్వరాదరింతురు? హా నాథా! మిత్రులు జెప్పిన హితంబు విననొల్లవైతివి సీతను దెచ్చితివి అందువలన హతుండవైతివి రాక్షసులందఱు నశించిరి నీయందధికానురాగముగల తమ్ముడగు విభీషణుని హితబోధనాలకింపవైతివి కాలవశంగతుడవై యజ్ఞానముచేత నమ్మహాత్ముని బరుషోక్తులాడి పరాభవించి వెడలగొట్టితివి నీవు రామునకు సీతాదేవి నొసంగియున్నచో నింతటివ్యసనంబు మాకు జేకూరియుండదు రాముడు మనయింటికి గూరిమి మిత్రుడై యుండెడివాడు మాకీ వైధవ్యప్రాప్తి చేకూరియుండదు సీతను బలాత్కారంబున చెఱబెట్టుటంజేసి యింతటి దుస్థితికి లోనైతివి ఇది నీ విధివ్రాత సర్వము దైవప్రేరణ చేతనే జరుగును దైవోపహతుడైన వాడే శత్రువుచే హతుండగును నీకి వినాశము దైవసంకల్పముననే గలిగినది గాని వేఱొండుగాదని క్రౌంచపక్షుల వోలె రావణుని భార్యలు రోదనంబు గావించిరి

## మండోదరి రావణుని జూచి దుఃఖించుట

అవ్విధంబున దుఃఖాగ్నిలో గుమిలెడు సపత్నులను గాంచి రావణునకత్యంత ప్రియురాలును, జ్యేష్ఠ భార్యయునగు మండోదరి దైన్యంబునొంది రామునిచే గూలియున్న భర్తనుజూచి యిట్లు విలపించెను హా! జీవితేశ్వరా! మహాభాగుడా! కుబేరుని తమ్ముడా! దేవేంద్రాదులను జయించిన నీ విక్రమంబు నేడెందుబోయె గంధర్వాదులు నీకు భయపడి

దిక్కులకు బాఱిరి గదా! రాక్షసోత్తమా! ప్రాణనాథా! ముజ్జగంబులను ముప్పుతిప్పలు బెట్టిన నీవు మనుష్యమాత్రునిచే గూలుటకు లజ్జ నొందవైతివేల? త్రైలోక్య రాజ్యలక్ష్మి కౌగిళ్లలోనోలలాడుచు దేవేంద్రాదుల కేని యోర్వంజాలనివుగటి మిగల నిన్ను అడవి మనుష్యుడొకడు వధించెననుట మిగుల నాశ్చర్యముగనున్నది కామరూపుడవగు నీవు రామునిచే నెట్లు గూలితివో విశ్వసించుట కాస్పదము లేదు ఇది మనుష్యమాత్రుని కార్యముగా నాకు దోచలేదు నీతమ్ముడగు ఖరుని వధించిన నాడే రాముడు మనుష్య మాత్రుడు గాడని స్పష్టముగా దెలసినది అమరులకు గూడ ప్రవేశించుట కలవిగాని లంకాపురంబులో హనుమంతుడేనాడు జొరబడెనో యానాడే మేమందఱు రాముడు మనుష్యమాత్రుడు గాడని తెలిసికొని దిగులొందితిమి ఇమ్మహాపారావారంబునకు సేతువు నిర్మించినపుడే రాముడు మనుష్యుడు గాడని నా మనంబున దలంచితిని కాలుడేయచింత్యమైన మాయావియై రామరూపంబు దాల్చి నీ మీదికి వచ్చియుండనోపును రాముడు లోక రక్షకుడు పరమాత్మ సర్వాంతర్యామి అచ్యుతుడు బ్రహ్మేంద్రాదులకన్న నధికుడు ప్రకృతి కతీతుడు సర్వప్రపంచమును సృజియించువాడు శంఖచక్ర గదాధరుండు దక్షిణ వక్షంబున శ్రీవత్సంబను కర్తవర్ణమత్స్యాకారమైన చిహ్నము గలవాడు శ్రీనివాసుడు రణాభంగుడు అట్టి సర్వలోకనాథుండు మనుష్య రూపంబునను, దేవతలందఱు వానరరూపంబునను అవతరించి నిన్ను సర్వరాక్షస సహితంబుగా వధించెను నీవు మున్ను జితేంద్రియుడవై ముల్లోకంబులను జయించితివి ఇప్పుడు యింద్రియ లోలుడై శత్రువుచే సంహరింపబడితివి రామునితో వైరంబు వలదనియు, సంధిజేసికొమ్మనియు నేనెన్నిమార్లు బ్రతిమాలినను విననొల్లవైతివి ఆ ఫలమిప్పుడనుభవమునకు వచ్చినది

అరుంధతీరోహిణులకంటెను పాతివ్రత్యంబున నధికురాలును పూజనీయురాలునగు సీతాదేవిని చెఱబట్టి తెచ్చి మోహపాశంబు నందగుల్కొంటివి ఆయురైశ్వర్యంబులను, బంధువులను గోల్పోయితివి హా! నాథా! నీ సతీమణులమైన మమ్ములను సౌందర్య విహీనులుగా

దలంచితివి భూదేవిని మించిన సహన స్వభావముగలదియు, లక్ష్మీదేవికంటె నధిక సంపదగలదియు, మహాసాధ్వియు, సర్వాంగసుందరియు, గల్యాణస్వరూపిణియు, దీనురాలునగు సీతను నిర్జరారణ్యము నుండి కపటోపాయంబున గొనివచ్చి యాబిడ సంగమంబపేక్షించి నీకాంక్ష ఫలింపక మునుపే దహింపబడితివా? ఇది జనకాత్మజ తప ప్రభావమే గాబోలు! అమ్మహాపతివ్రతా శిరోమణిని స్పృశించిన నాడే దగ్ధమై పోయియుండెడి వాడవు నీ ప్రభావంబునంజేసి బ్రదికితివని దేవతలందఱు వెఱగంది యుండిరి దుష్కర్మము లాచరించెడు దుష్టుడు సమయంబు సంప్రాప్తమైనప్పుడు తప్పక దత్ఫలితంబనుభవించుననుటలో సందియము లేదు సుకృతమొనరించెడు వానికి సుఖప్రాప్తి గలుగును దుష్కార్యము లొనరించెడు వానికి దుఃఖము సంభవించును విభీషణుడు రాముని శరణుజొచ్చి సుఖపడెను నీవు పాపకార్యము లాచరించి యీదుర్గతికి బాల్పడితివి సీతకంటెను సౌందర్యరాసులో యనంబరగెడు భార్యలెందరో నీకుండిరి సీతను కామించి మన్మథబాధకు గురియైనందున నీ భార్యల సౌందర్యము నీకు గోచరింపదయ్యె కులసౌందర్యాదుల యందును చాతుర్యము నందును సీతకు నేనేమియు దీసిపోననియెడు సంగతి నీకు దెలిసియు కామమోహితుడవై కన్నుగానక కడపటికిట్టి దుర్గతికి బాల్పడితివి ఎచ్చట గాని యే ప్రాణికిని నిమిత్తములేనిదే మరణంబు వాటిల్లదు సీతాదేవిని దెచ్చినందువలన నీకు మరణ కారణమేర్పడినది సీతాపహరణమనియెడు మృత్యుదేవతను దూరమునుండి గొని తెచ్చుకొంటివి ఇప్పుడు సీతకేమి? భర్తతోగూడి భోగభాగ్యములను భవింపగలదు మందభాగ్యనగు నేనుతుదియు మొదలుగాన రాని దుఃఖ సముద్రములో బడితిని

హా! జీవితనాథా! శోభదనరెడు మాల్యంబులను, వస్త్రములను ధరియించి విమానమారోహించి కైలాసమందర, మేరుమహీధరము లందును, చైత్రరథవనంబునందును, దేవతల సుందరోద్యానవనంబుల యందును నీతో గూడి స్వైర విహారమును సల్పుచుంటిని ఇప్పుడా కామోపభోగములన్నియు వ్యర్థమై పోయెను గదా! రాజసంపదలు

చంచలములైనవి నేనిపుడు సామాన్య స్త్రీవోలె నెట్లు జీవితమును బుత్తును రాక్షస రాజా! సుకుమార సుందరములైన కనుబొమలుగలదియు, స్నిగ్ధమైన చర్మముగలదియు, కోటేరును బోలిన ముక్కుగలదియు, సోముని గేలి సలిపెడు కిరీటాలంకృతంబగు నదియునగు ముఖారవిందముపై జిఱునవ్వు నాట్యమాడుచుండ మంగళకరంబై ప్రకాశించుచుండెను అట్టి నీ వదనారవిందము రామబాణంబులచే ఛేదింపబడి రక్తసిక్తమై మేదస్సు చేతను, మాంసంబు చేతను వ్యాకీర్ణమై రథపరాగంబులచే గప్పబడి కాంతిదఱిగియున్నదే! అయ్యో! నీవు మృతుండవైతివి నేను విధవనైతిని ఇట్టి దుస్థితి నాకు జేకూరునని మూఢురాలనగు కతంబున నేన్నడును దలంపనైతిని నాతండ్రి మయుడు దానవరాజేంద్రుడు నా జీవితేశుడు ఇంద్రుని జయించిన మేటి శూరుడుగు ఇంద్రజిత్తు నాసుతుండు నాకేమి కొదువయని గర్వించి యుంటిని ఇంద్రనీలమణివోలె నలరెడు నీ శరీరము తీక్ష్ణబాణంబులచే గ్రుచ్చబడి కౌగిలింప నలవిగాకున్నది వజ్రాయుధ ప్రహారంబునకు నేలగూలిన పర్వతంబు మాడ్కి నీ తనువు భూమిపై బడియున్నదే! అయ్యో! నాథా! నీవు విగత జీవుండగుట స్వప్నమై యుండునా? కాదు కాదు ఇది సత్యము మృత్యువునైనను వధియింప జాలిన నిన్ను రాముడెట్లు వధించెను నీవు మృత్యువునకెట్లు లోబడితివి? ముల్లోకంబులను జయించితివి కైలాసాచలంబు నెత్తితివి లోకంబులన్నిటిని చీకాకుబఱచితివి సర్వభూతములనఱపించితివి భృత్యులను రక్షించితివి శత్రువులను శిక్షించితివి దేవదానవ యక్షగంధర్వాదుల మదమడంచితివి యజ్ఞములెన్నింటినో విఘ్నంబుగావించితివి దేవకన్యలను, అసుర కన్యలను, రాజకన్యలను, మనుష్యకన్యలను బలిమింగొని తెచ్చితివి శత్రువులను వధించి వారి కులకాంతలకు దుఃఖంబొనగూర్చితివి శివప్రీత్యర్థమై నీ శిరంబులనగ్నియందు వ్రేల్చి భయంకరంబులైన కర్మంబు లాచరించితివి మాకందఱకు కామిత భోగంబు లొసంగితివి సర్వరథికులలోనుత్తముడవై రామునిచే సంహరింపబడితివి అయ్యో! నా హృదయమెంత కాఠిన్యమై యున్నది నా ప్రాణనాథుని జూచి జీవించి యున్నాను నా కింకను మరణంబు రాకున్నది రాజా! ఉత్తమంబైన మృదుశయ్యపై బవ్వళించు

చున్న నీ దేహము ధూళిలో నేలపై బడియున్నదే! నేనెట్లు జూచి సహింతును ఇంద్రజిత్తు లక్ష్మణునిచే జంపబడినప్పుడే నా హృదయము క్రుంగిపోయినది ఇప్పుడు నా ప్రాణంబులెగసిపోగలవు నాథా! దుఃఖితనగు నన్ను గొనిపోరాదా! నిన్నెడబాసి నేనెట్లు జీవింపగలను నన్నొంటిమైడంచ పోవుట నీకు దగునా? భాగ్యహీననగు నాతో బలుకవేమి? ప్రాణేశా! ముసుగుకూడలేక పట్టణద్వారంబు వెలువడి వచ్చిన నన్నుజూచి కినుక వహింపవేల? భార్యలందఱు ముసుగులు వీడి నిన్ను జూడ వచ్చియున్నారు చూడుము భార్యలందుగల నీ గాఢానురాగము నేడెందుబోయెను అనాథలైదుర పిల్లెడు నీ సతీమణుల నొక్కమాఱు బలుకరింపకున్నావెందుకు?

రాక్షసనాథా! సాధ్వీమణులను, ధర్మపరాయణులును, గురుశుశ్రూషా పరులునగు వనితామణుల భర్తలెందఱినో వధించితివి అమ్మహా పతివ్రతలు వైధవ్యము ననుభవింపజాలక దుఃఖాగ్నిలో గుమిలిపోయి నిన్ను శపించిరి ఆ ఫలమిప్పుడనుభవించితివి ముల్లోకములను జయించిన శూరాగ్రేసరుడవయ్యును, స్త్రీ చౌర్యము నీచమని దలపోయవైతివి మారీచుడు, కుంభకర్ణుడు, నా తండ్రియు జెప్పిన హితవాక్యములు వీర్యగర్వంబున విననొల్లకపోయితివి ప్రాణేశ్వరా! నీలవర్ణుడా! పీతాంబరధారీ! కరచరణంబులను జూచుకొని నిద్రించుచున్న వాడిక్క భూమిపై బడియున్నావే! నేనెంత విలపించుచున్నను మాఱుబలుకవెందుకు? నీవు నేలంగూలినదే తడవుగా సూర్యుడు తన కిరణంబులను లంకయందు బ్రసరింపజేసియున్నాడు ఇట్టి నూతన పరాభవము సంభవించినపుడిట్లు పరుండుట తగునా? లే లెమ్ము ప్రియురాలను వోలె యుద్ధభూమిని గౌగిలించి పరుండియున్నావు అప్రియనువోలె నన్నెడబాసి యెంత విలపించుచున్నను బలుకరింపకున్నావే! నా హృదయమింకను వేయివ్రక్కలుగాకున్నదే! నేనెంత పాపాత్మురాలను సర్వలోకములయందును నిందనీయనైతినని పరిపరి విధంబుల మండోదరి పనవి పనవి యేడ్చుచు భర్త వియోగాగ్ని నుండి దరిజేరంజాలక రావణుని వక్షంబునంబడి మూర్ఛిల్లెను అట్లు రోదనంబుజేయుచు మృతుండగు ప్రియుని వక్షంబుపైబడి విలపించుచున్న మండోదరిని సపత్నులు లేవనెత్తి

యాశ్వాసించి యిట్లూరడించిరి దేవీ! శరీరములనిత్యములు ప్రాణుల శరీరములు బాల్య, యౌవ్వన, వార్ధకము, మరణమునియెడు యవస్థలు గలిగి మారుచుండుట సహజము రాజుల సర్వసంపదలు నశ్వరములనియెడు విషయము నీకు దెలియనిదిగాదు ఇందుకు వగవనేల? శోకంబును మానుమని మండోదరిని సపత్నులోదార్చిరి రావణుని ధర్మపత్నులవ్విధంబున రోదనంబు గావించుచుండుటను రాముడెఱింగి విభీషణా! ఈ స్త్రీలందఱిని పురంబునకు బంపి మీ యగ్రజునకుత్తర క్రియలు గావింపుమనెను

## విభీషణుడు రావణునకు ఉత్తర క్రియలొనరించుట

ధర్మజ్ఞుడగు విభీషణుడు రాముని వాక్యములాలకించి యందులోని ధర్మమును ఔచిత్యమును, ధీశాలియై విమర్శించి, నేనే మాయన్నకు సంస్కారము చేసెదనని పలికినచో రాముడేమని దలపోయునోయని శంకించి యమ్మహాత్ముని మనోభిప్రాయమును బరిశీలింపగోరి యిట్లనియె రామా! రావణుడతిక్రూరుడు అధర్మపరుడు సత్యహీనుడు, జీవహింసకుడు, పరస్త్రీ గమనమొనరించినవాడు ఇట్టి పాపాత్మునకు సంస్కారంబు గావించుటకు నేనర్హుడనుగాను రాక్షసేంద్రుడు నాకు సోదరుని రూపములోనున్న శత్రువేగాని వేఱుగాదు సర్వభూతములకును కీడొనరించినవాడు నాకు జ్యేష్ఠుడగుటంజేసి పూజింపదగినవాడే ఐనను దురాచారము లాచరించినవాడు గాన పూజకర్హుడు గానేరడు అన్నకు సంస్కారము గావింపకుండుట వలన లోకులు నన్ను దుర్మార్గుడని దలపోయుదురేమో! ఇతని దుర్గుణములాలకించినచో విభీషణుడు రావణునకు సంస్కారము చేయకుండుటయే యుక్తమని దలపోసిన నన్ను శ్లాఘింపగలరని రామునితో జెప్పెను

వాక్యకోవిదుండగు విభీషణుని వాక్యము లాలకించి రాముడు సంతుష్టుడై యిట్లు పలికెను రాక్షస నాథా! నీవు నాకెంతయో ప్రియుండవు

నీ సాహాయ్యము వలననే నాకీ విజయంబు చేకూరినది కావున నేను నీకు హితంబుపదేశించెద నాలకింపుము ఈ రావణుడసత్యమును, అధర్మమును అవలంబించినవాడే, నీ మాటయును నిజమే కాని ఇతడు మహాబలపరాక్రమ సంపన్నుడు భండనంబున పరాజయంబెఱుంగని వాడు మహా ప్రభావసంపన్నుడు అమరేంద్రాదులనోడించిన మేటి మొనగాడు అట్టి శూరాగ్రేసరునిపై చనిపోయిన పిమ్మట వైరంబు బూనరాదు మనకాంక్షయు ఫలించినది సందేహింపక మీ యగ్రజునకుత్తర క్రియలు గావింపుము ఈతండు నీకెట్లు బంధువో నాకును బంధువే! అన్యుడుగాడు నాకే బంధువగునప్పుడు నీకు బంధువని నుడువనేల? ధర్మజ్ఞుడా! మీయన్న నీచేతినుండి శాస్త్రచోదితమైన యౌర్ధ్వ దైహికమును బొందనర్హుడు ఇతనికి సంస్కారము గావించి సత్కీర్తి నార్జించుకొనుము సందేహమును మానుమనియెడు రాముని పలుకులాలకించి విభీషణుడు వేగిరపడి రావణునకు దగినరీతిగా సంస్కారము గావించెను

అంతలో ఋత్విజులు పద్మకమును, వెట్టి వేళ్ళు మొదలు గాగల సుగంధ ద్రవ్యములతో జందన కాష్ఠములచేత జితినిచేర్చి దానిపై దెల్లని వెంద్రుకలుగల కృష్ణాజినంబును గప్పిరి తదుపరి వేదవిహితమైన యంత్యేష్టినిగావించి యధాశాస్త్రముగాబితృమేధ సంస్కారమును నెరవేర్చిరి ఋత్విజులు చితికాగ్నేయ దిశయందు వేదిని గల్పించి యావేదిక యందు పశ్చిమంబున గార్హ్య పత్యంబును, తూర్పు దిశనాహవనీయంబును, దక్షిణాగ్నినివ్వథంబున నయ్యైస్థానంబులందు త్రేతాగ్నులను రగులించిరి పెరుగుతో గలిపిన యాజ్యభాండమునచట నుంచిరి ఋత్విజులు సోమలతను దెచ్చు శకటంబును రావణుని పాదములపై నుంచిరి తొడల నడుమ యజ్ఞార్థము వడ్లుదంచురోలు నుంచిరి

వేదములందునను, స్మృతులయందునను, చోదితమైన మేరకు బవిత్రమైన నల్లని గోవును, వధించి హోమంబుగావించి దాని చర్మమును నేతిలోదడిపి రాక్షస రాజునకు గప్పిరి అప్పుడు రాత్రించరులందఱు విభీషణ సహితులై గంధమాల్యాదులచేతను, వివిధములైన వస్త్రములచేతను

రావణుని యలంకరించి శోకజలనిధి నీదుచు చితిపై బేలాలు చల్లిరి అటు పిమ్మట విభీషణుడు రావణునకు మంత్రయుక్తంబుగా నగ్ని నొసంగెను అవ్విధంబున విభీషణుడు తన సోదరునకగ్ని నొసంగి స్నానమాడి తడివస్త్రముతో దూర్వలును, నువ్వులును, సలిలంబునుంచి యందు ప్రేతావాహనంబు గావించి, యుదకదానంబొసంగి సాష్టాంగ నమస్కారము గావించి రావణుని భార్యలనాశ్వాసించి నగరంబునకు బొమ్మని చెప్పెను వారందఱు లంకాపట్టణంబునకు బోయిరి తదుపరి విభీషణుడు రాముని సన్నిధికరుగుదెంచి యతని పార్శ్వంబున సవినయంబుగా నిల్చెను రాముడు సకల సైన్యసమేతుడై సుగ్రీవ లక్ష్మణ సహితంబుగా మోదార్ణవమున దేలియాడెను

## లక్ష్మణుడు విభీషణునకు పట్టాభిషేకము జేయుట

రామరావణుల యుద్ధంబు జూడవచ్చిన, దేవగంధర్వాదులు తమ తమ నెలవులకు బోయిరి రాముడు మాతలిని గౌరవించి దేదీప్యమానంబగు దేవేంద్రుడు బంపిన దివ్య రథంబును గొనిపొమ్మని సెలవిచ్చెను దేవేంద్రసారథి రామునసుమతి వడసి దివ్యరథంబును దీసికొని స్వర్గమునకు బోయెను అటుపిమ్మట నీ విజయమంతయు సుగ్రీవుని సాహాయమున గలిగినందుల కమితానందసాగరంబున దేలియాడుచు రాముడు సుగ్రీవుని గాఢాలింగనము గావించుకొని లక్ష్మణుడు ప్రేరేపింప వానరోత్తములచే బూజలందుకొనుచు శిబిరంబునకేగెను అప్పుడు సత్యవాదియగు సుమిత్రాసుతుని గాంచి కౌసల్యానందను డిట్లనియె సౌమ్యుడవగు లక్ష్మణా! నా భక్తుడును స్నేహితుడునగు విభీషణుడు నాకెంతయో మహోపకారమొనరించియున్నాడు మందుగా నీ రాక్షసోత్తమునకు లంకాధిపత్యమొసంగి పట్టాభిషిక్తుని గావింపుము నేను కన్నులలర జూడనువ్విళ్లూరుచున్నాను ఇది నాకాంక్ష పొమ్మనిన తోడనే లక్ష్మణుడు సువర్ణకలశంబులతో సముద్రజలంబులను దెప్పించి విభీషణుని సింహాసనాసీనుని గావించి సమస్త రాక్షసుల నడుమనొక కలశంబెత్తి దానితో నతనికభిషేకము గావించెను విభీషణుడు పట్టాభిషిక్తుడై రాక్షసరాజగుటం

జూచి మంత్రివర్యులును, రాక్షసులును పరమానెూదమందిరి రాక్షసనాథుండు రామానుగ్రహంబునొంది మహా రాజ్యలక్ష్మిని బడసి ప్రజలనలరించి మరల దశరథసుతుని సన్నిధికి వచ్చెను పౌరులును, రజనీచరులు నమితముగా తమ రాజేంద్రునకు బేలాలను, దివ్యములగు పుష్పములను సమర్పించిరి రావణానుజుడావస్తువులన్నిటిని స్వీకరించి రామలక్ష్మణులకర్పించెను పరిపూర్ణ మనోరథుండగు విభీషణుడు కృతార్థుడగుట కెంతయునలరితనకు భోగేచ్ఛ లేకపోయినను రాక్షసనాథుడొసంగిన దివ్యవస్తుజాలంబును బ్రీతితో స్వీకరించెను

## రావణుడు నాచే హతుండయ్యెనని సీతకు జెప్పి రమ్మని రాముడు హనుమంతుని బంపుట

అంతలో దన పార్శ్వభాగమందు చేమోడ్పు గీలించి పర్వతాకారుడై నిల్చియున్న పవనాత్మజుని జూచి రాముడిట్లు బలికెను పవనతనయా! నీవు రాక్షస మహారాజగు విభీషణుని యనుమతి వడసి లంకాపురంబులోని రావణుని గృహంబులోనికేగి విజయము గలుగుగాక! యని సీతనభినందించి నేను సుగ్రీవలక్ష్మణ సహితంబుగనున్నాననియు, రావణుడు నాచే హతుండయ్యెననియు దెలియబలుకుము ఈ శుభవార్త నామెకుజెప్పి అక్కడి సమాచారమునుగొని మరలిరమ్ము పోయి రమ్మనిన తోడనే హనుమంతుడు రాముని యానతిని శిరంబునందాల్చి రావణుని గృహంబునకుబోయి క్రూర గ్రహపీడిత యగు రోహిణి చందంబున సంతోషహీనయై యున్న సీతను జూచి సమీపంబునకు బోయి నమస్కరించి వినమ్రుడై నిలువంబడెను అట్లు వచ్చి నిల్చున్న మారుతాత్మజుని మొదట గుర్తింపజాలక మౌనము వహించి కొంత తడవూరకుండెను తదుపరి చక్కగా జూచి హనుమంతుడని గుర్తించి సంతసించెను సీతాదేవి ప్రసన్నయగుటంగాంచి వానరోత్తముడు రాముడు చెప్పి పంపిన వృత్తాంతము నంతయు జెప్పనారంభించెను మాతా! రామచంద్రుడు సుగ్రీవ విభీషణులతో గూడి సుఖంబుననున్నాడు రావణుని వధించి

కృతకృత్యుడై నీ క్షేమంబడిగి తన క్షేమమును నీతో జెప్పుమనెను దేవీ! నా భాగ్యవశంబున జీవించియున్నావు నీకిప్పుడొక శుభవార్త నెఱిగించెద నాలకింపుము యుద్ధమందు మనకే విజయంబు లభించినది నీవు దుఃఖమునుండి దరిజేరి స్వస్థముగా నుండుము రావణుడు హతుండయ్యె లంకానగరంబంతయు మనస్వాధీనమైనది నిన్ను శత్రువుబారి నుండి తప్పించుటకై నిద్రాహారంబులు మాని సముద్రమునకు సేతువు గట్టితిని రావణుని సంహరించి ప్రతిజ్ఞ నెరవేర్చుకొంటని ఈ లంకా పట్టణమంతయు విభీషణుని స్వాధీనమైనది అందువలన స్వగృహంబులో నున్నట్లుగ భావింపుము భయంబువలదు విభీషణుడు నిన్ను జూడ గోరి వచ్చుచున్నాడని రాముడు తన మాటలుగా జెప్పుమనెను తల్లీ నిజవృత్తాంత మెఱిగించితిననిన తోడనే సీత మైపులకలెగయు లేచి యేమియు బలుకకుండెను హనుమంతుడది గ్రహించి దేవీ! నాతో ఏమి బలుకవేల? తెలియ బలుకుమనెను అప్పుడు రాముని ధర్మపత్ని సంతోషాంబుధినీదుచు డగ్గుత్తికతో నిట్లు బలికెను సమీరనందనా! నా పతిదేవుడు విజయము నొందెననియెడు నీ యమృతోపమానములైన వాక్యములాలకించి క్షణకాలము మాటాడజాల కూరకుంటిని వానరోత్తమా! ఇట్టి ప్రియవార్త నెఱిగించిన నన్నెట్లు ప్రశంసింపవలయునో తోచకున్నది నీకేదేని యమూల్యాభరణమొసంగెదమనిన నీకివ్వదగిన వస్తువు ముల్లోకములయందును గానబడకున్నది నీ ప్రియవాక్యములకు దగిన వస్తువు వెద్దియులేదు నాయనా! నీయుదారము నెంతని కొనియాడ నగునని సీత హనుమంతునితో జెప్పెను

అప్పుడాబిడకు పవన తనయుడు నమస్కరించి తల్లీ! మహా తాత్పర్యముగల నీ మృదుమధుర వాక్యమే రత్నరాసులకన్నను, సురేంద్ర పదవికన్నను నాకధికము ధన్యుడను మాతా! నాకింతకంటే వేఱేమి కావలయుననిన వాయుసుతుని భూసుత యిట్లు శ్లాఘించెను నాయనా! నీ యట్టి పుత్రుని బడసిన వాయుదేవుడెంతయు ధన్యుడు భాగ్యవంతుడు నీవు ధన్యజీవివనియెడు సీతాదేవి మధుర వాక్యములాలకించి హనుమంతు డిట్లనియె జననీ! మునుపు నిన్ను బాధించిన రాక్షస స్త్రీలందఱిని

వధించెదను నాకు వర మొసంగుము నీకపకారము గావించి పరుషోక్తులాడిన రాక్షస స్త్రీలందరిని పిడికిళ్లతో బొడిచి చేతులతో జఱచి, పాదంబులతోదన్ని రూపుమాపెదను నాకు సెలవొసంగుమని హనుమంతుడు సీతతో జెప్పెను అంజనేయుని వచనంబులాలకించి భూసుత ధర్మంబు గానిట్లు బలికెను

## రాక్షస స్త్రీలు శిక్షించుట కర్హులు గారని సీత హనుమంతునితో జెప్పుట

పవనాత్మజా! రాక్షసస్త్రీలు స్వతంత్రులు గారు రావణుని దాసీజనము రాజసేవనాశ్రయించి జీవించువారలు వీరిని హింసించుట తగదు నా భాగ్యవైపరీత్యము వలన నేను పూర్వజన్మములో జేసిన పాపమింతకు దెచ్చినది ఆ పాపఫలమిప్పుడనుభవింపక దీరునా! నిర్దోషులగు రాక్షస స్త్రీలనను శిక్షించుట భావ్యముగాదు వీరి తర్జనాదులనను క్షమించుచున్నాను రాక్షసేంద్రుని యాజ్ఞకు బద్ధులై నన్ను బాధించిరే గాని మఱొండేమియు లేదు ప్రాజ్ఞుడు తనకపకారము చేసిన వానికెంతమాత్రము ప్రత్యపకారమునను దలపెట్టడు అపకారమొనరించిన వానికి గూడనుపకారమే చేయవలయునని సత్పురుషులు చెప్పుదురు ఆ యాచారమే సత్పురుషులకు భూషణము పాపులైనను, సాధువులైనను సరియే అపరాధము గావించిన వారలు వధార్హులైనచో సత్పురుషుడు వారియెడ కారుణ్యమునే జూపవలయును ఇదియే నామతము రాక్షస స్త్రీలనను శిక్షించుట నాకసమ్మతము అనియొండు సీతాదేవి యమృతోపమానములగు వాక్యములాలకించి పండితోత్తముడగు పవనాత్మజుండిట్లు బదులుపలికెను తల్లీ నీవు రామచంద్రుని ధర్మపత్నివి పతివ్రతామహాశిరోమణివి సద్గుణ సంపన్నురాలవు యశస్సంపన్నవు నీకు నీతులు బోధింపగలనా? అమ్మా! రామచంద్రుని చరణారవిందముల కడకేగుచున్నాను నాకు బదులు సమాచారము జెప్పి పంపుము సెలవిమ్మనిన తోడనే వాయుసుతుని జూచి జనకాత్మజ సంతసించి

యిట్లనియె మారుతీ! నానాథుని జూచు భాగ్యముకంటె వేఱొండు భాగ్యము గలదా? రాముని జూడగోరెదననిన తోడనే దేవీ! శుభలక్షణ సంపన్నుడగు రాముని త్వరలోనే చూడగలవు లెమ్మని మహావేగంబున రాముని సన్నిధికేగి యిట్లు చెప్పెను

## సీతాదేవిని చూడుమని హనుమంతుడు రామునితో జెప్పుట

రామా! పరమదు ఖితయైయున్న సీతాదేవిని త్వరలో జూడుము కన్నీటి కాల్వలో నీదుచున్న యమ్మహాసాధ్వి నీ విజయంబునాలకించిన తోడనే పరమామోదమొంది, రామలక్ష్మణులను జూడగోరెదను అంతకంటె నాకు గావలసిన మఱొండు భాగ్యమేమున్నదని చెప్పెను హనుమంతుని వాక్యములాలకించి రాముడు తటాలున కన్నీరు రాల్చెను బహుకాలము పరపురుషునింట నుండిన సీతను చేపట్టినచో నాకు లోకాపవాదంబు గలుగునేమో! అబిడ యన్ననో నిర్దోషి లోకనిందకు వెఱచి పరిత్యజించినచో దోషంబు వాటిల్లును ఏమిచేయుదునని లోలోన రాముడు చింతనొందెను వెంటనే చెంతనున్న విభీషణుని జూచి రాక్షసోత్తమా! నీవుబోయి సీతనభ్యంగ స్నానము చేయించి పరిమళిమొలికెడు మైపూతచేతను, దివ్యాభరణాదుల చేతను అలంకృతను గావించుకొని త్వరితంబుగ నిచటికి దోడ్కొని రమ్మనెను

## విభీషణుడు సీతను రాముని సన్నిధికి దోడితెచ్చుట

విభీషణుడు రాముని యాజ్ఞ మేరకుబోయి సీతాదేవికి శిరస్నానము చేయించి దివ్యాంబరములచేతను, దివ్యాభరణాదులచేతను, అలంకరించి తల్లీ! రాముడు నిన్నుజూడగోరుచున్నాడు త్వరితంబుగ రమ్మనిన తోడనే యమ్మహాసాధ్వీమణి సంతోషాంబుధిని దేలుచు రాక్షసులచే రక్షింపబడుచున్న పల్లకిలో గూర్చుండెను విభీషణుడు సీతను త్వరితముగా

రాముని సన్నిధికి దోడ్కొని వచ్చెను రాముడు ఎంతో సేపటివరకు నేలచూపు చూచుచుండెను సీతాదేవిని దోడ్కొని వచ్చితినని రాక్షసరాజు విన్నవించెను లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు రాముని మనోభావంబెఱింగి సీతపైననురాగము గనబడకుండుటకు మిగుల వగచిరి ఔరా! రామునకు ధర్మపత్నియందు ప్రీతి దప్పినట్లున్నది ఇందులకు హేతువేమని యూహించుచుండిరి

అంతలో సీతాదేవి లజ్జచే దన యవయవంబులను సంకోచపఱచుకొని జీవితేశునియొద్దకు బోయెను ఆబిడ జనసమూహములో లజ్జచే ముసుగు వేసికొని రామా! ఆర్యపుత్రా! యని పలుకుచు రోదనంబు గావించెను బహుకాలము వియోగాబ్ధినీదుచున్న సీతాదేవి మోదవార్ధినీదుచు ప్రియుని కన్నులారగాంచెను లజ్జావనతయై తన పార్శ్వంబున నిల్చుండియున్న సీతను జూచి రాముడు క్రోధారుణలోచనుడై యిట్లు బలుకనారంభించెను

## సీతాదేవిని జూచి రాముడు శంకించుట

సీతా! నా శ్రమకు ఫలితమిప్పుడు చేకూరినది నా ప్రతిజ్ఞయు నెరవేఱినది ఇప్పుడు నాకు నేనే స్వతంత్రుడనైతిని నేను లేనప్పుడు చపల చిత్తుడగు రావణుడు నిన్నపహరించి గొనిపోయెను దైవముచే సంప్రాప్తమైన పరాభవంబును పురుష ప్రయత్నంబున బోగొట్టితిని హనుమంతుడు చేయవలసిన కర్మములన్నియు సఫలమైనవి సుగ్రీవుని కోర్కెయు సఫలమైనది విభీషణుడు రాజ్యాభిషిక్తుడయ్యె అతని మనోరథసిద్ధియు సఫలమైనదని రాముడు సీతతో బలుకుచుండ యాబిడ కనులనుండి బాష్పకణంబులు రాలదొడంగెను రాముడది జూచి మఱింత క్రుద్ధుడై వానర రాక్షసుల నడుమనున్న సీతనుజూచి పరుషోక్తులచే నిట్లులనియె

సీతా! సంప్రాప్తమైన పరాభవమును బోగొట్టుకొనగోరిన పురుషుడు చేయవలసిన కర్తవ్యమంతయు జేసితిని రావణుని వధించితిని మిత్రుల

తొట్రుపాటు వలన విజయలక్ష్మిని బడసితిని ఇదంతయు నీ కొఱకు జేయలేదు సదాచారమును రక్షించుటకును లోకాపవాదమును బాపుకొనుటకును నింతపని జేసితిని సుప్రసిద్ధమైన మా వంశంబునకు గలిగిన కళంకమును బాపుకొంటిని నాకన్నుల యెదుట నిల్చియున్న నీవు నేత్రరోగము గలవానికి దీపమువోలె నాకెంతయు బ్రతికూలవైయున్నావు నాచెంత నివసించి యుండుటకు నీకు జోటులేదు జనకపుత్రీ! నేనిదే యనుజ్ఞ నొసంగితిని ఈ దశదిశలయందును నీకిష్టమున్న చోటునకేగుము బహుకాలము పరపురుషుని యింట నివసించియున్న భార్యను సత్కులసంజాతుడగు పురుషుడెవ్వడు ప్రేమతో జేరదీయగలడు? ఇంతకాలము రావణుని యంకమునుండి యిప్పుడే దిగివచ్చినావు రావణునిచే మన్మథాతురంబగు దృష్టితో జూడబడినదానవు మరలనెట్లు గ్రహింపగలను? నిన్ను జేకొని నా వంశమునకపఖ్యాతిని దెచ్చిపెట్టుదునా? పరాభవమును దొలగించుటకై నిన్ను మరల జయించితినే గాని వేఱు కారణంబు మఱొండులేదు నాకు నీయందాసక్తి యెంతమాత్రము లేదు నీ కిష్టమైన చోటునకు వెడలిపొమ్ము నీయాత్మ పోషణార్థమై సుమిత్రా సుతుని యొద్దనో, భరతుని యొద్దనో, సుగ్రీవుని యొద్దనో లేక విభీషణుని చెంతనో జీవితమును గడపుము తన యింటనున్న నీ సహజ సౌందర్యాదులనుజూచి చపల చిత్తుడగు రావణుడు మన్మథబాధలకు గురియై సహించి యింతకాలమూరకుండునా? నీ శీలమును గూర్చి నాకేమియు దోచలేదు పొమ్మనిన రాముని పరుష వాక్యములాలకించి సీతాదేవి గడగడ వడంకుచు అశ్రుధారలొలుక పరమ దుఃఖితయై నిశ్చేష్టురాలై నిల్చెను

## సీత తన శీలమును గూర్చి రామునితో జెప్పుట

అంతలో జనకాత్మజ కన్నీటితో దడిసిన మోమును దుడుచుకొనుచు భర్తను జూచి డగ్గుత్తికతో మెల్లగా నిట్లు బదులు పలికెను ప్రాణపతీ! కర్ణకఠోరమైన వాక్యములాడి నన్నేల గాసిపెట్టెదవు ఏమియు దెలియనివాడు

తెలియనిదానిని బలుకు చందంబున బలుకు చున్నావెందుకు? రామా! నేను నిర్దోషిని నీవు దలంచునట్లు నేనే దోషంబు పాలును గాలేదు నాయనిందిత చరిత్రముపై నానబెట్టి చెప్పుచున్నాను నీకు నాయందు విశ్వాసము గలుగుటకేదైన నొక ప్రమాణమునకు గట్టుపడుము దుష్టలగు స్త్రీలు యేకొందఱోదుర్వృత్తి గావింతురని స్త్రీజాతినంతయు నిట్లు శంకించుట న్యాయమా! నా స్వభావము నీవెఱుంగవా? నాధా! దురాత్ముడగు రావణుడు నన్నపహరించుకొని పోవునపుడాతని దేహస్పర్శ నాకు గలిగెనందువేమో! నేనప్పుడు పరాదీనురాలను గదా! ఆ తప్పు దైవమునకే జెందును నాయందేకల్మషము లేదు అప్పుడు నీయందే నా మానసంబు జొరబడియుండెను రక్షింతువని యెంతయో దు ఖించితిని మొఱబెట్టితిని అస్వతంత్రనైతిని బలాత్కారంబున పరులు స్పృశియించి నందులకు నేనేమి జేయగలను? నీకే నా స్వభావము దెలియక పోయినచో యన్యులకెట్లు దెలియగలదు స్వామీ! హనుమంతుని నా యన్వేషణము కొఱకు లంకకు బంపినప్పుడే విడనాడి యుండగూడదా! నీవు నన్ను విడనాడితివనెడు వార్తను హనుమంతుని ద్వారా విని యానాడే ప్రాణంబులు నీ కర్పించియుండెడి దానను గదా! ఇంతఘోరమైన యుద్ధమెందుకు జేసి శ్రమకు లోనైతివి? పురుషోత్తమా! అల్పపురుషుని వోలె కోపము జెందితిరి యుక్తాయుక్తంబు లెఱుంగవైతివి స్త్రీ జాతినంతయు నొకటిగానే భావించి పరుషోక్తులాడితివి నాశీలమును దలపోయవైతివి భూమాత నా జననియని గుర్తింపజాలవైతివి జనక రాజకుమార్తెనని దలంపవైతివి చిన్ననాడే యగ్నిసాక్షిగా నన్ను వివాహమాడిన ప్రమాణమును హృదయమందు దలంపక పోయితివి నాయందుగల గాఢానురాగము, భక్తి, నాసచ్చరిత్ర మంతయు నీకిపుడు అప్రమాణమైపోయెను లక్ష్మణా! ఇంకను త్వరపడకున్నావేల? తండ్రీ! యీ వ్యసనమునకు ఔషధ ప్రాయమైన చితిని చేర్చుము ఆ చితియందుబడి ప్రాణంబులు వదలెదను ప్రియుని వలన మిధ్యాపవాదంబునొందిన నిర్భాగ్యురాలు జీవించియు ప్రయోజన మేమున్నది? మహాజన మధ్యమందు నన్ను శంకించి జీవితేశుడు పరిత్యజించి నప్పుడు అనలంబుజొచ్చుటకంటే మఱొక్కగతియేమున్నది? అనియెడు

సీతాదేవి వాక్యంబులు సుమిత్రాసూనుండు విని కౌసల్యాసుతుని యనుమతి మేరకు జితిని బేర్చెను

## సీతాదేవి అగ్ని ప్రవేశము గావించుట

ఆ సమయమందు భూపుత్రియగు సీత మెల్లగా రామునకు బ్రదక్షిణమొనరించి జాజ్వల్లమానంబైయున్న యగ్నిహోత్రము సన్నిధి కరుగుదెంచెను దేవబ్రాహ్మణులకు నమస్కరించి హుతాశనునకు జేమోడ్చి గీలించి దేవా! సంతతమును, నా మానసంబు రాముని దక్క పరపురుషుల యందు చలింపదనుట నిక్కువమ్మైతే లోకమునకు సాక్షిభూతుండవగు నీవు నన్ను రక్షింపుము పరిశుద్ధ హృదయముతో బతియే దైవమని భావించి సచ్ఛీల సంపన్నురాలననుట సత్యమైతే, రామునకు నాయందు గలిగిన శంకను తొలగించి పుణ్యాపాపంబులకు సాక్షిభూతుండవైన హుతాశనా! నన్ను రక్షింపుము నేను మనోవాక్కాయ కర్మంబులకులోనై పరపురుషులను జూడనొల్లకుందునేని సర్వలోకసాక్షియగు నగ్నిహోత్రుడా! నన్ను రక్షింపుము సూర్యభగవానుడును, వాయుదేవుడును, దిక్కులును, చంద్రుడును, రాత్రింబవళ్లును, ప్రాతస్సాయంసంధ్యలును, భూదేవియు నన్ను పతివ్రతాశిరోమణినని యంగీకరింతురేని దేవా! నన్ను రక్షింపుము ఇదే నీయందైక్యమై పోయెదనని సీతాదేవి ఆ యగ్నిహోత్రమునకు బ్రదక్షిణము గావించి దేహమందాసక్తిని వీడి మంటలెగయుచున్న యగ్నిలో బ్రవేశించెను అబాలగోపాలము సీతను జూచి వెఱగందిరి ముజ్జగంబుల వారును జూచిరి ఆ పెనుమంటలో దుమికి నా సీతను జూచి స్త్రీలందఱు నాక్రందనము గావించిరి వానర రాక్షసులు భయమంది మహాధ్వనిచే హాహాకారంబులు గావించిరి రాముడీవిచిత్రమును గాంచి శోకవ్యాకుల చిత్తుడై జొటజొట కన్నీరు రాల్చి చింతాసాగరంబునమగ్నుడై యుండెను

## సీత నిర్దోషియని దేవతలు రామునితో జెప్పుట

అంతలోనే కుబేరుడు, యముడు, సురనాధుడు, వరుణుడు, పరమేశ్వరుడు, బ్రహ్మదేవుడు, మొదలగు వారందఱు విమానముల నుండి లంకాపురములో దిగి రాముని సన్నిధికి వచ్చిరి దశరధసుతుండు వారందఱికి నమస్కరించెను ఆ బ్రహ్మాది దేవతలు తమ కంకణాద్యాభరణంబులచే నొప్పారునట్టి దీర్ఘబాహువులను బైకెత్తి యిట్లు పలికిరి రామా! నీవు సమస్త లోకంబుల కదినాధుండవు సర్వోత్తముడవు జ్ఞాననిదివి మున్ను అష్టవసువులలో ఋతధామయను పేరు గల వసువుగా వర్ధిల్లుచుంటివి ముజ్జగంబుల కాదికర్తవు పరమస్వతంత్రుడవు సర్వనియామకుడవు అష్ట రుద్రమూర్తులలో నెనిమిదవ మూర్తివి మహాదేవుడవు సాధ్యులలో నైదవవాడవు అశ్వినీదేవతలు నీకు చెవులు చంద్రసూర్యులు నీకు నేత్రములు, సృష్టికి ముందును నాశనమునకు బిమ్మటను నీ వొక్కడవే గానంబడుదువు సర్వేశ్వరుండవు సర్వశక్తివి సర్వజ్ఞుడవు ఇట్టి పరమాత్మ స్వరూపుడవైన నీవు మందుడగుమనుష్యుని వోలె సీతాదేవి యగ్నిలో బడుచుండగా నుపేక్షించి యూరకుండదగునా? యనియెడు లోకపాలుర వచనంబులాలకించి రాముడిట్లనియె మహాత్ములారా! నేను దశరధసుతుండననియే దలపోయుచున్నాను పరమార్ధమందెవ్వడను? ఏమి సంబంధము? ఎందుకొఱకిచట జననమొందితినో! వివరమంతయు సురజ్యేష్ఠుడు నాకెఱిగింపవలయుననిన బ్రహ్మదేవుడిట్లనియె

రామా! నీవు సాక్షాన్నారాయణుండవు స్వయంప్రకాశ స్వరూపుడవు లక్ష్మినెడబాయని లావణ్య ప్రియుడవు సర్వవ్యాపకుడవు సుదర్శనధారివి ఆదివరాహమూర్తివి పరబ్రహ్మవు చతుర్భుజుండవు రణాభంగుడవు శార్ఙమను ధనుస్సును దాల్చినవాడవు ప్రణవశబ్ద వాచ్యుడవు ఆరాధ్యుడవు వేదములు నిన్నెఱుంగవు సర్వలోకనాథా! నేను నీ హృదయముగను, సరస్వతీదేవి నాలుకగను, అమరగణంబులు నీ దేహమునందు రోమములుగను, అగుదుము నీవు కనురెప్పమూసినచో రాత్రియగును కన్నుదెఱచినచో పవలగును నీ యూర్పులే వేదములు

నీవు లేనిదేది గలదు? ఈ జగత్తు నీ శరీరము నీ కారిన్యాంశమే భూమి నీకోపమే యగ్ని నీ ప్రసన్నతయే శుభకరమైన సుధాకరుడు త్రివిక్ర మావతారంబునొంది బలిచక్రవర్తిని బంధించి దేవేంద్రునకు బట్టముగట్టితివి సీతాదేవి సాక్షాల్లక్ష్మి నీవు విష్ణుదేవుడవు సృష్టి స్థితి లయకారకుండవు రావణుని సంహరించుటకై భూలోకంబున మనుష్య శరీరంబును దాల్చి జన్మించితివి నిన్ను గీర్తించుటయు, స్తుతించుటయు మహాఫల ప్రదంబులు నిన్ను దర్శించిన వారు ధన్యులై మోక్ష సామ్రాజ్యమంద గలరనియెడు బ్రహ్మదేవుని వాక్యంబులాలకించి హుతాశనుండ మితానందమొంది సీతాదెవి నెత్తుకొని చితినుండి లేచి చితిని చెల్లచెదరు గావించి మానుషాకారంబును దాల్చి త్వరితంబుగా వచ్చి రాముని కొసంగెను అబిడ మునుపటికంటె సౌందర్యరాశియై వెలుగొందెను అప్పుడు శుభాశుభ కర్మములకు సాక్షియగు అగ్నిదేవుడు రాముని జూచి యిట్లు చెప్పెను

## సీతాదేవి శీలమును అగ్నిదేవుడు రామునితో జెప్పట

రామా! ఇదిగో! నీ భార్యను జూడుము ఈబిడ నిర్దోషి ఏ పాపమెఱుగదు ఈ సీత మనోవాక్కాయ కర్మంబులచే నిరంతరము నిన్నే మనంబున దలపోయుచుండును పరపురుషుల నెన్నడును మనంబున దలంచియెఱుంగదు ధనకనక వాహనాదులిచ్చెదనని రావణుడెంతయో బ్రతిమాలెను బెదరించెను ఎట్టకేలకు చంపెదనని గూడ బెదరించెను రాక్షసస్త్రీలు మిగుల బాధించిరి ఏమి జేసినను నిన్నే పరమగతిగా భావించి నియందే మనస్సునుంచి ధ్యానించుచుండెను సీత పాపరహిత పరిశుద్ధ హృదయముగలది ఇది నాయాజ్ఞ బదులు పలుకక సీతను ప్రతిగ్రహింపుమని యగ్నిదేవుడు రామునితో జెప్పెను అప్పుడా యగ్నిదేవుని పలుకులను రాముడాలకించి యిట్లనియె

హుతాశనా! ముజ్జగంబుల యందును సీత పాపరహితయనుట నిక్కువమే ఐతే యీబిడ చాలకాలము రావణునింట నుండినది

దశరథమహారాజంతటి వానికింబుట్టి సీతను బరిశోధింపకయే గ్రహించి యున్నచో నాకు లోకాపవాదంబు రాదా? మూఢుడనియు కాముకుడనియు లోకులు నన్ను నిందింపరా? జనకాత్మజకు నాపైనున్న గాఢానురాగమెట్టిదో నాకు దెలియును నేను సత్యమును నిరూపించుటకై ముల్లోకములవారును విశ్వసించునట్లుగా సీత యగ్నిప్రవేశము గావించు చుండ నేనుపేక్షించి యుంటిని అగ్నిజ్వాలను స్పృశియించుటకెంత దుస్సాధ్యమో సీతను స్పృశించుటయు రావణునకంత దుస్సాధ్యమై యుండును మీరు లోక పూజ్యులరు మీ హితోపదేశమూలకించి నేను జనకపుత్రిని ప్రతిగ్రహించుచున్నాననిన బ్రహ్మాదులు మిగుల మోదవార్ధి నీదిరి శ్రీరాముడు ధర్మపత్నిని చేరదీసి సుఖంబు నొందెను

## పరమేశ్వరుడు రామలక్ష్మణులకు దశరథుని జూపుట

రామా! భాగ్యవశంబున లోక కంటకుండగు రావణుని వధించి సర్వలోకములకును, శుభంబొనగూర్చితివి ఇక నీవు అయోధ్యకేగుము నీ వియోగమును భరింపజాలక దుఃఖితులైయున్న కౌసల్యను, కైకేయిని, సుమిత్రనం, భరతుని సందర్శించి రాజ్యాభిషిక్తుడవై బంధు జనంబులనందఱిని సంతోషింపజేయుము సద్యశంబు నార్జించుకొనుము అల్లదిగో! చూడుము నీ తండ్రియగు దశరథుండు స్వర్గము నుండి విమానారూఢుండై వచ్చియున్నాడు నీచే యసత్యదోషంబు వారయుకుండునట్లొనరించి యింద్రలోకంబు నొందెను నీవును, లక్ష్మణుడును నమస్కరింపుడని పరమేశ్వరుడు చెప్పెను రామలక్ష్మణుల మితానందతరంగ డోలలనూగుచు విమాన శిఖరమందున్న తండ్రిని జూచి నమస్కరించిరి అప్పుడు దశరథ మహారాజు ప్రాణముకంటె ప్రియుండగు రాముని గాఢాలింగనము గావించుకొని యిట్లు బలికెను

రామా! నిన్నెడబాసి యుండుట వలన నాకీ స్వర్గ సుఖములుగాని, దేవర్షులొనరించెడు గౌరవము గాని సంతోషము గలిగింపకున్నవి ఇది సత్యము శత్రువులను సంహరించి నా ప్రతిజ్ఞ నెరవేర్చిన నిన్నుజూచి

పరమసంతుష్టుడనైతిని సత్యపాశబద్ధుడనగు నన్ను దరింపజేసితిని ఈ రావణుని సంహరింపవలసిన బాధ్యత నీయందుండుట వలననే యానాడు నీ పట్టాభిషేకమునకు విఘ్నము చేకూరినదని తలంచుచున్నాను నాయనావనమునుండి గృహంబునకరుగుదెంచిన నిన్ను జూచి కౌసల్య సంతోషింపగలదు ఆబిడ కృతార్థురాలు అరణ్యమునుండియు నయోధ్యకేగి పట్టాభిషిక్తుడవై యలరారుచున్న నిన్ను జూడగల మనుష్యులందరు ధన్యులు సీతాలక్ష్మణులతోగూడి పదునాలుగేండ్లు వనవాసము గావించితివి నీ ప్రతిజ్ఞయు సఫలమాయెను దేవతలందఱిని సంతోష పఱచితివి సత్కీర్తి నార్జించుకొంటివి ఇక రాజ్యాభిషిక్తుడవై దీర్ఘాయుస్సు నొంది తమ్ములతో గూడ సుఖపడుమని దశరథుడు జెప్పగా రాముడు చేమోడ్పుగీలించి యిట్లనియె

తండ్రీ! రాముని వనవాసంబునకు బంపుమన్నచో నిన్ను నీసుతుండగు భరతుని పరిత్యజించెదనని కైకేయితో శపథంబుజేసి యుంటిరి గదా! ఇప్పుడు వారిరువురననుగ్రహింపుము నీ భయంకరమైన శాపము మా పిన్న తల్లిని, భరతుని దాకకుండునట్లు దయతో ననుగ్రహింపుము ఇదియే నా కాంక్షయనియెడు రాముని వాక్యములాలకించి దశరధుడు సంతోషించి నాయనా! అట్లేయగు గాక! యనుచు సమ్మతించి చెంతనున్న లక్ష్మణుని కౌగిలించుకొని యిట్లనియె కుమారా! నీ వెంతయు ధన్యుడవు సీతారాములకు శుశ్రూషజేసి నాకానందముగలిగించి గొప్ప పురుషార్థము నొందితివి సదా నీ శుశ్రూషను మఱవవలదు నీకు సుభము చేకూరగలదని దశరథుడు లక్ష్మణునితో జెప్పెను తదనంతరము సీతనుజూచి యిట్లు బలికెను రాముడు నిన్ను నిందించి పరిత్యజించినందులకు బరితాప మొందవలదు నీయనిందిత చరిత్రమును పరిశుద్ధము గావించుటకే యిట్లు జరిగినది వేఱుగాదు వేయేల? పతియే దైవముగా భావించి మెలంగుము నేనిదే పోయివచ్చెదనని కొడుకులకును, కోడలకును జెప్పి వెలుగొందుచున్న విమానములో దశరథుడింద్రలోకమునకు బోయెను దశరథుడు స్వర్గమునకు మఱలిపోయిన పిమ్మట తనముందు బద్ధాంజలియై నిల్చియున్న రాముని జూచి దేవేంద్రుడిట్లనియె రామా! మేమెంతయు నిన్ను మెచ్చి సంతోషించితిమి నీ మనస్సునకింపైన వరంబొద్దియో

కోరుమనిన రాముడు సురేంద్రునితో నిట్లు బదులు పలికెను సర్వసురేశ్వరా! నీకు నాయందు ప్రియంబుగలదేని నా కొఱకు ద్యాగమొనరించి యసువులను దొఱంగిన వానరులందఱిని బ్రదికింపుము ఇదియే నా యభీష్టమనిన తోడనే సురేంద్రుడట్లేయగుగాక! యని వరంబొసంగెను వెంటనే వనచరులందఱు నిదురించుచున్నవారు మేల్కొన్న చందంబున ప్రాణంబులతో లేచి రామచంద్రునకు నమస్కరించిరి ఆ సమయంబున దేవతలందఱు రామా! నీవయోధ్యకేగి, వానరులందఱికిని వారివారి నెలవులకు బొమ్మని సెలవొసంగుము నీ తల్లులను, తమ్ములను జూచి యాశ్వాసింపుము పట్టాభిషిక్తుడవై ప్రజలను సంతోషపెట్టుము నీకు శుభము కలుగునని దేవతలు రామునితో జెప్పి విమానంబులనారోహించి స్వర్గమునకు బోయిరి రాముడు దేవోత్తములకు నమస్కరించి విశ్రమింపుడని వానరులకనుమతి నొసంగెను

## నా సత్కారమును స్వీకరింపుమని విభీషణుడు రాముని బ్రతిమాలుట

బ్రహ్మాదులు వెడలిపోయిన పిమ్మట రామచంద్రుండా రాతిరంతయు సుఖముగా నిదురించి మేల్కొనెను అప్పుడు విభీషణుడు రామునిచేరంజని చేతులు మోడ్చి యిట్లనియె రామా! స్నానయోగ్యంబులగు జలంబులును, మైపూతలును, వస్త్రములును, భూషణములును, దివ్యగంధమాదిగాగల మాల్యంబులను గొనితెచ్చితిని చక్కగా నలంకరింప నేర్చిన కమలములను బోలు కన్నులు గల కాంతామణులు నీకు స్నానంబు సేయింతురు ఇందుల కంగీకరించి, నన్ననుగ్రహింపుము దయచేయుమని విభీషణుడు రామునితో బలికెను రాముడా పలుకులనాలకించి విభీషణుని జూచి యిట్లు బదులు పలికెను రాక్షసోత్తమా! సుగ్రీవాది వానరులందఱిని స్నానార్థము బిలువుము సుకుమార శరీరుండగు భరతుని యందే నా మనస్సు జొచ్చి యున్నది పదునాలుగేండ్లు నిండినపిమ్మట మఱుసటి దినమే నీ దర్శన భాగ్యము నాకు లభింపకున్నచో యగ్ని ప్రవేశము జేయుదునని మున్నాతడు

ప్రతిజ్ఞ గావించియుండెను ప్రతిజ్ఞ దప్పని పరిశుద్ధహృదయుడు నాకొఱకై యెదురు చూచుచు బరితపించుచుండును అట్టి ధార్మికుని విడిచి యున్న నాకు స్నానమేల? వస్త్రాభరణాదులేల? నేనిదే యయోధ్యకు బయలు దేరెదనని రాముడనెను ఆ మాటలకు విభీషణుడిట్లు బదులు పలికెను

దేవా! అంత తొందరేల? ఒక దినములోపల నిన్ను నీ పరివారంబును పుష్పక విమానములో గొనిపోయి యయోధ్యా నగరంబునకు జేర్చెదను రావణుడు కుబేరుని జయించి యీ విమానమును సంపాదించి యుండెను ఇప్పుడు కుబేరుడు వచ్చియున్నను అతనికివ్వక నీ నిమిత్తమై నిల్పియున్నాను నీవీ విమానంబు నారోహించి త్వరితంబుగ నయోధ్యాపురంబును జేరగలవు పరితాపమెందుకు? రామా! నీకు దెలియనిదేమున్నది నేను నీయనుగ్రహమునకు బాత్రుడనగుదునేని, నీకు నాయందు స్నేహము గలదేని యిచ్చట నిల్చి తీరవలయును సీతాలక్ష్మణ సమేతుండవై నేనొసంగెడి భూషణాంబరాదులను స్వీకరించి నాచే బూజలందుకొని యటుపిమ్మట ప్రయాణముగమ్ము సైన్యముల తోడను, మిత్రులతోడను, నా సత్కారము నంగీకరించి బయలుదేరుము నా ప్రార్థనను నీవంగీకరింతువనియు, నీయందు నాకుగల భక్తి భావముచేతను, ధైర్యముగా భృత్యమాత్రుడనై వేడుకొనుచున్నాను అంతియేగాని యాజ్ఞాపించుట కర్హుడనుగాను క్షమింపుమనియెడు విభీషణుని సునయోక్తుల నాలకించి యెల్లవారును వినుచుండ రాముడిట్లనియె రాక్షసరాజా! నీ మాటను నేనెప్పుడైనను జవదాటియుంటినా? పరమ భక్తుండగు భరతుని, నా తల్లులను, వసిష్ఠాది గురువులను, మిత్ర బృందమును, ప్రజానీకమును జూడవలయునని నా మనస్సు పరితపించుచున్నది త్వరగా పుష్పక విమానంబును దెప్పింపుము భరతుడట్టి ప్రతినబూని యున్నప్పుడు నేనిచ్చట నిల్చుటెట్లు? విభీషణా! ఈ పుష్పక విమానంబుచేతనే పూజింపబడితిని కోపపడవలదు త్వరితంబుగ నాకనుమతి నొసంగుము దుఃఖింపవలదని రాముడనిన తోడనే రాక్షసరాజు మనోహరమైన పుష్పక విమానంబును గొనితెచ్చి రామచంద్రునకర్పించెను

## విభీషణుడు సుగ్రీవుడు రాముని వెంటనే అయోధ్యకు వచ్చెద మనుట

పుష్పమాల్యాదులచే నలంకృతంబగు పుష్పక విమానమును రామచంద్రునకు జూపి రామా! ఇంకనేజేయవలసిన కర్తవ్యమెద్దియో సెలవిమ్మని యడిగెను అప్పుడు దశరథసుతుండు స్నేహపూర్వకముగా జూచి విభీషణా! గాఢయత్నమునుసల్పి నా కార్యమును సఫలంబు గావించిన వానరులకు రత్నములను, వస్త్రాదులను, ఆభరణంబులను ఇచ్చి సంతోషపఱపుము ప్రాణభయంబును బరిత్యజించి యుద్ధోత్సాహమ్ముతో మనకు జయంబు చేకూర్చిన పూజార్హులగు వానరులందఱిని పూజింపుము ఆశ్రితులకు గౌరవ మొసంగుటలో నద్వితీయుడవు గదా! నీకు జెప్పవలసినదేమున్నది రాజు సైనికులను యౌదార్యాది ప్రసాదగుణములతో జూడవలయును అట్లుగాక హింసించుచు విసగించినచో యుద్ధకాలమందాతని బరిత్యజింతురు కాన సేనలను గౌరవించుట రాజధర్మమని రాముడు విభీషణునితో జెప్పెను రాముని యానతిని శిరంబునందాల్చి రాక్షసరాజు వానరులకందఱకును రత్నములను, ధనంబులను నొసంగి గౌరవించెను

తదనంతరము లజ్జావనతయైయున్న సీతనంకంబునంజేకొని రాముడు లక్ష్మణునితో గూడ ధనుర్ధరుండై సర్వోత్తమంబగు పుష్పక విమానంబు నారోహించెను అట్లు విమానంబు నారోహించి సమస్త వానరులను, సుగ్రీవ విభీషణులను, జూచి సమ్మానించుచు నిట్లు పలికెను వానరోత్తములారా! మీరందఱు మిత్రకార్యమును గావించి కృతకృత్యు లైతిరి మీ మేలును మఱవజాలను మీ కనుమతి నొసంగుచున్నాను మీ మీ స్థలంబులకు బోయిరండు సుగ్రీవా! నీ మేలు మఱవరానిది నీ మైత్రి వర్ణనాతీతము నిను శ్లాఘింప నాతరముగాదు ఇక సేనా సమేతుడవై కిష్కంధకుబోయి సుఖముగా నుండుము

విభీషణా! నేనొసంగిన రాక్షస రాజ్యమునననుభవించుచు సుఖముగానుండుము నీవు నాకొనరించిన మేలును మఱువజాలను నేనిక బయలుదేరుచున్నాను నాకనుమతి నొసంగుడు మిమ్మందఱిని

వీడ్కొనుచున్నానియెడం రాముని వాక్యములు సుగ్రీవ వానర విభీషణులాలకించి యిట్లు పలికిరి రామా! మేము కన్నుల కఱవుదీర నీ పట్టాభిషేకమును జూడవలదా! కౌసల్యాదేవికి నమస్కరింప గూడదా? మేమందఱు నయోధ్యకు రాగోరుచున్నాము పిల్చుకొని పొమ్ము నీ పట్టాభిషేకమహోత్సవంబు నొక్కమాఱు నయనోత్సవముగా దిలకించి, కౌసల్యాదేవికి నమస్కరించి త్వరితంబుగా మా నివాసంబులకు మేము జేరుకొందుము సెలవిమ్మనిన రాముడమితానందమెయింది, మిమ్ము లందఱంగూడి భరతుని సందర్శించుటకు నయోధ్యకేగుట మరింత సంతోషముగదా! రండు అందఱును పుష్పక విమానంబు నారోహింపుడని సెలవొసంగెను సుగ్రీవ విభీషణులు తమతమ పరివారముతో విమానమెక్కి గూర్చుండిరి రామునసుమతిచే బుష్పక విమానము తారాపథంబున కెగిరెను ఆ దివ్యమగు పుష్పకవిమానమపేక్షించినంతనే యవకాశముగలది కావున వానరరాక్షసులందఱు సంతుష్టులై యిఱుకు లేకుండ నవ్విమానమందు గూర్చుండియుండిరి

## రాముడయోధ్యకు బయలుదేఱి పోవుచు సీతకాయా ప్రదేశములను గూర్చి చెప్పుట

రాముడాజ్ఞాపించిన తోడనే పుష్పక విమానమతివేగముగా బోయెను అప్పుడు కౌసల్యా సుతుండు నలువైపులను దిలకించుచు శశిని భాననయగు జనకాత్మజనుజూచి యిట్లనియె సీతా! విశ్వకర్మచే నిర్మింపబడిన లంకాపురంబు త్రికూట పర్వత శిఖరంబుపై నొప్పారుచున్నది చూడుము మాంసశోణిత కర్దమమయంబైన యుద్ధభూమి యిదియే వానర రాక్షసులెందఱో నిచ్చోటుననే హతులైరి విశాలాక్షీ! నీ నిమిత్తమై నాచే హతుండై భస్మరూపముతో బడియున్న రావణుని జూడుము ఇచ్చోటననే కుంభకర్ణుడు నాచే విగతజీవుండయ్యె ప్రహస్తుడను రాక్షసుడు నీలునిచే హతుండయ్యె హనుమంతునిచే ధూమ్రాక్షుడు వధింపబడిన చోటిదియే ఈస్థలమందే విద్యున్మాలినియను రక్కసుని సుషేణుడు

బరిమార్చెను లక్ష్మణుడు యింద్రజిత్తును, అంగదుడు, వికటుని వధించిరి విరూపాక్షుడు మహాపార్శ్వుడు మహోదరుడు, కంపనుడు నిచ్చోటననే వధింపబడిరి మండోదరి రావణునిపైబడి విలపించిన స్థలమిదియే అల్లదే! సముద్ర తీరమును జూడుము మేముసముద్రమునుదాటి యూరాతిరంతయు నిచ్చటనే నివసించి యుంటిమి

కమలలోచనా! నీ నిమిత్తమై నేను నలునిచే నిర్మింపబడిన సేతువిదిగో చూడుము మహాపారావారంబునిదియే హనుమంతుడు సముద్రమును దాటినప్పుడు మహానీరాకరంబును భేదించి లేచిన మైనాక పర్వతంబిదియే చూడుము సేతుబంధమను తీర్థమిదియే ఇది ముల్లోకంబుల చేతను బూజింపబడుచున్నది ఇమ్మహాతీర్థమందు స్నానమాడినచో మహాపాతకములు నశించును ఈ స్థలమందే విభీషణుడు నన్ను శరణు జొచ్చెను అల్లదిగో! సుందరారణ్యములచే నొప్పారెడు సుగ్రీవుని రాజధానియగు కిష్కింధాపురంబు గానబడుచున్నది చూడుము ఇచ్చోటననే నేను వాలిని వధించితిననియెడు రాముని వాక్యములాలకించి ప్రేమ, భయంబులుగదుర సవినయంబుగా భర్తను జూచి యిట్లనియె

నాథా! తార, రుమ మొదలైన సుగ్రీవుని ప్రియభార్యలతోడను, ఇతర వానరులందఱి భార్యలతోడను గుమిగూడి మన యయోధ్య ప్రవేశింప నువ్విళ్లూరుచున్నాను అనుగ్రహింపుమనియెడు సీతాదేవి వాక్యము లాలకించిన తోడనే రాముడు విమానమునునిల్పి సుగ్రీవునితో నిట్లులనియె సుగ్రీవా! నీవు నీ భార్యలందఱి తోడను, వానరవీరులు వారి వారి భార్యలందఱి తోడను అయోధ్యకు రావలయునని సీత కోరుచున్నది జాగుసేయక ప్రయాణము గమ్మనినతోడనే సుగ్రీవుడంత పురంబునకు బోయి తార మొదలుగాగల భార్యలందఱిని ప్రయాణము గమ్మనెను వానరవీరుల భార్యలందఱిని బిల్చి మీరందఱు మీ మీ భర్తలతో గూడ నయోధ్యకు బయలుదేరుమని యాజ్ఞాపించెను అందఱు సుగ్రీవుని యాజ్ఞ మేరకు బ్రయాణమై పుష్పక విమానమునకు బ్రదక్షిణముగావించి యెక్కి కూర్చుండిరి వెంటనే విమానము గగనవీధి కెగసెను ఋష్యమూక పర్వతంబును సమీపింపగానే రాముడు సీతనుజూచి యిట్లనియె

సీతా! ఈ ఋష్యమూక పర్వతంబెంత శృంగారమంచే నలరారుచున్నదో చూడుము ఇచ్చటనే సుగ్రీవునకును, నాకును సమాగమంబుజేకూరెను వాలిని వదించెదనని ప్రతిజ్ఞ జేసితిని ఆ పంపా సరస్సును జూడుము ఈ సరస్తీరమందే నీ వియోగమును భరింపజాలక పరమదు ఖాగ్నిలోగుమిలి విలపించితిని ఇచ్చోటుననే శబరిని జూచితిని ఈ స్థలమందే కబంధుని జంపితిని రావణుడు మహాత్ముడగు జటాయువును జంపినదావటవృక్షము చెంతనే చూడుము ఖరుని, దూషణుని, త్రిశిరుని, నేను ఎధించిన యాశ్రమ ప్రదేశమిదియే అదిగో! సుందరంబైన మన పర్ణశాలను జూడుము ఇచ్చటనే గదా! రావణుడు నిన్నానాడు బలాత్కారంబున నపహరించినది రమణీయ మెులుకుచు నిర్మలోదకంబుచె నలరెడు గోదావరినదిని దిలకింపుము ఇదిగో! అగస్త్య మహర్షి యాశ్రమంబు కానబడుచున్నది ఈ స్థలమందే విరాధుని బరిమార్చితిని అత్రిమహర్షి యాశ్రమములవిగో! చూడుము ఇచ్చటనే గదా! నీవు పరమసాధ్వియగు ననసూయాదేవిని జూచితివి ఇదిగో! చిత్రకూటపర్వతమును జూడుము రాజ్యమును స్వీకరింపుమని భరతుడు నన్ను బ్రతిమాలిన చోటిదియే గదా!

అల్లదిగో యమునానదియు భరద్వాజుని యాశ్రమంబును కానంబడుచున్నవి చూడుము ఆకాశము, భూమి, పాతాళంబులను బొందుటంజేసి త్రిపథయనంబడు గంగానదిని కన్నులలరజూడుము ఇదిగో! శృంగిబేరపురము గుహుడిచటనే మనయొద్దకు వచ్చియుండెను వనితారత్నమా! సహజశోభల నీనెడు మనయయోధ్యా పట్టణంబునకు జేరువలోనున్న సరయూనది కానబడుచున్నది నాయనగారి రాజధానీ నగరంబును జూడుము అయోధ్యకు మరల సుఖముగా వచ్చినాము ఈ పట్టణమునకు నమస్కరింపుమని రాముడు సీతతో జెప్పెను విభీషణుడు సుగ్రీవాది వానర రాక్షసులందఱు లేచి మంగళకరమైన యయోధ్యా నగరమందలి సౌందర్యాదులను దిలకించి సంతోషాబ్ధినీదిరి

## రాముడు భరద్వాజమహర్షికి నమస్కరించుట

చైత్రశుద్ధ పంచమియందు రాముడయోధ్యను వీడి వనవాసంబు కేగియుండెను ఇప్పుడు మరల చైత్రశుద్ధ చతుర్థికి పదునాల్గేండ్లు నిండినవి శుద్ధ పంచమి యందు రాముడు భరద్వాజునాశ్రమంబు జేరి నమస్కరించి యమ్మహర్షితో నిట్లనియె మహాత్మా! అయోధ్యా పట్టణంబును భరతుడు చక్కగా పాలించుచున్నాడా? ప్రజలందఱు సుభిక్షముగా నున్నారా? మా తల్లులందఱు సుఖులై యున్నారు గదా! మీరు వినియున్నచో నాకెఱిగింపుడనిన భరద్వాజుండు రాముని జూచి యిట్లనియె రామచంద్రా! భరతుడు సంస్కారము లేక జటాధారియై నీపాదుకలను ముందిడుకొని ప్రజలను పాలించుచు నీ రాకకై నిరీక్షించియున్నాడు నీ తల్లులు సుఖముగానున్నారు ప్రజలందఱు సుఖులైయున్నారు ఆనాడు నారచీరలను దాల్చి నీవరణ్యమున కేగుచుండ నాకెంతయో దుఃఖము గలిగెను నేడు శత్రుసంహారము గావించి బంధుమిత్రాదులతో గూడ సుఖంబుగా వచ్చితివి నిన్ను జూడ నా కమితానందముగలిగినది రామా! నీవు వనవాసమందనుభవించిన సుఖదుఃఖములన్నిటిని యోగదృష్టివలన దెలిసికొంటిని నీకొక వరంబొసంగెదను కోరుకొనుము ఈ దినమునే నొసంగెడు యర్ఘ్యాదులను స్వీకరించి రేపటి దినమయోధ్యకు బొమ్ము నీకు శుభముకలుగునని భరద్వాజుడు చెప్పిన మేరకు రాముడంగీకరించి యీ వరంబు గోరెను

భరద్వాజమహర్షీ! నేనయోధ్యకుబోవు మార్గమధ్యమందు భూరుహంబులన్నియు సకాలములో ఫలవంతములై మధువొలుకు చుండవలెను ఫలంబులమృతతుల్యములై యుండవలయును ఇదియే నాకోరిక యనిన, రామునితో నామహర్షి యట్లేయగుగాక! యని వరంబొసంగెను వెంటనే వృక్షములన్నియు పుష్పించి ఫలములతో దూగాడినవి మూడు యోజనములవఱకు నెటుజూచినను యెండిన వృక్షములన్నియు చిగురులను దొడగి చెలువారుచుదేనియలొలుక సాగెను వానరులు మైపులకలెగయ మోదార్ణవమున నీదుచు స్వేచ్ఛగా ఫలంబులను భక్షించి సుఖంబునొందిరి

## మా రాకను భరతునకు దెలియజేయుమని రాముడు హనుమంతుని బంపుట

రామచంద్రుడయోధ్యను దలంచుకొని మనంబున కొంత తడవాలోచించి పవన తనయుని బిల్చి యిట్లు పలికెను మారుతాత్మజా! నీవు బోయి యయోధ్యలో మాతల్లులందఱు క్షేమముగా నున్న సంగతిని దెలిసికొని రమ్ము పోవునప్పుడు శృంగిబేరపురంబులో బోయలరాజగు గుహుని జూచి యతనికి నా క్షేమంబెఱిగింపుము శత్రువులను జయించి సుఖముగా వచ్చియున్నానని తెలియజెప్పుము ఆతడీవృత్తాంతమాలకించిన తోడనే తన్మయుడై సంతోషము నొందగలడు ఆ నిషాదుడు నాకు బ్రాణమిత్రుడు అయోధ్యకు బోయెడు మార్గమును, భరతుని సచ్చరిత్రమును సంతోషాంబుధిని దేలుచు జెప్పగలడు అటు పిమ్మట నీవయోధ్యకేగి సీతాలక్ష్మణ సహితుండనై క్షేమముగా వనవాస వ్రతంబు ముగించుకొని వచ్చియున్నానని భరతునకు జెప్పుము

హనుమంతుడా! సీతాపహరణ వృత్తాంతమును, సుగ్రీవుని మైత్రిని, విభీషణుని శరణాగతిని, రావణ సంహారమును, మహేశ్వరానుగ్రహంబునంజేసి నా తండ్రి సమాగమంబు నాకొనగూడుటయు మొదలుగాగల విషయములన్నియు భరతున కెఱుగదెల్పుము సుగ్రీవ విభీషణులతో గూడ వచ్చియున్నానని నా సోదరున కెఱిగింపుము సకలైశ్వర్య సంపదలతో దులతూగెడు రాజ్యముననుభవించిన వాడెంతటి ధార్మికుడైనను మరల విడుచుట కష్టము నా వృత్తాంతమాభరతుడు నీ ద్వారా వినునప్పుడు ముఖంబుపైనే యాకారంబుదోచునో నీవు జాగ్రత్తగా గ్రహింపవలెను భరతుడే రాజ్యమపేక్షించెనా! మఱియు సంతోషము ఏ కొఱంతయు లేక సర్వభూమండలము నాతడే పరిపాలించుగాక! హనుమంతా! భరతుడు రాజ్యమపేక్షించినచో మేము దూరములో వచ్చుచుండగానే మాకెఱుగ దెల్పుము పోయి రమ్మని రాముడానతి నొసంగెను రామునాజ్ఞను శిరంబునందాల్చి హనుమంతుడు మానవ రూపంబును దాల్చి యాకసంబున కెగసిపోయి శృంగిబేరపురంబు జొచ్చి గుహుని జూచి యిట్లు బలికెను

గుహుడా! నీ సఖుండగు రామచంద్రుడు సుఖుండై సీతాలక్ష్మణ సహితుడై వచ్చి భరద్వాజ మహర్షి యాశ్రమంబులోనున్నాడు ఈ పంచమీ తిథి రాత్రి నమ్మహర్షియాశ్రమంబునంగడపి యనుజ్ఞ వడసి యెల్లి సూర్యోదయంబున బయలుదేఱి రాగలడు నీకు దనక్షేమంబు సెప్పుమని నన్ను బంపెను త్వరలో రాముని దర్శనము నీకు లభింపగలదు పోయి వచ్చెదనని సకలలోకముల కానందమొనగూర్చెడు రామాగమనంబును భరతునకు జెప్పెడి భాగ్యము దొఱకినందులకమితానంద పరవశుండై మార్గాయాసంబును గూడ సరకుగొనక యాకాశమార్గంబునంబోయెను

పవనతనయుండట్లు బోయి యయోధ్యాపురంబు జేరి దూరముగా కృష్ణాజినవల్కలధారుండై రాముని దర్శనార్థము దీనుడై వేచియున్న భరతుని జూచెను భ్రాతృదుఃఖంబునంజేసి కృశించియున్న ధర్మదేవత వోలె నలరెడు భరతుని జూచి నమస్కరించి పవనాత్మజుండిట్లనియె భరతుడా! ఎవ్వనిగుఱించి దుఃఖాబ్ధి నీదుచున్నావో యా రాముడు తన క్షేమమును నీకు దెల్పుమని నన్ను బంపెను రాజా! దుఃఖసాగరమునుండి దరిజేరుడు ముహూర్తమాత్రంబున నేరాముని దర్శించి సుఖంబు నొందగలవు అహా! ఏమి నీ భ్రాతృభక్తి కందమూలఫలంబులను భక్షించుచు జటావల్కల ధారుండవై రామచంద్రుని పాదుకలను బురస్కరించుకొని రాజ్యలక్ష్మి యొడిలో నుయ్యెల లూగుచున్నావే ! మహాత్మా! ఎంతటి జితేంద్రియుడవు మంత్రులు మున్నగువారలందఱును కాషాయాంబరములు దాల్చి సర్వభోగములను తృణప్రాయముగా త్యజించి నీకు జేదోడు వాదోడుగా నున్నారే! రాముడు రావణుని సంహరించి బాహుబలాఢ్యులగు మిత్రులతోడను, సీతాలక్ష్మణ సమేతుడై వచ్చుచున్నాడని వాయుసుతుండు భరతునితో జెప్పెను రామాగమన వృత్తాంతమాలకించిన తోడనే భరతుడపరిమితానంద సాగరంబున మగ్నుడై మూర్ఛిల్లి నేలంబడెను ఔరా! ఏమాశ్చర్యము ఇక రాముడే తటాలున వచ్చియున్నచో భరతుని గతియేమై యుండెడిదోగదా! అట్లు కొంత తడవునకు భరతుడు తెప్పఱిల్లి లేచి తనకు బ్రియవార్త నెఱిగించిన హనుమంతుని కౌగిలించుకొని వెల్లువలై స్రవించుచున్న యానంద బాష్పధారలతో నాతని దేహమంతయు దడిపి

యిట్లనియె సౌమ్యుడా! ఎంతటి దయార్ద్ర హృదయుడవు! ఎట్టి ప్రియవార్తను దెచ్చి నాకు జెప్పితివి! నీవు దేవతవో! మనుష్యుడవో! తెలియకున్నది నీకు లక్షగోవులను, నూఱు గ్రామములను, సద్వంశసంజాతులగు సౌందర్యరాసులోయనంబఱగిన పదునాఱుగుర కన్యకామణుల నొసంగెదను రామాగమన వృత్తాంతమాలకించి సంతోషభరితుండనైతిననుచు భరతుడు మఱియు నిట్లులనియె

పదునాలుగేండ్లు ఘోరారణ్యమందు నివసించి యిప్పుడు నానాథుడు రామచంద్రుడు వచ్చుచున్నందులకెంతని సంతోషింతును నేడెట్టి శుభవార్త నాలకించితిని మనుష్యుడు జీవించి యున్నచో నూఱేండ్లకైనను తప్పక యానందమొందుననియెడు లోకోక్తి యథార్థమని నాకు దోచుచున్నది రామచంద్రునకును, వానరులకును సమాగమమెట్లు గలిగినది? వివరింపుమనిన హనుమంతుడిట్లు చెప్పెను రాజనందనా! నీవు పాదుకలను దీసికొని పోయినంతవఱకు నీకు దెలియును గదా! తదనంతరము రాముడు సీతాలక్ష్మణ సహితముగా దండకారణ్యము ప్రవేశించెను విరాధుడను రాక్షసుడు వారికడ్డము వచ్చెను రాముడు వానిని వధించెను అటు తరువాత శరభంగమహాముని యాశ్రమంబునకేగి యాతినికి బ్రణమిల్లి జనస్థానంబునకుబోయిరి కొంతకాలమునకు శూర్పణఖయను రాక్షసి ముక్కు చెవులను లక్ష్మణుడు కోసెను పదునాల్గువేలమంది ఖరదూషణాదులను రాముడు దునుమాడెను సూర్పణఖ పోయి రావణాసురునకు తన పరాభవమును దెలిపెను రావణుడందుకు గినుక వహించి సీతాదేవి నపహరించుకొని పోయెను జటాయువను గృధ్రరాజు రావణునితో యుద్ధమందు చంపబడెను అప్పుడు రాముడు సీతను వెదకుచు లక్ష్మణునితో గూడ కిష్కంధకు బోయెను అచ్చోటననే రామసుగ్రీవులకు స్నేహము కుదిరెను రాముడు వాలిని చంపి సుగ్రీవునకు బట్టముగట్టెను వెంటనే వానరులను సీతాన్వేషణము కొఱకు దశదిశలకు బంపిరి నేను లంకాపట్టణమునకు బోయి సీతాదేవిని జూచి లంకా దహనంబు గావించి వచ్చితిని రాముడీ వృత్తాంతమాలకించి వానర సేనలతో గూడి పోయి సముద్రమునకుసేతువు గట్టెను రావణుని తమ్ముడు విభీషణుడు రాముని శరణుజొచ్చెను వానర రాక్షసులకు ఘోర యుద్ధము

జరిగెను రాక్షసులందఱు నశించిరి రాముడు రావణుని సంహరించెను దేవతలందఱు సంతోషించిరి రాక్షసరాజ్యమును విభీషణున కొసంగి యాతనిచే బూజలందుకొని పుష్పక విమానములో సుగ్రీవిభీషణులతో గూడ రాముడు విచ్చేసి యున్నాడు ఇప్పుడు రామచంద్రుడు భరద్వాజుని యాశ్రమమందున్నాడనిన తోడనే భరతుడమితానందమొంది పట్టణంబంతయు నలంకరింపజేసి రామాగమనంబును సర్వజనులకు దెలియపఱిచిరి వెంటనే సైనికులు, సేనాధ్యక్షులు, ప్రయాణమైరి ప్రజలు, పణ్యాంగనలు మొదలగు వారందఱు రాముని దర్శనార్థము బయలుదేరిరి దశరథుని భార్యలు పల్లకీల నారోహించి నందిగ్రామమునకు వచ్చిరి అయోధ్యానగరంబున నివసించుచున్న ప్రజానీకమంతయు నందిగ్రామమునకు వచ్చెను భరతుడు రాముని పాదుకలను శిరంబుపై నుంచుకొని రాజార్హములగు ధవళచామరంబులను దీసికొని మంత్రి నివాతంబుగా రామునెదుర్కొన బోయెను

## భరతుడు రామునెదుర్కొని తోడి తెచ్చుట

భరతుడు కొంతదవ్వేగిన పిమ్మట హనుమంతుని జూచి వానరోత్తమా! రాముడేడి? ఇంకను నాకగపడలేదే! యనెను ఆ మాటలకు మారుతాత్మజుడిట్లు బదులు పలికెను రాజనందనా! భరద్వాజుని యనుగ్రహము వలన వృక్షతతులు పుష్పించి ఫలములతో దూగాడు చుండగా నమ్మహర్షి రామునకును, సైన్యమునకు విందొనరించి యుండెను వానరులు పరమామోదజలధిని మగ్నులై ఫలంబులను భక్షించుచు వచ్చుచున్నారు గోమతీ తీరమందు ధూళిరేగుచున్నది అదిగో! చూడుము దివ్య పుష్పకవిమానము గగనములో గానబడుచున్నది సీతా రామలక్ష్మణులును, శూరులగు సుగ్రీవ విభీషణులును, విమానములో గూర్చున్నారు ఆనందంపడవలదని హనుమంతుడు భరతునితో జెప్పెను

అదిగో! రాముడు వచ్చెను అదిగో! రాముడు వచ్చెనని స్త్రీలు, పురుషులు పిల్లలందఱు సంతోషాంబుధిని దేలుచు గావించుచు

కోలాహలధ్వని, నింగిముట్టి చెలంగెను మేరుపర్వతము పైనున్న భాస్వంతునకు నమస్కరించునట్లు పుష్పకవిమాన శిఖరంబుపై నున్న రామచంద్రునకు పరిశుద్ధహృదయముతో భరతుడు నమస్కరించెను వెంటనే రామునిఅనుమతి మేరకు విమానము నేలకు వ్రాలెను భక్తి పరవశుడై యున్న భరతుని రాముడు కౌగిలించుకొని యంకమునందిడుకొనెను అటుపిమ్మట భరతుడు సీతాలక్ష్మణులకు నమస్కరించెను సుగ్రీవాది వానరోత్తములందఱిని కౌగిలించుకొనెను వారందఱు పరమసంతుష్టులై భరతుని క్షేమంబడిగిరి సుగ్రీవా! మా నల్వురకును నైదవ తోడబుట్టు వైతివని భరతుడు పలికెను

అటుపిమ్మట విభీషణుని జూచి రాక్షసోత్తమా! మహాభాగ్యవశంబున రామచంద్రునకు దోడ్పడి గొప్ప కార్యంబొనరించితివి నీకెంతయు కృతజ్ఞులమనెను అప్పుడు శత్రుఘ్నుడు రామలక్ష్మణులకు నమస్కరించి పిమ్మట సీతాదేవి పాదములకు సవినయముగ బ్రణమిల్లెను దుఃఖమువే గ్రంచియున్న తల్లిని జేరంజని రాముడు నమస్కరించెను ప్రజలందఱు రాముని జూచి చేతులు జోడించి మహాత్మా రామా! కౌసల్యానందనా! నీకు స్వాగతమని పలికిరి రాముడు వారందఱిని యాదరించెను భరతుడు పాదుకలను రాముని పాదములకు దొడిగి యిట్లనియె రామా! నేనిల్లడగా రక్షించుచుండిన నీ రాజ్యలక్ష్మిని నీకె యర్పించుచున్నాను ప్రీతితో స్వీకరింపుము నీవు మరల నయోధ్యకు రాజ్యాభిషిక్తుడగుటను జూచు భాగ్యమునకు నోచుకొంటిని నా జన్మ తరించినది ఇప్పుడు నాకాంక్షలు ఫలించినవి ధన్యుడనని పలికిన భరతుని పలుకులాలకించి యాతని భ్రాతృభక్తి కమితాశ్చర్యము నొంది వానరులు, విభీషణుడు కన్నీరు రాల్చిరి అప్పుడు రాముడు భరతుని తన యంకంబుపై నిడుకొని సకల సేనా సహితుడై నందిగ్రామమునకు పుష్పక విమానములో బయలు దేరిపోయెను నందిగ్రామము జేరిన పిమ్మట నీస్వామి కుబేరుని జేరుకొమ్మని పుష్పక విమానమునకాజ్ఞ నొసంగెను ఆ యుత్తమ విమానంబు రామునననుజ్ఞ నొంది, యుత్తర దిశాభిముఖముగా పోయి కుబేరుని జెంతకు జొచ్చెను రాముడు వసిష్ఠుని పాదములకు నమస్కరించి యుత్తమాసనమలంకరించెను

## భరతుడు రాజ్యమును రామునకప్పగింపగా రాముడయోధ్యకుబోవుట

కైకేయి పరమామోదంబున నొప్పుచుండ భరతుడు తల్లిని ముందుంచుకొని రామచంద్రునకు నమస్కరించి యిట్లనియె అన్నా! ఇదిగో రాజ్యభారంబును నీ కప్పగించుకొనుచున్నాను గొప్ప వృషభముమోయు బరువును దూడ మోయలేని చందంబున నా బారమును నివారించు కొనుచున్నాను కట్టతెగిన జలప్రవాహమునకు గడ్డి, యాకుమండలు వేసినచో నిలువని భంగి బహుచిద్రంబులుగల రాజ్యము గుప్తమంత్రాది సాధనములచే రక్షింపనియెడల నిలువజాలదు అటులనే రాజ్యభారమును నేను భరింప సమర్థుడనుగాను దశరథమహారజు తపస్సు చేసి పుత్రకామేష్టాదులచే నిన్ను బొందగలిగెను సమస్త కళ్యాణ గుణములచే నలరెడు నీవు గాక మఱొక్కరీ రాజ్యభారమును వహింపగలరా? ఇప్పుడు పట్టాభిషిక్తుడవుగమ్ము ఆ చంద్రతారార్కముగా రాజ్యమేలుమని బ్రతిమాలుచు శుభాసనముపై భరతుడు కూర్చుండెను

శత్రుఘ్నుడందఱికిని క్షురకర్మ చేయించి, స్నానాదులకు వలయునేర్పాట్లు గావించెను సుగ్రీవవిభీషణాదులందఱు స్నానము జేసిరి రాముడు జడలు విడదీసి స్నానమాడి పుష్పమాలికల చేతను, సుగంధాది ద్రవ్యములచేతను నలంకృతుండై పీతాంబరమును దాల్చి కళలొలికెడు సింహాసనముపై నాసీనుడయ్యెను ముష్పురత్తలును సీతాదేవి నలంకరించిరి కౌసల్య వానర భార్యలందఱికిని యలంకారములు గావించెను శత్రుఘ్ను నాజ్ఞ వలన సుమంత్రుడును సారథి యుత్తమ రథంబును గొని తెచ్చెను రాముడా దేదీప్యమానంబగు రథంబుపై నారోహించెను స్త్రీ పురుషులందఱు నయోధ్యకు బయలుదేరిరి రాముడు వచ్చుచున్న వార్తనాలకించి అశోకుడు, విజయుడు, సుమంత్రుడుజేరి పట్టాభిషేకమేవిధముగా జేసిన యెడల శుభదాయకమని వసిష్ఠునితో నాలోచించిరి తదుపరి మంత్రులు రామునకెదురుగాబోయి యయోధ్యకు దోడి తెచ్చిరి

శత్రుఘ్నుడు ఛత్రంబును గొనితెచ్చెను లక్ష్మణ విభీషణులు వింజామరలచే వీవదొడంగిరి మంత్రులు జయజయశబ్దములచే రాముని యాశీర్వదించిరి మహాత్ముడగు రాముడు తండ్రి గృహంబు బ్రవేశించెను అప్పుడు భరతుడు సుగ్రీవుని జూచి రామ పట్టాభిషేకంబునకు దూతలను బంపి సముద్రజలంబులను దెప్పింపుమనెను సుగ్రీవుడు వెంటనే నల్వురు వానరులను రావించి సువర్ణకలశంబులొసంగి రేపువేకువ జామునందే మీరు సముద్రజలంబులు గొని త్వరితముగా రావలయునని యాజ్ఞాపించెను జాంబవంతుడు, హనుమంతుడు, వేగదర్శి, ఋషభుండుననను వానరోత్తములు సుగ్రీవుని యానతివేరకు సముద్రజలంబులను గొనితెచ్చిరి శత్రుఘ్నుడు పట్టాభిషేకంబునకు వలయు నేర్పాటులన్నియు గావించియున్నామని వసిష్ఠమహర్షికి దెలిపెను



## శ్రీరాముని పట్టాభిషేకము

వృద్ధుడును, పరిశుద్ధుడునగు వసిష్ఠమహర్షి భూసురబృందముతో గూడి సీతాసమేతముగా రత్నమయ పీఠంబుపై గూర్చుండబెట్టెను అంతలో వసిష్ఠుడు, వాసుదేవుడు, జాబాలియు, గాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడునను యెనమండ్రు మహర్షి సత్తములును, అష్ట వసువులు సురేంద్రున కభిషేకము గావించినట్లు పురుషోత్తముడగు రామచంద్రున కభిషేకము గావించిరి వసిష్ఠాదు లవ్విధంబున నభిషేకించినపిమ్మట ఋత్విజులచేతను, బ్రాహ్మణుల చేతను, కన్యకలచేతను, మంత్రులచేతను, పౌరజనంబులచేతను, యోధులచేతను, కౌసల్యాసుతునకభిషేకము గావించిరి వసిష్ఠాదులచే నాహూతులైన లోకపాలురు నల్వురును, సమస్త దేవతలును, ఆకాశమునుండి దివ్యములైన సమస్తౌషధుల రసంబులచే రామున కభిషేకించిరి

శత్రుఘ్నుడు సుందరంబైన శ్వేతఛత్రంబును బట్టెను వానరేంద్రుడు ధవళచామరంబునుగొని వీచెను రాక్షసేంద్రుడు చంద్రునివోలె కాంతులీనెడు ధవళచామరంబును గైకొని వీచెను వాయుదేవుడు సురనాథుని పనుపున దేదీప్యమానమై నూఱు కమలములతో నలరారెడు బంగారుహారమును నాయకమణితో కాంతులొలికెడు ముక్తాహారమునుదెచ్చి రామచంద్రునకొసంగెను పట్టాభిషేకసమయంబున దేవగంధర్వులు మధురగాన మొనరించిరి అప్సరసలు నృత్యమాడిరి సస్యసమృద్ధి గలిగెను వృక్షములు ఫలములతో దూగాడుచుండెను పుష్పసమములు పరిమళమెంగబోయుచుండెను లక్షగుఱ్ఱములను, లక్షగోవులను, నూఱు యాబోతులను, విప్రోత్తముల కొసంగెను ముప్పది మూడు కోట్ల బంగారు నాణెములను, వస్త్రాభరణాదులను, బ్రాహ్మణులకిచ్చెను రత్నమయిమై రాణించుచున్న కాంచన మాలను వానరోత్తముడగు సుగ్రీవునకు పురుషోత్తముడొసంగెను అంగదునకు వైడూర్యవజ్రములచే బొదిగింపబడిన బంగారు బాహువులను మానవేంద్రుడిచ్చెను సీతాదేవికి ముక్తాహారంబు నొసంగెను భర్తయనుమతిని వడసి జనకాత్మజ దివ్యాంబరములను, దివ్యాభరణములను, ముక్తాహారమును వాయుపుత్రున కొసంగెను ఆ ముక్తాహారమును దాల్చి పవనాత్మజుడు మిగుల ప్రకాశించెను ద్వివిదుడాదిగాగల వానరోత్తములనందఱిని వారివారి యోగ్యతకు దగినట్లు సత్కరించి బహుమతులొసంగెను సుగ్రీవాది వానరులందఱు రాముని పట్టాభిషేక మహోత్సవమును కన్నులలర దిలకించిరాముని యనుమతి నొంది కిష్కింధానగరంబునకు బోయిరి విభీషణుడు శ్రీరాముని యాజ్ఞమేరకు శ్రీరంగ విమానంబునారోహించి లంకకు బోయెను రాముడు మహాయశస్సంపన్నుడై దుష్టులను శిక్షించుచు, శిష్టులను రక్షించుచు బరమసంతోషముతో రాజ్యమును పాలించెను లక్ష్మణుని యువరాజుగా నుండుమని రాముడు కోరెను జ్యేష్ఠుడు భరతుడుండగా రాజ్యభారము నాకు వలదని సుమిత్రాసుతుండు బదులు పలికెను రాముడమితానంద మొంది భరతునకు యువరాజ్యాభిషేకము గావించెను అందఱు మోదార్ణవమున దేలుచు సుఖముగా నుండిరి

## రామరాజ్యము

ఔరా! రామరాజ్యములోని ప్రజల భాగ్యమేమనవచ్చును స్త్రీలు వైధవ్య దుఃఖమే యెఱుంగరైరి క్రూరమృగమ్ముల వలన గాని, రోగములవలన గాని భయమావంతయు ప్రజలెఱుంగరైరి చోరభయ మిసుమంతయులేదు ఎవ్వరికిని కష్టమనునది లేకుండెను వృద్ధులకు ముందెన్నడును బాలురు మృతి జెంది యెఱుంగరు సమస్త ప్రాణికోటియు మోదవార్ధినీదుచుండెను సర్వజనులు ధార్మికులై యొకరిపై నొకరు వైరంబు వహింపకుండిరి రామరాజ్యమందు జనులు వేయిమంది కుమారులు గలవారలై దృఢగాత్రులై పెక్కువేలేండ్లు జీవించియుండిరి లోకమంతయు రామమయముగానే యుండెను ప్రజలందరు రామమయమనుచు సమస్త వ్యవహారంబులు జేయుచుండరి వృక్షములు మధురఫలంబుల నొసంగుచుండెను జలధరములు సకాలమందే వర్షించుచుండెను సమీరుడు చల్లగా వీచుచుండెను బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులు, లోభములేని వారై తమ విహిత కర్మములను ఆచరించుచుండిరి రామరాజ్యములోని ప్రజలెల్లరును పరమ ధార్మికులై సత్యమును దప్పక శుభలక్షణ సంపన్నులై యుండిరి రాముడు తమ్ములతోగూడి సమస్తైశ్వర్య సంపన్నుడై పదునొకండువేల సంవత్సరములు ధర్మపరిపాలన మొనరించెను

## ఫలితము

వాల్మీకి మహర్షిచే రచియింపబడి వేదార్థ ప్రకాశకంబును, ఆదికావ్యమునైన రామాయణమును చదివినను, విన్నను సమస్త పాపములు నశించును

శ్రీరామపట్టాభిషేకము వరకు ఈ కావ్యమును చదివిన వారికి పుత్రసంతానము కలుగును ధనధాన్యములకు కొదవయుండదు క్షత్రియుడాలకించినచో రాజ్యమేలగలడు

స్త్రీలు విన్నచో రామలక్ష్మణ భరత శత్రుఘ్నులవంటి పుత్రులను బడయుదురు మరియు దీర్ఘాయువు బొందుదురు దారిద్ర్యాది సమస్తకష్టములనుండియు గట్టెక్కగలరు

రామాయణమును చక్కగా వినువారలను జూచి సమస్తదేవతలు సంతృప్తి జెందుదురు గృహములోనుండు విఘ్నకారి భూతములు శాంతినొందును పుష్పవతులగు స్త్రీలు సర్వోత్తములగు పుత్రరత్నములను బడయుదురు

ఆదికావ్యమగు యీ యితిహాసమును పూజించినను, చదివినను సర్వపాపములు సమసిపోవును దీర్ఘాయుస్సు కలుగును ఈ సత్కావ్యమును క్షత్రియులు బ్రహ్మజ్ఞానమెరింగిన భూసురోత్తముని వలన వినవలయును అప్పుడు రాముడే ప్రేమించును

జనులారా! ఇమ్మహాకావ్యమును శ్రద్ధతో బఠింపుడు భగవంతుని యనుగ్రహమునకు బాత్రులగుదురు పితృదేవతలు సంతృప్తి జెంది సంతోషించెదరు వాల్మీకి విరచితమైన శ్రీరామదివ్యచరితమును ఇతరులచే భక్తితో వ్రాయించినను తామే వ్రాసినను సమస్తైశ్వర్య సంపన్నులగుదురు

వాల్మీకి వదనారవిందమునుండి స్రవించిన **రామాయణమనెడు తేనెను** తృప్తితో భక్తిమీరగా గ్రోలువారలు జననమరణము మొదలైన వానిచే అపాయకరమగు నీ సంసారమును వదలి స్వర్గలోకంబున పునరావృత్తి రహితంబుగా వెలుగొందుచుందురు





**యుద్ధకాండము సంపూర్ణము**

**9-9-1960**

